# పాల్కురికి సోమనాథుఁడు –
# వీరశైవ సిద్ధాంతము

## ప్రథమ సంపుటం

కీ॥ శే॥ ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య

**PĀLKURIKI SOMANĀTHUDU - VĪRAŚAIVA SIDDHANTAMU**
**(Vol. I)**

**(Late) Prof. TIMMĀVAJJHALA KODANDARAMAIAH**
Formerly Professor and
Head of the Department of Telugu,
Madurai Kamaraj University, Madurai



ప్రథమ ముద్రణ : ప్రతులు

వెల రూ :

ప్రతులకు :

1. **తిమ్మావజ్ఝల కృష్ణమూర్తి**
   రిటైర్డ్ ఫారెస్ట్ ఆఫీసర్
   *18-3-52/డి4*, ఖాదీకాలనీ
   తిరుపతి, చిత్తూరు జిల్లా. ఫోన్ *31701*

2. **విశాలాంధ్ర బుక్ హౌస్**
   హైదరాబాద్, తిరుపతి, విజయవాడ
   హనుమకొండ, అనంతపురం, విశాఖపట్నం
   గుంటూరు, కాకినాడ

లేజర్ టైప్‌సెట్ అండ్ ప్రింటింగ్ :
**ఎల్. వి. ప్రెస్**
ప్రకాశం రోడ్, తిరుపతి

# ప్రరోచన

శ్రీ నిరంతరానందనిశ్శ్రేయసార్థ
సాధకము సమస్తకిల్బిషబాధకము స
మగ్రవిజ్ఞానదము మహామహిమఘనము
శరణమగు మాకు సద్గురుచరణయుగము

# మనవి

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మూలమున నాకు విద్యార్థిదశ నుండియే శివకవుల సాహిత్యము మీఁదను, నందును బ్రత్యేకించి పాలకుఱికి సోమనాథుని గ్రంథముల మీఁదను నొకప్రత్యేక మయిన యభిమాన మేర్పడినది. ఆ యభిమానమే యీ పరిశోధనమునకు దారితీసినది. ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున నిచుమించుగా నయిదేండ్లపాటు నేనుసాగించిన పరిశోధన ఫలము. దీనిని నిర్వహించుటలో నాకు మార్గదర్శకులు శ్రీ పింగళి లక్ష్మీకాంత కవిగారు, డాక్టరు జి. యన్. రెడ్డిగారు. ముఖ్యముగా నీపరిశోధన గ్రంథమున కేవంవిధమయిన స్వరూపమును గల్పించుటకుఁ దగు సూచనలిచ్చి, నాయీ పరిశోధనకార్యమును బర్యవేక్షించి తోడ్పడిన డాక్టరు జి. యన్. రెడ్డిగారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. ఇందుపయుక్తము లయిన గ్రంథములను విరచించిన విద్వాంసులకును, వ్యాసకర్తలకును నా నమస్సులు.

బసవపురాణము నుండియుఁ, బండితారాధ్య చరిత్రము నుండియు నిందొసఁగఁబడిన పుటల సంఖ్య లీ క్రింది గ్రంథములలోనివి:

1. **బసవపురాణము:** వావిళ్లవారి ప్రతి : పరిష్కర్త : శివశ్రీ బండారు తమ్మయ్యగారు.
   – తొలి సంఖ్య యాశ్వాస సంఖ్యను, దరువాతిది పుటసంఖ్యను దెలుపును.
2. **పండితారాధ్య చరిత్రము :** ఆంధ్రగ్రంథమాల వారిచేఁ బ్రకటితము. పరిష్కర్త : డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు.
   – తొలి సంఖ్య సంపుటము సంఖ్యను, దరువాతిది పుటసంఖ్యను దెలుపును.

జనవరి, 1968

**తిమ్మావజ్ఝల కోదండరామయ్య**

# విషయానుక్రమణిక

# సాహిత్య తత్త్వము

సాహిత్యము ప్రగతిశీలము. సుభగము, సుందరము నయిన దాని గమనము నిరంతరము సాఁగుచుండును. అప్పుడప్పుడు సాహిత్యమున స్తబ్ధత కూడ నేర్పడుచుండును. కాని యది తాత్కాలికము మాత్రమే. తుపానునకు ముందున్న ప్రశాంత పరిస్థితి యది. ఒక పెనుసుడిగాలి వీచినట్లు – నిశ్చల సముద్రములో నువ్వెత్తుగ నొక పెద్ద తరంగము లేచినట్లు – ఉప్పెన పొంగి పొరలువాఱినట్లు ఆ స్తబ్ధత యంతయుఁ దొలఁగి సాహిత్యము మహావేగముతో నుఱుకలు పరుగులు వేయునట్లు ఏదో యొక సంచలనము, ఒక జాగృతి, ఒక యుద్యమము ఏర్పడుచుండును. ఆ యురవడితో, ఆ వేగముతో సాహిత్యము కొంత ముందునకు సాఁగును. అగమ్య మయిన గమ్యము దెసకుఁ బురోగమించును. దేశకాలపరిస్థితులనుబట్టియు, రాజకీయోపప్లవముల కారణమునను, మఱియుఁ గొన్ని యవాంతర కారణములవలనను సాహిత్య మెప్పటికప్పుడు తన స్వరూప స్వభావ లక్షణములను, నప్పుడప్పుడు లక్ష్యములను మార్చుకొను చుండుటయు సహజము.

బాహ్యమయిన నాగరికతయు, నాంతరికము అయిన రసికతా సంస్కృతులును గణనీయమయిన యొక స్థాయి నందుకొనినప్పుడు సాహిత్యసృష్టి జరుగునని చెప్పుదురు. సాహిత్యమును ఒక జీవనస్రవంతితోఁ బోల్చవచ్చును. ఏ కొండకోనలోనో సన్నని పాయగాఁ బుట్టి, సమతల ప్రదేశమునఁ గతిపయదూరము జాలువాఱి, సువిశాలములగు మైదానములందుఁ బ్రవహించి, కొండలు, తిప్పలు నెదురయినప్పుడు మలకలు తిరిగి తనమార్గము మార్చుకొని – స్నేహభావముతోఁ జేతులు సాచి కలియ వచ్చు వాగులను వంకలను తనలోఁ జేర్చుకొనుచు – నట్లు చేర్చుకొనుట వలన మఱింత చియ్యఁబాఱి పరిపుష్టి నొందుచు విశ్వరూపముతో వెలసి రసపావిత్ర్యముచే భక్తకోటికిఁ దీర్థభూతములగుచు లోకహితముగాఁ దనమనుగడ సాఁగించి తుదకు సాగర సంగమము చేసి మహానదీ ప్రవాహము చరితార్థమగును. అట్లే సాహిత్యము కూడ. భాషాలిపిసంపన్న మయిన జాతిలో లిఖితరూపమయిన సాహిత్యము తొలుత నల్పాల్పముగా మాత్రమే పొడమి, యా జాతియందుఁ బుట్టిన యనేక మహాకవుల యవిరళకృషిచేఁ బరిపుష్టినంది, దేశకాల ప్రభావముల యాటుపోటులకుఁ దలయొగ్గి మలఁగుచు, మార్పు చెందుచు,

నవ్యభాషా సాహిత్యసంస్కారములను దనతో సంతర్పింపఁజేసి పరిపూర్ణము మాత్మతేజముతో, వినూత్నరూప సౌరభములతో శోభిల్లుచు, పరిమళిల్లుచు, గుబాళించుచు సాహితీపరులగు సహృదయులకు సాయుజ్యసుఖపు తృప్తిఁ గలుగఁజేయుచు, లోకహితము పొంటెఁ బ్రవర్తిల్లుచు లోకకల్యాణస్థితికి దోహదము నొసఁగి మహోపకార మొనర్చుచున్నది. ఏ భాష యందలి సాహిత్యపరిణామమును బరిశీలించినను నిట్టి స్థితి గోచరించును.

సాహిత్యమునకు జీవన స్రవంతితోఁ బోలిక కూర్చుట సంప్రదాయసిద్ధము, సమంజసము. కన్నడ సాహిత్య చరిత్రమును రచించి యప్పటి భాషకు మహోపకృతి యొనర్చిన మహావిద్వాంసుఁడు ఇ.పి. రైసుదొర సాహిత్యపరిణామము శాఖోపశాఖలతోఁ గూడిన మహాప్రవాహముగఁ బోల్చి మూలప్రవాహము మొదట జైనప్రవాహమని, వీరశైవవాహిని దానిలోఁ జేరి తన ప్రత్యేకతలతోఁ గలసి పారె నని, యాతరువాత వైష్ణవవాహిని పై రెండింటిలోఁ గలసి ప్రవహించుచుండెనని యభివర్ణించినాఁడు.[1]

ఏ భాషయందలి సాహిత్యమును బరిశీలించినను నది యెల్లకాలము నొక్క తీరుననే సాఁగినట్లు గోచరింపదు. వివిధకాలములలో వివిధ రీతుల నది జాలువాఱును. వివిధరూపముల సంతరించుకొనును. వినూత్న వేషములు ధరించును. ఎరవు సొమ్ములతోఁ దురంగలించును. చిత్రవిచిత్రములయిన పోకడలు పోయి జిగియుఁ జేవయు హెచ్చును. ఆత్మగుణము తరుగుచున్నప్పుడు జాతిని చెంది మఱల జవముతో జీవముతోఁ బులకించును. సాహిత్య పరిణామక్రమము మిట్టితీరుననే సాఁగును.

సాహిత్యమునఁ బ్రవర్తిల్లుచుండు నిట్టి పరిణామములకు దేశకాల ప్రభావముతోఁ బాటు ఆ సాహిత్యమునఁ దఱచుగా నేర్పడు కొన్ని యుద్యమములు కూడఁ గారణము లగుచుండును. అసలు సాహిత్య చరిత్ర మనునది యా

1. *The Whole course of the history may be compared to a river receiving tributaries. During the first millenium of its course it is an unmingled stream of Jaina thought in the twelfth century this is joined by the stream of Vira-Saivism; and the two streams, like the Rhone and Saone at Lyous, flow side by side without mingling in the beginning of the sixteenth century these two are joined by a Vishnava affluent, and the united stream flows on until in the nineteenth century it is broadened and much modified -- by a great inrush of western thought*
*A History of Kanarese Literature by Edward P Rice, B A, Pp 12, 13*
*A publication of the Heritage of India Series*

సాహిత్యమున నానాఁట నేర్పడిన సాహిత్యోద్యమముల సమాహార స్వరూపనిరూపకమే యనుట యతిశయోక్తి కాఁజాలదు. ఏ భాషయందయినను నిట్టి సాహిత్యోద్యమము లేర్పడుటయు, నాయుద్యమముల ఫలితముగా నా భాషాసాహిత్యములో నొక విస్పష్ట పరిణామము ప్రవర్తిల్లుటయు సహజముగా జరుగుచుండు స్థితి.

'ఉద్యమము' అను పదమునకుఁ 'బ్రయత్నము' అని సామాన్యార్థము. కాని Movement అను నాంగ్లపదమునకు సమానార్థకముగా నీపద మీనాఁడు వ్యవహరింపఁబడుచున్నది. ఒకానొక లక్ష్యమును సాధించుటకై చేయు సంఘటిత ప్రయత్నమను నర్థమున నాయాంగ్లపదము సాధారణముగాఁ బ్రయుక్త మగుచుండును. కాఁగా – దత్సమానార్థకముగాఁ దెలుఁగున వాడఁబడుచున్న 'యుద్యమ' పదము నకును మన మదే యర్థమును చెప్పుకొనవలసియున్నది. సాహిత్యమున నొకానొక లక్ష్యమును గాని, ప్రయోజనమునుగాని సాధించుటకు జరిగిన తీవ్రమయిన ప్రయత్నము, కృషి, యుద్యమ మగును. ఆ లక్ష్యము ప్రక్రియకు సంబంధించినది కావచ్చును. ఛందస్సునకు సంబంధించి యుండవచ్చును. ఇవి రెండును గానిచో భాషలో నొక విప్లవము దెచ్చుటయుఁ గాఁదగును. అంతకు ముందుండిన సాహిత్య స్వరూపమునకు భిన్నముగా నొకక్రొత్తదనమును ప్రవేశపెట్టుటయుఁ గావచ్చును. ఇట్టి లక్ష్యముతో సాఁగిన యుద్యమము సమకాలములోని పెక్కురు కవుల సంఘటిత ప్రయత్నమయినను గాఁదగును. లేదా మహాశక్తిసంపన్నుఁడయిన యొకమహాకవి పూర్వమార్గమును బరిత్యజించి యొక క్రొత్తపుంతను ద్రొక్కఁగా నతనిమీఁది గౌరవ భావముతోనో లేక యానూతనత్వముమీఁది ప్రీతిచేతనో యాకవీశ్వరుని యడుగు జాడలను దరువాతి తరములకుఁ జెందిన కవులనుసరించి యాతం డారంభించిన యా యుద్యమము నందిపుచ్చుకొని సాహిత్యమున విస్పష్టమయిన పరిణామమును దెచ్చుటయు జరుగును. అట్లు కాదేని నొకానొకమహాకవి చిత్తశుద్ధితో నొకయుద్యమము నాకాంక్షించి తన కవిత్వ శంఖారావముతో సమకాలిక సంఘము నుఱ్ఱూఁత లూఁగింపవచ్చును. కాని యెంత చిత్తశుద్ధి యున్నను నాయకత్వ గుణము లోపించుటచే నతని ననుసరించువారు లేక యతని గొంతు ఒక్కటియే యేకాకిగా వినిపించ వచ్చును. అయినను నట్టి తీవ్ర ప్రయత్నము జరిగినప్పుడెల్ల దానిని మన ముద్యమము క్రిందనే గ్రహింపఁదగును.

ఇట్లు సాహిత్యతత్త్వమును, సాహిత్యోద్యమ నిర్వచనమును దెలిసికొనిన పిదప నట్టి యుద్యమములకు హేతువు లెట్టివగునో యించుక పరిశీలింతము.

# సాహిత్యోద్యమ హేతువులు

వివిధ భాషలయందలి సాహిత్యోద్యమముల తీరుతెన్నులను, నాయాయుద్యమముల యావిర్భావవికాసములకు హేతుభూతము లయిన పరిస్థితులను సమీక్షించిచూచినప్పుడు సాహిత్యోద్యమహేతువులుగా నీక్రింది సామాన్యసూత్రములు గోచరములగుచున్నవి. ౧. ప్రతిభావంతుఁడును, బ్రజ్ఞాశాలియు నగు మహాకవియు యుగకర్తయు నగు కవితల్లజుని ప్రయత్న ప్రభావము, ౨. రాజకీయ పరిస్థితులు, ౩. సాంఘిక పరిస్థితి, ౪. మతము, ౫. రాజకీయప్రభావము, ౬. అనుకరణము, ౭. ప్రతిధ్వని, ౮. మహాపురుష ప్రభావము, ౯. వైయక్తిక సన్నివేశము, ౧౦. నూతనత్వాభిలాష. ఇట్లు దశవిధములుగా వింగడింపఁబడిన సాహిత్యోద్యమహేతువులు వివిధ భాషలలోని యుద్యమముల యావిర్భావ వికాసముల కెట్లు దోహద కారులయ్యెనో, యవి యాయా సాహిత్యములలో నెట్టి యెట్టి పరిణామములను బ్రసాదింపఁజాలెనో యించుక పరిశీలింతము.

ప్రతిభావంతుఁడయిన యొకానొకకవీశ్వరుని మేధస్సులో నొక యభ్యూహము పొడమును. అది యంతకు మునుపెవరికిఁగాని పొటమరిల్లి యుండదు. అయ్యది ప్రతిభావిలసితము. ప్రత్యగ్రము, తనకు గోచరమయిన యాయభ్యూహమున కాతఁ డొక రూపము గల్పించును. దానికినంగాంగపుష్టి చేకూర్చును. తనయద్భుత కవితాశక్తితో దానికిఁ బ్రాణప్రతిష్ఠ చేయును. అప్పుడది జీవముతోఁ దొణికిసలాడును. దాని రూపతేజోవిభవములను దర్శించువారి కది మిఱుమిట్లు గొలుపును. కన్నులు జిగేలు మనఁగా వారు దాని నద్భుతానందములతోఁ దిలకింతురు. దాని సౌందర్యమునకు ముగ్ధులగుదురు. దాని ప్రభావమునకు లొంగి మోకరిల్లుదురు. దాని మూర్తికి నీరాజనము లర్పింతురు. అట్టి వినూత్నకావ్యనిర్మాణమును స్వయముగా, స్వతంత్రముగాఁ జేయ నలఁతులు గాకపోవుట చేతను, దమ శక్తిసామర్థ్యము లట్టి సాహిత్య సృష్టికి సమర్థములు కావని వారికే గోచరమగుటచేతను, జాపల్యముజేతను, నట్టి మూర్తినిర్మితులయం దేర్పడిన సమధికోత్సాహము తోడను బెక్కురు కవులట్టి మహాకవి ప్రభావమునకు లొంగి యాతని మార్గమునే యనుసరించి కవిత్వ మల్లుదురు. కృతులు విరచింతురు. ప్రతిభావంతుఁడయిన యాకవీశ్వరుని ప్రజ్ఞాసమున్మేషముచే బ్రభావితులయిన యితర కవుల కతఁ డగ్రగామి యగును. ఇతరులతని యనుయాయులు. ఆ నాయకు ననుసరించి యాతని

యడుగుజాడలలో నడచుననుచరులు. వీరియందతి కృషిఫలితముగా నాభాషయందలి సాహిత్యమునొక యుద్యమము బయలుదేరును.

## వంగ సాహిత్యము :

వంగభాషలో మంగళకావ్యరచనోద్యమ మిట్టిదే. వంగదేశము ఢిల్లీ పాలకుల యధీనమునుండి తొలఁగి స్వతంత్రప్రతిపత్తి పొందినప్పుడు ఆరాష్ట్రములో స్వతంత్రపరిపాలనము నెఱపిన రాజులును, నవాబులును హైందవపండితుల నాదరింప నారంభించిరి. తొలిదినవములలో వారి యాస్థానవములందుఁ గుదురుకొనిన విద్వాంసులు సంస్కృతపండితులు. వారు గ్రంథరచనమునకుఁ బూనుకొనలేదు. అట్లు సంస్కృత పండితులు క్రియాశూన్యులయి యున్నను పదునైదు పదునాఱు శతాబ్దులలోఁ బల్లెలయందు నివసించుచుండిన గేయ కవులు మాత్రము చేతులు ముడుచుకొని కూర్చుండలేదు. ఈ పల్లె కవులలోనే బెంగాలీభాషయందలి మంగళకావ్యములు బయలుదేరినది. రాజులకొఱకో, ధనికుల కొఱకో కాక సామాన్యులకొఱకు వ్రాయఁబడిన కావ్యము అది. పురాణకథలతో దానికెట్టి సంబంధమును గాని లేదు. అవి మంగళమును గలిగించును గనుక దానికి మంగళ కావ్యములను పేరు వచ్చెను. ధర్మమంగళ, చండీమంగళ, మనసామంగళకావ్యములను బండుగుదినములలోను, జాతరలలోను గవులు గానము చేయుచుండిరి.

మనకుఁ దెలిసినంతవఱకు క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దమునకుఁ జెందిన మయూరభట్టు మొదట ధర్మమంగళకావ్యమును వ్రాసెను. కాని యది యిప్పుడు లభ్యమగుట లేదు. లభించిన గ్రంథములలో రూపరామ చక్రవర్తి యనుకవి రచించిన ధర్మమంగళ యతిప్రాచీన మయినది. ఇతనికిఁ దరువాత పదునాఱవ శతాబ్దములోనే మానిక గంగోపాధ్యాయ, పదునెనిమిదవ శతాబ్దమున కవిరత్న ఘనరామచక్రవర్తి, మానికరామగంగూలీ యనువారలు ధర్మమంగళ కావ్యములు విరచించిరి.

చండీమంగళకథలు రెండు ప్రచారమున నున్నది. వానిలో నొకటి కళింగదేశమునుండి బంగాళమునకు దిగుమతి మయినది. రెండవది వ్రతకథ. క్రీస్తుశకము **1579**లో మాధవకవి యనునతఁడు చండీమంగళకావ్యము విరచించెను. క్రీస్తుశకము **1600** ప్రాంతమున నుండిన ముకుందరామచక్రవర్తి చండీమంగళకావ్యరచయితలలో సుప్రసిద్ధుఁడు. ఈ చండీమంగళకావ్యమునే యనుసరించి రామేశ్వర భట్టాచార్యుఁడనుకవి 'శివసంకీర్తన' మని యొక కావ్యమును వ్రాసెను.

తరువాతది మనసామంగళ. మనసామంగళకుఁ బర్మాపురాణ మని కూడఁ బేరు కలదు. విప్రదాసు అను కవి క్రీస్తుశకము 1495 లో 'మనసావిజయ' యను పేరుతో నొక మనసామంగళకావ్యమును విరచించెను. అదేకాలమున 'విజయగుప్త' యనునొకకవి మఱొక మనసామంగళ వ్రాసెను. పదునాఱవ శతాబ్దమున నారాయణ దేవు అను కవీశ్వరుఁడు వేఱొక మనసామంగళకావ్యమును విరచించెను. వీరికిఁదరువాత మశీదాసచక్రవర్తి, రాధానాధచౌదరి, కేతకాదాసు, విష్ణుపాలుఁడు మొదలుగాఁ గలకవులు సుమారు పాతికమందికిఁ బైఁగా మనసామంగళకావ్యములు వ్రాసిరి. వారిలో 'కేతకాదాసు' సుప్రసిద్ధుఁడు.

వైష్ణవకవులు కొందఱు భాగవతకథ ననుసరించి కృష్ణ మంగళ, గోవింద మంగళ ముకుందమంగళ, గోకులమంగళ, రాధికామంగళ మొదలయిన మంగళ కావ్యములను వెలయించిరి. గుణాకర భారత చంద్రరాయి రచించిన 'అన్నదా మంగళ' మఱొకటి కలదు. అన్నపూర్ణ మంగళ యని దీనికి నామాంతరము.

ఇట్లనేక విధములుగా నున్న మంగళకావ్యములలో నొక్కొక్కటియుఁ దొలుత నొకమహాకవిచే రచింపఁబడుటయుఁ, దరువాతఁ బెక్కుఱు కవులు దాని ననుసరించి కావ్యములు రచించుటయుఁ జూచితిమి.

## మలయాళ సాహిత్యము :

మలయాళసాహిత్యమున 'ఎఴుత్తచ్చన్' వంటి కవిశేఖరుఁడు 'న భూతో నభవిష్యతి'. అతని గ్రంథములు మలయాళవాఙ్మయమున కమూల్యాలంకారములు.

మలయాళమునఁ బ్రామాణికమయినకావ్యభాషను బ్రవేశపెట్టిన మహాకవి, ఎఴుత్తచ్చన్. అతని సుకుమారహస్తమున 'కిళిప్పాట్టు' అను ఛందోవిశేషము అందాలు దిద్దుకొనినది. 'కిళిప్పాట్టు' అనఁగా చిలుకపాట యని యర్థము. ఈ చిలుకపాట లేక కిళిప్పాట్టు అనుకావ్యవిశేషమునకు మలయాళవాఙ్మయమున విశిష్ట స్థానము కలదు. కావ్యారంభమునందా కావ్యము నుడువుచున్న పక్షిపేరు సూచింపఁబడుచుండును. కొన్ని కావ్యములలోఁ జిలుకకు మాఱుగా హంస గాని తుమ్మెద గాని యుండును. అయినను దీనికిఁ జిలుకపాట లనియే వ్యవహారము కలదు. కిళిప్పాట్టును వ్యాప్తిలోనికిఁ గొనితెచ్చినవారిలో ఎఴుత్తచ్చన్ ప్రథముఁడని చెప్పుదురు. కాని యతనికిఁ బూర్వమే యీ కిళిప్పాట్టు లనఁదగినవి కొన్ని వెలసి యుండెను. ఎఴుత్తచ్చన్ ఆ ఛందమునకుఁ గావ్యత్వయోగ్యత కల్పించి దానిని

బహుళప్రచారమునకుఁ దెచ్చెను. ఈ తెగకుఁ జెందిన గ్రంథములు తరువాతఁ బదునాలు పదునేడు శతాబ్దములు మధ్య బాగుగా వ్యాప్తిలోనికి వచ్చెను. ఇట్లు 'కిళిప్పాట్టు' అనే ఛందోభేదమున రచింపఁబడిన కావ్యజాతమున కెల్ల ఎళుత్తచ్చన్ ప్రభావమే ప్రధానకారణము.

**ఆంధ్ర సాహిత్యము :**

ఇక నాంధ్ర మునఁ గూడ దీనికి దృష్టాంతము కాఁగల నన్నయ భట్టారకుని యుద్యమవిధానమును బరికింతము. నన్నయభట్టారకునికిఁ బూర్వ ముండినశాసనములలో దేశియచ్ఛందమునకుఁ జెందిన తరువోజ, మధ్యాక్కర, సీసము అను పద్యములు కానవచ్చున్నవి. రగడ, కందము, చంపకమాల మున్నగు నితరపద్యములు కూడ నప్పుడుండె ననుటకుఁ దార్కాణములు కలవు. మొత్తముమీఁద నప్పుడు మాత్రాఛందస్సునకుఁ జెందిన జాత్యుపజాతులే హెచ్చుగా వాడఁబడుచుండెనని చెప్పవచ్చును. నన్నయభట్టు దీనికిఁ దోడు అక్షరచ్ఛందమునకుఁ జెందినపలువృత్తములను సంస్కృతమునుండి గ్రహించి తన భారతమున దానిని విస్తారముగా వాడి యుండెను. సంస్కృతపదములను దత్సమీకరించుపద్ధతి యేర్పఱిచి, వానిని దెనుఁగునందు విస్తారముగా వాడి తెనుఁగుపదసంపదను విస్తరింపజేసినట్లే యతఁడు సంస్కృతమునుండి మత్తేభశార్దూల చంపకోత్పలమాలాది వృత్తములను గ్రహించి తెలుఁగునందలి ఛందస్సంపదను గూడ విస్తృతముగావించెను. అతఁడు గ్రహించిన వృత్తములన్నియు ధారాళమైన చక్కని గమనము కలిగినట్టివి. అసంఖ్యాకము లయిన సంస్కృత భాండారమునుండి ధారాళ గమనము కల చక్కని వృత్తములను మాత్రమే యెన్నుకొనుట నన్నయయొక్క ఛందఃపరిజ్ఞానమునకుఁ జక్కని తార్కాణగా నున్నది. పంపాదు లగు కర్ణాటక కవులు కన్నడమున గ్రంథములు వ్రాయనారంభించినప్పుడట్లే యొనర్చిరి. ఛందోవిషయమున వారనుసరించిన పద్ధతియే నన్నయకు మార్గదర్శక మయ్యెను.

ఛందోవిషయమునందువలెనే కావ్యమును జంపువుగా వ్రాయువిషయము నందును నన్నయకుఁ గన్నడకవులే యొజ్జబంతులయిరి. కన్నడమున రత్నత్రయమనఁబడు కవీశ్వరులు రచించిన గ్రంథము లన్నియుఁ జంపూపద్ధతినే రచింపఁబడినది. మఱియు నన్నయకుఁ బూర్వకాలమునం దుండి నశాసనములలోఁ బద్యము తరువాతఁ గొంత వచనము కూడ నచ్చటచ్చట వ్రాయఁబడి యుండెను. కన్నడ కవులు తమ కావ్యముల యందవలంబించిన చంపూ

పద్ధతిని, శాసనములయందలి గద్యపద్యోభయరీతిని బాగుగాఁ బరిశీలించి నన్నయ తన భారతము నాపద్ధతిలోనే వ్రాయఁదొడఁగెను. నన్నయనాఁటి నుండి ప్రబంధయుగము చివరివఱకు నొక్క నిర్వచనోత్తరరామాయణముననను, ద్విపదకావ్యము లందును దక్కఁ దక్కిన యన్ని కావ్యములలో నీచంపూపద్ధతియే యవలంబింపఁబడెను. ఇట్లు మహాకావ్య రచనానుకూలమగు లయిన భాషాచ్ఛందములను రచనాపద్ధతిని స్వయము నిర్ణయించుకొని నన్నయ మహాభారత రచనమున కుపక్రమించెను. భారత రచనము నారంభించుటకు ముందు నన్నయ పలువిధముగాఁ బూర్వరంగము నెంతో శ్రమపడి సవరించుకొన వలసి వచ్చెను. ప్రతిభాసంపన్నుఁడును బాండిత్య సముద్రుండును నగుటచే నతఁడు దాని నెంతో సమగ్రముగా, సుమనఃప్రశంసాపాత్రముగా నిర్వహింపఁ గలిగెను. అట్టి మహాప్రతిభాసంపన్నుఁడగు నన్నయభట్టారకుని ప్రభావముచేతనే యాంధ్రవాఙ్మయమునఁ జంపూకావ్యనిర్మాణపద్ధతియు, సంస్కృత వృత్తసమాదరణశీలమును, దత్సమపదబాహుళ్యమును – దీని యన్నింటి సమాహార రూపమయిన మార్గకవితా పద్ధతియు నాంధ్రసాహిత్య మునఁజాలకాలము రాజ్యముచేసెను.

ఇట్లు యుగకర్త యనిపించుకొనఁదగు మహాకవి ప్రేరణ ప్రయత్నముల వలననే కాక సమకాలమునందలి రాజకీయపరిస్థితులు కూడ సాహిత్యోద్యమముల యావిర్భావమునకుఁ గొంతవఱకుఁ గారణభూతము లగుచున్నది.

## కన్నడ సాహిత్యము :

క్రీస్తుశకము పంద్రెండవ శతాబ్దమునందు బసవేశ్వరుఁడు ప్రసిద్ధికి వచ్చి కన్నడ సాహిత్యమునకొక క్రొత్తరాచబాట వేసెను. ఆకాలమునందు రాజకీయధార్మిక విప్లవములమూలముగఁ బ్రజాజీవనము సుపూర్ణముగా స్తంభించి పోయి యుండెను. దాని ప్రభావమచ్చటి వాఙ్మయము మీఁదఁ బ్రసరించినది. మహావైభవముతోఁ దులఁదూఁగిన చాళుక్యసామ్రాజ్య మంతరించినది. ముఖ్యసామ్రాజ్యభాగములు స్వతంత్రములై పరస్పరము పోరాడుకొనుచు నశాంతిని పెంచుచుండినది. దీనికిఁదోడు పులిమీఁదఁ బుట్రవలెఁ బదుమూఁడవ శతాబ్దమున మహమ్మదీయుల దండయాత్రలు ప్రారంభ మయ్యెను. దేవగిరి యాదవులును, హొయసల భల్లాళులును దురకల దురాగతములవే నంతరించిరి. కన్నడ భూమితో హాహాకారములు చెలరేగెను. ఇట్టి మహాసంకటసమయములో మహానుభావుఁడగు శ్రీ విద్యారణ్యస్వామి తపోబలముచే విజయనగర సామ్రాజ్యము తల యెత్తెను.

రాజకీయపరిణామముల ప్రభావము ప్రజల మీఁదను, నా ప్రజల సాహిత్యము మీఁదను బ్రతిఫలించుట సహజము. పండ్రెండవ శతాబ్దమున జైనము పూర్వౌన్నత్యమును గోల్పోయెను. వైదిక మతములు శుష్కాచారములలోఁ బడి నిర్వీర్యము లయ్యెను. నూతనోత్తేజమును గలిగించి సమాజమును సవ్య మగుమార్గమున నడిపించుటకై కన్నడభూమిలో బసవాది శివశరణు లుదయించిరి. బసవేశ్వరుని నుండి కుమారవ్యాసుని వఱకును నీ యుగము కన్నడసాహిత్యములో సాఁగినది. పండితులతోఁబా టెందఱో యనుభావులు, నాత్మదర్శనులు నీ యుగమునందు రచనలు చేసిరి. నా రందఱికిని భక్తబండారి బసవేశ్వరుఁడు మార్గదర్శకుఁడయ్యెను. కన్నడసాహిత్య మీకాలమునఁ బెక్కు పరిణామము లందెను. మార్గపద్ధతి నుండి దేశిపద్ధతికిఁ బరివర్తనము మొదలయ్యెను. విషయముతో, భాషతో, ఛంధస్సుతో దేశిప్రాధాన్యమెక్కువ యయినందున దీనిని 'స్వతంత్రయుగ' మని కొందఱనిరి. ఈకాలమున 'వచనము' అను సాహిత్యరూపము పుట్టెను. రగళె, త్రిపది, షట్పది యనునచ్చగన్నడ ఛందస్సుతో గ్రంధములు వెలసెను. శివలీలలు, శరణుల చరిత్రలు, వైదికపురాణగాధలు కావ్యవస్తువు లయ్యెను. భాషావిషయకముగా హళగన్నడమునకు, హొసగన్నడమునకు మధ్య నడుగన్నడము వ్యాప్తిలోనికి వచ్చెను. కన్నడ సాహిత్యమునం దేర్పడిన యీ పరిణామమున కలతకును నలనాఁటి రాజకీయవాతావరణమే కారణమనుట యతిశయోక్తి కాదు.

సాహిత్యముననొక విస్పష్టపరిణామము కలుగుటకు సమకాలమునాఁటి రాజకీయ పరిస్థితులును, రాజకీయోపప్లవములను దోహదము చేసినట్లే సాంఘికపరిస్థితి కూడ సహాయకారి యగుచున్నది.

## సాంఘిక పరిస్థితులు :

వంగదేశమున నీశ్వరచంద్రవిద్యాసాగరుని యుద్యమఫలితముగా క్రీస్తుశకము **1856**లో విధవావివాహశాసనమును బ్రభుత్వ మామోదించినది. అదే సంవత్సరమున ఉమేశచంద్రమిశ్ర రచించిన విధవావివాహనాటకము వెలువడినది. ఆకాలమున విద్యాసాగరుని యుద్యమున కనుకూలముగను, బ్రతికూలముగను బెంగాలీ భాషలోఁ గొన్ని నాటకములు వచ్చినది. వానిలో ఉమాచంద్ర చటోపాధ్యాయ విధవావివాహనాటకము, రాధామాధవమిత్ర విధవామనోరంజన నాటకము, యదుగోపాలచట్టోపాధ్యాయ చపలాచిత్తచాపల్య నాటకము, విహారీలాలునంది విదవాపరిణామోత్సవనాటకము,

రాజగుణనిధి కవికౌతుక నాటకము, హారానచంద్రముఖోపాధ్యాయ సాలభంజిక నాటకము, హరిశ్చంద్రమిత్ర శుభస్యశీఘ్రమ్, చ్యూక్ ఘరేవకే, యదునాథ చట్టోపాధ్యాయ విధవావిలాసనాటకము, విపినవిహారీబే ఏకాదశీపారణ మొదలయిన నాటకములానాఁడు ప్రజానీకము నాకర్షించినవి. ముఖ్యముగా ఉమేశచంద్రమిత్రుని విధవావివాహనాటకమునిననో వేలాదిప్రజలు విఱుగఁబడు చుండెడినారు.

ఆకాలమున వంగదేశములో మద్యపానమొక సభ్యతగా నుండెడిది. ధనిక కుటుంబములోని స్త్రీలు కూడ స్వేచ్ఛగా మద్యపానము చేసెడివారు. ఈ కలంక చరిత్రమును జిత్రించుచు క్షేత్రమోహనఘటక 'కామినీనాటకము' ను వ్రాసెను. అట్లే ప్రసన్నకుమారసాలు లను వంగదేశీయుఁడు వేశ్యావృత్తిని నిరసించుచు 'వేశ్యాసక్తనివర్తక నాటకము' ను వ్రాసెను.

తెలుఁగు సాహిత్యమునఁ బందొమ్మిదవశతాబ్ది చివరి భాగములోను, నిరువదవ శతాబ్ది తొలి దశకములలోను వీరేశలింగ కవి సాంఘిక దురాచారములను నిరసించుచు వ్రాసిన ప్రహసనములును, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారి వరవిక్రయము మొదలగు రచనములును, గురజాడ అప్పారాయకవి కన్యాశుల్క నాటకమును సాంఘిక పరిస్థితుల ప్రోద్బలమున వెలువడినవే.

## మత పరిస్థితులు :

సాహిత్యోద్యమహేతువులలో మతము మిక్కిలి ప్రధానమయినది. ముఖ్యముగా భారతీయభాషాసాహిత్యములలో నేర్పడిన యుద్యమములు మతప్రచారోద్దేశముతోఁ బ్రవర్తిల్లిన దని చెప్పవచ్చును. మనదేశమున రాజకీయోపప్లవములు ప్రజలమీఁదనంతగాఁ దమప్రభావమును బ్రసరింప నీయ లేదు. ధార్మిక విప్లవములే విస్తారముగాఁ జెలరేఁగెను. ప్రజలమీఁదను దాని ప్రభావము ప్రసరించినది. కన్నడసాహిత్యమునకు ధర్మమే ప్రేరకము. ధర్మమే మూలము. కన్నడసాహిత్యమున నాదికవి యని విఖ్యాతినందిన ఆదిపురాణము విక్రమార్జునవిజయము నను గ్రంథములను విరచించిన పంపమహాకవి మొదలుకొని కన్నడమునఁ గావ్యనిర్మాణము గావించిన కవీశ్వరులందఱును దమమతసందేశములను జాటుటకే సాహిత్యమును జేపట్టిరి. జైన మతావలంబకుఁ డగు పంపమహాకవి జినాగమమును విశ్వమునందు వెలిఁగింపఁజేయుమహోద్దేశముతో 'ఆదిపురాణ' కావ్యమును విరచించెను. ఆ యీ యుద్దేశ మతనికిఁ గలదని 'ఆదిపురాణ దొళరిపుదు కావ్యధర్మమం,

ధర్మముమం' అనువాక్యములలనఁ దెలియుచున్నది. అతనినే గురు వని భావించిన జైనకవు లందఱును నతనిమార్గమునే యనుసరించి మతప్రచారము చేయునుద్దేశముతోనే తమప్రౌఢకావ్యములను విరచించిరి. ఇట్లు తొలికాలమున వెలసిన జైనకవులు మాత్రమే కాక కన్నడమునఁ దరువాతికాలమునందు వెలసిన యితరకవీశ్వరులు సైత మీమార్గమునే యనుసరించిరి. బసవేశ్వరుఁడు మొదలగు వచనకారులు రచించిన రచనము లన్నియు వీరశైవమతప్రచారము నుద్దేశించినవే. ఆ తరువాత వచ్చిన వైష్ణవదాససాహిత్యము కూడ నీకార్యమునే కొనసాగించినది.

కన్నడసాహిత్యమున నాటికాలమున వెలసిన జైనకవుల గ్రంథములు లౌకికములనియు, ధార్మికము లనియు రెండుతెఱఁగులుగా వింగడింపఁ దగి యున్నది. ధార్మికకావ్యములు జైనతీర్థంకరులయొక్కయు, మహాపురుషుల యొక్కయు జీవన చారిత్రము లయి జైనమతమును బ్రచారము చేయుపరమ సాధనములుగా రచింపఁబడినవి. లౌకికకావ్యములు ప్రసిద్ధము లయిన రామాయణ, మహాభారత, పురాణాదులనుండి కథలను గ్రహించి తమ్ముఁ బోషించు రాజులచరిత్రములను స్ఫురింపఁజేయు విధమున రచితము లయిన ధ్వని కావ్యములు. పంపమహాకవి యాదిపురాణము, పొన్నకవి శాంతిపురాణము, రన్నకవి అజితపురాణము, చాముండరాయకవి చాముండరాయ మహాపురాణ మనుపేరుతో విలసిల్లు త్రిషష్టిశలాకాలక్షణమహాపురాణము, నాగవర్మ మల్లినాథపురాణము, నయసేనుని ధర్మామృతము నను నవి జైనతీర్థంకరుల చరిత్రములను, జైనమత ధర్మములను వివరించు కావ్యరాజములు.

ఆంధ్ర సాహిత్యమునఁ బాలకుఱికి సోమనాథ కవి చేపట్టిన దేశి కవితోద్యమము వీరశైవమతప్రచారమునకొఱకే యుద్దేశింపఁబడినది. మల్లికార్జునపండితుఁడు తన శివతత్త్వ సారమున శైవమతధర్మములను గొంత స్థూలముగా వివరింపక పోలేదు. నన్నెచోడుని కుమారసంభవమున దేశికవిత్వలక్షణములు బీజప్రాయమున నున్నను నది మహావృక్షమై ఫలించినది పాల్కుఱికి సోమనాథుని కావ్యజాతమునందే, అతఁడు సాధించిన యీ దేశికవితోద్యమునకు మూలమును, ముఖ్యహేతువును మతమేయనుటు విస్మరింప రాని విషయము. దేశికవితోద్యమలక్ష్యమును, స్వరూపమును గుఱించి తెలిసికొనునపుడు మఱికొన్ని వివరములు వఁగలము. రాజకీయప్రాబల్యము కూడ సాహిత్యోద్యమముల యావిర్భావమునకుఁ గారణ మగుచుండుట కలదు. సమకాలమునందలి రాజకీయపరిస్థితులు కారణముగా రాజకీయపరముగాను, సాహిత్యపరముగాను నప్పుడప్పుడు కొన్ని యుద్యమములు బయలుదేరుటయుఁ

దనమ్మాలవమున దేశమునందునను, సాహిత్యమునందును గొన్ని కొన్ని యుద్యమములు బయలుదేరుచుండునట్లే కొన్ని భావనలలో రాజకీయ ప్రాబల్యము చేతఁ గూడ సాహిత్యోద్యమము లేర్పడునవకాశములు కలవు. ఇటీవలికాలమున హంగరీ దేశములో నేర్పడిన 'గాయపడిన యువకుల' కవిత్వోద్యమ మట్టిది.

## పాశ్చాత్య సాహిత్యోద్యమములు :

యూరోపుమహాఖండమున హంగరీదేశముయొక్క చరిత్రము మిక్కిలి విషాద కరమయినది. జర్మనీదేశమున హిట్లరు నియంత నియంతృత్వపాలనము తన కత్తి కెదురు లేదన్నట్లుగా నిరంకుశముగా, నిరాఘాటముగా సాగుచుండినకాలములో నాజీలు హంగరీదేశముపైఁ బడి దండెత్తి దానిని ధ్వంసముచేసిరి. ఆ తరువాత ద్వితీయ మహాప్రపంచసంగ్రామములో జర్మనీదేశము పరాఘాతమై పడఁగొట్టఁ బడినతరువాత రష్యాదేశపు కమ్యూనిష్టులు హంగరీదేశముయొక్క స్వతంత్రప్రతిపత్తిని గబలించి తమ సైనికబలముతో హంగరీదేశము యొక్క యాత్మకుఁ దీవ్రమయిన యాఘాతమును గలిగించిరి. కమ్యూనిష్టుల యాయణఁచివేతకును, నేరివేతకును వ్యతిరేకముగా హంగరీదేశముఁ గ్రీస్తుశకము 1956వ సంవత్సరమున దేశవ్యాప్తముగా విప్లవజ్వాలలు చెలరేఁగినవి. ఆ విప్లవసమయమున రష్య నుకమ్యూనిష్టులు నిరంకుశముగా, నిర్దాక్షిణ్యముగా, నిష్కరుణముగా టాంకులలోను, తుపాకులతోను నా తిరుగుబాటు నణఁచి వేసిరి. విప్లవప్రయత్నము విఫల మయి పోయినది. రష్యాదేశపు కమ్యూనిష్టుల కర్కశపాదములక్రింద హంగరీప్రజలు నలఁగి కలఁగి పోయిరి. చిత్తుగాఁ జితికిపోయిరి.

ఈ విప్లవానంతరము రష్యాదేశపుఁ బర్యవేక్షణమున జీవించుచుండిన హంగరీలో నాదేశప్రజలాశించినవిధముగా - నెదురుచూచినవిధముగా నెట్టి యభ్యుదయమును గలుగలేదు. ఎల్లయెడల దారిద్ర్యము తాండవించుచుండెను. ప్రజలకుఁ దగిన యుపాధులును, నుద్యోగములను లభింపవయ్యెను. తల దాచుకొనుటకు నిలువ నీడలు గాని, నివాసగృహములు గాని లేవయ్యెను. ముఖ్యముగా నాత్మాభివృద్ధికిఁ గావలసిన స్వేచ్ఛాస్వాతంత్ర్యములు గాని, మనసులోని మర్మమును, మధనమును బట్టబయలు చేసికొని యాత్మసంతృప్తిని, నవిర్వచనీయ మయిన శాంతిని బొందుటకుఁ దగిన యాత్మీయత గాని లభింపని కారణముగా వారి మనస్సులతో - నంతరాంతరములతో దాఁగియుండిన వారి యసంతోషము క్రమముగాఁ గవిత్వరూపములో వెలువడినది. దేశమునం దాకాలమున

జరుగుచుండిన కవిత్వపుఁ బోటీలలో హంగరీదేశపు యువకవులు విస్తారముగాఁ బాలుగొని తమ యాంతరాభివ్యక్తిని – బాధను వ్యక్తము చేసిరి. సోషలిస్టు సత్యమునకు బదులుగా యథార్థసత్యమునకు హంగరీ యువకవుల హృదయములలో గణనయు, గణనీయమయిన గౌరవమును నేర్పడినవి.

సెపెల్ ఐరన్ వర్క్సులో మేస్త్రీగాఁ బని చేయుచుండిన యువకుఁడొక కవిత్వపుఁబోటీ జరుగుచుండఁగా నందుఁ జదువుటకై యాతఁడు తనకవితాఖండము నొకదానిఁబంపెను. ఆ యువకుని పేరు ఫెరెనెక్ బారాన్యీ. దాని శీర్షిక 'గాయపడిన యువకుల గీతము?' ఆ కవితాసమ్మేళనమునఁ జదువఁబడిన యాగీత మాతరువాత 'బుడాపెస్ట్' నగరమునుండి ప్రచురింపఁబడుచుండిన 'కోక్‌రాత్స్' అను సాహిత్య మాసపత్రికలోఁ గూడఁ బ్రచురితమయ్యెను. ఆ గీతమునందు 'బారాన్యీ' హంగరీ యువజనుల మానసికసంక్షోభమును, స్వేచ్ఛారహిత జీవితమును, నసంతృప్తికిఁ దావలమయిన యలనాఁటి దేశపరిస్థితులను వ్యంగ్యముగాను, వాస్తవముగాను వ్యక్తీకరించెను. ఆ గీతము రష్యను అధికారుల విమర్శనమునకుఁ బాత్రమయినది. ఆ గీతము వెలువడిన పిదప నందలి ధోరణి నంది పుచ్చుకొని హంగరీ యువకులు మఱి కొందరు కవిత లల్లిరి. వారు సాఁగించిన యుద్యమము గాయపడిన యువకుల కవితోద్యమముగా రూపొందినది. ఈ యుద్యమ ప్రారంభమునకు రష్యాదేశపు రాజకీయ ప్రాబల్యమును, దమననీతియుఁ గారణము లనుట విశదము.[2]

ఒక భాషలోని యుద్యమమున కనుకరణముగా మఱొక భాషయందొక సాహిత్యోద్యమ మేర్పడుటయుఁ గలదు. ఒక భాషలో నేదో యాంతరంగిక కారణముల ప్రోద్బలముచే నొకయుద్యమము బయలుదేరును. అట్టి పరిస్థితులు కాని, యట్టి యుద్యమముయొక్క యావశ్యకము కాని మఱొక భాషలో లేక పోవచ్చును. కాని యాభాషలో నాయుద్యమకాలమున వెలువడిన రచనములను జదివి యందలి క్రొత్తదనమునకో, వైచిత్ర్యమునకో, వస్తువిన్యాస వైఖరికో, శాబ్దికచమత్కృతికో మురిసిపోయి ముగ్ధుఁడయి తనభాషలోఁ గూడ నట్టి వినూత్న ప్రయోగము చేయ వలయునను సంకల్ప మాతనికిఁ గలుగ వచ్చును. అట్టి రచనము చేయుటకు ముచ్చటపడి యాతఁడు తద్విధమగు రచనమునకుఁ దొడఁగ వచ్చును. తమభాషలో, గ్రొత్తగా వచ్చిన యా రచనమును

---

[2] ఈ యుద్యమమునుగూర్చిన వివరములు 'ప్రపంచ సాహిత్యంలో యువతరం తిరుగుబాటు' అను వ్యాసము నుండి సంగ్రహింపబడినది. వ్యాసకర్త: శ్రీ నిఖిలేశ్వర్. భారతి. ౧౯౬౭ జనవరి నెల సంచిక.

మఱికొందఱు ప్రియంపడి యనుసరింపను వచ్చును. అట్లా తొలియాతని ప్రయోగప్రయత్న మొక యుద్యమరూపము దాల్చును. అట్టి యాయుద్యమము ననుకరణఫలముగా నేర్పడినది.

క్రీస్తుశకము **1924**వ సంవత్సరములు 'పారిసు' మహానగరమున నొక క్రొత్త యుద్యమము బయలుదేరినది. సర్రియలిజము (Surrealism) అని యా యుద్యమముపేరు. తెలుఁగున దానికి 'అధివాస్తవికత' యని నామకరణము చేసిరి.

సామాన్యముగా నెట్టి పొంతనము కాని సంబంధముకాని లేని మూర్త పదార్థములను, శాబ్దికబింబములను నెదురుబదురుగా నిలిపి వాని యద్భుత సమ్మేళనము వలన నొక యనిర్వచనీయతను, సాహిత్య సౌందర్యమును సాధించుట దాని యాశయము. వ్యక్తావ్యక్తస్థితిని గూర్చి 'ఫ్రాయిడ్' తెలిసిన సిద్ధాంతమే యీ యధివాస్తవిక సిద్ధాంతము నందుఁ బ్రధానభూమిక వహించుచున్నది.[3] ఈ యుద్యమమునకు నాయకుఁడయి, దీనికిఁ బ్రాతినిధ్యము వహింపఁగల శక్తిసామర్థ్యములు గలిగిన (Andre Breton) ఆండ్రీ బ్రీటన్ అనుకవి యీ యుద్యమముయొక్క లక్ష్యములను, లక్షణములను వివరించు తన 'మహాపత్రము' (Manifesto)లో నీక్రిందివిషయములను దెలిపెను.

అధివాస్తవికత యనునది యొక మానసిక యాంత్రిక ప్రవృత్తియేకాని యన్యము కాదు. భావముయొక్క చెప్పుచేతలలో నది యుండును. నైతిక మయిన, రసాత్మక మయిన ప్రభావములకు లోఁగక తర్కము యొక్కయు, విచారము యొక్కయు నధికారము లోపించినదశలో దీని ప్రాదుర్భావము జరుగును. ఈ యుద్యమమునకుఁ జెందినకొందఱు కవులు అచేతనస్థితి యొక్క క్రియాశీలతవలనఁ గలుగు ప్రత్యేక ఫలితములను బొందఁ గలిగితి మనియుఁ గొన్ని ప్రత్యేక మూలపదార్థముల నెన్నుకొని వాని రమణీయసమ్మేళనమువలనఁ

3. ***Surrealism*** *- A movement in Literature and Painting, succeeding* ***Dadaism*** *and founded in Paris in 1924 with the aim of achieving effects of 'Super' realism through the juxtaposition and combination of Verbal Images and Physical objects ordinarily considered incongrous. The Freudan concept of the unconscious plays an important role in theoritical Surrealism, it being claimed as the origin of the arrangements of incongruities which produce these effects.* ***Andre Breton****, leader and most representative poet of the movement in his* ***Manifest du Surrealisme*** *(Surrealist Manifesto 1924) defines surrealism as pure psychological automatism... thoughts' dictation, in the absence of all control exercised by the reason and outside all aesthetic or moral pre-occupations. . —— The Reader's Encyclopaedia.*

దముకావ్యములలో లేక రచనములలో నొకయద్భుత ఫలితమును సాధింపఁ గలిగితి మనియు నుడుపుచున్నారు. ఇరువదవ శతాబ్దమునందు వెలసిన యీ యుద్యమము Symbolism సాంకేతిక అనుపేరఁ బిలువఁబడు మఱొక యుద్యమమునకుఁ బుత్రిక యనఁదగును. విసరి పాఱ వేసినట్లున్న శాబ్దిక చిత్రములను, వైయక్తికసంబంధములను బ్రధానముగాఁ బదర్శించుసుద్యమ మిది. గోథిక్ నవలారచయితలు, మార్క్విస్ డి. సాడె. యస్. టి. కాలరిడ్జి, లూ కారెల్, టాట్రెవహాంటు, రింబాడ్, ఆల్ఫ్రెడ్ జారీ యనువా రీ యుద్యమమునకుఁ జెందిన కవులు.

ఈ యుద్యమము ప్రారంభింపఁబడిన తొలిదినములలో నిది కమ్యూనిష్టు సిద్ధాంతముపై నాధారపడిన కళాసాహిత్యోద్యమముగా భావింపఁబడినది. కాని కమ్యూనిష్టు నాయకులే దీనిని బహిరంగముగా, బాహాటముగా ఖండించిరి.

అమెరికా దేశములోనికిఁ గూడ నీయుద్యమము కొంతవఱకుఁ బ్రాకినది. కాని యాదేశమున దీని కంతగాఁ బ్రోత్సాహము లభింప లేదు. న్యూయార్కు మహానగరములో వెలువడిన 'దారి' రచనలు అమెరికా జనసామాన్యములో నొక వర్గము వారిదృష్టికి నీయధివాస్తవికతను గొని రాఁ గలిగెను. హాస్యరసపూరితము లయిన యసంబద్ధవిషయముల యద్భుతసమ్మేళనము వలనఁ గొంత వినోదము వారికి లభించినది. ఒకకొంత మార్పుతో సర్రియలిజము పద్ధతులు అమెరికా దేశములోని ప్రకటనపద్ధతులపై నధికప్రభావము నెఱపినది. ముఖ్యముగా 'ఫాషను' (Fashion) ప్రకటనలయందును జిల్లరయంగళ్లలోని కిటికీ ప్రదర్శనము లలోను దాని ప్రభావము గోచరించును.

## భారతీయసాహిత్యముపై పాశ్చాత్య సాహిత్యోద్యమ-ప్రభావాలు:

**1940**వ సంవత్సర ప్రాంతమున నాంధ్రసాహిత్యములోఁ గొందఱు కవులీ యధి వాస్తవిక ధోరణిలోఁ గవితలు రచించిరి. ఈ యుద్యమము తెలుఁగులో నల్పకాలము మాత్రమే నిలచి యుండినది. తరువాత నేమికారణమువనో నామరూపములు లేకుండ నశించి పోయినది. ఇది పరసాహిత్యానుకరణమున నేర్పడిన యుద్యమము. అనుకరణముగాఁ బారంభించిన యేయుద్యమము కాని పదికాలములపాటు నిలువదు. దాని జీవితము తాత్కాలికము మాత్రమే యగును. తెలుఁగులోని యధివాస్తవికోద్యమమున కట్టిగతియే పట్టినది. [4]

[4] ఈ యుద్యమమును గూర్చిన వివరములు మఱికొన్ని 'ఆంధ్రభాషలోని సాహిత్యోద్యమములు' అనునధ్యాయమున దెలుపఁబడినవి.

అనుకరణము మూలముననే కాక ప్రతిధ్వని లేక ప్రేరణమూలమునం గూడ సాధారణముగా నుద్యమములు బయలుదేరుచుండును. మనదేశమున బెంగాలు రాష్ట్రములో మొన్నమొన్న తలయెత్తిన 'ఆకలియుగము' (Hungry generation) అనబడు సాహిత్యోద్యమము ఇతరభాషలలోని యుద్యమప్రేరణచే దానికిఁ బ్రతిధ్వనిగా నేర్పడిన దని చెప్పవచ్చును. దీనికిఁ బ్రేరణభూతమయిన సాహిత్యోద్యమము అమెరికను భాషా సాహిత్యములోని బీట్ జెనరేషన్ (Beat Generation). ఆయుద్యమమునకుఁ జెందిన కవులకు బీట్నిక్కు లని పేరు.

బెంగాలురాష్ట్ర విభజనము జరిగిన తరువాత భారతభూభాగమున నొకరాష్ట్రముగా బ్రముఖస్థానము వహించిన పశ్చిమబంగాళమునందుఁ గడచిన యిరువది సంవత్సరములుగాఁ బ్రశాంతత కరువయి పోయినది. దానికిఁ గారణము లే దయినఁ గావచ్చును. మొత్తము రాష్ట్రమునకుఁ బ్రతిబింబ మారాష్ట్రమునకు రాజధానీ నగరమయిన కలకత్తా పట్టణము. చీమలబారులవలె నిరంతరము సాఁగిపోవు చుండు మహాప్రజావాహిని, రహదారులపై వివిధము లయిన వాహనములు, యానసాధనములు - ట్రాములు, కారులు మోటారు సైకిళ్లు, స్కూటరులు, మామూలు సైకిళ్లు - ఎంతో యలజడి. మఱి యెంతో సంచలనము. కలకత్తా మహానగరమున నేదో యొకచోట, నోదో యొకకారణ మున నెవరో యొకరు న్మొయనుచుఁ జేయనిదినముండదని చెప్పుదురు. నిలువ నీడ లేని నిర్భాగ్యులెందరో రహదారులప్రక్క నున్న కాలిదారుల (Foot paths) పైనే నివసింతురు. తినుటకుఁ దిండియుఁ, బండుట కొక వర్ణకుటీరమో పటకుటీరమో కాని లేని కాందిశీకులు మందలు మందలుగా నగరవీధులలోనే కాపురములు చేయుచుందురు. వేలాది సంఖ్యలో నిరుద్యోగులు నిస్పృహతో, నిరాశతో నిట్టూర్పులు వదలుచుండు దృశ్యము కడుపు చుమ్మలు చుట్టించును. రాజకీయనాయకుల శుష్కప్రియవములు, శూన్యహస్తములు ప్రజల కెట్టియూఱటయు గొలుపజాల వయ్యెను. ఆచరణ యోగ్యములు కాని నీతివేత్తల నీతివాక్యములు చెవులతో నిరంతరము గింగురు మనుచున్నను నవి చెవులలోఁ బ్రవేశింపఁ గలిగినంతగా మనసునఁ బ్రవేశింప శక్తిమంతములు కాక పోయెను. వానిని గ్రహించుటకుఁ గాని, గ్రహించి యాకళింపునకుఁ దెచ్చుకొని యాచరణమువలోఁ బెట్టుటకుఁ గాని వారి మనస్సులు తిరుగుబాటు చేయుచుండెను. లోకహితముకొఱకుఁ గాక వ్యాపారమనస్తత్త్వముతో గడ్డితిని యయిన డబ్బు గడించుటయే పరమప్రావ్యముగా భావించు రచయితలు, కవులు పెచ్చు పెరిగి పోయిరి. ఇట్టి సమకాలిక సామాజిక పరిస్థితులు, విసపూరిత మయిన

విపరీతవాతావరణము కలకత్తా మహానగరమున నివసించు కొందఱు యువకులపైఁ దీవ్రముగాఁ బని చేసినది. వయి వాతావరణములో నీయువకులు తిరుగుబాటు మనస్తత్త్వముతోఁ గోపావేశముతో నెదురుతిరిగిరి. వీరోద్రేకముతో విఱుచుకొని పడిరి. ఆ తిరుగుబాటు ఫలమే బెంగాలీసాహిత్యములో మొన్న మొన్న యవతరించిన 'ఆకలితరము' (Hungry generation) అనఁబడు సాహిత్యోద్యమము.

అమెరికా దేశములోని 'బీట్‌జెనరేషను' ఉద్యమనేతయు, నాయుద్యమకవులకు నేసుక్రీస్తుఁ బోలినవాఁడును నగు ఎలెన్ గిన్స్‌బర్గ్ భారతదేశమునందుఁ బర్యటించుచు వచ్చి కలకత్తా నగరమునఁ దిరుగుబాటు మనస్తత్త్వము కల యీ యువకులను గలిసికొనెను. బీట్‌జెనరేషను జీవిత విధానమును వారికి 'ప్రేరణ' గాఁ జూపెను. దానితో బెంగాలీయువతరమునకుఁ జెందిన కవులును, రచయితలను సమాజములోఁ గవితలో నొక యౌన్నత్యము కొఱకన్వేషణమును బ్రారంభించిరి.

ఇట్లు బీట్ జెనరేషను (Beat Generation) అనఁబడు సాహిత్యోద్యమ ప్రేరణచే నాయుద్యమమునకుఁ బ్రతిధ్వనిగాఁ బశ్చిమబంగాళమున నాకలితర (Hungry generation) మనఁబడు నీ సాహిత్యోద్యమ మవతరించి పురోగమించుచున్నది. మలయరాయ్ చౌధురి, సుచిమత్‌బసాక్, సమీర్‌రాయ్ చౌధురి, ఉత్పల్‌కుమార్‌బసూ, దేవిరాయ్, ప్రదీప్‌చౌధరి మొదలగు వారీ 'యాఁకలితరము' నకుఁ జెందిన యువకులు, కవులు.

## మహాపురుష ప్రభావము :

మహాపురుషప్రభావమువలనఁ గూడ నప్పుడప్పుడు సాహిత్యములోఁ గొన్ని యుద్యమములు తల యెత్తుచుండుట కలదు. ఆమహాపురుషులు స్వయము గ్రంథములు విరచింపక పోయినను వారి ప్రోద్బలమునఁ బెక్కురు కవులు గ్రంథ రచనము చేయుటయు, గ్రంథరాజములు వెలయించుటయు, నది యొకప్రత్యేక మార్గమునకుఁ జెంది యుండుటయుఁ దటస్థించుచున్నది. మహారాష్ట్ర సాహిత్యము లోని 'మహానుభావపంథ' యనుసంప్రదాయము నిటఁ బేర్కొనఁదగును. మహారాష్ట్రసాహిత్యమున జ్ఞానదేవుఁడను కవీశ్వరునికిఁ బూర్వమందును, ఆదికవి యగు ముకుందరాజునకుఁ దరువాతను నొక క్రొత్తసంప్రదాయము స్థాపింపబడెను. దాని పేరు 'మహానుభావపంథ'. 'మానుభావపంథ' యనుపేరుతో దానిని

వ్యవహరింతురు. కాని యీ సంప్రదాయమునకుఁ జెందిన గ్రంథములలో నా పే కనఁబడదు.

జీవాత్మ వేఱు, పరమాత్మ వేఱనియు – జగత్తు నిత్యము, స్వతంత్రమ జడ మనియు – పరమేశ్వరుఁడు నిత్యముక్తుడనియు వారి సిద్ధాంతము. ఇఁ మతము ద్వైతసిద్ధాంతమును బ్రతిపాదించుచున్నది. శ్రీ కృష్ణుడు, దత్తాత్రేయుఁ ద్వారవతీవాసియైన బాంగదేవరావుల్, బుద్ధిపురమునందలి గుండంరావుల్ చక్రధరుఁడు భగవంతుని యవతారము అని వీరి మతము. చక్రధర విరచిత మగ సూత్రపార మీమతానుయాయుల పారాయణ గ్రంథము. అతఁడే సంప్రదాయమ నకుఁ బ్రవక్త. ఈ సంప్రదాయమునకుఁ జెందిన గ్రంథములు సాంకేతిక శబ్దములతో నిండి యుండును.

చక్రధరుఁడు సదాచారసంపన్నుఁడు, వైరాగ్యశీలుఁడు. కఠినము లగునియ మములను బాటించునియమవ్రతుఁడు. తన సంప్రదాయమునఁ జేరువారి నీతఁడు బాగుగాఁ బరీక్షించి కాని దీక్ష నొసఁగువాఁడు కాఁడు. తనశిష్యులగువా రెట్టివారి యొద్ద నేపదార్థమును భిక్షారూపమున స్వీకరింపఁదగునో, యట్లు స్వీకరించిన యాయాపదార్థముల వినియోగ మెట్లుచేయవలయునో యనుదానిని గూర్చి యాతఁ డొక దండకమును వ్రాసి, యాదండకములోఁ జెప్పఁబడినరీతిని దనశిష్యులాచరింప వలయునని యాతఁడు కట్టడ చేసెను. దానికి విరుద్ధముగా నడచినవారి కాతఁడు శిక్షలు గూడ నొసఁగుచుండెను.

ఇట్లొక నూతనసంప్రదాయమునకుఁ బ్రవక్త యై యాతఁడెందఱినో గ్రంథ రచనమునకుఁ బ్రోత్సహించి తనకీర్తియాచంద్రార్కము నిలుచునట్లు చేసికొనెను. ఇట్టి తరులచేత గ్రంథములు రచింపజేసిన యాతఁడు మాత్రము గ్రంథములు రచించినట్లగపడదు. భాస్కరప్రణీత మగు శిశుపాలవధ (శా.శ. 1195), ఉద్ధవగీత (శా.శ. 1196) దామోదరపండితుఁడు రచించిన వత్సహరణము (శా.శ. 1200), నరేంద్రుఁడనుకవి విరచిత మయిన రుక్మిణీస్వయంవరము (శా.శ. 1213), విశ్వనాథపండితుని జ్ఞాన ప్రబోధము (శా. శ. 1224), నారాయణపండితుఁడు రచించిన బుద్ధిపురవర్ణనము (శా.శ. 1253) అను గ్రంథము లీసంప్రదాయమునఁ బ్రసిద్ధము లయినవి. చక్రధరుఁడప్పుడప్పుడు ప్రదర్శించిన లీలలను, నతనిశిష్యుఁడయిన మహీభట్టు లీలాచరిత మను గ్రంథమున నభివర్ణించెను. ఆధునికులు కూడఁ గొంద ఱీసంప్రదాయమునకుఁ జెందిన గ్రంథములను విరచించి యున్నారు. ఇట్లు మహారాష్ట్ర సాహిత్యమున 'మహానుభావ

పంథ' కు సంబంధించి వెలువడిన గ్రంథజాల మంతయుఁ జక్రధరుఁడను నాసంప్రదాయ ప్రవక్తయొక్క ప్రోద్బలము చేతను, నాతని ప్రభావఫలముగాను నేర్పడినదని తెలియుచున్నది.

వంగసాహిత్యములోఁ గూడ దీని కొకదృష్టాంతము కలదు. క్రీస్తుశకము 1486-1533 సంవత్సరముల నడిమికాలమున జీవించిన చైతన్యస్వామి గొప్ప వైష్ణవ భక్తుఁడు. ఆయన శిష్యులును, ప్రశిష్యులును నాతనిని నవతారపురుషుఁడుగా భావింతురు. చైతన్యస్వామి ప్రవేశపెట్టిన నామసంకీర్తన మతని ఖ్యాతిని దశదిశల విస్తరింపజేసినది. ఒక్క వంగదేశములోనే కాక భారతదేశము నలుమూలలయందును నతఁడు వైష్ణవమతమును విస్తరింపఁజేసెను. మహమ్మదీయులు కూడ నాతని కెందఱో ప్రియభక్తులయిరి. చైతన్యస్వామి వంగభాషలోఁ గావ్యరచనము చేయలేదు. కాని, యనేకవంగభాషాకావ్యములకును, దన సమకాలమునాఁటి, యనంతరకాలమునాఁటి వైష్ణవసాహిత్యమున కతఁడు మూలకారణమయ్యెను. చైతన్యస్వామి దేశమునఁ గలిగించిన నూతనచైతన్యము వలనఁ బ్రభావితులై యెందఱో కవులు కావ్యములు, గ్రంథములు విరచించిరి. అతని జీవితచరిత్రములు బెంగాలీసాహిత్యచరిత్రములో నొక నూతనాధ్యాయమును సృష్టించినది.

చైతన్యస్వామి జీవితచరిత్రమును రచించినవారిలో మొట్టమొదటివాఁడు మురారి గుప్త. ఇతని గ్రంథము చైతన్యచరిత (1475). రఘునాథగోస్వామి (1425-1505) స్వామిజీవితమును సంస్కృతములోఁ బద్యకావ్యముగా విరచించెను. కవికర్ణపూరపరమానందసేను అనుకవి (1527) 'చైతన్య చరితామృత' అనుకావ్యమును, 'చైతన్యచంద్రోదయ' అను నాటకమును, గౌరాంగ గణోద్దేశదీపిక యను పేరుతోఁ జైతన్యస్వామి యనుచరుల పట్టికను రచించెను. బృందావనదాసు (1507-1609) రచించిన గ్రంథమునకు 'చైతన్యభాగవత' మనియు, చైతన్యమంగళ మనియుఁ బేరు. చైతన్యలీలామృత అను మఱొకగ్రంథము నీతఁడు సంతరించెను. కృష్ణదాస కవిరాజు (1496-1583) చైతన్య చరితామృతము అను గ్రంథమును రచించెను. త్రిలోచనదాసు (1523-1589) అను మఱొక కవి మురారిగుప్తుని 'కరచా' ననుసరించి చైతన్యమంగళ మను గ్రంథమును రచించెను. ఇంకను బెక్కురు కవులు బెక్కు గ్రంథములను రచించినట్లు వంగసాహిత్య చరిత్రమువలనఁ దెలియుచున్నది. చైతన్యస్వామి యుద్యమ ప్రభావమువలన సుమారు రెండువందలమందికిఁ బైఁగా వైష్ణవపదకర్తలు బెంగాలు దాప ములో నవతరించిరి. వీరిలోఁ బలువురు బెంగాలీభాషలోను, వ్రజబులిలోను

బదములు విరచించిరి. పదునాఱవశతాబ్దిలో బెంగాలీభాషలోఁ గవిత్వము చెప్పిన కవులలో నూటికిఁ దొంబదిమంది చైతన్యమతము నవలంబించినవారే. పెక్కురు కవులాయనకు శిష్యులో, ప్రశిష్యులో యయియుండిరి. హిందువులే కాదు, పెక్కురు ముస్లిము కవులు కూడ నామహనీయుని ప్రభావమునకి లోఁబడి చక్కని వైష్ణవపదములు వ్రాసిరి. వారిలో నయ్యదు మార్తుజా, నాసిర్ మామారాదు మొదలగువారు ప్రసిద్ధులు. ఇట్టికాలమునందు వెలువడిన సాహిత్యమును 'చైతన్య సాహిత్య మని వచింపఁదగును. వంగభాషయందు వెలువడిన యీ చైతన్యసాహిత్య మంతయుఁ జైతన్యస్వామి ప్రభావముచే నేర్పడిన దని రూఢి యగుచున్నది. మహా పురుషప్రభావమువలనఁ గూడ సాహిత్యములో నొక నూతనోద్యమము బయలుదేరుచుండు ననుట కిది యొక్క చక్కని యుదాహరణము.'

సాహిత్యోద్యమములకుఁ గారణభూతము లయిన హేతువులలో మత మనునది తక్కినయన్ని హేతువులకంటెఁ బ్రముఖస్థానము వహించు నని యిదివఱకే తెలుపఁబడినది. మతమునకుఁ దరువాత నంతటి ప్రాధాన్యమును వహించు సాహిత్యోద్యమహేతువు నూతనత్వాభిలాష. ప్రాంత బంగారమే (Old is Gold). అందుల కెట్టి సందేహము గాని యుండఁబోదు. కాని ప్రాంత యొక రోఁత – క్రొత్త యొక వింత యను నొక నానుడి కూడఁ గలదు కదా. ప్రాంత యగునది యెల్ల బంగారమువలె విలువ కలదిగా, విజ్ఞులగువారి కెల్ల నుపాదేయము గాఁ గొందఱు పరిగణించుచుండఁగా మఱి కొందఱు ప్రాంతదారులకు రోసి క్రొత్తపుంతలు ద్రొక్కుదురు. ప్రాంతయభిరుచులుఁ బ్రాంతధోరణులు, దారులు కాలము గడచుకొలఁది మొగము మొత్తిపోవును. దాని యెడ వెగటును, విసుగుదలయు జనించును. పాడినదే పాడుచుండుటకు రోఁత కలుగును. మనస్సు తిరుగుబాటు చేయును. అట్టి మనఃస్థితిలోఁ గ్రొత్తరుచులు చూచుటకు మనస్సువ్విళ్లూరును. క్రొత్తదారులను గవేషించును. క్రొత్త పోకడలు పోవుటకుఁ గుతూహలపడును. ప్రాంతరీతులమీఁద రోఁతయు, నూతనత్వముమీఁదఁ బ్రీతియుఁ బెక్కు సాహిత్యములలో నూతనోద్యమములు తల యెత్తుటకు హేతువు లగుచున్నవి.

## ఆంగ్ల సాహిత్యములో కాల్పనికోద్యమము:

ఆంగ్లసాహిత్యమున నేర్పడిన కాల్పనికోద్యమము (Romantic Movement) అంతకుముందు సాహిత్యమున నుండిన ప్రాచీనపద్ధతికిఁ బ్రతియోగముగా వెలసినది. రొమాంటిక్ అనుపదము రొమాన్జ్ (Romanz) అను ప్రాచీన మయిన ఫ్రెంచి పదము

నుండి యేర్పడినది. దీనికి లాటిసుభాషలోఁ గాక సామాన్య జనుల్లభాషలో వ్రాయుటఁ యని యర్థము. Roman అను విశేష్యపదము దేశభాషలలో వ్రాయఁబడిన భావ ప్రధానము లయిన రచనములకు వాడఁబడెను. ఈవిధముగాఁ గాల్పనికత్వము (Romanticism) అనునది సంప్రదాయబద్ధతకుఁ బ్రతియోగముగా వాడఁబడును. జన సమ్మతము, సాహసోపేతము, రూప రహితము అనుభావమును సూచించుచున్నది. క్రీస్తుశకము పదునేడవశతాబ్దిలో ఫ్రెంచివారును, నింగ్లీషువారును దాని నాయర్థములోనే వాడియుండిరి. రొమాంటిక్ (Romantic) అనఁగాఁ గోమలము, లలితము రసాత్మకము, శోకపూరితము నని యర్థము. క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దమున నాంగ్లదేశమున నీయర్థమే ప్రచారములో నుండెను. యూరపుఖండమునఁ గాల్పనికోద్యమమునకు ముందు ధనికవర్గముల పతనమును, 'మధ్యతరగతి' జనుల యభ్యుదయమును సంభవించుచుండెను. అట్టి సమయమున నిగ్రహముతో, సంయమనముతోఁగూడిన ప్రాచీన సారస్వత ప్రక్రియలు సన్నగిల్లి భావావేశప్రధానము లయిన రచనలు పెంపొందెను. ఆంగ్లసాహిత్యములో నీయుద్యమమునకుఁ జెందినకవులు స్కాట్, షెల్లీ, బైరను, వర్డ్సువర్తు అనువారలు. ప్రాచీనసాహిత్యమార్గమునకుఁ బ్రతియోగముగా నవతరించిన యీకాల్పనికోద్యమ స్వరూపమును, దాని యాశయములును నీక్రింది వాక్యములలో విశదము కాఁగలదు.

'Romantic' movement is a term applied to a general artistic upheaval which culminated about 1830-40. It was a re-action against the accepted formulae of so-called classical art and although it may be regarded as having originated in the field of German Literature in the later 18th century (eg.Lessing and Schiller) it rapidly embraced the whole European art. The relative aims of classical art and Romantic art were summed up by Heine as follows: 'Classical art had to express only the finite and its forms could be identical with the artist's Romantic art had to represent or rather to typify the infinite and spiritual and had therefore to be expressed symbolically.' Classical art may be said to possess objective beauty since universal types are presented, the artist being chiefly a technical medium of realisation. Romantic art, on the other hand, is subjectively beautiful since individual impressions are presented, the artist being primarily a psychological medium of interpretation. The rules evolved from classical tratition were not suited to Romantic ideals, the former aimed at symmetry of outline

latter aimed at the expression of individuality. The Romantic Movement therefore discarded formal beauty in favour of emotional intensity [1]

'A reflection in Literature of the universal effort at emancipation from tyranny that culminated in the French Revolution, with its later repurcussion throughout Europe. It was largely a rebellion against the inflexible rigidity and limited imaginative range of the classical School which had dominated all European Literature for over a century '[2]

'Romanticism is a term applied to the Movement in European Literature and other arts which began at the end of the 18th century, emphasizing the imagination and emotions over reason and the intellect and revolting against the conventional strictness of Neo-classicism. Called Romanticism because it was ostensibly defended *as a return to the freer fancies* and methods of Romance, the movement is interpreted by many critics as the response of the artist's psychology to the growing complexity of an increasingly mechanised industrial and scientific civilization which came into being with the industrial revolution of the mid-18th century. The leading characterisations of Romanticism are individualism, nature-worship, primitivism, a fondness for the middle ages, the orient and vanished or alien cultures in general, Philosophic idealism, a paradoxical tendency towards both free thought and religious mysticism, revolt against political authority and social convention, the exaltation of Physical passion and the encouragement of sexual inconstancy, the cultivation of emotion and sensation for their own sake and a persistant attraction to the Super-natural the morbid, the melancholy and the cruel.'[3]

ఒకానొకచిన్ని సన్నివేశమో, దురంతమో కూడ సాహిత్యములో నుప్పెనగాఁ గొన్ని గ్రంథములు వెలువడుటకుఁ గారణమగుచుండును. ఒక యుద్యమమువలె

1. *Everyman's Encyclopaedia, vol. 10, Edited by E.F. Bozman, M.A. (cantab).*
2 *The Universal Encyclopaedia, vol 9, Edited by Sir John Hammerton.*
3 *The Reader's Encyclopaedia, Edited by Williams Rose Bene't.*

నాగ్రంధ రచనము సాఁగినదా యనిపించును. వంగదేశములో తారకేశ్వరమఠము తాలూకు మహంతు మాధవగిరి యనునతఁడు. అతఁడు 'ఎలోకేశి' యనునొకయువతిని బలవంతముగాఁ జెఱపట్టి యామెయెడ నత్యాచారము నొనర్చెను. అతనిపై న్యాయస్థానమున గొప్ప యభియోగము జరిగెను. మాధవగిరికి శిక్షపడెను. ఈదారుణోదంతముతో వంగదేశము ట్టుడికి పోయినది. ఒక్క మొగిని నీదురంత మితివృత్తముగా వంగభాషలో నించుమించుగా నిరువదియైదు నాటకములు వెలసినది. దానిలోఁ గొన్ని భండ తపస్వి, మహంతేర ఎయికి కాజ్?, మహంతేర జై సాకీ తైసా, మహంతేర శేష కాన్నా, మహంతేర జెమున కర్మ తెమున ఫల – యనునవి.

కొందఱు ఉత్సాహభరితులు, నూర్జితసత్త్వులు చేరి యొకసంఘముగా నేర్పడుదురు. సాహిత్యాభ్యుదయము పరమధ్యేయముగాఁ గలసి పని చేయుదురు. ఏదో యొకరక మయిన యభివృద్ధిని గాని పరిణామమును గాని సాధించు దృఢసంకల్పముతోఁ జేతులు కలుపుదురు. తమయాశయములు ఫలించుటకై తపస్సులు చేయుదురు. అట్టి యుత్సాహభరితు లగుయువకుల సంఘముయొక్క సంఘటితకృషిఫలితముగాఁ గొంతకాల మొక యుద్యమము నడచును.

వంగదేశములో ఈశ్వరచంద్రవిద్యాసాగరుఁడు (1820-1891) సంస్కృతకాలేజి అధ్యక్షుడుగా నుండి కొంతమంది రచయితల నొకగోష్ఠిగా నేర్పఱచెను. ఈగోష్ఠికి **సంస్కృత కాలేజి గోష్ఠి** యని పేరు. ఈగోష్ఠిసభ్యు లయిన రచయితలు విద్యాసాగరు ననుసరించి గద్యరచనలు సాగించిరి. వారిలో తారాశంకరతర్కరత్న, రామగతిన్యాయరత్న, నీలమణిబసాక ముఖ్యులు. 'సంస్కృతకాలేజిగోష్ఠివలెనే మఱికొంతమందిరచయితలు' **'హిందూ కాలేజిగోష్ఠి'** గా నేర్పడిరి. ఈ గోష్ఠికూడ బెంగాలీ గద్యసాహిత్యములోఁ బ్రముఖస్థానము వహించెను. సంస్కృత కాలేజి గోష్ఠి బెంగాలీసాహిత్యములో సంస్కారమును బ్రవేశపెట్టఁగా హిందూకాలేజిగోష్ఠి విప్లవమును బ్రవేశపెట్టినది. ఈగోష్ఠికిఁ జెందిన గద్యరచయితలలో ప్యారీచాందమిత్ర బెంగాలీగద్యములో నొకవిప్లవమును దీసికొని వచ్చెను. హిందూ కాలేజిగోష్ఠికిఁ జెందిన గద్యరచయితలలో మహర్షి దేవేంద్రనాథఠాకూరు, రాజనారాయణవసు, ద్విజేంద్రనాథఠాకూరు అనువారు ముఖ్యులు.

ఇట్లే, ఓఢ్రసాహిత్యములో గోపబంధుదాసు అనుకవీశ్వరుఁడు 'సాక్షిగోపాల్' అనుగ్రామములో [illegible]

నాకాలమునం బ్రత్యేకోత్కలరాష్ట్ర నిర్మాణమునకై ప్రబోధవాఙ్మయమున వివిధరీతుల వెలయించిరి. వీరి ప్రతిరచన యందును భారతీయసంస్కృతి పునఃప్రతిష్ఠ, భారతదేశ దాస్యవిముక్తి, ప్రాచీనోత్కలభాషావికాసనిరతి గోచరించును. వీరు ప్రాతవృత్తములను వీడి క్రొత్తఛందస్సులను సృష్టించిరి. వ్యావహారికభాష దేశాభివృద్ధికి జీవగఱ్ఱ యనిభావించి యాభాషలోనే వీరు తమరచనములను వెలయించిరి.

కన్నడమునం గూడ నిట్టి సంఘములవలన జరిగిన సాహిత్యాభ్యుదయకృషి విశేషముగాం గలదు. 1914వ సంవత్సరమున స్థాపింపంబడిన కన్నడసాహిత్య పరిషత్తు మూలమునం బ్రతిభావంతు లయినరచయిత లెందఱో ముందునకు వచ్చి యుత్తమ రచనలు చేయుటకు వీలేర్పడెను. పరిషత్తుమూలమునం బ్రసిద్ధిలోనికి వచ్చినవారిలో బి. రామారావు, అలూరు వెంకటరావు, ములియ తిమ్మప్పయ్య మొదలగువారు ముఖ్యులు. బి. యం. శ్రీకంఠయ్య, మాస్తి వెంకటేశ అయ్యంగారు, డి. వి. గుండప్ప గారలు నడపిన 'తళిరుగుంపు' – పంజె మంగేశ్వరరావు, గోవిందపై ప్రభృతుల యాధ్వర్యవమున సాఁగిన మంగళూరు మిత్రమండలి – ధార్వాడనుండి బేందేనాయకత్వమున వెలసిన 'గెళెయర గుంపు' మొదలయిన సాహిత్యసంఘములు చాలాఁ బ్రశంసనీయ మయిన కృషి చేసినవి. ఈ సంఘముల మూలమున నవ్యకవిత్వము విశేషముగా వెలువడినది. ఈకవితలలో గేయములు, మాత్రాచ్ఛందస్సులు, వర్ణనాత్మకములు, ఆత్మాశ్రయములు, గేయనాటికలు మొదలయిన సాహిత్యప్రక్రియలు సాధింపఁబడెను.

**ఆంధ్రసాహిత్యపరిషత్తు, నవ్యసాహిత్యపరిషత్తు, సాహితీసమితి** యను సాహిత్య సంఘము లాంధ్రసాహిత్యమును దట్లే యాశతాబ్దమునం దభ్యుదయమును సాధించినవి.

ఇట్లు సాహిత్యసంఘములు కూడ సాహిత్యోద్యమములకు సక్రత్తుగా హేతుభూతములగుచు సాహిత్యాభ్యుదయ సాధనమునకు నెంతో కొంత తోడ్పడుచుండును.

## సాహిత్యోద్యమలక్షణములు

సాహిత్యోద్యమము లెట్టియెట్టిహేతువులవలన నేర్పడుచుండునో పూర్వ ప్రకరణమునందుఁ దెలిసికొంటిమి. ఇంక నీప్రకరణమున నుద్యమ లక్షణములను

గూర్చి కొంత చర్చింతము. ఉద్యమలక్షణము లనఁగా వివిధ భాషాసాహిత్యములలో నాయాయాంబహేతువులవలన నేర్పడు సాహిత్యోద్యమము లేయేవిషయములయం దభ్యుదయము సాధించుటకుఁ గృషి సల్పినవో, యేపరిణామప్రయోజనమును నపేక్షించి యాసాహిత్యోద్యమములు రూపొందినవో, వాని స్వరూపస్వభావాదులెట్టివో యనుమొదలగు విషయములు. ఇట్టి యుద్యమలక్షణములను భాష, భావము, ప్రక్రియ, ఛందస్సు, అనుకరణము, స్వతంత్రరచనము అను నాలువిభాగములక్రింద వర్గీకరించ వచ్చును. సాహిత్యోద్యమములు సాధారణముగా దీనిలో నొక్కొక్క విషయముమీఁదనే తమదృష్టి నంతను గేంద్రీకరించి యభ్యుదయము సాధించుటతో, నూతనసంప్రదాయము నెలకొలుపుటకో, పరిణామము పడయఁజేయుటకో ప్రబలముగాఁ బటిష్ఠముగాఁ బ్రయత్నము చేయవచ్చును. లేదా యొక్కొక్కప్పుడు ఒకే సాహిత్యోద్యమము పయివానిలో రెంటిమూఁటి విషయమున సమకాలముననే సమప్రాధాన్యముతోఁ బ్రశంసనీయముగుపరిశ్రమను సలుప వచ్చును. మొత్తముమీఁద నీయుద్యమలక్షణములు ప్రతి సాహిత్యోద్యమము నందును నొక్కటి కాని లేదా యొక్కటికంటె నెక్కువ కాని తప్పక యొకస్థానమును గలిగియుండు నని చెప్పవచ్చును. వివిధసాహిత్యములయందలి యుద్యమములలో నీలక్షణము లెంతవఱకు గోచర మగుచుండునో యుదాహరణ పురస్సరముగాఁ బరిశీలింతము.

ఒకానొకభాషకుఁ జెందినసారస్వతములో నొకకాలమున నొకరక మయినభాష ప్రచలిత మగుచుండును. ఆభాషలోఁ గావ్యములు విరచించకవు లెల్లరు నట్టిభాషనే తమ కృతులయం దనుసరించుచుండ వచ్చును. అయ్యది కృతకముగానో, క్లిష్టముగానో తోఁచి యామార్గమునకు భిన్నముగా నేకవీశ్వరుఁ డయినను భాషావిషయకముగా నొకసౌలభ్యమును, సౌకర్యమును దీసికొని రా వలయునను నుదాత్తాశయముతో నున్నతలక్ష్యముతోఁ దనకావ్యములను వెలయింప వచ్చును. ఆ పద్ధతి నచ్చి యితరులనేకు లాతని ననుసరించి కృతు లల్లవచ్చును. ఇట్లా సారస్వతములో నాయుద్యమము మూలమున నొక విప్లవమో, పరిణామమో యేర్పడఁ దగును. అప్పుడా యుద్యమముయొక్క లక్షణము భాషావిషయక మయిన దని వచింపఁ దగును.

ఉదాహరణమునకు మలయాళసాహిత్యములోని యొకయుద్యమమును బరిశీలింతము. మలయాళ సాహిత్యమునందుఁ బ్రారంభదశలో పచ్చ

మలయాళము, తమిళము, సంస్కృతము అనునవి గ్రాంథికమలయాళమును దీర్చి దిద్దె ననవచ్చును. పచ్చమలయాళ మనఁగా శుద్ధమలయాళము. ఇది సంస్కృత తమిళభాషల ప్రభావము లేని మలయాళభాష యన్నమాట. మలయాళభాషలో నాదికాలమున వెలసిన జానపద గేయరచనములయందు సులభసుందర మయిన భాష వాడఁబడుచుండినది. అది వాడుక భాషకు సన్నిహితముగా నుండు శుద్ధమలయాళము. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దము దాఁక పెరుమాళ్ రాజవంశీయులగు తమిళభూపతుల యేలుబడి కేరళమున సాఁగినది. వారియేలుమునఁ దమిళసంస్కృతి కేరళదేశమున వ్యాప్తిచెందినది. అప్పటికి మలయాళము లోఁ గావ్యభాష రూపొందియుండలేదు. అందుచేఁ దమిళమునందలి కావ్యభాషకే కేరళమునఁ బ్రాధాన్య మేర్పడెను. క్రీస్తుశకము పదునాలుగవశతాబ్దముదాఁకగూడఁ దమిళభాషాప్రభావము మలయాళమునఁ గొట్టవచ్చినట్లు కానవచ్చుచుండెను. మలయాళమున నాదికావ్య మని పరిగణింపఁబడు రామచరితము అను పంద్రెండవశతాబ్దికిఁ జెందిన కావ్యమున నీతమిళభాషాప్రభావ మెక్కువగాఁ గాననగును. తుదకుఁ గొన్ని మలయాళ శబ్దములకుఁ గూడఁ దమిళరూపమొసంగఁబడెను. మలయాళసారస్వతముపైఁ దమిళ భాషాప్రభావమెట్లో సంస్కృతభాషాప్రభావముకూడ నట్లే విశేషముగాఁ గలదనుట నిర్వివాదాంశము. సంస్కృతశబ్దములను గ్రహించుటయేకాక మలయాళము దానిని దమవిగాఁ జేసికొనినది. భారతదేశమున వ్యవహరింపఁబడుభాష లన్నియు సంస్కృతమునుండి యెన్నో శబ్దములను స్వీకరించి యుండినను నవి యన్యభాషాశబ్దములుగనే నిలిచిపోయినవి. మలయాళమున నట్లు జరుగలేదు. సంస్కృత మలయాళశబ్దములు క్షీరనీరన్యాయమునఁ గలసిపోయినవి. తత్ఫలితముగా **మణిప్రవాళ** మను నొకక్రొత్తభాష మలయాళమునం దేర్పడినది. మధురము లగు మలయాళ, సంస్కృత శబ్దములసమ్మేళనమే మణి ప్రవాళ మని నుడువఁ దగును. **మణిప్రవాళమను హారమునందు మణులవంటి మలయాళశబ్దములును, ప్రవాళములవంటి సంస్కృత శబ్దములును జక్కఁగాఁ గూర్చఁబడవలెను.** అప్పుడే యాహారము కన్నుల పండువు సేయును. మలయాళసారస్వతమునకుఁ జెందినకావ్యములలో నీ మణిప్రవాళభాష ప్రవేశించుటకు హేతు వీక్రిందివిధముగా భావింపఁబడుచున్నది. మణిప్రవాళసాహిత్యమునుగూర్చి పరిశోధనము సలిపిన శ్రీ పి. శంకరన్ నంబియార్ అను విద్వాంసుఁ డిట్లభిప్రాయపడుచున్నాఁడు.

‘పండితులు కానివారు కూడ సంస్కృతకావ్యములను జవి చూడ వలయు నని నంబూద్రిబ్రాహ్మణులు కొంద ఱభిలషించిరి. అట్టివారికి సంస్కృతశబ్ద జాలమును, వ్యాకరణమును జిన్న చిన్న మోతాదులతోఁ జతురతతో నందించినచో వా రనాయాసముగా వానిని గ్రహింపఁ గలుగుదురు. తత్ఫలితముగాఁ దమకుఁ దెలియకుండఁగనే వారు కావ్యరసాస్వాదన మొనర్చుచు సంస్కృత వ్యాకరణ రహస్యములను గూడ గ్రహింపఁ గలుగుదురు.’ ఇట్టి యాశయముతో మలయాళ సారస్వతమున నీమణిప్రవాళశైలి ప్రవేశించినది. ఈ మణి ప్రవాళభాషలో నాతరువాతఁ బెక్కుకావ్యములు విరచింపఁబడినవి. మలయాళసారస్వతమున సంస్కృతభాషాప్రభావముచే నేర్పడిన యీ మణి ప్రవాళభాషాప్రయోగపద్ధతి మలయాళకావ్యభాషలో జరిగిన యొక సుందరపరిణామ మనియు, నది భాషకు సంబంధించిన యొక యుద్యమఫలితముగా నాసారస్వతమున స్థానము గడించుకొనినదనియు విశదమగును.

ఇట్టిదే కన్నడసాహిత్యమునుండి యొకయుదాహరణము. నయసేనుఁ డనుకవి పండ్రెండవశతాబ్దారంభమున ‘ధర్మామృత’ మను నొకకావ్యమును వెలయించెను. నయసేనుఁడు జైనమతావలంబకుఁడు. ధర్మామృతము జైనమతమునకుఁ జెందిన మహాపురుషుల చరిత్రముల నభివర్ణించుకావ్యరాజము. అంతవఱకు జైనకవులు రచించిన పురాణము లన్నియుఁ బ్రౌఢము లై సామాన్యజనులకుఁ గొఱకరాని కొయ్యలుగా నుండెను. వైదిక పురాణము లట్లు కాక సరళములుగా నుండి జనులలో విశేషప్రచారము పడసి యుండెను. జైను లీరహస్యమును గుర్తింపక పోలేదు. జైనకవి యగు నయసేనుఁడు తనగ్రంథమునకు మంచి వ్యాప్తి కలుగ వలయునని యాశించి దానిని ‘శుద్ధకన్నడ’ భాషలో రచించెను. పంపఁడు మొదలగు జైనమహాకవులు పండితరంజనము కొఱకై తమకావ్యములను విరచింపఁగా నయసేనుఁడు శుద్ధకన్నడమునఁ దనకావ్యమును వెలయించి పామరజనరంజనము సాధించెను. పామరులను దృష్టిలో నిడుకొని రచన చేసిన కవీశ్వరుఁడు నయసేనుఁడు. నయసేనుని యీ ప్రయత్నము కన్నడమునఁ గావ్యభాషకు సంబంధించినది.

ఆంధ్రభాషయం దీశతాబ్దమున శ్రీగిడుగు వెంకటరామమూర్తిగారిచేఁ బ్రారంభింపబడిన ‘వ్యావహారికభాషోద్యమము గూడ నిట్టిదే. ఇట్లు సాహిత్యమునం దేర్పడుచుండు నుద్యమములకు భాష యొక్క ప్రధానలక్షణములుగాఁ బ్రతిభాసిల్లుచుండును.’’

సాహిత్యోద్యమములు కొన్ని యాభాషను వ్యవహరించు జనులలో నొక విధమయిన భావవిప్లవమును గొని తెచ్చునుద్దేశముతోc గూడc బ్రభవిల్లుచుండును. భావము అనుపదము Concept అను నాంగ్లపదమునకు సమానార్థకముగా నిందు గ్రహింపబడినది. జీవితమును గూర్చియుc, గవిత్వమును గూర్చియు జనులకంతకు ముందుదాక నుండిన యభిప్రాయములలో నొకవిప్లవమును దీసికొని వచ్చి నూతన దృక్పథ మలవడునట్లు చేయుట దానియాశయము. భాషాగత మయినసంస్కరణము వలెనే భావగత మయినయట్టి సంస్కారము కూడ నప్పుడప్పుడు సాహిత్యోద్యమముల మూలమున జరుగుచుండును. ఇటీవల నాంధ్రసాహిత్యమున వెలువడిన దిగంబరకవితోద్యమ మిట్టియాశయముతోనే యవతరించిన దని చెప్పదగి యున్నది. వారియభిప్రాయముతో నేటి తెలుగు సాహిత్యము కొందఱు కవులను, గధకులను మినహాయించినచో యథార్థమును విస్మరించి శవప్రాయముగా నున్నది. కళాకారులును గవులును గర్తవ్యము నెన్నడో మఱచి పోయిరి. ఇట్టి పరిస్థితులలోc దెలుగు సాహిత్య రంగముమీదికి దిగంబరకవులు ప్రవేశించిరి. నేటి వ్యవస్థను సమూలముగాc బెకలించి పైచి నిత్యనూతన మయిన, మహత్తర మయినవ్యవస్థకొఱకుc దపన పడుచున్న దిగంబర కవులు సాహిత్యములో జీవితములోని యాధార్థ్య మనెడుమహాసత్య మభివ్యక్తీకరింపబడ వలయు నని యభిలషించుచున్నారు. నేటిజీవితములో మానవుడు తాను స్వయముగా చేసికొనిన ముసుగును దొలగించుకొని తటస్థముగా – నంటియు ముట్టనట్లుగాc గాక సహజముగా, సక్రమముగా జీవింపవలయునని వాంఛించుచున్నారు. నూతన మయిన తాత్త్విక దృక్కోణముతో నేటి సామాజికవ్యవస్థలో మార్పు తీసికొని రా వలయునని – మానవుని దృక్పథములోc గూడ నొక వాంఛనీయ మయిన పరిణామమును గొని రావలయునని యాశించి యన్ని రంగములలోను జడత్వ మావహించి యున్న యాంధ్రదేశముపైc దిరుగుబాటు లేవదీయుచున్నారు. కవిత్వము కేవలము కవిత్వముకొఱకే మనcజాల దనియుc, గవిత్వములో నవజాగ్రుతి కొఱకు మాత్రమే కాక నేటి యువజనులలో నొకనవజీవనవిధానమును రూపొందింపc జేయు వలయు నని వారు నిరంతరము తపించుచున్నారు. 'ధర్మయుగ్' అనుపేర హిందీభాషలో వెలువడు సుప్రసిద్ధ వారపత్రికలో దిగంబరకవు లొకలేఖలోc దమ కవిత్వాశయముల నిట్లు పేర్కొనిరి.*

* చూ. ప్రపంచసాహిత్యంలో యువతరం తిరుగుబాటు – వ్యాసము. శ్రీ నిఖిలేశ్వర్, భారతి 1967 జనవరి సంచిక

'మానసికదిగంబరత్వముకొఱకు నిత్యసచేతన ఆత్మస్ఫూర్తితో జీవించుటయే మా యాశయము. ఊపిరి పీల్పుప్రతివ్యక్తితోను సారూప్యము చెంది, వ్యక్తియొక్క యస్తిత్వపరిరక్షణము కొఱకై – అంతరంగములో నణంగి పడి యున్నయారాటమును అసంతోషమును, విసుగును అక్షరరూపమున వ్యక్తీకరించి నూతన విశ్వాసమును, ఆశను కలిగింపవలయునని మాగాఢ విశ్వాసములు, చాచస్తములు అనుదానినుండి మానవుని వేఱు చేయ వలయు నని మాప్రయత్నము' – దిగంబరకవులు తమకవిత్వాశయములంగాఁ బయివాక్యములలో వెల్లడించిన యభిప్రాయములు మానవునిలో భావవిప్లవమును గొనితెచ్చుటయే వారి యుద్యమలక్ష్యమని విశదీకరించుచున్నవి. ఇట్లే మఱికొన్ని యితరభాషలలోఁ గూడ భావవిప్లవసాధన లక్ష్యముతో గవిత్వోద్యమములు ఘటిల్లుచుండుట సత్యదూరముకాదు. భాషవలెనే భావము కూడ సాహిత్యోద్యమలక్షణములలో నొకటి కాఁదగు ననుట యీచర్చసారాంశము.

సాహిత్యోద్యమములు కొన్ని ఛందస్సును గూడ నాశ్రయించి యుండును. ఆయా భాషాకావ్యములయం దంతకుఁ బూర్వమునుసరింపఁబడుచుండిన ఛందస్సులను మాని నూతనచ్ఛందము నవలంబించి యొకకవీశ్వరుఁడు కవిత్వము చెప్ప వచ్చును. ఆ నూతన చ్ఛందములో రచిత మయిన యాకావ్యరాజముయొక్క యందచందములకు మురిసి పోయి మఱికొందఱు కవులు అదే ఛందస్సును స్వీకరించి కావ్యము లల్లవచ్చును. అప్పుడాయుద్యమము ఛందస్సు నాశ్రయించినట్టి దగును. ఇట్టి యుద్యమములు భారతదేశభాషలలో సాధారణముగా సంస్కృతభాషా చ్ఛందములను మాని దేశీయవృత్తస్వీకరణ రూపమున నుండును. పరభాషావృత్తముల ననుసరించుట కొకవిధ మయినవైముఖ్యమును, దేశిచ్ఛందస్సులయెడను, దద్గతము లయిన యందచందములయెడను గల యాదరాభిమానములను, నూతనప్రవృత్తిస్వీకరణముతో నొకక్రొత్తఁదనమును సాధించు నభిలాషయు సాధారణముగా వివిధ మయిన యుద్యమముల ప్రాదుర్భావమునకుఁ బ్రోత్సాహకము లగుచున్నవి. వివిధ భాషలయందలి యుద్యమముల తీరుతెన్నులను బరిశీలించి చూచినపు డిట్లు ఛందస్సు నాశ్రయించిన యుద్యమములే తక్కిన యుద్యమములకంటె సంఖ్యలో నధికముగా నుండునట్లు గోచరము కాక మానదు.

మలయాళసాహిత్యమున 'కణ్ణశన్ పాట్టుగళ్' అనుపేరు గల యొకకావ్య సంపుటము కలదు. ఇందు 'కణ్ణశ' రామాయణము ముఖ్యముగాఁ బేర్కొనఁదగి

యున్నది. దానిని రామపణిక్కర్ అనునతఁడు రచించెను. కణ్ణశ(
వంశనామము. ఆ వంగడమునకు మూలపురుషుఁ డగు 'క
అనుపదమునండి 'కణ్ణశన్' అను రూపమేర్పడి యుండు నని భావించు(
కణ్ణశన్‌కవులు సంస్కృత, మలయాళములందు మంచిపండితులు. వీరు
1375–1475 సంవత్సరప్రాంతములందు నివసించి యుందురని
లభిప్రాయపడుచున్నారు. కణ్ణశన్ కావ్యములలోఁ దమిళపుఁబాలు చాల
మలయాళమునకుఁ బ్రాధాన్య మధికము. అంతేకాదు. సంస్కృతశబ్ద
సంస్కృతసమాసములును వీరికవితలోఁ జోటు చేసికొనెన
తమకావ్యములలో నొకక్రొత్తఛందస్సును గూడ నుపయోగించిరి
'నిరణవృత్తము' అని పేరు. దీనికి మాతృక యొక తమిళ ఛందో(
విజ్ఞులభిప్రాయపడుచున్నారు.

మలయాళసాహిత్యమున గాథాకావ్యములని యొక శాఖ
మలయాళమునం దెన్నియో గాథలు కలవు. వానిలో కృష్ణగాథ యను
మిక్కిలి ప్రశస్తమైనది. దీనిని రచించిన కవీశ్వరుఁడెవరో తెలియ వచ్చు(
ఇది కృష్ణునికి సంబంధించిన కథయని 'కృష్ణగాథ' యనుపేరు
తెలిసికొనవచ్చును. కాని 'గాథ' యనుమాటకు మలయాళమ
విశిష్టమయినయర్థము కలదు. కృష్ణగాథ మంజరీచ్ఛందస్సున వ్రాయఁబ(
ఛందస్సున వ్రాయఁబడినకావ్యమునకే 'గాథ' యను వ్యవహార మ(
నేర్పడెను. మలయాళకవులు సంస్కృత తమిళముల నాదరించి(
మలయాళము నాదరింపలేదని నుడువఁ దగును. వారు మలయాళఛంద(
జిన్నచూపు చూచిరి. అట్టిదినములలో దేశీయచ్ఛంద మగు మంజరీచ్ఛంద
నీ 'కృష్ణగాథ' కావ్యము వెలసెను. ఇట్టికావ్యమును రచించినకవీశ్వ(
ఛందోవిషయమునందు స్వాతంత్ర్యము వహించి నూతనచ్ఛందమునఁ గావ్య
విరచింపఁగా నాతని ననుసరించి పెక్కు రదే ఛందస్సునఁ గావ్యము లల్లిరి.
వెలసిన కావ్యములే గాథాకావ్యములు. ఈగాథాకావ్యరచనోద్యమముయొక్క
లక్షణము ఛందస్సు. ఛందోవిషయముననే కాక భాషావిషయముననను
స్వాతంత్ర్యము వహించెను. ఈ రెండుకారణములవలనను నీకావ్యమునకుఁ(
మణిప్రవాళ రచనలకంటెను పెక్కుఁడు ప్రచార గౌరవములు సమకూడెను.

క్రీస్తుశకము 1128–1198 మధ్యకాలములో జీవించి యుండిన ము(
రాజు అనుకవీశ్వరుఁడు మహారాష్ట్రసాహిత్యమున నాదికవిగాఁ బరిగణింప(

మున్నాఁడు. అతఁడు వివేకసింధు వనుకావ్యమును రచించెను. ఈకావ్యము ' ఓవీ' యనుదేశివృత్తములో వ్రాయఁబడెను. అతని 'వివేకసింధు' కావ్యమున **1671** ఓవీవృత్తములు కలవు. ఈ ' ఓవీ' వృత్తము సంస్కృతఛందోరీతులలోఁ జేరదు. నాథసంప్రదాయమునకు జెందిన 'గోరక్ష గీత' యనుగ్రంథము కూడ ' ఓవీ' వృత్తములలోనే రచింపఁ బడినది. మహానుభావపంథకుఁ జెందిన శిశుపాలవధాది కావ్యములన్నియుఁ గూడ ఓవీ వృత్తబద్ధములే. ఇంకను ఏకనాథుఁడు మొదలగు పెక్కురు కవీశ్వరులు ఈ ఓవీ వృత్తమునందే తమ కావ్యములను వెలయించిరి. క్రీస్తుశకము **1533–1599** సంవత్సరముల నడిమికాలమున జీవించిన 'ఏకనాథుఁడు' ఈ ఓవీ వృత్తరచనమును గుఱించి తెలిపిన యీవాక్యము గమనింపఁదగియున్నది. ' జ్ఞానేశ్వరునియనంతరమెవరు ఓవీవృత్తమునఁ గావ్యము వ్రాయఁ దలఁచిరో వారు అమృతమయ మయిన బంగారు పళ్లెరముందొ కటెంకాయ చిప్ప నుంచుచున్నారు.' ఈవాక్యము జ్ఞానేశ్వరునికి ఓవీవృత్తరచనమునఁ గలశక్తిని, రక్తిని జాటుచున్నవి.

ఈ విషయమునఁ బంజాబీసాహిత్యమునకు జెందినయొకదృష్టాంతమును గూడ నిటఁ బరికింతము.

బాబాఫరీద్ అనుకవి పంజాబీసాహిత్యమున సుప్రసిద్ధుఁడు. క్రీస్తుశకము **1173–1255** సంవత్సరములమధ్యకాలమున నతఁడు జీవించి యుండెను. అతఁడు తనయుదాత్తవ్యక్తిత్వప్రభావముచేతను, మధురభావముల ప్రభావముచేతను లక్షలకొలది హిందువులను ఇస్లాంమతమునఁ జేర్చెను. అతఁడు గొప్ప మతప్రచారకుఁడు కూడ. అతని ప్రచారమార్గములో మాధుర్యము ప్రధానగుణము. అందుచేతనే యాతనికి 'షక్కర్‌గంజ్' అను ప్రసిద్ధి యేర్పడినది. పంజాబీసాహిత్యములో నాతనికిఁ బ్రముఖస్థానము కలదు. సాధారణముగా ఉర్దూ కవులు పార్సీ, అరబ్బీ భాషలచేఁ బ్రభావితులై, తమ భావములను వ్యక్తము చేయుట భాషలలోని ఛందస్సులను గ్రహించుటయే కాక తమ రచనముల నన్నింటిని విదేశీయములగు శబ్దజాలముతో నింపుచుండెడివారు. కాని బాబాఫరీద్ తన ప్రౌఢబుద్ధితో దీర్ఘముగా నాలోచించి పార్సీ అరబ్బీఛందస్సులు పంజాబీప్రకృతికి ననుకూలింపవని గ్రహించెను. అతఁడు ప్రాచీనభారతీయఛందస్సులను జక్కఁగా నధ్యయనము చేసి తనరచనములందు 'దోహా' మొదలయిన దేశీయచ్ఛందస్సులను స్వీకరించెను. అంతేకాదు. విదేశీయశబ్దజాలమునకు బదులు పంజాబీభాషకుఁ

జెందిన సుపరిచితము లగు పదములను బరిగ్రహించెను. ఫరీద్ అనుసరించిన యీ నూతనమార్గము మహత్త్వపూర్ణమై తరువాతికవులకు మార్గదర్శక మయ్యెను. పంజాబీకవిత్వ మొక యపరిచితవస్తువుగా గాక సరసము, సరళము, సజీవము నయినవస్తువుగా మాఱి పోయెను. దీనివయాలమునఁ బంజాబీకవిత్వము సామాన్యప్రజలకుఁ గూడ నతిసన్నిహిత మయ్యెను. ఫరీద్ బాబా ప్రభావము సమధికముగాఁ బడుటచేతనే 'శాహ్‌హుసేన్' 'బుల్‌హాషా' యను కవీశ్వరులు 'గజల్' అను ఛందస్సునకు బదులు కాఫీఛందస్సును – 'సుల్తాన్‌బాహు' మొదలగువారు 'రుబాఈ' లను ఛందస్సునకు బదులు 'దోహాను' వాడిరి. ఇట్లు పంజాబీ సాహిత్యమున విదేశీయచ్ఛందస్సులను విడనాడి భాషాప్రకృతికనుగుణ మయిన దేశిచ్ఛందస్సులను బరిగ్రహించుటలో బాబాఫరీద్‌కవి యొక క్రొత్తపుంత ద్రొక్కి తరువాతి తరముల వారికావిషయమున మార్గదర్శకుఁ డయ్యెను. పంజాబీ సాహిత్యమున బాబాఫరీద్ తల పెట్టిన యుద్యమము భాషాచ్ఛందములకు రెంటికిని సంబంధించిన దయినను బ్రధానముగా నాయుద్యమము ఛందస్సుమీఁదనే కేంద్రీకరింపఁబడిన దని తెలియుచున్నది. ఆంధ్రభాషయందు దేశకవిత్వోద్యమము మూలమున 'ద్విపద' యను దేశిచ్ఛందము ప్రచారములోనికి వచ్చెను.

కొన్ని భాషలలో సాహిత్యోద్యమములు ప్రక్రియాగతములుగాఁ గూడఁ గాన వచ్చును. ఒక నూతనసాహిత్యప్రక్రియ నొక కవీశ్వరుఁ డభ్యూహించి దానికి సాహిత్యములోఁ గ్రొత్తగా బ్రవేశము కల్పించును. ఆప్రక్రియ భాషాదు లగునితర విషయములచేఁ గాక తనస్వభావములచేతనే యితరుల నలరించును. వారా నూతనప్రక్రియను జేపట్టి కావ్యము లల్లుదురు. అట్లానూతన ప్రక్రియ యొక్క యుద్యమముగాఁ బరిణమించును. ఆ యుద్యమఫలముగా నాసాహిత్యప్రక్రియ యాభాషాసాహిత్యములో స్థిరముగాఁ గాలూని నిలుచును.

ప్రక్రియకు సంబంధించిన యుద్యమమునకు మలయాళసాహిత్యము నుండి యొక యుదాహరణమును బరిశీలింతము. కేరళదేశమునందలి కళావిశేషములలో 'తుళ్లల్' ఒకటి. దీనికి సంబంధించిన వాఙ్మయము కూడ మలయాళమునఁ గొంత కలదు. 'తుళ్లల్' ఒక జానపదనృత్యవిశేషము. ఇది మన యాంధ్ర సాహిత్యములోని 'యక్షగానము' అనురచనమును గొన్ని విషయములలోఁ బోలుచున్నది. ఇందు పరయన్, సీతంకన్, ఓట్టన్ అను మూఁడు రకములు కలవు. దీని ప్రాదుర్భావమునకు 'కుంజన్ నంబియారు' అను కవిపండితుఁడు

కారణభూతుఁడని వచింతురు. అతఁడు మొత్త మరువదినాలుగు తుళ్లల్ రచనలు చేసినట్లు చెప్పుదురు. కాని కొందఱు పరిశోధకులాతఁడు నలువదియైదు రచనలు మాత్రమే చేసెనని విశ్వసించుచున్నారు. 'తుళ్లల్' అనునది సామాన్యులను సయిత మలరింపఁజేసిన సాహిత్యప్రక్రియ. దీని మూలమున 'కుంజన్ నంబియారు' పండితాధీన మయినసాహిత్యమును బ్రజలకు సన్నిహితము గావించెను. ఇతని తరువాత నీప్రక్రియ ననుసరించి పెక్కురు రచనలు గావించిరి. ఇట్లు మలయాళ సారస్వతమునుండరి 'తుళ్లల్' రచనోద్యమము ప్రక్రియకు సంబంధించి యున్నది. ఇందుమూలమునఁ బ్రక్రియ కూడ సాహిత్యోద్యమ లక్షణములలో నొకటిగాఁ బరిగణనము పొందుచున్నది.

సాహిత్యోద్యమలక్షణములలో ననుకరణము కూడ నొకటి. ఇతరభాషలలో నొక పద్ధతికిఁ జెందినరచన మొకకాలమునఁ బ్రాచుర్యము నంది యుండఁగా దానియనుకరణముగా మఱొకభాషలో నట్టి రచనోద్యమము బయలుదేరవచ్చును. తొలుత నొకకవి యితరభాషలోని కవితాపద్ధతి ననుకరణముగాఁ దనభాషలో నొకరచనమును వెలయింపఁగా నాకవీశ్వరుని ప్రాబల్యప్రభావముల వలనను, నాతఁ డవలంబించినయాకవితా పద్ధతిమీఁది యాదరమువలనను, ననుకార్య మగుమఱొకపద్ధతి యొక్క యభావమువలనను దాని ననుసరించిన రచనము లీభాషలో రచింపఁబడవచ్చును. అప్పుడది యొకయుద్యమ రూపమును దాల్చును. అట్టి యాయుద్యమము యొక్క లక్షణము సహజముగా నాభాషయందలి పరిస్థితులనుబట్టి యేర్పడినకవితాపద్ధతి కాక యితరభాషానుకరణముచే సిద్ధించిన దగుటచే ననుకరణ మాయుద్యమముయొక్క లక్షణమగుట తటస్థించును. తెలుగున నన్నయోపజ్ఞ మయినమార్గకవిత్వోద్యమ మిట్టియనుకరణలక్షణముతోఁ గూడిన దని చెప్పవచ్చును.

కన్నడమున రచింపఁబడి లభ్యము లగుచున్న గ్రంథములలో క్రీస్తుశకము **815** నుండి **877** వఱకు, బరిపాలించిన నృపతుంగుఁ డను నామాంతరము కల యమోఘ వర్షుఁడు రచించిన 'కవిరాజమార్గము' మిక్కిలి ప్రాచీన మయినది. అతఁడు రాష్ట్రకూట చక్రవర్తి. అతఁడు కన్నడ, సంస్కృతములలో గొప్పపండితుఁడై పలువురుకవులను బోషించి యుండెను. అతఁ డాదిపురాణకర్త యయినజినసేనుని శిష్యుఁడు. కవిరాజమార్గమున నాతఁడు తనకుఁ బూర్వకాలమం దుండినపలువురు

జెందిన సుపరిచితము లగు పదములను బరిగ్రహించెను. ఫరీద్ అనుసరించిన యీ నూతనమార్గము మహత్త్వపూర్ణమై తరువాతికవులకు మార్గదర్శక మయ్యెను. పంజాబీకవిత్వ మొక యపరిచితవస్తువుగా గాక సరసము, సరళము, సజీవము నయినవస్తువుగా మాఱి పోయెను. దీనిమూలమునఁ బంజాబీకవిత్వము సామాన్యప్రజలకుఁ గూడ నతిసన్నిహిత మయ్యెను. ఫరీద్ బాబా ప్రభావము సమధికముగాఁ బడుటచేతనే 'శాహహుసేన్' 'బుల్‌షాహ్' యను కవీశ్వరులు 'గజల్' అను ఛందస్సునకు బదులు కాఫీఛందస్సును – 'సుల్తాన్‌బాహు' మొదలగువారు 'రుబాఈ' లను ఛందస్సునకు బదులు 'దోహాను' వాడిరి. ఇట్లు పంజాబీ సాహిత్యమున విదేశీయచ్ఛందస్సులను విడనాడి భాషాప్రకృతికనుగుణ మయిన దేశిచ్ఛందస్సులను బరిగ్రహించుటలో బాబాఫరీద్‌కవి యొక్క క్రొత్తపుంత త్రొక్కి తరువాతి తరముల వారికావిషయమున మార్గదర్శకుఁ డయ్యెను. పంజాబీ సాహిత్యమున బాబాఫరీద్ తల పెట్టిన యుద్యమము భాషాచ్ఛందములకు రెంటికిని సంబంధించిన దయినను బ్రధానముగా నాయుద్యమము ఛందస్సుమీఁదనే కేంద్రీకరింపఁబడిన దని తెలియుచున్నది. ఆంధ్రభాషయందు దేశికవిత్వోద్యమము మూలమున 'ద్విపద' యను దేశిచ్ఛందము ప్రచారములోనికి వచ్చెను.

కొన్ని భాషలలో సాహిత్యోద్యమములు ప్రక్రియాగతములుగాఁ గూడఁ గాన వచ్చును. ఒక నూతనసాహిత్యప్రక్రియ నొక కవీశ్వరుఁ డభ్యూహించి దానికి సాహిత్యములోఁ గ్రొత్తగా బ్రవేశము కల్పించును. ఆప్రక్రియ భాషాదు లగునితర విషయములచేఁ గాక తనస్వభావముచేతనే యితరుల నలరించును. వారా నూతనప్రక్రియను జేపట్టి కావ్యము లల్లుదురు. అట్లానూతన ప్రక్రియ యొక్క యుద్యమముగాఁ బరిణమించును. ఆ యుద్యమఫలముగా నాసాహిత్యప్రక్రియ యాభాషాసాహిత్యములో స్థిరముగాఁ గాలూని నిలుచును.

ప్రక్రియకు సంబంధించిన యుద్యమమునకు మలయాళసాహిత్యము నుండి యొక యుదాహరణమును బరిశీలింతము. కేరళదేశమునందలి కళావిశేషములలో 'తుళ్లల్' ఒకటి. దీనికి సంబంధించిన వాఙ్మయము కూడ మలయాళమునఁ గొంత కలదు. 'తుళ్లల్' ఒక జానపదనృత్యవిశేషము. ఇది మన యాంధ్ర సాహిత్యములోని 'యక్షగానము' అనురచనమును గొన్ని విషయములలోఁ బోలుచున్నది. ఇందు పరయన్, సీతంకన్, ఓట్టన్ అను మూఁడు రకములు కలవు. దీని ప్రాదుర్భావమునకు 'కుంజన్ నంబియారు' అను కవిపండితుఁడు

కారణభూతుఁడని వచింతురు. అతఁడు మొత్త మరువదినాలుగు తుళ్లల్ రచనలు చేసినట్లు చెప్పుదురు. కాని కొందఱు పరిశోధకులాతఁడు నలువదియైదు రచనలు మాత్రమే చేసెనని విశ్వసించుచున్నారు. 'తుళ్లల్' అనునది సామాన్యులను సయిత మలరింపఁజేసిన సాహిత్యప్రక్రియ. దీని మూలమున 'కుంజన్ నంబియారు' పండితాధీన మయినసాహిత్యమును బ్రజలకు సన్నిహితము గావించెను. ఇతని తరువాత నీప్రక్రియ ననుసరించి పెక్కురు రచనలు గావించిరి. ఇట్లు మలయాళ సారస్వతముసుందరి 'తుళ్లల్' రచనోద్యమము ప్రక్రియకు సంబంధించి యున్నది. ఇందుమూలమునఁ బ్రక్రియ కూడ సాహిత్యోద్యమ లక్షణములలో నొకటిగాఁ బరిగణనము పొందుచున్నది.

సాహిత్యోద్యమలక్షణములలో ననుకరణము కూడ నొకటి. ఇతరభాషలో నొక పద్ధతికిఁ జెందినరచన మొకకాలమునఁ బ్రాచుర్యము నంది యుండఁగా దానియనుకరణముగా మఱొకభాషలో నట్టి రచనోద్యమము బయలుదేరవచ్చును. తొలుత నొకకవి యితరభాషలోని కవితాపద్ధతి కనుకరణముగాఁ దనభాషలో నొకరచనమును వెలయింపఁగా నాకవీశ్వరుని ప్రాబల్యప్రభావముల వలనను, నాతఁడవలంబించినయాకవితా పద్ధతిమీఁది యాదరమువలనను, ననుకార్యమగుమఱొకపద్ధతి యొక్క యభావమువలనను దాని ననుసరించిన రచనములీభాషలో రచింపఁబడవచ్చును. అప్పుడది యొకయుద్యమ రూపమును దాల్చును. అట్టి యాయుద్యమము యొక్క లక్షణము సహజముగా నాభాషయందలి పరిస్థితులనుబట్టి యేర్పడినకవితాపద్ధతి కాక యితరభాషానుకరణముచే సిద్ధించినదగుటచే ననుకరణ మాయుద్యమముయొక్క లక్షణమగుట తటస్థించును. తెలుఁగున నన్నయోపజ్ఞ మయినమార్గకవితోద్యమ మిట్టియనుకరణలక్షణముతోఁ గూడిన దని చెప్పవచ్చును.

కన్నడమున రచింపఁబడి లభ్యము లగుచున్న గ్రంథములలో క్రీస్తుశకము 815 నుండి 877 వఱకు, బరిపాలించిన నృపతుంగుఁ డను నామాంతరము కల యమోఘ వర్షుఁడు రచించిన 'కవిరాజమార్గము' మిక్కిలి ప్రాచీన మయినది. ఇతఁడు రాష్ట్రకూట చక్రవర్తి. అతఁడు కన్నడ, సంస్కృతములలో గొప్పపండితుఁడై బుపురుకవులను బోషించి యుండెను. అతఁ డాదిపురాణకర్త యయినజినసేనుని శిష్యుఁడు. కవిరాజమార్గమున నాతఁడు తనకుఁ బూర్వకాలమం దుండినకవులు

కవులను బేర్కొని యుండెను. అందుచేఁ గన్నడవాఙ్మయ మప్పటికిఁ గొన్ని శతాబ్దులు పూర్వమే యున్నతస్థితియందుండిన దని విశదమవుచున్నది. విమలోదయ, నాగార్జున, దుర్వినీతు లనువారు గొప్పగద్యరచయితలు గాను, శ్రీవిజయకవీశ్వర పండితచంద్రలోకపాలాదులు గొప్ప కవులుగాను గవిరాజమార్గమునఁ బేర్కొనఁబడి యున్నారు. దీనిఁబట్టి కవిరాజ మార్గమునకుఁ బూర్వమే మార్గకవిత్వము కొంత కన్నడమున వ్యాపించి యున్నట్లు తెలియుచున్నది. అంతకుఁబూర్వము కన్నడమున దేశికవిత్వము కూడఁ గొంత లేకపోలేదు. కన్నడకవిరాజమార్గమునుదుఁ బేర్కొనఁబడిన 'చెత్తాణె, బెదండె' యను ప్రాచీనకావ్యభేదములు దేశిపద్ధతికే చెందిన వని చెప్పఁదగును. ఇట్లాతనికిఁ బూర్వము మార్గదేశిరచనాపద్ధతులు రెండును గన్నడమున వ్యవహారమునం దుండి వ్యాప్తి గాంచి యుండఁగా నృపతుంగుఁడు తన కవిరాజమార్గమున భాషాప్రయోగ విషయమునను నితరకవితాలక్షణముల విషయమునను సుస్థిరములయిన నియమములు కల్పించి మార్గ కవితాపద్ధతికి ఘంటాపథమును నిర్మించెను. అప్పటి నుండియుఁ గన్నడకవు లామార్గమునే యనుసరించి కావ్యములు విరచింపఁ దొడఁగిరి. పంపాదు లగుకర్ణాటకకవులు కవిరాజ మార్గమునందుఁ దెలుపఁబడిన నియమానుసారముగా మార్గపద్ధతినే యవలంబించి తమ కావ్యములను రచించిరి. వారి యాకావ్యము లన్నియుఁ జంపూకావ్యములు. అందలి భాష మసంస్కృతోక్తి. అందలి వృత్తములు ప్రాయికముగా సంస్కృత వృత్తములు. కాలమునఁ గన్నడ తెలుఁగుభాషల కిప్పుడున్నంత వ్యత్యాసము గాని, పార్థక్యము ని లేకుండెను. అందుచే నుభయదేశములయందలి కవులును, ప్రజలును ండొరుల భాషా సాహిత్యములలోఁ బరిచయము కలిగి యుండుట కవకాశము దు. అందుచేఁ గన్నడమున వ్యాప్తి గాంచి యుండిన మార్గకవితాపద్ధతి తెలుఁగునఁ గాడఁ బ్రచార మందుట యసంభావ్యము కాఁజాలదు. తెలుఁగు దేశమున న్నయకుఁ బూర్వము దేశికవిత్వ మధికముగాను, మార్గపద్ధతి యల్పముగాను నుభయమార్గములును బ్రాచుర్యము నందియుండినను బండితకవులు గాదరము మాత్రము మార్గపద్ధతివంకకే మ్రొగ్గఁ దొడఁగెను. నన్నయునాఁటి కవి గుగా వేరూనినది. నన్నయ కూడ నాకాలపరిస్థితుల ననుసరించి కన్నడభాషతోఁ నిపరిచయము కలిగి యుండును. ఒకవేళ నతనికాభాషయం దట్టి పరిచయము ని, దానికిఁ బ్రమాణము లేదని వాదించినను నతనికి భారతరచనమునందుఁ

తోడ్పడిన యాతని సహాధ్యాయుఁడును వాఙ్మయధురంధరుఁడుననగు నారాయణభట్టు కన్నడభాషయందుఁ గవియుఁ, బండితుఁడునునయి యుండె నని శాసనప్రమాణమువలనఁ దెలియుచున్నది. అతఁడు కర్ణాటకభాషలో రచితము లయిన పంపాదులకావ్యములను బఠించి యుండును. అతఁ డందలి మార్గకవితాపద్ధతిని గాంచి, యందలి సామంజస్యమున కలరి - తెలుఁగుదేశమునందలి పండితకవులు కూడ మార్గపద్ధతివంకకే మొగ్గుచుండుటను గుర్తించి - మహాభారతమువంటి యుద్గ్రంథము నెట్లు వ్రాయుదమా యని చింతాకులితచిత్తుఁ డయిన నన్నయభట్టారకునికిఁ గన్నడమునందలి కవిత్వము నాదర్శముగాఁ జూపి దాని ననుసరించి కావ్యరచనము చేయవలసిన దని భారతఘోరరణమునందు శ్రీకృష్ణుఁడర్జునునికివలెనుద్బోధఁ గావించి యుండును. అతని యాయుపదేశము ననుసరించి నన్నయభట్టారకుఁడు మహాభారతమును జంపూకావ్యముగాఁ దత్సమపదబహుళముగా, సంస్కృతవృత్తముల నధికముగా వాడి మార్గపద్ధతిలో రచించెను. తెలుఁగున నంతకుఁబూర్వము కావ్యరచనము లేకుండుటచేతను, నన్నయవిరచితమగు మహాభారతమే యాదికావ్యమగుట చేతను దెలుఁగున నాతరువాత కాలమునఁ గవిత్వము చెప్పినవారెల్లరును ఆమార్గకవిత్వ పద్ధతినే యనుసరించి తమతమకావ్యములను విరచించిరి. ఇట్లు **తెలుఁగుభాషయందలి మార్గకవిత్వోద్యమము కన్నడభాషయందలి మార్గకవితాపద్ధతి కనుకరణముగా వెలసిన దని యూహింపఁదగి యున్నది.**

తెలుఁగునం దీ యిరువదవశతాబ్దమున వెలసిన అధివాస్తవికకవిత్వోద్యమము కూడ నిట్లే యనుకరణలక్షణమును గలిగి యున్నది. అది పాశ్చాత్యభాషలోని Surrealism అను కవితాపద్ధతి కనుకరణముగా మనభాషయం దిటీవలికాలమున వెలువడిన యుద్యమము. దీనిఁగూర్చిన వివరములు పూర్వప్రకరణమునందుఁ గొంత తెలుపఁబడినవి.

ఈయుదాహరణములనుబట్టి యనుకరణ మనునది సాహిత్యోద్యమ లక్షణములలో నొకటి యని నిరూపిత మగుచున్నది.

స్వతంత్రరచనము కూడ సాహిత్యోద్యమలక్షణములలో నొకటిగాఁ బరిగణింపఁదగియున్నది. ఒకానొకసాహిత్యమునం దితర భాషాప్రభావము చాలకాలముపాటు చెల్లుబడి యగుచు దానిప్రాబల్యమువలనను - నీభాషయందలి

కవులకు దానిమీఁదఁ గలగౌరవభావముచేతను నాపరభాషయందలి గ్రంథములు, సాహిత్యప్రక్రియలు నీ భాషలో ననువదింపఁబడుచు – ననుసరింపఁబడుచుఁ గేవల మనువాదసాహిత్యముగానే కొంతకాలము వెలయుచుండు పరిస్థితి యేర్పడుటయుఁ గలదు. అట్టి పరిస్థితిలో నాభాష యందు స్వతంత్రకావ్యములు వ్రాసి యొకనూతన మార్గమును సాహిత్యమునందుఁ బ్రవేశపెట్ట వలయునను సంకల్పము కొందఱకుఁ గలుగ వచ్చును. అట్టి సంకల్పముతో నారంభింపఁబడిన యాయుద్యమమునకు స్వతంత్రరచనము లక్షణముగా భాసిల్లును. దీని నొకదృష్టాంతముతోఁ బరిశీలించి తెలిసికొందము.

తెలుఁగుసారస్వతమునందలి ప్రబంధకవితోద్యమమిట్టి స్వతంత్రరచనా సంకల్పముచేఁ బ్రేరిత మయినయుద్యమము. 'పురాణాంతర్గత మయిన యొకయుపాఖ్యానమును గైకొని దానిని నానావిధశిల్పాలంకృతులతోఁ బ్రబంధీకరించి యొక స్వతంత్ర రచన చేయుట యీ ప్రబంధశాఖకు ముఖ్యలక్షణ'మని శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు వ్రాయుచున్నారు. ఇట్టి పథకమును దొలుదొల్త నూహించి ప్రథమప్రబంధరచన చేసినకవి యాంధ్రకవితాపితామహుఁ డగు నల్లసాని పెద్దన. ఆపద్ధతియే క్వాచిత్కముగానే యిరువ్వరకో, మువ్వురకో తప్పఁ దక్కిన ప్రబంధకవుల కెల్లరకును ననుసరణీయమయ్యెను. శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు పయివ్యాసమునందే రచించిన యీక్రింది వాక్యములు కూడ నిట ననుసంధింపఁ దగియున్నది. 'ఆంగ్లవాఙ్మయమున ఎలిజబెత్ రాణి శకమును నాటకయుగ మనియు, నప్పటి నాటకములను నవ్యకవితానాటకము (Romantic Dramas) లనియుఁ జెప్పుదురు. అంతకు మున్ను ఆంగ్లమున నాటకములు లేక పోలేదు. కాని, షేక్స్పియరు మున్నగు మహాకవులు గ్రీకునాటకముల వరవడిని వదలి పెట్టి స్వతంత్ర నూతననాటకములను దమజాతి మనస్తత్త్వమున కనుగుణముగా దేశీయపద్ధతిని రచించుటచే నా నాటకములకు 'రొమాంటిక్‌డ్రామాస్'' అని పేరు వచ్చినది. అట్లే మనసారస్వతమునందును పెద్దన ప్రభృతికవులు సంస్కృతకావ్యములకంటె భిన్నములుగా దేశీయపద్ధతులతో స్వతంత్రనూతనకావ్యసృష్టి చేయుటచేత నానాఁడు ఒకనవ్యకవితోద్యమము (Romantic Movement) ప్రవర్తిల్లిన దనిచెప్పఁదగును.

౬ చూ. తెలుఁగువిజ్ఞానసర్వస్వము: మూఁడవసంపుటము: పుట *614.*

డాక్టరు సి. నారాయణరెడ్డిగారు చెప్పినట్లు,[2] ఆంధ్రసాహిత్యములో నతఃపూర్వము గతానుగతికముగా నడచుచున్న యనువాద పద్ధతినిద్రోసిరాజనుట ప్రబంధయుగప్రత్యేకత. ప్రబంధయుగమునకుఁ బూర్వము వెలువడిన కావ్యములలో తిక్కన నిర్వచనోత్తర రామాయణము, మడికి సింగన్న వాసిష్ఠ రామాయణము మూలవిధేయములుగా నున్న యాంధ్రానువాదకావ్యములు. శ్రీనాథుఁడు మొదలుకొని నంది మల్లయ్య, ఘంట సింగయ్య యనుకవుల వఱకుఁ గల తక్కినకవులు చాలవఱకు స్వతంత్రానువాదములే వెలయించిరి. పదునైదవ శతాబ్దినాఁటికే తెలుఁగున సంస్కృతవాఙ్మయములోని వివిధ సాహిత్యప్రక్రియలు దిగుమతిచేయఁబడినవి. ఆయుగమున స్వతంత్రరచనము చేసిన యేకైకకవీశ్వరుఁడు పాలకురికి సోమనాథుఁడు. కాని, యాతఁడు శైవుఁడగుటచేత గాఁబోలు నాతని మార్గమాతని తరువాతికాలమున ననుసరింపఁబడలేదు. భారత, రామాయణ, భాగవతాది మహాగ్రంథములు, మార్కండేయపురాణాది పురాణములు, దశకుమార చరిత్రాదిగద్య కావ్యములు, ప్రబోధచంద్రోదయాది నాటకములు భిన్న భిన్నరీతులలో ననువదింపఁబడినవి. ఛందోఽలంకార వ్యాకరణాదు లగు శాస్త్రగ్రంథములును రచింపఁబడినవి. వేములవాడ భీమకవి రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్యమును రచించినట్లు పింగళి సూరన 'భీమన తొల్లిఁ జెప్పె ననుపెద్దలమాటయె కాని' యను తన రాఘవపాండవీయమునందలి పద్యమునఁ దెలుపుచున్నాఁడు. అతఁడు దానిని రచించినమాట వాస్తవమగుచో నంతకుఁ బూర్వమే ద్వ్యర్థికావ్యము కూడఁ దెలుఁగులో వెలసిన దని చెప్పదగియున్నది. ఇట్లు, ప్రబంధ యుగమునకుఁ బూర్వకాలమునందు సంస్కృత సాహిత్యములోని సమస్తసాహిత్యప్రక్రియలును దెలుఁగునందు విస్తరించి యుండినది. శ్రీకృష్ణదేవరాయల కాలములోని కవులకు సంస్కృతసాహిత్యము నుండి దిగుమతి చేయుటకునెట్టి సాహిత్యప్రక్రియ కాని మిగుల లేదు. అందుచేతనే స్వతంత్రకావ్యనిర్మాణము వారి కావశ్యక మయినది. ఇట్టి స్వతంత్రకావ్యరచనా సంకల్పమే తెలుఁగునఁ బ్రబంధ రచనమునకు దారి తీసినది. పెద్దన మనుచరిత్రము రచింపఁ బడినతరువాత నీ ప్రబంధ రచన మొక యుద్యమముగా రాయలకాలమున సాఁగి పెక్కు ప్రబంధములు రచింపఁ బడినవి. ఇట్లు సాఁగిన ప్రబంధ

[2] ఆధునికాంధ్రకవిత్వము : డా॥ సి. నారాయణరెడ్డి, పు॥ *125.*

కవిత్వోద్యమమునకు 'స్వతంత్రరచనము' ప్రధానలక్షణముగా భాసిల్లిన దని దీనిఁబట్టి తెలియును. ఇట్లే, యితరసాహిత్యము లందును గొన్నిట స్వతంత్రరచనము సాహిత్యోద్యమ లక్షణముగా భాసిల్లుచుండుట కాన నగును. దీనివలన సాహిత్యోద్యమ లక్షణములలో 'స్వతంత్రరచనము' కూడ నొకటి యనువిషయము నిర్ధారిత మగుచున్నది.

ఈయధ్యాయమునందుఁ జర్చింపఁబడిన యంశముల సారాంశము నీక్రింది విధముగాఁ బేర్కొన వచ్చును.

౧. సాహిత్యము ప్రగతి శీలము. దేశకాలపరిస్థితులను బట్టియు, రాజకీయో పప్లవములకారణముననను, మఱియుఁ గొన్ని యవాంతరకారణములవలనను సాహిత్యమెప్పటికప్పుడు తన స్వరూప స్వభావలక్షణములను, నప్పుడప్పుడు లక్ష్యములను మార్చుకొనుచుండును. దేశకాల ప్రభావముతోఁబాటు సాహిత్యమునఁ దఱచుగా నేర్పడుచుండు కొన్ని యుద్యమములు కూడ సాహిత్యమున నేర్పడిన సాహిత్యోద్యమముల సమాహారస్వరూపనిరూపకమే యనుట యతిశయోక్తి కాదు.

౨. ప్రతిభావంతుడును, ప్రజ్ఞాశాలియు నగు మహాకవియు, యుగకర్తయు నగు కవితల్లజుని ప్రయత్న ప్రభావము, రాజకీయపరిస్థితులు, సాంఘికపరిస్థితి, మతము, రాజకీయప్రభావము, అనుకరణము, ప్రతిధ్వని, మహాపురుష ప్రభావము, నూతనత్వాభిలాష, వైయక్తికసన్నివేశము నను నీపదియంశములును వివిధభాషలయందు సాహిత్యోద్యమముల యావిర్భావవికాసములకు హేతుభూతములగుచున్నవి. ఆయా ప్రాంతములయం దేర్పడిన సాహిత్యసంఘములు కూడ సాహిత్యోద్యమములకు సకృత్తుగా హేతుభూతము లగుచుండును.

౩. భాష, భావము, ఛందస్సు, ప్రక్రియ, అనుకరణము, స్వతంత్ర రచనము అనునవి సాహిత్యోద్యమ లక్షణములుగాఁ బరిగణింపఁదగియున్నవి.

# ద్వితీయాధ్యాయము

## భారతీయ భాషలలో సాహిత్యోద్యమములు – స్థూలస్వరూపము

సాహిత్యోద్యమము – తత్స్వరూపలక్షణములనుగూర్చి పూర్వాధ్యాయమునఁ జర్చించితిమి. అట్లు సాహిత్యోద్యమస్వరూప లక్షణములను గూర్చి తెలిసికొన్నపిదప వివిధ భారతీయభాషలలో – ముఖ్యముగా హిందీ, బెంగాలీ, పంజాబీ, ఓఢ్రము, తమిళము, కన్నడము, మలయాళము, మహారాష్ట్రము అను భాషలలో నేర్పడిన సాహిత్యోద్యమములయొక్క చరిత్రమును స్థూలముగా నీయధ్యాయమునందుఁ బరిశీలింతము. ఆంధ్ర సాహిత్యములోని యుద్యమములనుగూర్చి ప్రత్యేకముగాఁ దరువాతి యధ్యాయమునఁ బరిశీలింపఁ బడును. వివిధభారతీయభాషలలోని యుద్యమములను బరిశీలించునపుడు కొన్నిభాషలలోని యుద్యమములు ప్రాచీనకాలమునఁ గూడ నొక నిర్దిష్ట లక్ష్యముతో నుద్యమములుగానే ప్రవర్తిల్లి యుండుటను గుర్తింపఁ గలము. కాని, కొన్ని భాషలలోఁ బ్రాచీనకాలమునందుఁ గొంతకాలము ఒకవిధమయిన కవితాపద్ధతి ప్రాచుర్యము వహించి యుండుట చూపట్టును. ఆకాలమునందలి పెక్కురు కవులా పద్ధతిచేఁ బ్రభావితులై తద్విధమయిన లక్షణములతోఁ గవిత్వరచనము చేసి యుండుట కాననగును. అప్రయత్నముగానే యది యొక యుద్యమముగా సాఁగి సాహిత్యమున నొక పరిణామము దెచ్చి యుండువిషయ మాసాహిత్య చరిత్రమును నేఁటి దృష్టితో లక్షించువానకు గోచరము కాఁగలదు. అట్టి యేకరూప మయినకవితాపద్ధతి ప్రవర్తిల్లినవి కూడ నాయాభాషలలోని యుద్యమములుగనే యిందుఁ బరిగణింపఁబడినవి. మఱియు నాయాభాషలలోఁ బ్రవర్తిల్లిన సాహిత్యోద్యమముల కాయాభాషాసాహిత్య చరిత్రములయం దెట్టివ్యవహారము కలదో యావ్యవహారము ననుసరించియే యాయా సాహిత్యోద్యమములిందుఁ బేర్కొనఁబడును. అట్టివ్యవహారము లేక యేకరూపమయిన కవితాపద్ధతి ప్రవర్తిల్లిన యుద్యమములకు మాత్రము వాని స్వరూపస్వభావములనుబట్టి యేపేరఁ బేర్కొనుట సమంజసమో యూహించి యాపేరుతో నాయాసాహిత్యోద్యమము లందు గ్రహింపఁ బడినవి.

### 1. హిందీసాహిత్యము

హిందీభాషలోఁ బ్రధానముగా ఖడీబోలీ యుద్యమము, ఛాయావాద కవితోద్యమము, ప్రగతివాదకవితోద్యమము, ప్రయోగవాదికవిత్వము, హిందూ

స్థానీ యుద్యమము, నయీకవిత, నయీకహానీయుద్యమము ననునవి పరిశీలింపఁదగి యున్నది.

### 1. ఖడీబోలీ యుద్యమము :

### 19వ శతాబ్దియుత్తరార్ధము, 20వ శతాబ్ది ప్రారంభము

ఖడీబోలీ యనునది భాషకు సంబంధించిన యుద్యమము. హిందీసారస్వతము నందు సగుణభక్తికిఁ జెందినశాఖాద్వయములో రామభక్తిశాఖ ముఖ్యముగా నయోధ్య ప్రాంతములందు వ్యవహారములో నున్న యవధిభాష నవలంబించెను. కృష్ణభక్తిశాఖ వ్రజేశ్వరుని లీలాభూమి యగు మధురాబృందావన ప్రాంతమునందు మాటాడఁబడు వ్రజభాష నభిమానించెను. స్థూలముగా నీ శాఖాద్వయసాహిత్యమునకుఁ గలతారతమ్యమును భాషనుబట్టి యిట్లు నిర్ణయింపఁ దగి యున్నను రామచరితమానసము అను తులసీదాస రామాయణమును రచించిన గోస్వామి తులసీదాసు అవధీ, వ్రజభాషలు రెంటిలోను సవ్యసాచిత్వమును నెఱపెను. క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్దముదాఁక హిందీ సాహిత్యములో నీ రెండురకము లయిన భాషలును ప్రాధాన్యము వహించి యుండెను. పందొమ్మిదవశతాబ్ది యుత్తరభాగము హిందీసాహిత్యములో నాధునిక యుగమునకుఁ ప్రారంభము. ఆకాలమున దేశము దంతటను నాంగ్లేయ పరిపాలనము స్థిరపడి పోవుటతో నొకేవిధ మయిన పరిస్థితు లేర్పడెను. పాశ్చాత్యనాగరికతాసంస్కృతుల ప్రభావమువలనను సంపర్కమువలనను సాంఘిక, ధార్మిక, రాజకీయ రంగములయందుఁ బెక్కుసమస్యలు తల యెత్తెను. యుగానుకూలమయిన భావాభివ్యక్తికిఁ బద్యమనుకూలింప దయ్యెను. ముద్రణయంత్రము లేర్పడుటతో సారస్వతప్రచారసాధనములు మెండయ్యెను. అయీకారణములచే నాకాలమునందుఁ బద్యరచనలకంటె గద్యరచనలకే ప్రాధాన్యము లభించినది. ఈ గద్యరచనలే భాషలో రచింపఁబడవలె ననుమీమాంస బయలుదేరినది. ఢిల్లీ పరిసరప్రాంతములందు వ్యవహారములో నున్న 'ఖడీబోలీ' నేగ్రంథములందు వ్యవహరింప వలయు నని యాకాలమునందలి విద్వాంసులు, విద్యావేత్తలు నొకనిర్ణయమునకు వచ్చిరి. ఆర్యసమాజము, క్రైస్తవమతబోధకులు, ఆంగ్లేయాధికారులు ఖడీబోలీ హిందీ ప్రాముఖ్యమును గుర్తించి యాభాషలో రచనలను ప్రోత్సహింపఁ జొచ్చిరి. కలకత్తాలోని ఫోర్టువిలియమ్స్ కళాశాలలో ఖడీబోలీకి బోధనసదుపాయము లేర్పఱిచి పాఠ్యగ్రంథములు వ్రాయించిరి. ఇట్లు ఖడీబోలీ యొక యుద్యమముగా సాగింపఁబడెను. ఆధునిక యుగనిర్మాత యని

కీర్తింపఁబడు 'భారతేందు హరిశ్చంద్ర' పాశ్చాత్య ప్రభావముచే నేర్పడిన నూతన సాహిత్యప్రక్రియలకు వచనమే యుచిత మయిన దని తలంచి యెన్నో గద్యరీతులకు శ్రీకారము చుట్టెను. అతఁడు అరబ్బీ, పారశీ, సంస్కృత శబ్దబాహుళ్యము లేకుండ విషయానుగుణమయిన సరస సరళశైలిలో రచనలు సాగించి ఖడీబోలీని సర్వసంపన్నము కావించెను. వచనములో వ్రాయుటయే ప్రధానలక్ష్యముగా గ్రహించిన కాలములో వ్యాకరణసమ్మతమైన శైలిని అనుసరించక పోవుట స్వాభావికమే. 'భారతేందు హరిశ్చంద్ర' స్వయముగాఁ బెక్కుగద్యకృతులను రచియించుటయేకాక పత్రికలను స్థాపించి యితర రచయితల నెందఱినో యాతఁడు ప్రోత్సహించెను. అతనియడుగు జాడల ననుసరించినవారు ప్రతాపనారాయణ్‌మిశ్ర, బదరీనారాయణ్‌చౌదరీ, బాలకృష్ణభట్, బాలముకుంద్‌గుప్త, అంబికాదత్త్‌వ్యాస మున్నగువారు పెక్కురు కలరు.

ఇతని తరువాత మహావీర్ ప్రసాద్ ద్వివేదీ యను విద్వాంసుఁడు 'సరస్వతి' యనుపత్రికను నడుపుచు నందు భాషను శైలిని వ్యాకరణనియమబద్ధముగాను, పరిమార్జితముగాను నుండునట్లు యథాశక్తిగాఁ బ్రయత్నించెను. భారతేందు హరిశ్చంద్ర గద్యరచనలందు మాత్రమే ఖడీబోలీని స్వీకరింపఁగా నీ మహావీర్ ప్రసాద్ ద్వివేది పద్యరచనకును, గద్యరచనకును గూడ ఖడీబోలీనే స్వీకరించి యాభాషను కావ్యరచనాయోగ్య మయినదానిగా నిరూపించెను. ద్వివేదీ యుగమునకే చెందిన మైథిలీ శరణగుప్త యను కవీశ్వరుఁడు గాంభీర్యయుక్త మయిన ప్రవాహమయశైలిలోఁ బెక్కురచనలు సాగించుటయే కాక 'ఖడీబోలీ'కి మాధుర్యమును, మంజులత్వమును సమకూర్చిపెట్టెను. ఇట్లు క్రమముగా 'ఖడీబోలీ' ప్రచారములోనికి వచ్చి కావ్యభాషగా హిందీసాహిత్యములో స్థిరపడిపోయెను. అవధీ వ్రజభాషలలో నేది యనుసరణీయమను మీమాంస బయలు దేరినపుడు ఆ వివాదమునకుఁ బ్రత్యామ్నాయముగాఁ దలపెట్టఁబడిన యీభాషోద్యమము ఫలప్రదమై క్రమముగా హిందీసాహిత్యములో స్థిర మయినస్థానమును సముపార్జించుకొనెను.

## ఛాయావాదకవితోద్యమము
## (20వ శతాబ్దిప్రారంభము)

ఇరువదవశతాబ్ది ప్రారంభమున అనఁగా క్రీ.శ. **1910–15** నడిమికాలములో హిందీసాహిత్యమునందు అప్పటికి సరిక్రొత్తగా బెంగాలీ రచనల ననుకరించి వెలసిన

---

[1] మా. శ్రీ ముట్నూరి సంగమేశంగారి యముద్రిత వ్యాసము.

యొకానొకకావ్యశైలి యాతరువాత 'ఛాయావాదము' అనుపేరున విశేషము వ్యాప్తిలోనికి వచ్చినది. ఈశైలిలో నింకను బెక్కురకము లయిన సాహిత్యకవాద లన్నీ మేళవించినను సామదాయకముగా వాని కన్నింటికిని 'ఛాయావాదశై యనువది రూఢనామమై నేటికిని వినవచ్చుచున్నది. తెలుగులోని భావకవిత్వమ హిందీలోని ఛాయావాద కవిత్వము రెండును నొకేతీరున నొకేతత్త్వముతో వె వికసించిన యాధునికకవితారీతులు. 'ముక్తాఫలే తు యచ్ఛాయా' యనుపద్ధతి వంగాంగ విశిష్ట మయిన సౌందర్యమునకుం దోడు సర్వాంగసమా(శయమైన లావ మేవిధముగా స్ఫురించునో యదే విధముగా నీనవ్యకవిత్వములో భావము కూ సమష్టిమీఁద ఛాయాభాసగా స్ఫురించి దీని కాపేరును సార్థకము చేసినది.

ఆనాఁటివఱకు నుండిన అలంకార(ప్రధానములగురచనలు, శృంగా ముక్తకములు, (ప్రేమగీతములు, వస్తువర్ణనలు, బాహ్యచిత్రణ(ప్రధానము లయి కవితలు, సమస్యా పూర్తులు, శబ్దశ్లేషలు వగైరాలపై నప్పటి యువకులకొ విధమయిన విసుగు పుట్టి, విరక్తి కలిగి నందులకు ఫలితముగా – నా(పాచీన కవితకు (ప్రతిక్రియగా నీనవ్యకవిత్వోద్యమము బయలుదేరినది. ద్వివేదీ కవిత్వములో వీరుకథా(ప్రధానరచనలు, అభిధా(ప్రధానశైలి, కల్పనా శూన్యత మొదలయినదానికి (ప్రతిక్రియారూపముగా బయలుదేరిన యీయాయుద్యమము హిందీకావ్యసాహిత్యము నత్యుచ్చస్థాయికిఁ జేర్చినది. ఆంగ్లసాహిత్య సంపర్కముచే నప్పుడప్పుడే యాంగ్లభాషలో వెలసి వికసించుచుండిన Walt Whitman రచనామకరణలలోని స్వచ్ఛందశైలి యాకాలమునాఁటియువకుల నెక్కువగ నాకర్షించినది. క్రైస్తవసాధకులు, మతగురువులు తమ యాధ్యాత్మికానుభూతులన వెలార్చి (వ్రాసికొనిన రహస్యాత్మక(ప్రణయగీతములు (బ్రహ్మసమాజ సాధకుల భక్తి భావమున కనుగుణముగా భాసించినవి. రవీం(ద్రుని గీతాంజలికి పాశ్చాత్యదేశములలోఁ బరిగణనము, (ప్రసిద్ధి లభించిన హేతువుచే నారీతిరచనలపై నొకవిధమయిన మోజేర్పడినది. ఇవి యన్నియుఁ జేరి యా దినములలో బెంగాలీభాషలో నందియు నందనిభావములు చి(త్రించుచు (వ్రాసిన యాధునిక కవిత్వమునకు ఆభాషలో ఛాయావాదకవిత్వ మనుపేరు (ప్రచారములోనికి వచ్చినది. దాని ననుకరించి (వ్రాసిన హిందీ కవిత్వమునకుఁ గూడ నదే పేరు కాలాంతరమున స్థిరపడి పోయినది. ముక్తకములవలె నీకవిత కూడ ధ్వనినే (ప్రధానముగా నా(శయించి సాహిత్య స్థాయి నందుకొనినది. భావుకత, గీతాత్మత, వ్యంజనా(ప్రధానశైలి, కాల్పనికదృష్టి కోణము అనునవి యీ నూతనకవిత్వలక్షణములు.

కాలానుగుణముగా నిందప్పటికిఁ బాశ్చాత్య దేశములలో విరివిగాఁ బ్రచారము పొందిన కళావాదము, అభివ్యంజనావాదము, వికాస వాదము, కామవాసనా తత్త్వము మొదలయిన సాహిత్యకవాదవము లెన్నో ప్రతిధ్వనింపసాగినవి. పాశ్చాత్య సంగీతములోని స్వరసమ్మేళనమును, నందలి నాదసౌందర్యమును నమకరించుచు నల్లిన గ్రీతముక్తకరచనలు సరిక్రొత్తగా వినిపించసాగినవి. ఛందమును విసర్జించి, లయను మాత్రము సాధించుచు వ్రాసిన కవితలలో నదేదో యొకక్రొత్త యందము రూపించినది. ప్రాచీనజానపదగేయ రీతులలో వ్రాసిన కొన్ని క్రొత్తపాటలలో మునుపటివానిలో లేని సాహిత్యస్థాయి భాసించినది. ఆయీలక్షణము లన్నియుఁ జేరి నందున నీకవిత్వము మొదటఁ గొంత యలజడిని, నాతరువాత నాకర్షణమును కలుగఁ జేసినను కాలక్రమమున నుపేక్షను, నుదాసీనతను – నాపిదప ద్వితీయప్రపంచమహా సంగ్రామమునాఁటికి మరొకప్రతిక్రియను గూడఁ గలుగఁజేసినది. క్రీ.శ. 1935–40 తరువాత నీకవిత్వప్రవాహము కొంత సన్నగిల్లి తరువాతి రచనలలో నల్పాల్పముగా – శైలీమాత్రచిహ్నముగా రూపొందినది. హిందీసాహిత్యములో నీనవ్యకవిత్వ మునకు జయ శంకరప్రసాద్, సుమిత్రానందన్ పంత్, సూర్యకాంత్ త్రిపాఠీ నిరాలాలు మూలపురుషులు. నూతనవస్తువు, సరిక్రొత్త ఛందస్సులు, ఆత్మాభివ్యక్తికిఁ బ్రాధాన్యము, లాక్షణిక మయినభాష, ప్రకృతి తత్త్వనూతననిరూపణము, ఆదర్శసౌందర్యసృష్టి అను మొదలగు లక్షణములలో నీనూతనకవిత్వము హిందీసాహిత్యము నలంకరించినది.

ఛాయావాదకవితాచార్యులు భాషలోను, భావములోను గూడ గోచరించును. దేశములో నస్వాతంత్ర్యము, సమాజవ్యవస్థలో నస్తవ్యస్తత, బ్రదుకులోఁ బరాధీనత, ప్రయత్నములలోఁ బరాజయము మొదలగునవి యెన్నోయప్పటి యువకులలో నాతనిస్వేచ్ఛాపిపాసను, నంతులేని సుఖాపేక్షను బ్రేరేపించి, యందుల కనుకూలించిన వాతావరణమును, ననుగుణ మయిన పరిసరములను వెదకి యస్పష్టముగనో, స్పష్టముగనో తమహృదయమును వెల్లడింపఁజేసినవి. ఇది యాత్మాశ్రయపద్ధతికి మూలమై యాకాలమున వ్యాప్తిలోనికి వచ్చిన వ్యక్తివాదమునకు మంచి చేయూత నిచ్చినది. ఇది పీడితమానవలోకము నంతటిని నుద్ధరించ వలయునను తహతహతోపాటు వ్యక్తిస్వాతంత్ర్యమును, నాత్మగౌరవమును సాధించి నిలువఁబెట్టుకొనవలయు నను నాకాంక్షను రేకెత్తించినది. కాని, పరిస్థితులందు కింకను ననుకూలింపక పోవుటచేత రేగిన యాకాంక్షలన్నియు నాక్రోశించినట్లో, యావేదనగానో ప్రతిధ్వనింప సాగినది. ఫలితముగా దుఃఖ

మొకసుఖముగా వర్ణింపఁబడినది. దీనికి బౌద్ధుల దుఃఖవాదము కొంత తోడ్పడిన దని చెప్పినను దప్పులేదు. ఈ శతాబ్దములో ననేకానేక దార్శనికసిద్ధాంతములు సాహిత్యమునందు ననురణన శ్రుతులవలె వినిపింప సాగినది. దేశప్రేమ, సామాజికశిల్పముగా రూపు కట్టినది. ప్రకృతిప్రేమ పరవళ్లు త్రొక్కి పలాయనవాదముగా భాసించినది. లోకమునందుఁ బరాజయమునుపొంది, భావలోకములో మత్తుగా విహరించి, స్వాప్నిక సౌందర్యానుభూతు లేవో కల్పించుకొని యానందించి ప్రకృతదుఃఖమును దిగమ్రింగు తత్త్వ మొకటి ఉమర్‌ఖయ్యాము తత్త్వముతో మేళవించి హాలావాదమును సృష్టించినది. దీనితోఁ గవులు గాయకులుగా, సౌందర్యాన్వేషకులుగా, సుకుమారజీవులుగా స్వప్న లోకసంచారులుగాఁ, జిరవిరహులుగా మాఱిపోయి మాతీరే వే అన్నట్లు చరింప సాగిరి. ఇంద్రియగోచర మగు ఈ జగత్తున కావల మఱేదో యతీంద్రియమయిన లోక మున్నదనుభావ మొకటి యాయామూర్తవిషయముల ననుసరించి ప్రసరించు నమూర్త చ్ఛాయలలో స్ఫురించుసరికి, నదేదో యందుకొని యానందింపవలెనను నభిలాషతో నీ కవులు సుఖైకసాధకులుగా వ్యవహరింప సాగిరి. కొందఱీ కీజడచేతనమయ మయినసృష్టి యంతటను నేదో యొకదివ్యశక్తి వ్యాపించి యున్నట్లు భాసించి, అవునన్నట్లు జడజగత్తులోఁ గూడఁ గొన్ని చైతన్యసంకేతములు గోచరించుసరికి వా రీప్రకృతినే పరమారాధ్యగా, నిత్య సుందరిగా, చిరసహచరిగా, నిష్టసఖిగా వర్ణించి, దానికి మానవత్వము నారోపించి, దానితో నాత్మీయతనుసాధించి, యందులో లీనమైపోయి తక్కిన వన్నియు మఱచి చరించు నొకానొక తత్త్వము నలవఱచుకొనిరి. ప్రకృతిలో గోచరించిన యాయాధ్యాత్మికతత్త్వ మొక వినూతనమైన యద్వైతతత్త్వము ననుభూతికిఁ దెచ్చి మునుపటి యేకాత్మవాదమును మఱింత సన్నిహితముగాఁ ప్రదర్శించి విశుద్ధప్రణయమునకును, విశ్వప్రేమకును నారు పోసినది. ఆధ్యాత్మ తత్త్వాన్వేషకు లయిన సాహితీసాధకుల కీ విశ్వ మొక పారదర్శక దర్పణముగా నుపయోగపడి ప్రత్యక్ష జగత్తునకా చివరను గల భావజగత్తులోని కీయాత్మను బ్రసరింపఁజేసి, యంతటను వ్యాపించి యున్న యాపరమ సత్త్వ మేదో దానిని దర్శింప వలయు ననియు, నాసత్త్వముతోఁ దమసత్త్వమును మేళవింపఁ జేయవలయు ననియు నాశించుట కనువు కూర్చినది. పరిణామతః అట్టి సంయోగమును వాంఛించియు – నది లేక విరహవ్యథ ననుభవించియు వ్యక్తీకరించిన భావములు 'రహస్యవాదము'గాఁ బరిమళించినది.

ప్రకృతిని చైతన్యరూపములోఁ జూచుచూపెన్నఁడును నస్పష్టమైన ఛాయగానే భాసించును. అందుకుఁ దో డాధ్యాత్మిక సౌందర్య మేదో వెదకి గ్రహించు ప్రయత్న మీ చూపును స్థూలజగత్తునుండి సూక్ష్మజగత్తులోనికిఁ బ్రసరింపఁజేసి మఱింత యస్పష్టతకు హేతువయినది. తత్ఫలముగా ననుభూతులందియు నందనిదిగాఁ దయారయి యభివ్యక్తి లాక్షణికమయినది. ఆకాశము నంటునంతగాఁ గల్పన విరిసినను భావము మాత్రము ఊహించి చిత్రించినది యెక్కువను, ననుభవించి చవి చూచినది తక్కువగను రూపించినది. బుద్ధి యప్రతిభమై, భావము పరవళ్లు త్రొక్కినది. ఫలితముగాఁబలుకు బరువెక్కిపోయి పాటగా వినిపించినది. భావన కేవలము వైయక్తికముగానే నిలిచిపోయి నందునను – వర్ణ్యవస్తువు సంకోచించి విభావమునకు విస్పష్టత లేకపోయినందునను ఊహకు విభిన్నార్థభూములలో విహరించు సత్తువ లోపించినది. ఆయాకారణముల వలనఁ గవులీవిధముగా స్వప్నలోకసంచారులై సాధించిన దెల్ల సుకుమారసుందర మయిన యభివ్యక్తి దాని కనుకూలించిన స్వచ్ఛందఛందశ్శైలిని మాత్రమే.

ఈ ఛాయావాద రచనలలో గోచరించినంతగా పదలాలిత్యము, కల్పనాప్రాభవము, భావాకులత, వేదనావివృతి, ప్రయోగవైచిత్రి, వ్యంజకచిత్ర విన్యాసము, మూర్తప్రత్యక్షీకరణము, అన్యోక్తిరుచివంటివి పూర్వ సాహిత్యములో గోచరింప లే దన్నచో నతిశయోక్తి కాఁజాలదు.

'ఆధునిక మీరా' యని పేరు గాంచిన శ్రీమతి మహాదేవివర్మ, శోకమే సుఖ మను మృదుమానసికచ్ఛాయకుఁ బ్రతినిధి, అద్వైతభక్తిప్రేరణవలనను, రవీంద్ర వివేకానందుల ప్రేరణవలనను 'నిరాల' తన రచనలలో దివ్యవేదాంతసౌరభమును గుప్పించెను. అభివ్యంజనలో నూతనశైలి గ్రహించి ప్రేమ,సౌందర్యము, ఆనందము – అను మూఁడు విషయములలోఁ గావ్యరచనలను సాగించినవాఁడు జయశంకరప్రసాదు. ఆంగ్లసాహిత్యములోని రొమాంటిక్ కవులవలె సుమిత్రానందన్ పంత్ ప్రకృతిమానవుల యొక్క సహజసుందర రహస్యాత్మక సంబంధమును వ్యక్తీకరించెను. బాలకృష్ణశర్మ 'నవీన్' ప్రేమ, ప్రకృతి విద్రోహములను కావ్యవస్తువులుగా గ్రహించి రచించెను. రామనరేశత్రిపాఠి దేశభక్తితోను స్వాతంత్ర్యపిపాసతోను గూడినరచనలు కావించెను. ఇట్టి గొప్పకవులతోఁ గూడి యాంగ్లసాహిత్యములోని స్పష్టభావాభివ్యంజన – బెంగాలీవారి సరస మధురశైలి, మరాఠీవారి గాంభీర్యము, ఉర్దూభాషలోని

ధారాళత యనునగుణములను బుణికి పుచ్చుకొని వర్ధిల్లిన యీ ఛాయావాదకవిత్వము హిందీసాహిత్యచరిత్రములో మిక్కిలి ప్రధాన మయినది.

## ప్రగతివాదము (క్రీ.శ. 1935 ప్రాంతము)

హిందీసారస్వతములో ఛాయావాదమునకుఁ బ్రతిక్రియగా బయలుదేరిన కవితోద్యమము ప్రగతివాదము. కవిత్వము పలాయనము కాదనియు, జీవితసమస్యలను యధాతథముగా నెదుర్కొని సంఘక్షేమమును సాధించుటయు, సంఘప్రబోధమునకును, పరపీడననిర్మూలనమునకును వినియోగపడుటయుఁ గావ్యప్రయోజనమును, లక్ష్యమును నని రచయితలు విశ్వసింపఁజొచ్చిరి. భావాంబర విశ్రుత వీధుల నుండి క్రిందికి దిగి వచ్చి యీకవులు సంఘజీవితమును వస్తువుగా గ్రహించి రచనలు చేసిరి. సామ్యవాద ఆర్థికసిద్ధాంతములు మూల కారణములుగా బయలుదేరిన యీ కావ్యరచనలకు 'ప్రగతివాదిరచనలు' అనిపేరు. ఇది తెలుఁగులోని 'అభ్యుదయకవిత్వము' ను పోలును. రామధారిసింహదినకర్, నరేంద్ర, సుమన్, అంచన్ మొదలగు వారు ప్రగతివాదకవులుగాఁ బరిగణింపఁ బడుచున్నారు.

## ప్రయోగవాదము (క్రీ.శ. 1945 ప్రాంతము)

ప్రగతివాదమునకుఁ దరువాత హిందీసాహిత్యములో వచ్చిన సాహిత్యోద్యమము ప్రయోగవాదము. ఈకవిత్వమున శాబ్దికవైచిత్రికిఁ బ్రాధాన్యము మెండు. శాబ్దికవైచిత్రీ ప్రాధాన్యవాదు లయిన యీ నవ్యకవులను '**ప్రయోగవాది రచయితలు**' అనుచున్నారు. ప్రయోగవాది రచయితలలో '**అజ్ఞేయ**' అగ్రగణ్యుడు. అతఁడు '**తాఙ్‌సప్తక్**' అనుపేర మూఁడుభాగములలో నిరువదియొక్కరు కవీశ్వరుల రచనములను ప్రచురించెను. ఆకవితాసంకలనము నందుఁ జేర్పఁబడిన కవితలను రచించినవా రెల్లరును ప్రయోగవాది రచయితలని వేఱుగాఁ జెప్ప నవసరము లేదు.

## హిందూస్థానీ ఉద్యమము (క్రీ.శ. 1940 ప్రాంతము)

ఇదియు 'ఖడీ బోలీ' యుద్యమమువలె భాషకు సంబంధించిన యుద్యమము. భారతదేశమునకు స్వాతంత్ర్యము లభింపక పూర్వము బ్రిటిషువారి రాజనీతి ఫలితముగా హిందువులకు, మహమ్మదీయులకు వైషమ్యములు హెచ్చెను. జాతిపిత యగు గాంధిమహాత్ముఁడు హిందూమహమ్మదీయైక్యమునకు విశేషముగాఁ బాటుపడెను. హిందువుల వ్యవహారములో నుండిన హిందీభాష

యందు సంస్కృతపదజాలము విశేషముగా నుండెను. అట్లే మహమ్మదీయులు వ్యవహరించుచుండిన హిందీభాషలో ఉర్దూ భాషాపదము లధికముగా నుండెను. నాఁటిదనుక హిందీభాష నాగరలిపిలో లిఖింపబడుచుండెను. మహమ్మదీయు లాభాషను తమయుర్దూలిపిలో గూడ వ్రాయుట కనువుగా నీరెండు విధములయిన భాషలకును సమన్వయము కలిగించి తన్మూలమునఁ గూడ మతైక్యము సాధింప యెంచిన గాంధిమహాత్ముఁడు 'హిందూస్థానీ' భాషోద్యమమును దలపెట్టెను. హిందువులకును, మహమ్మదీయులకును నుభయులకును సమ్మత మగు తీరున సంస్కృతపదములు, ఉర్దూపదములు ఈ రెంటికిని సమప్రాధాన్యము కలిగిన భాషగా నది యుండవలయునని యామహాత్ముని సంకల్పము. దేశప్రజలయొక్క మైకమత్యము కొంతవఱకు దీనిమూలమున సాధింపవచ్చునని యాయన విశ్వసించుటయే కాక దక్షిణ దేశమున హిందీభాషను ప్రచారము చేయు దక్షిణభారతహిందీప్రచారసభవారికిని, దేశము లోని యితరప్రధాన సంస్థలకును రాష్ట్రభాష యొక్క ప్రాముఖ్యమునుగూర్చి ప్రచారము చేయవలసినదిగా నాదేశించెను. ఈ యుద్యమము భాషా పరిస్థితులనుబట్టి భాషలోనో, మఱి దేనిలోనో యొక నూతనసంస్కారమును గొనిరావలయునను సంకల్పముతోఁ గాక రాజకీయ కారణములచేఁ బ్రారంభింపఁబడిన యుద్యమము. గాంధీమహాత్ముని వంటి మహనీయు డీయుద్యమమును బ్రారంభించి ప్రచారము కావించుటచే దాని కాయన జీవితకాలమున నాయనకుఁ బ్రజలలోను, ప్రభుత్వములోను గల పలుకుబడిని బట్టి కొంతప్రచారము కలిగెను. కాని యసహజపరిస్థితులలో, రాజకీయ కారణములచే నారంభింపఁబడిన యాయుద్యమము గాంధీమహాత్ముని నిర్యాణానంతరము నిర్వీర్యమై క్రమముగా రూపు మాసి పోయెను.

## నయీకవిత, నయీకహానీ యుద్యమము[2]

### (క్రీ.శ. 1960 ప్రాంతము)

నూతనసమాజపరికల్పనోద్దేశముతో, నిర్భీకమైన యభివ్యక్తితో ఛాయావాదకవిత్వ ముపైఁ దిరుగుబాటుగా నాధునికహిందీవచనకవిత్వము ధ్వజ మెత్తినది. ఈ తిరుగుబాటు సిద్ధాంతరూపముగాఁ గాక ప్రముఖముగా సృజనాత్మకరూపముగా మిక్కిలి యుద్ధృతముగా వచ్చినది. ప్రత్యక్ష

---

[1] చూ. ప్రపంచసాహిత్యంలో యువతకు తిరుగుబాటు : వ్యాసము : శ్రీ నిఖిలేశ్వర్ : భారతి - *1967.* జనవరి సంచిక.

సంఘర్షణమునకు బదులు ఆధునికయువరచయితలు రచనారూపముగా నసంఖ్యాకముగాఁ గవిత్వము, కథలు, నవలలు మొదలగు రచనలు రచించి తిరుగుబాటు చేసిరి. స్వర్గీయ గజానన్ మాధవ్ ముక్తిబోధ్, కైలాస్ వాజపేయి, రాజకమల్ చౌదరి, తదితరులు వీరిలో ముఖ్యులుగాఁ బరిగణింపఁ దగియున్నారు.

'నయీకహానీ' యనుపేరుతో కథానిక క్రీ.శ. 1960 సంవత్సరమునుండి యొక యుద్యమమువలె వచ్చినది. పత్రిక లన్నియు వానికి సముచితస్థానము నిచ్చి ప్రోత్సహించినవి. కమలేశ్వర్, రూప్‌నాథ్, జ్ఞాన్‌రంజన్, రమేష్‌బక్షీ, రవీంద్రకాలియా, రాజేంద్ర యాదవ్, ధర్మవీర్‌భారతి, మున్రారాక్షస్, మమతాకాలియా, నిర్మల, సుధా మొదలగువారు నవలలు, కవిత్వము, కథలు అను వివిధ సాహిత్యప్రక్రియలయందుఁ గృషి చేసిరి.

ఇటీవల అకవిత, అకహానీ, అనాటక్ అను పేరుతో వ్యతిరేకపద్ధతి (Anti-Style) సాహిత్యము కొంత వచ్చినది. హిందీలోని యీ నయీకహానీపై జరిగినన్ని చర్చాసమావేశములు, పత్రికలలోఁ జర్చలు నిటీవల నేభాషలోను జరుగ లేదన్నచో నతిశయోక్తి కాఁజాలదు.

## ౨. బెంగాలీ సాహిత్యము

హిందీభాషా సాహిత్యమునందలి సాహిత్యోద్యమములను గూర్చియు, నాయుద్యమము లేర్పడుటకుఁ గారణభూతము లయిన రాజకీయ, సాంఘిక, సారస్వత పరిస్థితులను గూర్చియు స్థూలముగాఁ దెలిసికొంటిమి. ఇఁక భారతదేశభాషలలో – యూరపు ఖండములోని భాషలలో ఫ్రెంచిభాషవలె – నవనవోన్మేషముతో నెప్పటి కప్పుడు క్రొంగ్రొత్త రూపములను దాల్చుచుఁ జైతన్యభరితముగా విరాజిల్లు బెంగాలీభాషాసాహిత్యములోని సాహిత్యోద్యమములను గూర్చి స్థూలముగా నిటఁ దెలిసికొందము. పాశ్చాత్య సభ్యతను నాగరికతను దమజీవితములలో జీర్ణింపఁ జేసికొని ప్రపంచములో నేదేశమున, నేసాహిత్యములోఁ గ్రొత్తదనము గానవచ్చినను దానిని తమదిగాఁ జేసికొనఁగల, తమసాహిత్యము లోఁ బ్రతిఫలింపఁ జేసికొనఁ గల చిత్తసంస్కారము, విశాలదృక్పథము గలవంగజాతిసాహిత్య మిటీవలి కాలమునఁ బెక్కు సాహిత్యోద్యమములకుఁ దన్మూలమున జరిగిన సాహిత్య పురోగమనమునకుఁ గాణాచి యయినది. ప్రాచీనవంగసాహిత్యములోఁ గూడఁ గొన్ని

సాహిత్యోద్యమము లేర్పడి వానిమూలమున సాహిత్యసృష్టి గణనీయముగా జరిగినది. ఇట్లు వంగసాహిత్యము పరిపుష్టి నొందుచుఁ గాలము గడచినకొలఁది వినూత్న వేషములను దాల్చుచు, వినూత్నరుచుల నలవఱుచుకొనుచుఁ గ్రొత్త రీతుల సంతరించుకొనుచుఁ బురోగమించుటకుఁ దోడ్పడిన సాహిత్యోద్యమములలో ౧. లౌకికసాహిత్యోద్యమము, ౨. చైతన్య సాహిత్యోద్యమము, ౩. పురాణానువాదోద్యమము, ౪. కవీరలడాయి యుద్యమము, ౫. గద్యసాహిత్యోద్యమము, ౬. చలితభాషోద్యమము, ౭. ఆధునిక కవిత్వోద్యమము, ౮. అత్యాధునిక కవిత్వోద్యమము, ౯. ఆకలితరముకవుల యుద్యమము అనునవి మిక్కిలి ప్రధాన మయినవి.

## 1. లౌకికసాహిత్యోద్యమము లేక మంగళకావ్యరచనోద్యమము
## (15, 16, 17 శతాబ్దములు)

పండ్రెండవ శతాబ్దినాఁటికి వంగదేశమును పాల, సేన రాజవంశములు పరిపాలించుచుండినవి. ఈరాజుల యేలుబడిలో దేశములోని కళలు చక్కఁగా నభివృద్ధి పొందినవి. వారు కవిత్వము మొదలగు లలితకళలకు గొప్పప్రోత్సాహము నొసగుచుండిరి. పండ్రెండవశతాబ్ది చివరిభాగమున వంగదేశముపై తురకలు దండయాత్రలు చేయఁ దొడఁగిరి. ఈదండయాత్రలు పదునాలుగవశతాబ్ది వఱకుఁ దఱుచుగా జరుగుచుండెడిది. దీనిమూలముగా దేశము నిస్సార మగుటయే కాక యాదరప్రోత్సాహములు లేక కళలు మూలఁబడినవి. సాహిత్యము నశించి పోయినది. వంగదేశమునందలి పండితులు, కవులు, బౌద్ధాచార్యులు తమతమ గ్రంథములను మూట గట్టుకొని దేశము విడిచి నేపాలదేశము నకు వలస పోయిరి. పదుమూఁడు, పదునాలుగు శతాబ్దులలో వంగసాహిత్యము మూగ వోయినది. ఆకాలమున వంగదేశాధిపత్యమును వహించిన ముస్లిముపాలకులు రాజకీయవ్యవహారములందు పార్సీభాషను, మతవిషయములకు అరబ్బీ భాషను నుపయోగించుచుండిరి. బెంగాలీభాషకు రాజాశ్రయము లేకుండఁబోయినది. ఈరెండు శతాబ్దులును బెంగాలీసాహిత్యమున చీకటిశతాబ్దములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి.

కాని ఢిల్లీపాలకుల యాధిపత్యమును ద్రోసి పుచ్చి వంగదేశము స్వతంత్ర మయినపిదప నీపరిస్థితి మారిపోయినది. వంగదేశమున స్వతంత్రపరిపాలన మేర్పఱుచుకొనిన రాజులును, నవాబులును హిందూపండితుల నాదరించుట

యారంభించిరి. ఆకాలమున నాహిందూరాజుల, నవాబుల యాస్థానములలోఁ గుదురుకొనినవారు సంస్కృతవిద్వాంసులు. వారు గ్రంధరచనమునకుఁ గడంగ లేదు. ఇట్లాకాలమున సంస్కృతపండితులు మూగనోము పట్టినను వంగదేశములోని పల్లెపట్టులలో నివసించుచున్న గేయకవులు ప్రజా సామాన్యముకొఱకై కొంత సాహిత్యసృష్టి కావించిరి. ప్రజాసామాన్యమున లౌకిక దేవతల యెడ భక్తిప్రపత్తులను గలుగఁ జేయుటయుఁ, దమమతవిశ్వాసములను లోకములోఁ బ్రచారము గావించుటయు వారి పరమాశయములు. ఆయాశయములు నెఱవేర వలయు నన్న నాకార్యము ఒక్క సాహిత్యము మూలముగానే జరుగఁ గలదు. సంస్కృతములో నే లౌకిక దేవతలను గూర్చిన మహిమాదికము లభివర్ణింపఁ బడినవో నా కావ్యముల మూలమున వా రాశించిన ఫలసిద్ధి లభింపదు. అందుచే వారు తమకావ్య రచనమునకు బెంగాలీభాషనే స్వీకరింపవలసి వచ్చినది. అట్లు వారు వ్రాసిన కావ్యములకు **మంగళకావ్యము** లని పేరు. అది రాజులకొఱకో, ధనికులకొఱకో కాక సామాన్యజనానీకము కొఱకు వ్రాసిన కావ్యములు. దీనికిఁ బురాణకథలలో నెట్టి సంబంధము గాని లేదు. అది నూఁటికి నూఱు పాళ్లు దేశీయేతివృత్తములతోఁ గూడినవి. **ధర్మమంగళ, చండీ మంగళ, మనసామంగళ** యని యాకావ్యముల పేళ్లు. ఇవి మంగళమును, శుభమును గలిగించును గనుక, దీనికి మంగళకావ్యము లని పేరు వచ్చెను. ఈకావ్యములను గేయ కవులు ప్రజాసమావేశములలోను, పండుగలలోను, జాతరలలోను గానము చేసెడివారఁట.

ధర్మదేవుని భక్తుఁ డగు లావుసేనునియొక్క వీరగాథ ధర్మమంగళ కావ్యములలోని ముఖ్య మయిన యితివృత్తము. చండీమంగళకథలు రెండు తెఱఁగులవి ప్రచారములో నున్నవి. వానిలో నొకటి కళింగదేశమునుండి వంగదేశమునకు దిగుమతి యయినది. రెండవది వ్రతకథ. మనసామంగళ శివుని కుమార్తె యని భావింపఁబడు మనసాదేవియొక్క మహిమాదికమును దెలుపు కావ్యము. దీనికి పద్మాపురాణ మని కూడ మరొక పేరు కలదు.

వీనిలో నొక్కొక్క లౌకికకథను స్వీకరించి పెక్కురు కవులు కావ్యములను భిన్న భిన్న కాలములలో రచించిరి. క్రీ.శ. 1571లో ధర్మదేవత యాదేశముప్రకారము రూపరామచక్రవర్తి యనుకవీశ్వరుఁడు మొట్టమొదటిసారిగా ధర్మమంగళకావ్యమును వ్రాయఁగా దాని ననుసరించి యదే శతాబ్దములో మాణికగంగోపాధ్యాయ యను కవీశ్వరుఁడును, క్రీ.శ. 1711లో కవిరత్న

వ్యసరామచక్రవర్తియు, **1781**లో మానిక రాం గంగూలీ యను కవీశ్వరుఁడును ధర్మమంగళకావ్యములను రచించిరి.

చండీమంగళను మొట్టమొదట ముకుందరామ చక్రవర్తి యనుకవీశ్వరుఁడు రచించెను. తరువాత మానికదత్తు చండీదేవి యాదేశముప్రకారము మరల నొక చండీ మంగళకావ్యమును విరచించెను. మాధవకవి యనునతఁడు క్రీ.శ. **1579**లో నొక చండీమంగళకావ్యమును వ్రాసెను. మనసామంగళకావ్యము క్రీ.శ. **1495**లో విప్రదాసు అనుకవీశ్వరునిచే రచింపఁబడెను. దానికి మనసావిజయము అని పేరు. ఆకాలములోనే విజయుగుప్త యనుకవీశ్వరుఁడును నొక మనసామంగళను విరచించెను. పదునాఱవశతాబ్దములో నారాయణదేవు అను కవి మఱొక మనసామంగళ వ్రాసెను. వంశీదాసచక్రవర్తి, రాధానాథ చౌధురి మొదలయిన కవులు సుమారు పాతికమందికి పైగా మనసామంగళకావ్యములు రచించిరి.

ఈ లౌకికకావ్యముల యావిర్భావము, అందలి భాష మొదలయిన విషయములను గూర్చి బెంగాలీసాహిత్యచరిత్రకారులు తెలిపిన యీ యంశములు గమనింపఁదగి యున్నవి.

"While Sanskrit was the vehicle of orthodox Brahmanism, Bengali Literature owed its origin and early growth to the Medieval cults - such as Sahajiya, Nath, Manasa, Chandi and Dharma cults. These cults originated before the Muslim conquest, but they became most active and they fully established themselves in Hindu Society; after the conquest. They were the main power behind the resurgence of Hinduism in the sixteenth, Seventeenth and eighteenth centuries and they provided the subject matter of the bulk of Bengali Literature in the Gaur and Nadia periods. They were Non-Aryan, Anti-Brahmanic, opposed to the caste System and mainly prevalent among the lower sections of the population. They were called Laukik or vulgar in order to distinguish them from the orthodox Brahmanism that obtained among the minority at the top and the gods and goddesses were called 'Laukik' in order to distinguish them from the classical gods and goddesses. Excluded from the Aryan fold they lived a sumerged life among the lower classes in the villages and were untouched by any higher culture except the Buddhist. They derived their democratic spirit from Buddhism and many of them originated from disintegrating

Buddhism. That religion had its main following among the non-Aryan masses at the bottom of Hindu society and it found a natural refuge among the same masses in its last days That is how some Buddhist deities, transformed and perverted by the popular mind, reappeared as Laukik deities. Manasa, Chandi and Dharma are instances in point. In their new forms those deities were at first worshipped by the common people, but in course of time they gained followers among the upper classes, and they finally became well estabilshed as Hindu deities. Their Literature tells us how that happened '

*- Bengali Literature, Ghosh, J C pp. 14-15.*

లౌకికదేవతల మహిమాదికమును వర్ణించుచు బెంగాలీభాషలో రచింపఁబడిన యీ మంగళకావ్యములు కాలక్రమమున పురాణకథలలో రచితము లయిన మంగళకావ్యములుకొన్నింటికి మార్గదర్శకములు కూడ నయినవి. భాగవతకథ ననుసరించి వైష్ణవకవులు కృష్ణమంగళ, గోవిందమంగళ, ముకుందమంగళ, గోకులమంగళ, రాధికామంగళ మొదలయిన మంగళ కావ్యములను రచించిరి. ఇట్లు బెంగాలీభాషలోని యీ లౌకికసాహిత్యోద్యమ మాభాషలోఁ బెక్కుమంగళ కావ్యములు వెలయుటకుఁ దోడ్పడి ప్రజాసామాన్యములో భక్తిప్రవక్తులను బ్రచారము చేయుట మూలముగా తమతమ మతప్రచారమునకు సాధనముగా నుండుటయే కాక వైష్ణవమతావలంబకులకుఁ దమ మతప్రచారము చేసికొనుటకు నొకసాహిత్య ప్రక్రియను గూడ ప్రసాదించి తరువాతి కాలమునఁ దన ప్రభావమును నెఱపినది.

## చైతన్యసాహిత్యోద్యమము (15, 16 శతాబ్దములు)

దీనినే వైష్ణవసాహిత్యోద్యమ మని కూడ స్థూలముగాఁ బేర్కొనవచ్చును. బౌద్ధ మతము క్షీణించినపిదప వంగదేశములో వైష్ణవమతము ప్రాబల్యములోనికి వచ్చినది. అది క్రమక్రమముగా నభివృద్ధి చెంది వంగదేశమునందు చైతన్యస్వామి ప్రభవించుటతో వెల్లువ లై పొంగి పొరలినది. వైష్ణవకవులలో బడు చండీదాసు ప్రథముఁడు. ఇంచుమించుగా నితనికి సమకాలికుఁడే యయిన మైథిలికవి విద్యాపతి 'ప్రజబురి' భాషలో రచించిన వైష్ణవపదములు కూడ నీ సాహిత్యములోనే చేరును. చండీదాస, విద్యాపతులలోఁ బ్రారంభమైన వైష్ణవకవిత్వము చైతన్యస్వామి యావిర్భావములో నత్యుచ్చస్థాయినందుకొనినది. జ్ఞానదాసు, గోవిందదాసు, బలరామదాసు, నరోత్తమదాసు, రాజశేఖరకవి వంటి యుత్తమకవులు వంగభాషలో

నుత్తమవైష్ణవసాహిత్యమును సృష్టించిరి. ఎందఱో ముస్లిముకవులు, కవయిత్రులు కూడ వైష్ణవకావ్యములు వ్రాసి వైష్ణవసాహిత్యమును బరిపుష్టము కావించిరి. రాధాకృష్ణులప్రేమలీల వీరి కావ్యములలోని ప్రధానకథా వస్తువు. చైతన్యస్వామి సాగించిన యుద్యమము వైష్ణవసాహిత్యమునకుఁ గ్రొత్తవెలుఁగును బ్రసాదించినది. అతఁ డొక్క వంగదేశమునందే కాక భారతదేశము నలుమూలల వైష్ణవమతమును విస్తరింపఁజేసెను. వైష్ణవమతములో నాతఁడు ప్రవేశపెట్టిన నామసంకీర్తన మనతికాలములో నవద్వీపమున నాతనిఖ్యాతి నినుమడింపఁ జేసినది. అతఁడు వంగభాషలో నెట్టికావ్యరచనయునుగాని చేయలేదు. కాని, యతఁ డనేక వంగభాషాకావ్యములకును, నాతనికాలమునను, నతని కనంతరకాలమునను వెలసిన వైష్ణవసాహిత్యమునకును మూలకారణుఁ డయ్యెను. అతఁడు దేశమునఁ గలిగించిన నూతనచైతన్యమువలనఁ బ్రభావితులై పెక్కురు కవులు వంగ భాషలో గ్రంథరచనముఁ గావించిరి. ఈకాలమున (1468-1533) నతని జీవితచరిత్రమును జిత్రించుగ్రంథములు వంగభాషాసాహిత్య చరిత్రములో నొకనూతనాధ్యాయమునే సృష్టించెను. మురారిగుప్త, రఘునాథగోస్వామి, కవికర్ణపూర పరమానందసేను, బృందావనదాసు, కృష్ణదాస కవిదాసు, త్రిలోచనదాసు, చూడామణిదాసు, జయానంద, ప్రేమానంద మొదలగు కవు లీచైతన్యస్వామి జీవితము కథావస్తువుగాఁ బెక్కు గ్రంథములను విరచించిరి.

అతని యుద్యమప్రభావమువలన సుమారు రెండువందలమందికిఁ బైఁగా వైష్ణవ పదకర్తలు వంగదేశములోఁ బ్రభవించిరి. వారిలో వసుదేవఘోషు, జ్ఞానదాసు, గోవింద దాసు మొదలగువారు ప్రముఖులు.

ఈకాలమున వంగభాషాకవులలోఁ బెక్కురు చైతన్యమత మవలంబించినవారే. వారిలోఁ బెక్కురు ఆయన శిష్యులు, ప్రశిష్యులు. ఇందుచేత నీకాలమునందు వెలసిన సాహిత్యమును చైతన్యసాహిత్య మనవచ్చును. ఇతని ప్రభావమువలన నెందఱో ముస్లిము కవులు వైష్ణవసాహిత్యమును సృష్టించిరి. వారిలో సయ్యదు మాత్తుళా, నాసిర్ మామూ మొదలగువారు ప్రసిద్ధులు.

ఈ చైతన్యసాహిత్యోద్యమము లేక వైష్ణవసాహిత్యోద్యమము యొక్క ప్రభావము వలన వంగభాషలో వెలసిన సాహిత్యమును బ్రధానముగా మూఁడు తెఱఁగులుగా వర్గీకరింప వచ్చును. ౧. వైష్ణవధర్మప్రతిపాదకము లయినగ్రంథములు,

౨. చైతన్యస్వామి యొక్కయు, నితరవైష్ణవాచార్యులయొక్కయు జీవితచరిత్రముల నభివర్ణించు గ్రంథములు, 3. వైష్ణవపదములు.

"The Vaishnava Poetry produced in this period was of three kinds: (1) Expositions of Vaishnava doctrine and Practice, (2) Biographics of Chaitanya and other Vaishnava leaders, and (3) The Pads (Short Songs)" - Bengali Literature, p. 49

వైష్ణవసాహిత్యవమునుగూర్చి వంగసాహిత్యచరిత్రకారులు వ్రాసిన యీవిషయములు గమనార్హములు.

'Vaishnavism had been current in Bengal long before Chaitanya, but the impetus he gave to it made it the main channel through which the national genius expressed itself for three centuries. Though primarily a religious movement, it was a manifold expression of the human spirit and it overflowed into many channels other than the religious.'

***

'The movement, it is needless to say, derived its main impetus from the personality of Chaitanya (1486-1534). Only the last twenty four years of Chaitanyas life were given to Vaishnavism, 'yet within that time he made it the principal faith in Bengal and took it to many parts of India. His followers believed him to have been heaven-inspired, even an incarnation of God.'

*- Bengal Liturature - pp. 47-48.*

## పురాణానువాదోద్యమము (15వ శతాబ్ది మొదలు 19వ శతాబ్ది వఱకు)

ముసల్మానుల యేలుబడిలో వంగదేశమున రాజాదరణము సన్నగిలినది. ఈ యవకాశమును దొరకిపుచ్చుకొని దేశభాష యగు వంగభాష యాకాలమున బాగుగాఁ దల యెత్తఁ దొడఁగినది. ముసల్మాను పాలకులు ప్రధానముగా పార్సీ, అరబ్బీ భాషా పక్షపాతులే యయినప్పటికిని సాధారణవ్యవహారమునకు వారికి వంగభాష తప్పనిసరి యగుచు వచ్చెను. రాజకీయవ్యవహారములలో పార్సీభాషతోఁ బాటు వంగభాషాను వాదము కూడ నావశ్యక మయ్యెను. ఇందుమూలమునఁ బ్రజలకు మాతృభాష మీఁదఁ బ్రత్యేకమయిన యనురాగమేర్పడెను. దానితో సంస్కృతపురాణములును,

ఇతిహాసములను దమమాతృభాషలోనికి ననువదించుకొనవలయునన్న యభిలాష వారికి జనించెను. ప్రజల కెల్లరకును నవగతము కావలయునన్న యభిప్రాయముతో కృత్తివాస ఓఝు అను కవీశ్వరుండు రామాయణమును వంగభాషలోని కనువదించెను. ఆతరువాత మునల్మాను పాలకులు కూడ భారతము మొదలయిన గ్రంథములను వంగభాషలోని కనువదింపం జేసిరి.

తమయమగ్రంథములు దేశభాషలోని కనూదితములగుచోం దమయాధిపత్యమునకు భంగము కలుగునని భయపడి యానాంటి బ్రాహ్మణపండితు లట్టియనువాదకార్యమునకు వ్యతిరేకించిరి.

"To translate the Sanskrit Puranas into Bengali was an act of sacrilege in the eyes of the conservative Brahmin Priest and Pandit.

Whoever hears the eighteen Puranas and the Ramayana in Bengali goes to Raurava hell'. So ran an unofficial Ban ' - Bengal Literature, p. 14.

ఈ పురాణాదుల యనువాదము పదునైదవశతాబ్దములో నారంభ మయినది. అట్లు అనువదింపంబడినగ్రంథములలో రామాయణము, మహాభారతము, భాగవతము మొదలయిన పురాణములు ముఖ్యమయినవి. పదునైదవశతాబ్ది మొదలుకొని పదునాలుగుమంది రామాయణకవులు కానవచ్చుచున్నారు. ఇరువదవశతాబ్ది వఱకు నేయేంబది, యఱువదిమందో యుందురనుటకు సందేహము లేదు. అట్లే భారత రచయితలు మొత్త మెనుబదిమంది, భాగవత రచయితలు పాతికమందికిం బైంగా నుందురని తెలియుచున్నది. రామాయణకవులలో కృత్తివాస ఓఝు, అద్భుతాచార్య, చంద్రావతి, రామశంకరదత్తు మొదలగువారు కలరు. రామాయణకవుల వలెనే పెక్కురు భారత కవులు సంజయుడు, కవి శ్రీపరమేశ్వరుడు, శ్రీకరనంది, విజయపండితుండు మొదలగువారు కలరు. వంగభాషలో రచితము లయిన మహాభారతములలో కాశీరామదాసు రచితమగు మహాభారతమున కున్నపేరు మహాబాంగ్లా భారతమునకుం గూడ లేదు. మాలాధరవసు, భాగవతాచార్య యని ప్రసిద్ధి గాంచిన రఘునాథ భట్టాచార్యుండు మొదలగుకవులు భాగవతము ననువదించినవారు కలరు. హరివంశము, వరాహపురాణము, కాశీఖండము మొదలగు నితరపురాణములు కూడ వంగభాషలోని కనువదింపంబడినవి.

'Before we pass on to the Literature of the other cults we should notice the versions that were made of the Ramayana and the Mahabharata. As in Tudor England, so in Bengali in Nadia Period the growing strength of the Vernacular Literature shared itself in two ways in original compositions and in translaations of the classics. Of the many Sanskrit works that engaged the attention of the translators, the most important were, of course, the Ramayana and the Mahabharata and, after them, the Bhagavatam There were so many translations of the Ramayana and the Mahabharata that even if none of the other Puranas had been translated we should still have been justified in calling this period of Puranic renaissance.'

*- Bengali Literature, Pp. 74-75*

## కవీర లడాయి యుద్ధ్యము

### (18వ శతాబ్ది చివరి భాగము – 19వ శతాబ్ది ప్రారంభము)

పదునెనిమిద శతాబ్ది చివరి భాగములోను, పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభము నను గొందఱు కవులువంగభాషలో కవిగేయములు వ్రాసిరి. ఈ తరగతి కవులకు 'కవివాలాలు' అని పేరు. వీరిలో నిరుపక్షముల వారికిని కలహములు కూడ సాగుచుండెడివి. వానికి 'కవీర లడాయిలు' అని పేరు. కవులు రెండుపక్షములుగా నేర్పడి తఱచు ఆశువుగా గేయములను పాడుదురు, పాడుచున్నప్పుడు 'కాంశి' అను నొక కంచువాద్యమును గూడ వాయింతురు. ఒక పక్షము కవి మఱొక పక్షము వారిని పాటలతో సవాలు చేయును. ఎదిరిపక్షమునకుఁ జెందిన కవి యా సవాలునకు గేయరూపముతోనే సమాధానము చెప్పును. అట్లు జవాబు చెప్పలేని పక్షము లడాయిలో నోడిపోయినట్లు పరిగణింపబడును. ఇట్టి కవివాలాలలో నిధుబాబు, శ్రీధరపథకుఁడు, రామవసూ దాశరథిరాయి, భరానీపణిక మొదలయినవారు ప్రసిద్ధులు.

'The Kavivalas got the name of Darakavi from their customary practice of extemporizing their songs while standing in front of their audience. They were organised in bands often in rivalry with one another and the attacks and the counter — attacks of the leaders of the bands produced many sallies of quick firing, impromptu wit and of course much scurrility. As wit-combats the Kaviwala songs have a certain resemblance to the Scots flying.'- Bengali Literature, p. 87

వంగభాషలోని యీ కవీరలడాయి యుద్యమము మన యాంధ్రభాషలోని యష్టావధాన, శతావధాన ప్రదర్శనములను, అశుకవితాప్రదర్శనములను బోలుచున్నవి. వీని మూలమున సామాన్య ప్రజలలో సాహిత్యాభిరుచి పెంపొందు నవకాశము కలదు.

## గద్యసాహిత్యోద్యమము
### (19వ శతాబ్దము, 20వ శతాబ్ది ప్రారంభము)

వంగభాషలోని గద్యసాహిత్యోద్యమచరితమును రామమోహనరాయల యుగము (1801-1843), తత్త్వబోధినీయుగము (1843-1872), బంకించంద్రయుగము (1872-1892), రవీంద్రనాథయుగము (1892-...), అని నాలుగుయుగములుగా విభజింప వచ్చును. వంగభాషలో పందొమ్మిదవశతాబ్దికిఁ బూర్వము చెప్పుకొనఁ దగిన గద్య మచ్చున్నకైనను గనబడదు. రాజా రామమోహనరాయలు బెంగాలీ గద్యసాహిత్యప్రథమ ప్రవర్తకుఁడు. కలకత్తానగరమున బ్రిటిషు ఉద్యోగులకు దేశభాషలలో శిక్షణ నొసఁగుటకై స్థాపింపఁబడిన ఫోర్టు విలియం కళాశాల (క్రీ.శ. 1800) యందలి యుపాధ్యాయులు బెంగాలీభాషలో పాఠ్యగ్రంథములు లేనికొఱంతను దీర్చుటకై కొన్ని గ్రంథములు రచించిరి. వానిని కళాశాలవారు ప్రకటించిరి. వారా గద్యగ్రంథములను బ్రకటించుటకు రామమోహనరాయల ప్రోత్సాహమే కారణము.

'The most important part of the language training was the colloquial and the conversational and for that it was necessary to have text books in prose. But as no prose books were available in Bengali, the teachers of the college had to produce their own text-books, mainly by translation from Sanskrit and English. Thus it was that the foundation of Bengali Prose was laid in the Fort William College.' - Bengali Literature, p. 100.

రామమోహనరాయల చేయూతలో క్రీ.శ. 1818లో స్థాపిత మయిన 'స్కూలుబుక్కుసొసైటీ' కొన్ని గద్యగ్రంథములను బ్రకటించినది. ఆకాలములోని కొన్ని పత్రికలు కూడ గద్యవాఙ్మయవికాసమునకు మిక్కిలి తోడ్పడినవి.

వంగభాషలో గద్యవాఙ్మయవికాసమునకు తత్త్వబోధిని యనుమాసపత్రిక 1843లో స్థాపితము) చేసినసేవ యపార మయినది. ఇది యంతవఱకును సాఁగుచుండిన బెంగాలీగద్యను నూతనమార్గము పట్టించినది. ఈపత్రికవ్యాస కర్తలతో నొకఁడగు ఈశ్వర చంద్రవిద్యాసాగరుఁడు (1820-1891) ఆధునిక గద్యసాహిత్యజనకుఁ డని పేర్వడెను. లలిత మయిన, మధుర మయిన గద్యశైలిని వంగభాషలోఁ బ్రవేశపెట్టినకీర్తి యితనికే దక్కవలసి యున్నది. ఇతఁడు సంస్కృత కాలేజీ అధ్యక్షుఁడుగా నుండి కొంతమంది రచయితల నొక గోష్ఠిగా నేర్పఱిచెను. ఈగోష్ఠికి సంస్కృతకాలేజిగోష్ఠి అనిపేరు. ఈగోష్ఠికిఁ జెందినసభ్యులు విద్యాసాగరు ననుసరించి గద్యరచనలు సాగించిరి. వారిలో తారాశంకర రత్న, రామగతిన్యాయరత్న, నీలమణిబసాక ముఖ్యులు. సంస్కృతకాలేజీగోష్ఠి వలెనే కొంతమంది రచయితలు 'హిందూకాలేజి గోష్ఠి'గా నేర్పడిరి. ఈగోష్ఠి కూడ బెంగాలీ గద్యసాహిత్యములోఁ బ్రముఖపాత్ర వహించిన దనియే చెప్పఁదగును. సంస్కృతకాలేజి గోష్ఠి బెంగాలీ సాహిత్యములో సంస్కారమునుబ్రవేశపెట్టఁగా హిందూకాలేజిగోష్ఠి విప్లవమును ప్రవేశపెట్టినది. ఈగోష్ఠి రచయితలలో మహర్షి దేవేంద్రనాథ రాకూరు, రాజ నారాయణవసు, ద్విజేంద్రనాథ రాకూరు మొదలగువారు ముఖ్యులు.

వంగదేశపు గద్యసాహిత్యములో నవయుగమును బ్రతిష్ఠించిన మహనీయుఁడు బంకిమచంద్రచట్టోపాధ్యాయ. నవలారచనఁ బ్రారంభించి యాతఁడు గద్యరచనలోఁ జూపిన కలాకౌశల మద్వితీయమయినది.

గతానుగతికవముగా సంస్కృతశబ్దాడంబరవమునకును, అలంకార బాహుళ్యమునకును బానిసగా నుండిన వంగభాషాదేవి కితఁడు స్వతంత్రమూర్తిని తీర్చిదిద్దెను. బంకిమచంద్రుని వంటి యసాధారణప్రతిభావంతుఁడు జన్మించి యుండక పోయినచో బెంగాలీగద్యసాహిత్య మింత త్వరలో నింత యౌన్నత్యమును బొంది యుండెడిది కాదు. ఆయుగమునందలి చిన్న పెద్దరచయిత లందఱిమీఁదను నాతని ప్రభావ మంతో యింతో పడినది. రమేశచంద్ర దత్తు, సంజీవచంద్ర చట్టోపాధ్యాయ, స్వర్ణకుమారీదేవి, అక్షయచంద్రసర్కారు మొదలగు వారు స్పష్టముగా నాయన ననుసరించి గద్యరచనలు చేసిరి. అతని యనంతరము కూడ హరప్రసాదశాస్త్రి మొదలగువా రతని ననుకరించినవారు లేకపోలేదు.

రవీంద్రుని యుదయముతో వంగభాషలోని గద్యసాహిత్యములో స్వర్ణయుగ మారంభమయ్యెను. బంకిమచంద్రునివలె నితఁడు మొదట సాధుభాషలో రచన యారంభించి యనతికాలములోనే యది సరికాదని గుర్తించి చలితభాషలో రచన సాగించెను. వాడుక భాషలో గద్యనౌకకళగా నతఁడు నిరూపించెను. గద్యరచనా శిల్పములో రవీంద్రుఁడు కల్పించిన పరివర్తన యపూర్వ మయినది, అద్భుతమయినది. అతని కవితవలెనే యతని గద్య లలితము, రసవంతము. బంకిమచంద్ర చట్టోపాధ్యాయ తన నవలలు మొదలయిన దానిలో నేర్పరచిన గద్యమార్గములు రవీంద్రనాథ ఠాకూరు ఆగమనముతో సన్నగిల్లి ప్రాతవడి పోయినది. రవీంద్రయుగములోని గద్యరచయిత లంతఱును రవీంద్రమార్గమునే యనుసరించిరి. వారిలో శరత్‌బాబు ప్రముఖుఁడు.

'The Prose that there was before Vidya Sagar either had no music at all, or had a bastard, Pseudo-Poetic Music. Now a new harmony, 'the other harmony of Prose' was born in our language As is to be expected, Vidya Sagar was the main influence on the other Prose writers of the Second half of the century. Some of them were his colleagues and students at the Sanskrit college and were directly inspired by him. They modelled their style on his and like him devoted their classical scholarship to the pursuit of the vernacular Tongue. - Bengali Literature, p. 126.

## ఆధునికకవితోద్యమము (19వ శతాబ్దము)

పాశ్చాత్యభాషాప్రభావముచే బెంగాలీ గద్యలో నాధునికత మిక్కిలి త్వరితగతిని స్థానమును సముపార్జించుకొనినది. కాని, బెంగాలీకవిత్వమున మాత్రము పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్థమునఁ గాని యాధునికత్వము పొడసూపలేదు. పదునెనిమిదవశతాబ్దములో 'విద్యాసుందర' కావ్యమును రచించి మిక్కిలి ప్రసిద్ధి వహించిన 'భారతచంద్రు' ని పేరింకను చెల్లుబడి యగుచునే యుండెను. కవివాలాలు లడాయి సాగించుచునే యుండిరి. కాని, యాకాలమున నాంగ్లకళాశాలలలో విద్య నభ్యసించిన యువకులు క్రమక్రమముగా బెంగాలీభాషలో నవ్యకవిత్వమును దీసికొనివచ్చిరి. బైరను, షెల్లీ, కీట్సు, వర్డ్సువర్తు మొదలయిన యాంగ్లకవీశ్వరుల కావ్యములు వీరిని గ్రొత్త పుంతలు త్రొక్కునట్లుచేసినవి. ఆకాలములో ప్రాచీన పద్ధతిలోఁ గవిత్వము చెప్పి ప్రాచీనకవులకోవకుఁ జెందిన

చివరికవి ఈశ్వరచంద్రగుప్తుఁడు. ఇతడు 1812–1859 నడిమికాలమున జీవించిన వాఁడు. ఇతని ప్రసిద్ధి మాత్రము పందొమ్మిదవశతాబ్ది చివరిదాఁక నుండుచునే యుండినది. 1824–1873 నడిమికాలమున జీవించిన మైకేలు మధుసూదనదత్తు బెంగాలీకవిత్వములో యుగపరివర్తనము కలిగించిన మహనీయుఁడు. అతనికిఁ బూర్వము బెంగాలీ కావ్యధార యొదుగుపొదుగులు లేక గొట్టితోఁకపలెఁ బెరుగక తఱుగక పాగిపోవుచుండినది. కవులు నలఁగినదారినే నడచి పోవుచుండిరి. కవితలోఁ గ్రొత్తదనము లేదు. వూర్పు లేదు. అనుప్రాసబాహుళ్యము గొప్ప కావ్యగుణముగాఁ బరిగణింపఁ బడఁ జొచ్చినది. అట్టి సారస్వతపరిస్థితులలో మధుసూదనదత్తు లవతరించి వంగసాహిత్యమునకు గొప్ప యభ్యుదయమును జేకూర్చినాఁడు. మధుసూదనదత్తు ప్రతిభలో నాకాలపు బెంగాలీకాలిబాట నవీనయాత్రకు యోగ్య మయినవహారథపథముగా రూపొందినది. నిర్భీకభావముతో నితఁడు బెంగాలీభాషకు నాధునికదీక్షనొసఁగెను. ప్రాచీన 'పాయల్' వృత్త సమవిభక్త వేలాబంధమును తెగఁగొట్టి దానిమీఁద నాతఁడు నూతనముగా 'అమిత్రాక్షర' (Free verse) ప్రసంతిని బ్రసరింపఁ జేసెను. ఇతఁడు మేఘనాధవధ, వ్రజాంగన, కృష్ణకుమారి, వీరాంగన యను కావ్యములను, బెక్కునాటకములను రచించెను. దానిలో 'మేఘనాథవధ' కావ్యము మిక్కిలి ప్రసిద్ధి చెందినది. ఇతఁడు బెంగాలీ కవితలో అమిత్రాక్షర ఛందస్సును ప్రవేశపెట్టెను. ఈమధుసూదనదత్తు ననుసరించి దీనానాధ ధర, మహేశచంద్రశర్మ, బోలా నాథచక్రవర్తి మొదలగు పెక్కురు కవీశ్వరులు బెంగాలీభాషలో నాధునికకవిత్వమును సృష్టించిరి.

మధుసూదనదత్తు అనంతరము బెంగాలీకవులలో రెండు మార్గము లేర్పడినవి. మొదటిది గతానుగతికముగా వచ్చుచుండిన క్లాసిక్ మార్గము. రెండవది నవీనమైన రొమాంటిక్ మార్గము. మొదటిమార్గము ననుసరించి కవులలో హేమచంద్రవంద్యోపాధ్యాయ, నవీనచంద్ర సేను మొదలగువారు కలరు. రెండవ తెగకుఁ జెందిన కవులలోఁ గ్రొత్తకంఠమును వినిపించిన వాఁడు బిహారీలాలు చక్రవర్తి. ఇతఁడు ఆధునిక గీతికావ్యజనకుఁడు. ఆధునికసాహిత్యములో నితఁడు 'కవిగురువు' అని అనిపించుకొనెను. బిహారీలాలుతోబాటు క్రొత్త రకము కావ్యములు వ్రాసినవారిలో సురేంద్రనాథమజుందారు, ద్విజేంద్రనాధ఼ ఠాకూరు, దేవేంద్రనాధ సేను మొదలగువారు కలరు.

రవీంద్రనాథుడు బెంగాలీసాహిత్యాకాశములో మధ్యందినమార్తాండునివలె వెలిగి పోయినాడు. బెంగాలీభాషలో నంతటిమహాకవి యేనాడును బుట్టలేదు. అతని 'గీతాంజలి' మిక్కిలి ప్రసిద్ధి గాంచినది.

## అత్యాధునిక కవిత్వోద్యమము (20వ శతాబ్ది ప్రారంభము)

రవీంద్రయుగములోనే బెంగాలీకవితలో నత్యాధునికయుగ మారంభమయినది. ఎజ్రాపౌండు, ఇలియట్ల ప్రభావము నవకవులమీఁదఁ బడినది. రష్యాసాహిత్యచ్ఛాయతో నభ్యుదయకవిత్వము తల యెత్తినది. క్రమముగా బెంగాలీ సాహిత్యములో నత్యాధునిక ప్రక్రియ లారంభ మయినవి. రవీంద్రనాథుని యనుయాయు లొకతెగగాను, నగ్రగాములయిన యత్యాధునికు లొకతెగగాను నేర్పడుచు వచ్చిరి. డాక్టరు నరేంద్రచంద్ర మోహితలాలు మజుందారు నవీనులకు నాయకత్వము వహించిరి. నజరుల్ ఇస్లాము అనుకవి నాయకత్వములో కొందఱు మహమ్మదీయయువకులు Kematists అని యొకసంఘముగా నేర్పడిరి. అభ్యుదయ సాహిత్యమునకు రవీంద్రునియనుయాయు లడ్డంకి యని యత్యాధునిక వాదులు సాకులు లేవదీయఁగాఁ, బ్రతిపక్షులు అత్యాధునికసాహిత్యమును 'మేకలసాహిత్యము' అని యాక్షేపించిరి. వాద్రిసాహిత్య మంతయు అశ్లీలమని నోటికి వచ్చినట్లు దుమ్మెత్తి పోసిరి. ఈయత్యాధునిక యుగములో వివిధశాఖలలోఁ బ్రసిద్ధులయిన కవులు పెక్కురు కలరు. వీరిలో క్షేమేంద్రనాథమిత్ర –

> 'అమీ కవి జతో కమారేర
> అక్ కాలసారిర ఆద్ భుతో రేర
> ములె మిజూరేర
> అమి కవి జతొ ఇతరేర'

నేను కమ్మరులకవిని. చమారుల, వడ్రంగుల కవిని. కూలీలందరి కవిని – అని చాటుకొనిన యభ్యుదయకవి. అశుచట్టోపాధ్యాయ యనునవకవి యౌవనధర్మికవితను వెలయించినాడు. అందులో అతఁడు – 'యౌవనధర్మిని నేను. ఈ యిరువదియేళ్లప్రాయపు తరుణ తాపసిని. నిజమయిన జీవన మున్నచోనేదియో యాజీవితము, ననుభవింప వలయునని ప్రయత్నించెదను. 'రొటిన్' దాసుఁడను కాను నేను. బంధనములబాటలోనే నెన్నఁడును నడవను. ఘ్రాంధాతెల

కాలమునాఁటి ప్రాంతరాతిగోడలతోఁ దల పగలిచచ్చినను సరే పంధాకు మాత్రము తల యొగ్గను' – అని నిర్భీకముగాఁ దన స్వేచ్ఛాప్రియత్వమును జాటుకొనెను.

అత్యాధునికులగు నీయభ్యుదయకవులకు పూచికపుల్ల నుండి స్పుత్నిక్కు దాఁక నేదియుఁ గవిత్వమున కనర్హము కాదు. ఈప్రపంచములోని సమస్తమును వారికిఁ గవితావస్తువే. ఈయుద్యమమునకుఁ జెందినకవులలో మహీ ఉద్దీన, మణీంద్రరాయ్, ఆలోకరంజనదాసగుప్త, అరుణకుమారమిత్ర మొదలగువారు పెక్కురు కలరు.

## చలితభాషోద్యమము

### (19వ శతాబ్ది యుత్తరభాగము, 20వ శతాబ్ది ప్రారంభము)

ఇది భాషకు సంబంధించిన యుద్యమము. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దము నుండి పదునైదవశతాబ్దముదాఁకఁ గల కాలము వంగసాహిత్యమున గౌడ **యుగ** మనుపేర వ్యవహరింపఁ బడుచున్నది. ఈయుగమునందలి పూర్వార్ధమున రచితము లయిన గ్రంథములలోఁ బ్రాకృతభాషాప్రభావ మెక్కువగాఁ గానవచ్చును. ద్వితీయార్థమున ననఁగా పదునాలుగు, పదునైదు శతాబ్దులలో సంస్కృతమునుండి గ్రహింపబడిన తత్సమపదజాలముతో నొక కావ్యభాష రూపొందినది. దానికి **వంగసాహిత్యమున 'సాధుభాష'** యని పేరు. తరువాత నది యాయుగములో – పదునాఱవశతాబ్దమునుండి పదునెనిమిదవ శతాబ్దమువఱకుఁ గల కాలమున – వెలసిన కావ్యములలో సాధుభాషయే ప్రచలితమయినది. ఆ పిదప వెలసిన **కలకత్తాయుగములో** – పందొమ్మిదవశతాబ్ది యుత్తరభాగమున సాధుభాష కృతకముగా భావింపఁబడినది. దానిస్థానమున ప్రజావ్యవహారమున నున్న **చలితభాష** గ్రంథములలో ముఖ్యముగా గద్యరచనములలో వాడుటకుఁ బ్రారంభించిరి.

'The classicised Sadhu Bhasha is perceived in the Second half **of the century** to be artificial and unsuitable; and is replaced by **Chalita** Bhasha or common language, mainly based on the **colloquial** speech of Calcutta.' - *Bengali Literature, p. 12.*

బంకిమచంద్రుఁడు తనసవలలను సంప్రదాయసిద్ధ మగుసాధుభాషలోనే రచించినాఁడు. తరువాత వివేకానందస్వామి యుజ్జ్వల మయిన సాధుభాషలోను, చలిత భాషలోను రెండింటియందును గ్రంథరచన చేసె తరువాతి రచయితలకుఁ జలితభాషాప్రయోగమున మార్గదర్శకుఁ డయ్యెను. రవీంద్రనాథుఁడు

చలితభాషలో గ్రంధరచనము చేయుటకుఁ బ్రారంభింపక ముందే వివేకానందస్వామి వాడుకభాషలో రచనలు చేయుఁడని తన యనుయాయుల కుపదేశించెను. రవీంద్రుఁడు మొదట బంకించంద్రునివలె సాధుభాషలోనే గ్రంధరచనమును ప్రారంభించి, యనతికాలములో నది సరియయిన పద్ధతి కాదని గుర్తించి యప్పటి నుంచి చలితభాషలోనే రచనలు చేయ సాగించెను. ప్రమధ చౌధురి (1868–1948) యనురచయిత చలితభాషను సమర్థించుచు వ్రాసిన యీ వాక్యములు సాధుభాషావాదుల నోళ్లను మూయించినది.

'భాష మనుష్యుని నోటిద్వారా కలమునోటికి వచ్చును. కలమునోటిద్వారా మనుష్యుని నోటికి రాదు – ఈ పనిని తలక్రిందులుగాఁ జేయఁ దలఁచినచో నాతనినోట సిరామాత్రమే పడును.' –

బెంగాలీసాహిత్య చరిత్రమునందలి యీవాక్యము లిట ననుసంధించుకొనఁ దగియున్నది.

'The History of Prose style in the Nineteenth century is that of the replacement of Sadhu Bhasha (Literary language) by chalita Bhasha (colloquial language) and the influence of English was uppermost in bringing about that change. The transition from the old to the New Prose is noticeable in Bhavani charan Vandyopadhyay. ... ... He is not sure of prose as his medium and mixes it freely with verse; nor is he able properly to blend the Sadhu Bhasha and the Chalita Bhasha. None the less he is of considerable historical importance. As a pioneer of colloquial style and social satire he is the direct ancestor of Tek-chand Takur and Kali Prasanna Simha .... The writers before Easwara Chandra Vidya Sagar had observed an arbitrary divorce between Chalita Bhasha (collequial language) and Sadhu Bhasha (Literary language) and their style had flattered between the coarseness of the first and the pedantic obscurity of the second. But Vidyasagar reformed them both and created a style which combined the naturalness of the one with the strength of the other ... At the time of its publication (Alsler Charer Dulal), as in the beginning of the century, prose was still under the domination of the Sadhu Bhasha (Literary Language). But Tek-chand was a stout champion of the Chalita Bhasha (colloquial language) and wrote in

a predominantly colloquial style This was a daring thing to do and Tek-chand was taken to task by the purohits and traditionalists. But he influenced some of the younger writers notably Bankim Chandra Chattopadhyay and at last the Chalita Bhasha secured its rightful place in poetic literature.

*- Bengali literature, 128, 129*

## ఆకలితరముకవుల (HUNGRY GENERATION) కవిత్వోద్యమము
## (క్రీ.శ. 1958 సం. ప్రాంతము)

వంగదేశవిభజనము జరిగినతరువాత నీయిరువదిసంవత్సరములకాలము కూడఁ బశ్చిమబంగాళ మెల్లప్పుడును కల్లోలితమయి యే యుండిన దన్నచో నతిశయోక్తి కాఁ జాలదు. రాష్ట్రమునకు రాజధాని యయిన కలకత్తానగరమున నీయశాంతిపరిస్థితులెల్లప్పుడును దాండవించుచుండెడివి. చీమలబారులవలె నిరంతరము సాగిపోవుచుండు ప్రజలు – రహదారులలో ట్రాములు, బస్సులు, కార్లు వీనిరొద – అలజడి, కలకత్తాలో నమ్మలేని దినముండదని ప్రసిద్ధి. తల దాచుకొనుచోటు లేక పెక్కుమంది యెల్లప్పుడును రాజవీధులలోనే తిరుగాడుచుఁ గనఁబడుచుండురు. వీరు చాలనట్లు ఇండ్లు వాకిండ్లు వదలి పెట్టి పొట్ట చేతల బట్టుకొని వచ్చిన కాందిశీకులు, లక్షలసంఖ్యలో నున్న నిరుద్యోగులు, రాజకీయనాయకుల స్వార్థపరత్వము, ప్రజలకు వారు చేయు శుష్క వాగ్దానము, సత్యము, ధర్మము, న్యాయము ననుష్ఠింపుఁ డని ప్రబోధించు నీతి వేత్తలు. ప్రజోద్బోధముకొఱకుఁ గాక ద్రవ్యసంపాదనమునకై వ్రాయు వ్యాపారమనస్తత్వము గల రచయితలు – కలకత్తానగరమునందలి యీ పరిస్థితులు కొందఱు యువకులపైఁ దీవ్రముగా బని చేసినవి. సంఘములోని యరాజక, అసాంఘిక విషయముల వలన నేర్పడుచున్న ఘాతుక మయిన పరిస్థితులపట్ల – అట్టి చర్యలపట్ల వారు కోపావేశములో నెదురు తిరిగిరి.

అదే సమయమున అమెరికాదేశములోని 'బీట్ జెనరేషన్' (Beat Generation)కు ఆరాధ్యదైవ మయిన ఎలెన్ గిన్స్‌బర్గు భారతదేశమునకు వచ్చుట తటస్థించినది. అతఁడు భారతదేశమునఁ బర్యటించుచుఁ గలకత్తా నగరమున నీయువకులను గలసికొనుట సంభవించినది. అతఁడు అమెరికాలోని 'బీట్ జెనరేషన్' యొక్క జీవితవిధానమును, వారియాదర్శములను దెలిపి వీరి కుత్తేజనము

కలిగించెను. దానితో వంగదేశములోని యువకవులు ఒకానొక యౌన్నత్యముకొఱకై యన్వేషణముఁ బ్రారంభించిరి.

మలయరాయ్ చౌధురి, సుబిమల్ బసాల్, సమీర్‌రాయ్ చౌధురి, ఉత్పల్ కుమార్ బసూ, దేవి రాయ్, ప్రదీప్ చౌధురి, రామానంద చట్టోపాధ్యాయ, వాసుదేవ దాస్, సుభాష్ ఘోష్ మొదలగువా రీయాకలితరమునకుఁ జెందిన యువకవులు. వీరందఱి వయస్సు ఇరువదినాలుగు, ఇరువది యెనిమిది నడుమ నుండును. వీరిలో మలయరాయ్ చౌధురి రచించిన 'బైద్యుతిక్ ఛుతర్' అనుకావ్యమునందు కామము (Sex) బాహాటముగా వర్ణింపఁబడినది. దానిని బహిష్కరింప వలయు నని న్యాయస్థానమున నొకయభియోగము కూడ నడచినది. న్యాయాధిపతి యట్టియశ్లీలగ్రంథమును రచించినందుకు రచయిత కపరాధమును గూడ విధించెను.

1958వ సంవత్సరమునుండి యీ యాకలితరమునకుఁ జెందిన యువకవులు, రచయితలు సమకాలీనజీవనమునకు సంబంధించిన యన్నివిషయములమీదను నెదురు తిరిగిరి. కేవలము పైపై మెఱుఁగులుగాఁ దయారయిన నీతి, శీలము, సాహిత్యము, రాజకీయము అను వానికిఁ బ్రతిగా అవినీతిని, అశ్లీలమును, సాహిత్యనిర్భీకత్వమును, అరాజకవాదమును సమర్థించుచుఁ బెక్కురచనలు చేసిరి. అశ్లీలమును సమర్థించుచు మలయరాయ్ చౌధురి పెక్కు ఉపన్యాసములను గూడ నిచ్చెను.

1964వ సంవత్సరమున నీ తరుణయువకులు సుమారు రెండువేలకుఁ బైఁగా నట్టముసుఁగులను (Masks) దయారుచేసిదానిపై జంతువుల ముఖములను దింపి దేశములోని నలుమూలల నున్న కళాకారులకు, రచయితలకు, కవులకు, మేధావులకు, రాజకీయ నాయకులకు, విద్యావేత్తలకుఁ బంపిరఁట. వా రందఱును తమతమ ముసుఁగులను దొలఁగించుకొని యథార్థమానవులుగా స్వీయవ్యక్తిత్వములతో సంఘమునందు మెలఁగ వలసినదిగా నభ్యర్థించుచు నాముసుఁగుల మూలమున సూచించిరి. ఈలోకమున 'లైంగిక ప్రవృత్తి' (sex) యొక్కటే హద్దులు లేని దనియు, సంకుచితము కాని దనియు, నందువలన 'సెక్సు' మానవీయమయిన దనియు వీరి వాదము. అందుచేతనే వీరినిగూర్చి 'అశ్లీలాంతర్ముఖులు' (Filthy Introverts) అని విమర్శకులు పేర్కొనుట సంభవించినది. వీరు ప్రకటించిన 'మేనిఫెస్టో' చాలఁ జిత్రముగా నుండును. కాని

యీతరమునకుం జెందిన కవులు, రచయితలు చేసిన సృజనాత్మక వ్యవసాయము తక్కువ. వాదోపవాదములు, చర్చలు, కార్యకలాపములు నధికమని పేర్కొనం దగును. తమకు వుందుతరమునకుం జెందిన రచయితలతోను, పత్రికాసంపాదకులతోను, సంఘములోని మిధ్యాదంభములతోను (False Prestige) బోరాడుటతోనే వీరికాల మంతయు వ్యయమై పోయినది. అయినను నీకవులయొక్క చిత్తశుద్ధిని, నిజాయితీని, తపనను మాత్రము శంకింప నవసరము లేదు. [3]

## ౩. పంజాబీ సాహిత్యము

బెంగాలీసాహిత్యములోని యుద్యమములయొక్క స్వరూపస్వభావములను గూర్చి తెలిసికొన్నపిదప పంజాబీసాహిత్యములోని ప్రముఖ సాహిత్యోద్యమములను గూర్చి యించుక పరిశీలింతము. రహస్యవాదకవిత్వోద్యమము, భక్తికవిత్వోద్యమము దేశభక్తికవిత్వోద్యమము, అభ్యుదయకవిత్వోద్యమము, శుద్ధపంజాబీ ఉద్యమము అనునవి పంజాబీసాహిత్యములో నెన్నందగిన యుద్యమములు.

### రహస్యవాదకవిత్వోద్యమము (12, 13 శతాబ్దములు)

బాబాఫరీద్‌షక్కర్‌గంజ్ (11-3-1255) అనునతఁడు పంజాబీసాహిత్య జన్మదాత యని పంజాబీసాహిత్యపరిశోధకుల యభిప్రాయము.[౧] కాని యిటీవలి పరిశోధనవలన ఫరీదుకంటె రెండుశతాబ్దములకు వుందునుండియే పంజాబీసాహిత్య వుండినదను వాదము బలపడుచున్నది. బాబాఫరీద్ ఆంధ్రసాహిత్యములో నన్నయభట్టారకునివంటి వాఁడు. అతఁడు అరబ్ దేశమునకుం బోయి యచ్చట ఫకీరులను, సూఫీలను గలసికొని వచ్చి ఢిల్లీ నగరములోఁ గొంతకాలము వసించెను. ఆనగరమునందు ఒకప్రసిద్ధి పఠాన్ జాతీయుఁడు 'కుతుబుద్దీన్ భక్తియార్ కాకి' యనువాఁడు రహస్యవాది యై యుండఁగా నితఁడతనికి శిష్యుఁడై 'పాక్‌పటన్' అనుచోట నొక పీఠమును నెలకొల్పి

---

[3] ఆకలితతరమునకుం జెందినకవుల కవిత్వోద్యమమునుగూర్చిన యీ విషయములకు శ్రీ నిఖిలేశ్వర్ రచించిన 'ప్రపంచసాహిత్యంలో యువతరం తిరుగుబాటు' అను వ్యాస మాధారము. భారతి, *1967 జనవరి.*

[౧] చూ. ఉత్తరభారతసాహిత్యములు : పుట - *239*

యచ్చటనుండి తన రహస్యవాదమును బ్రచారము గావింప మొదలిడెను. అతని ప్రచారమార్గము 'మధురత' యనుగుణము నాశ్రయించి యుండుటచే నతనికి 'షక్కర్‌గంజ్' అనుపేరేర్పడెను. అతఁడు మొట్టమొదటిసారిగా పంజాబీభాషలో గూఢభావములతోఁ గూడిన కవితలను వెలయించెను. మఱియు నాకాలమున ఁఉర్దూకవులు పార్సీ, అరబ్బీభాషలచేఁ బ్రభావితులై తమభావములను వ్యక్తము చేయుట కాభాషలయందలి ఛందస్సులను గ్రహించుట మాత్రమే కాక తమరచనల నన్నింటిని విదేశీయశబ్దజాలముతోను, పలుకుబడులతోను నింపివేయు చుండిరి. అట్టి స్థితిలో బాబాఫరీద్ తన జ్ఞాన ప్రౌఢబుద్ధితో నాలోచించి పంజాబీ ప్రకృతికి పార్సీ, అరబ్బీ ఛందస్సు లనుకూలింపదని గ్రహించెను. ప్రాచీన భారతీయ ఛందస్సుల నతఁ డధ్యయనము చేసి 'దోహా' మొదలయినదేశీయచ్ఛందములను స్వీకరించెను. అంతేకాక వైదేశిక శబ్దజాలమునకు బదులు పంజాబీజీవనమున సర్వసాధారణములు సుపరిచితములు నగు పదములను, ఉపమారూపకములను విశేషముగా గ్రహించెను. ఫరీద్ గీచిన యీరేఖాచిత్రము తరువాతి కవులకు మార్గదర్శక మయ్యెను. అతని యీ ప్రయత్నము వలన పంజాబీకవిత్వ మొకయపరిచితవస్తువుగాఁ గాక సరళము. స్వాభావికము, సజీవము నయినవస్తువుగా మాఱిపోయెను. దీనిప్రభావముచేతనే శాహ్‌హుసేన్ బుల్‌హేషా యనుకవీశ్వరులు 'గజల్' బదులు కాఫీ ఛందస్సును, సుల్తాన్‌బాహు మొదలయినవారు 'రుబాఈ' కి బదులు 'దోహా'ను వాడిరి. ఇట్లు దేశీయచ్ఛందములను, దేశి పదజాలమును గ్రహించి కవిత్వము చెప్పుటలో నితఁడాంధ్రసాహిత్యములోని పాలకుఱికి సోమనాథునితోఁ బోల్పఁ దగి యున్నాఁడు.

## భక్తి కవితోద్యమము (16–17 శతాబ్దములు)

పదునాఱవ శతాబ్ది పూర్వార్ధమునందు పంజాబులోఁ బరిస్థితులు మిక్కిలి తీవ్రముగా నుండెను. ఎవని ధన ప్రాణములు కూడ సురక్షితములు గాకుండెను. హిందువుల యవస్థ మిక్కిలి దయనీయముగ నుండెను. వారిని బలవంతముగా మహమ్మదీయ మతము స్వీకరించునట్లు చేయుచుండిరి. ఇట్టి రాజకీయ, సాంఘిక పరిస్థితులలో ప్రజలలోఁ బ్రతిక్రియా సంకల్పము పొడముట సహజము. తత్ఫలితముగ భారత దేశములో నొక యాధ్యాత్మిక సామాజికలహరి యుత్పన్నమై నాఁటి ప్రజలను బ్రభావితులను గావించెను. అదియే భక్తిలహరి యనుపేరఁ బరఁగెను. ఆ భక్తిలహరితోఁబాటు సూఫీలహరి కూడ వికసించెను. ఆ కాలమున

హిందూధర్మప్రవంతి దురాచారములు, అంధవిశ్వాసములు, పురోహితుల స్వార్థము, ప్రజల యౌదాసీన్యము మొదలయినవాని ప్రాబల్యము మూలమున నింకి పోవుచుండెను. ఇట్టి భారతభూమిలోనికి ఇస్లాము మతము ప్రవేశించి హైందవ ధర్మమునకుఁ గ్రొత్త యాపదను దెచ్చిపెట్టెను. అట్టి స్థితిలో దేశమునందలి మేధావులు, సహృదయులు దురాచారములతోను, నంధవిశ్వాసములతోను నవయుచున్న హిందూసమాజము నుద్ధరించుటకై యీ బంధములను ఛేదించి జాతికొక నవ చైతన్యమును గలిగింప వలసిన యావశ్యకమును గుర్తించిరి. అట్టి ప్రయత్నమున నున్న మన వారికి మన శాస్త్రగ్రంథములతో సమాజము నుద్ధరించుటకు జ్ఞాన, కర్మ, భక్తి మార్గములు గోచరించెను. ఆ మూఁడింటిలోఁ గూడ భక్తిమార్గమొకటే విజృంభించుచున్న ఇస్లాంమతము యొక్క ప్రభావమును బ్రతిఘటింపఁ జాలి యుండెను. హైందవ సంఘోద్ధారకు లీ భక్తిమార్గము ననుసరించిరి. గురునానక్, గురు అర్జున దేవ్, గురుగోవింద సింహ, భాయీ గురుదాస్ మొదలగు కవీశ్వరులు వెలయించిన గురు సాహిత్యమీ భక్తి భావముచే నుద్దీప్తమై సమాజోద్ధరణమును లక్షించినట్లు చెప్పవచ్చును. వీరిలో గురునానక్ దేవుఁడు తన కాలమునందుఁ బ్రచురము లై యుండిన యోగమార్గమును భక్తి మార్గమును, కర్మ మార్గమును, పశ్చిమమునుండి వచ్చిన ఇస్లాం సూఫీ మతములను తన యనుభవ భాండమున వేసి శతాబ్దములనుండి వానితోఁ గలసి యుండిన మైలను శోధించి సారభూతమగు సహజమార్గమును బ్రసాదించెను. ఆయనయు, నాపరంపరలోఁ దరువాతి గురువులును నాసత్యములను అనుపమచ్ఛందః ప్రబంధరూపమున, విచిత్రకావ్యరూపమున సామాన్య జనుల కందఁ జేసిరి.

## దేశభక్తి కవితోద్యమము (20వ శతాబ్ది ప్రారంభము)

పంజాబీసాహిత్యమున నాధునిక యుగము ఇరువదవ శతాబ్ది ప్రారంభమున మొదలిడినదని భావింప వచ్చును. ఆధునికగద్యరచనాపితామహుఁ డగుభాయీవీరసింహుడు తనమహాకావ్య మగు 'రాణా సూరత్‌సింహ'ను ప్రకటించిన 1905వ సంవత్సరమునందే పంజాబీసాహిత్యములో నాధునికయుగమునకు శిలాన్యాసము జరిగెను. ప్రథమప్రపంచ మహాసంగ్రామము తరువాత పంజాబులో అకాలీ యుద్యమము, బబ్బర్ ఉద్యమములే కాక యీయన్నింటి సమష్టిరూప మై తీవ్ర మయినజాతీయోద్యమము వర్ధిల్లెను. ఈ యుద్యమము వివిధ భాషాసాహిత్యములను వలెనే పంజాబీసాహిత్యమును గూడ

నొక్కి సారిగా సువిశాల మొనరించెను. ఆకాలమునందే జాతీయ వార్తా పత్రికలు కూడ వెలువడి పంజాబీగద్యమునకు నూతనశబ్దజాలము ప్రసాదించి జనులలో దేశభక్తి నుద్దీపింపం జేసెను. పంజాబీకవిత్వము కూడ నీక్రొత్తరంగులచే రంజిత మయ్యెను. దేశభక్తిపూరితము లగు కవితలను వెలయించిన నవ్యకవులలో '**జ్ఞానీహీరాసింహ్ దర్ద్**', జ్ఞానీ గురు ముఖసింహ ముసాఫిర్, మోహనసింహ యనువారు ప్రసిద్ధులు. వీరిలో మొదటి యిరువురి బందీ కావ్యములును, మోహనసింహుని యావేశపూర్ణ కవిత్వమును పంజాబురాష్ట్రములోని ప్రజలలో జాతీయభావము నుత్తేజపఱచి యాంగ్లవ్యతిరేక భావమును ప్రబలము గావించెను.

## అభ్యుదయ కవిత్వోద్యమము (క్రీ.శ. 1945 ప్రాంతము)

ద్వితీయ ప్రపంచమహాసంగ్రామము తరువాత కార్మికకర్షకోద్యమము విజృంభించి నవ్యకవులను, లేఖకులను నెందఱినో యాకర్షించెను. ఇదే సమయమున బశ్చిమమునుండి యభ్యుదయ భావమున నొకమహాచ్ఛాయ గూడదేశముపై నావరింపం దొడఁగెను. జాతీయోద్యమము పరంపరాగతముగా వచ్చుచుండిన సాహిత్య సంప్రదాయ శృంఖలములనుండి విడదీసి వారి దృక్పథమును జాతీయమార్గమును బట్టించి, దేశభక్తి నుద్దీపింపఁజేయఁగా – నీ యభ్యుదయకవిత్వోద్యమము వారి దృష్టి కోణమును మఱింత విస్తృతపఱచి యంతర్జాతీయ మార్గమును బట్టించెను. ఈనూతనోద్యమప్రభావమువలన పంజాబీసాహిత్యమున **వాస్తవికతావాదము** ప్రవేశించెను. తత్ఫలితముగాఁ బ్రాచీన మగు నాధ్యాత్మికవాదమును, నవీన మగు నాదర్శవాదమును నిస్తేజము లయ్యెను. భాయీవీరసింహుని రచనములు ఆదర్శవాదముద్ర ధరించి యుండును. అయినను నవి పాశ్చాత్యసాహిత్యప్రభావము వలన నాధునిక రీతిలోఁ బోఁత పోసినట్లు కానవచ్చును.

## శుద్ధ పంజాబీ యుద్యమము (క్రీ.శ. 1945 ప్రాంతము)

ఇటీవలి కాలములో పంజాబీసాహిత్యమున మరొకయుద్యమము బయలుదేరి పంజాబీసాహిత్యమునకు నూతనోత్తేజము నొసఁగెను. దీనికి '**శుద్ధపంజాబీ యుద్యమ**' మని పేరు. ఇది భాషకు సంబంధించిన యుద్యమము. దీని లక్ష్యము హైందవుల లోను, ముస్లిములలోను, శిక్కులలోను పంజాబీభాషను బ్రచారము చేయుట. అందఱికిని నాదరణీయమగు పంజాబీసాహిత్యమును

సృష్టించుట కూడ దీని మఱియొక లక్ష్యము. ఈయుద్యమమును అమృతసర్‌నగరమున – లాలా ధనీరాం ఛాత్రిక్, చరణ్‌సింహ హీరాసింహద్దత్, మౌలాబక్ష్ – అనువారు లేవఁదీసిరి. వీరు పంజాబీభాషను శిక్కులు కాని వారిలోఁ బ్రచారము చేయుటకై సారంగ్, పంజాబీదర్యాక్ అను రెండు మాసపత్రికలను ఉర్దూలిపిలోఁ బ్రకటించి నిర్వహించిరి. ఈయుద్యమముమూలమున హిందూ ముస్లిముల యైకమత్యము కొంతవఱకు సాధింపఁబడినది. మఱియు సర్వసమాదరణీయ మగు సరళ సాహిత్యము పంజాబీభాషలో నవతరించినది.

ఆధునిక కాలమునందు కావ్యసాహిత్యమును వెలయించిన కవులను మూఁడు తరములుగా విభజింప వచ్చును. భాయీవీరసింహుఁడు మొదలగువారు మొదటితరమునకుఁ జెందినకవులు. చరణసింహషహీద్, మోహనసింహ మొదలగువారు రెండవతరమునకుఁ జెందుదురు.

ఈతరములోని కొందఱు కవులను **ప్రయోగవాది కవులనియు**, వారు వెలయించిన కవితలను **ప్రయోగవాది కవిత్వ** మనియుఁ బిలుతురు. వారు భిన్న భిన్న రూపములలోఁ గవిత్వమును వెలయించిరి. ఈతరమునకుఁ జెందిన కవులలో నొక ప్రసిద్ధ సంఘము కనబడును. వారు ప్రజల కత్యంతము సన్నిహితులై రంగస్థలము మూలమున లక్షలాది పంజాబీ ప్రజలలో పంజాబీభాషను – ప్రాచీనఛందో బంధములను –కవితానియమములను బ్రచారము చేసిరి. వీరిలో ఉస్తాద్ హందస్, ఉస్తాద్ దామన్ మొదలగువారు ప్రసిద్ధులు.

ఆధునిక కవిత్వములో మూఁడవ తరము పంజాబు విభజన మయిన తరువాత నారంభ మయినది. ఈకవులను అగ్రగామికవులు, రూపవాది కవులు అని రెండు వర్గములుగా విడదీయ వచ్చును. మొదటి దగు అగ్రగామీ పద్ధతి ననుసరించువారిలో ముఖ్యుఁడు సంతోషసింహధీర్. రెండవవర్గము వారు విషయమునకంటె రచనకుఁ బ్రాధాన్యమిచ్చెదరు. ఈవర్గములో తఖ్తసింహ, హర్‌భజనసింహ, జ్ఞానసింహ మొదలగు వారు ప్రసిద్ధులు.

## 4. ఓఢ్ర సాహిత్యము

పంజాబీసాహిత్యములోని యుద్యమములను, వాని స్వరూపస్వభావ ములను నవి బయలుదేరుటకు హేతుభూతము లయినపరిస్థితులను బరిశీలించితిమి. ఇఁక ఓఢ్ర భాషకుఁ జెందినసాహిత్యోద్యమముల నిందుఁ బరిశీలింతము.

ఓఢ్రసాహిత్యములోఁ బ్రధానముగాఁ బేర్కొనఁదగిన సాహిత్యోద్యమములు – ౧. ప్రజాకవిత్వోద్యమము, ౨. వైష్ణవ సాహిత్యోద్యమము, ౩. కావ్యసాహిత్యోద్యమము, ౪. నవ్యకవిత్వోద్యమము, ౫. సత్యవాదిసంఘోద్యమము, ౬. సబూజసంఘము లేక నిత్యశ్యామల సంఘోద్యమము – అనునవి.

## ప్రజాకవిత్వోద్యమము (16, 17 శతాబ్దములు)

ఓఢ్రసాహిత్యమున దాసకవిత్రయముకాలమును పురాణయుగమని పేర్కొందురు. క్రీ.శ. **1550** మొదలు **1700** వఱకుఁ గలనడిమికాలము ఓఢ్రభాషలో దాసకవిత్రయము వెలసినకాలముగాఁ బరిగణింపఁబడుచున్నది. ఆంధ్రసాహిత్యములో కవిత్రయమున కెట్టి పూజ్యతాప్రసిద్ధులు కలవో ఓఢ్రసాహిత్యమున దాసకవిత్రయమున కట్టి పూజ్యతా ప్రసిద్ధులు కలవు. సరళాదాసు, బలరామదాసు, జగన్నాథదాసు అనువారి కాసాహిత్యమున **దాసకవిత్రయ** మని పేరు. వీరిలో సరళాదాసు భారతమును, బలరామదాసు రామాయణమును, జగన్నాథదాసు భాగవతమును రచించిరి. ఒరియాభాషలో సరళా దాసు రచించిన భారతమునకును, సంస్కృత భారతమునకును నేవిషయములోను నేమాత్రమును బోలిక లేదు. అది సామాన్యప్రజలకొఱకై ప్రజాభాషలో రచింపఁబడినది. కథలో మార్పు, వర్ణనములలో మార్పు – అంతయు నిత్యనూతనము. అతనికాలములోనే కొందఱు కవీశ్వరులు భారతమును యథాతథముగా ననువదించిరి. కాని, యది ప్రజాదరణమును బొందలేదు. ఇట్టికావ్యము సంస్కృతనిరపేక్షముగా, ప్రజాభాషలో సామాన్య ప్రజలకు నీతి, ధర్మము, హితము అనువానిని బోధించుటకై రచింపఁబడినది. సంస్కృత భాషలోఁ గల మంత్రతంత్రము లన్నియు సంస్కృతవిద్వాంసులకే కాని సామాన్యజనుల కందుబాటులో లేకుండెను. ఆమంత్రతంత్రాదుల రహస్యములను, నందలి సత్యములను బ్రజలు తెలిసికొనుట కనువైన సులభశైలిలో బలరామదాసు వాడుకభాషలోఁ బెక్కు గ్రంథములను వ్రాసెను. ఇతఁడు తనరామాయణమునఁ బ్రజల యాచారవ్యవహారములను సంపూర్ణముగాఁ బ్రతిబింబింపఁ జేసెను. మఱియు నితఁడు తనకుఁ గల రామభక్తికిని, ఉత్కళాభిమానమునకును జిహ్నముగా నుత్కళులు శ్రీరామచంద్రునితోఁబాటు దండకారణ్యమునకేఁగి రామచంద్రమూర్తిని సేవించి యాతనికి సాయపడినట్లు

తన రామాయణమునఁ జిత్రించెను. ఇతఁడు సంహితలు, గీతలు, పురాణములు మొదలగు పదునాఱు గ్రంథములను రచించెను. ఈతఁడు సృష్టించిన సాహిత్యము మూలమున మూలమూలల నున్న సామాన్యప్రజలు కూడ మతరహస్యములను తెలిసికొనుట కవకాశ మేర్పడెను. ఇతఁడు లక్ష్మీపురాణమను మరొక గ్రంథమును విరచించెను. అది హరిజనుల నుద్ధరించుటకై వ్రాయబడిన కల్పితకావ్యము. ఇట్లు బలరామదాసు సంస్కృతభాషలోని మంత్రతంత్ర రహస్యములను సామాన్యప్రజలకుఁ దెలుపునుద్దేశముతోఁ బ్రజల నిత్యవ్యవహారమున నున్న వాడుకభాషలోఁ బెక్కు రచనలు రచించి యాకాలమున వెలసిన ప్రజాకవిత్వమును బరిపుష్టము కావించెను.

ఒరియాభాషలో భాగవతమును రచించిన జగన్నాథదాసు ఒరియాసాహిత్య యుగ ప్రముఖుఁడు. ఆంధ్ర భాషలో తాళ్లపాక అన్నమాచార్యులు అను సంకీర్తనాచార్యుఁడు శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిని తన ఆధ్యాత్మ, శృంగారసంకీర్తనలను బ్రతిదినము గానము చేసినట్లుగా నీతఁడు పూరిలోని జగన్నాథస్వామివారి యాలయప్రాంతమునఁ గల వట వృక్షచ్ఛాయను గూర్చుండి తన భాగవతగేయములను గానము చేసెను. ఇతఁడు తనకుఁ బూర్వు లగులాక్షణికుల ఛందస్సు నాశ్రయింపక తొమ్మిదియక్షరములు గలయొకనూతన ఛందస్సును సృష్టించి భాగవతమును గానయోగ్యముఁ గావించెను. ఓఢ్రదేశమున గ్రామపురోహితులు సాయంకాలములం దూరూర నీ భాగవతగేయములను గానము చేయుచుండఁగా ప్రజలు భక్తిపూరితు లై వినుచు నానందించెడివారు. ఆకాలమునఁ బ్రజలు ప్రతిగ్రామములోను భాగవతమందిరములను, భాగవతవిహారములను నెలకొల్పిరి. అందు జగన్నాథ దాసు రచించిన, భాగవతమును వ్యాసపీఠముపై నుంచి పూజింపఁబడుచుండును. ఓఢ్రులకు దైవభక్తి, స్వభావానురక్తి, జాతీయతాసక్తి, ఆస్తిక్య భావానురక్తి యనుసుగుణములు జగన్నాథదాసుభాగవతము మూలముననే కలిగె ననుటలో నతిశయోక్తి లేదు. జగన్నాథదాసు సంస్కృతచ్ఛందము నాశ్రయింపక తనభాగవతమును దేశిచ్ఛందములో రచించి యుండుట గమనార్హము.

వీరిలో సరళాదాసు యొక్క పూర్వనామము 'సిద్ధేశ్వరిపిరిడియా'. అతఁడొక పేదరైతు. శూద్రుఁడు. అతఁడు సరళాదేవి యను గ్రామదేవతను నిరంతరభక్తితో సేవించుచుండెడివాఁడు. అతఁడేగురువునొద్దను జదువుకొనినవాఁడు కాఁడు. తీరిక

గలిగినప్పుడెల్లఁ బండితుల సన్నిధిఁ జేరి వారు చెప్పుచుండు భారత కథలను వినుచుండెడి వాఁడఁట. అట్లు విబుధజనులవలన విన్నంత కన్నంత తనదిగాఁ జేసికొని సరళాదేవీ కటాక్షము నూఁతగాఁ గొని యతఁడు ఒరియాభారతమును వ్రాయ సమకట్టెను. అతనికి ఒరియాభాషలోఁ బాండిత్యము లేదు. సంస్కృతము రాదు. భారతమును జదువలేదు. అతని కున్న దెల్ల శ్రుతపాండిత్యము మాత్రమే. ఈవిషయములో నితఁడు సహజపాండిత్యుఁడను బిరుదము వహించిన మన బమ్మెర పోతనామాత్యునిఁ బోలును. అష్టాదశపర్వసంశోభితమగు సంస్కృతభారతము సంగతి యేమాత్రము నెఱుఁగక స్వతంత్రముగా సరళాతిసరళమధురభాషలో నీతఁడు రచించిన భారతము సమకాలమునాఁటి ఒరియా ప్రజల సాంఘిక రాజకీయార్థికవిషయములకును, మానసిక, దైహిక, దైవికాదివిషయములకును ప్రతిబింబ మై వెలయుచు ఒరియాప్రజలకు జాతీయ గ్రంథ మయినది.

ఇట్లు దాసకవిత్రయ మనఁబడు నీముప్పురు కవీశ్వరులును ఒరియాభాషలోఁ బ్రజాకవిత్వమును వెలయించినవా రయిరి. సరళాదాసు సంస్కృతమూలము ననుసరింపక స్వతంత్రముగాఁ గావ్యము కల్పించెను. బలరామదాసు ప్రజలనిత్యవ్యవహారములో నున్న వాడుకభాషలోఁ దన రామాయణమును, నితరగ్రంథములను రచించి సంస్కృత భాషలోని వుతవిషయములను మూలమూలలనున్న ఒరియాప్రజల కందునట్లు చేసెను. జగన్నాథదాసు సంస్కృతచ్ఛందము నవలంబింపక తొమ్మిది యక్షరములు కల యొక నూతనచ్ఛందములో భాగవతమును గేయరూపమున రచించి ఒరియాప్రజలకు దాని నీనుదినపారాయణగ్రంథముగా నొనర్చెను. ఇట్లీకాలమున వెలసిన సాహిత్యమును బ్రజాకవిత్వమనియు, వారు సంకల్పించి నిర్వహించిన యుద్యమమును ప్రజాకవిత్వోద్యమ మనియుఁ బేర్కొన వచ్చును.

## వైష్ణవసాహిత్యోద్యమము (16, 17, 18 శతాబ్దములు)

పదునేడవశతాబ్ద మధ్యభాగమున వంగదేశపు సన్యాసి యగుచైతన్యుఁడు వంగ దేశములో మహమ్మదీయులు పెట్టుబాధలను సహింప లేక యుత్కళదేశమునకు యాత్రార్థియై వచ్చి పూరీజగన్నాథ క్షేత్రమున స్థిరనివాసము గల్పించుకొనెను. అతఁడు దన్ను దర్శింపఁ జనుదెంచుచుండిన భక్తుల కందఱకిని –

దాసకవిత్రయమువారు ప్రబోధించిన భక్తి భావములతోఁ దాను నేకీభవించి – భక్తిప్రబోధమును గావింపఁ దొడఁగెను. అతని ప్రబోధ ప్రభావముచేఁ బెక్కుమంది తమయుద్యోగములను ద్యజించియుఁ, దమ దైనందినకార్య కలాపములను గట్టిపెట్టియుఁ జైతన్యుని చరణసన్నిధిని జేరి తమ్ముఁ గోపికలుగాను, చైతన్యుని శ్రీకృష్ణునిగాను భావించి పూజించి నృత్యగానములలో మునిఁగి తేల సాఁగిరి. ఈ చైతన్య మతము రాధాప్రేమగా రూపొంది పెక్కుభక్తకవులను వైష్ణవసాహిత్య సృష్టికిఁ బ్రోత్సహించెను. చైతన్యుని వైష్ణవమతప్రభావము ఒరిస్సాభాషపైఁ గూడఁ గొంత ప్రసరించినది. పదునైదవశతాబ్దములోని దినకృష్ణదాసుకాలమునుండి, పందొమ్మిదవశతాబ్దములోని గోపాలకృష్ణుని కాలమువఱకుఁ బ్రజలు రాధాకృష్ణ మతములో మునిఁగి తేలుచుండిరి. అనతికాలమున ఒరియాభాషలో మంచి కీర్తనలును, పద్యములును గొన్ని వెలువడినవి. అందుఁ గొన్ని గేయములును, పద్యములును బ్రజలకు నూతనచైతన్యము గలిగించినవి లేక పోలేదు.

## కావ్యసాహిత్యోద్యమము (16, 17 శతాబ్దములు)

దాసకవిత్రయకాలమున ఒరియాసాహిత్య మెంత మహోన్నతదశ నందుకొనెనో చైతన్యజయదేవులకాలములో నంత క్షీణదశకు వచ్చెనని ఉత్కలసాహిత్యవేత్తల యభిప్రాయము. చైతన్యమతము రాధాప్రేమగా రూపొంది ఓఢ్రుల పౌరుషప్రతాపములను రూపుమాపి యోఢ్రజాతిని నిర్వీర్యముగా జేసివేసిన దని స్వామి వివేకానందులు వచించిరి. ఈకాలములోఁ బురుషులు విలాసపురుషు లగుటచేతను, స్త్రీలు విలాసవతులై యసూర్యంపశ్యలుగా నుండుటచేతను ఒరియా ప్రజలలో సోమరితనము పెచ్చుపెరిగి పోయెను. దీనిచే ఒరిస్సా రాష్ట్రము తనరాజకీయస్వాతంత్ర్యమును గూడఁ గోలుపోయెను. దేశము ఛిన్నాభిన్నమై చిన్నచిన్న ఖండములుగా మాఱిపోయెను. దీని కంతటికిని గారణ మీమధ్యయుగములో రేకెత్తిన చైతన్యమతప్రభావమని చరిత్రజ్ఞుల యభిప్రాయము. శృంగారప్రియత్వము ఈమతముయొక్క ఫలితమే యనవచ్చును. అందుచేతనే కావ్యయుగములోని ఓఢ్రసాహిత్యమున శృంగారము రాజ్యము చేసినది. ఈకావ్యయుగములో నెన్నఁ దగినకవి ఉపేంద్రభంజి. ఇతఁడు గంజాము మండలములోని ఘరాకోటరాజగు ధనంజయభంజి యనుమహారాజునకు మనుమఁడు. ఇతఁడు రాజ్య సింహాసనమునకు బదులు కవితాసామ్రాజ్య

సింహాసనమును నధిష్ఠించి 'కవిసమ్రాట్టు' అని విఖ్యాతిని గాంచెను. పురాణయుగమునను, కావ్యయుగమునను గూడ నితనిని మించినకవి ఒరిస్సా రాష్ట్రములో నుద్భవింపలేదు. ఇతనిని ఆంధ్రసాహిత్యములో కవి సార్వభౌముడని విఖ్యాతిఁ గాంచిన శ్రీనాథకవితోఁ బోల్పవచ్చును. ఇతఁడు వైదేహీ విలాసము, లావణ్యవతి మొదలగుకావ్యము లిరువది దాఁక రచించెను. శ్రీనాథుని చాటువుల కున్న బహుళప్రచార మీ యుపేంద్రభంజి శృంగారపద్యములకును గలదు. ఇతనికవిత్వము కూడ పచ్చిశృంగారమున కాలవాలముగా నున్నది. అభిమన్యసామంత సింహుడనుకవీశ్వరుఁడు ఉపేంద్రభంజి తరువాత నెన్నఁదగిన కవిసత్తముఁడు. ఇతఁడు 'విదగ్ధచింతామణి' యను ప్రణయకావ్యమును రచించెను. ఈ యుగమున భూపతి పండితుఁడు, గోపాలకవి, రఘునాథభంజి, పీతాంబరదాసు, విశ్వనాథబంటియా మొదలగు మఱికొందఱు కవీశ్వరులు కూడఁ బేరు గాంచిరి. ఇట్లు ఒరియా భాషలో కావ్య సాహిత్యము ఉపేంద్రభంజినాఁటి నుండి పరిపుష్టి నొంది శృంగారప్రధానముగా సాఁగినది. ఈ కావ్యసాహిత్యోద్యమమునకుఁ బ్రారంభకుఁడును బ్రవర్తకుఁడును కవిసమ్రాట్టు ఉపేంద్రభంజి. అతని కవిత్వముచేఁ బ్రభావితులయిన తక్కిన కవీశ్వరు లాతని వలెనే శృంగార ప్రధానము లయిన కావ్యము లల్లి ఒరియాసాహిత్యమును బరిపుష్టము గావించిరి.

## నవ్యకవితోద్యమము

**(19వ శతాబ్ది యుత్తరార్ధము, 20వ శతాబ్ది ప్రారంభము)**

భారతదేశములో నాంగ్లేయుల పరిపాలన మారంభమైన పిమ్మట నితరరాష్ట్రములందువలెనే ఒరిస్సా రాష్ట్రములోఁ గూడ ఒరియాభాష బహుముఖముగా నభివృద్ధి గాంచఁ దొడఁగెను. ఒరిస్సా ప్రత్యేకరాష్ట్రముగా నేర్పడుటకుఁ బూర్వము ఒరిస్సాభూభాగమంతయుఁ జిన్నచిన్న పెద్ద పెద్ద జమీందారులచేఁ బాలింపఁబడుచుండెను. ఆకాలమునఁ బ్రజలు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లేక విద్యాధనములలోఁ జాల వెనుకఁ బడి యుండిరి. రైతులు జమీందారులకు వెట్టిచాకిరీ చేయవలసి యుండెను. అందుచే రైతు నిత్యదరిద్రుఁడై పోయెను. 'మధ్యతరగతులు' వారు పైకి వచ్చుదారి కనుబడ దయ్యెను. ఓఢ్రప్రజల వీర్యపరాక్రమములు కుంటుపడి పోయెను. అనేకకారణములచే ఒరిస్సాప్రజలు తమసంప్రదాయమును, సంస్కృతిని గోలుపోయి

యుండిరి. ఒరియాభాషాభివృద్ధి బాగుగాఁ గుంటుపడి పోయెను. ఇట్లు ఒరియాప్రజలు స్వస్థానవేషభాషాభిరతిని గోలుపోయి యున్న యాతరుణములో ఫకీరుమోహన్, రాధానాధ్, మధుసూదన్ అను ముగ్గురుకవులు ఒరిస్సా రాష్ట్రమున నవతరించి త్రిమూర్తులై త్రిపథగామి యైన గంగానదివలెఁ ద్రివిధమార్గములను ద్రొక్కి, ఒరియాభాషకును, సాహిత్యమునకును మరలఁ బ్రాణము పోసిరి. ఈ నవకవిత్రయముచే ఒరియాభాష త్వరితగతిని సముజ్జీవనము నొంది యపూర్వవైభవముతోఁ బ్రకాశింపఁ దొడఁగెను.

వీరిలో ఫకీర్‌మోహనుసేనాపతి మన యాంధ్రసాహిత్యములో శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు గారితోఁ బోల్పఁ దగిన మనీషి, భాషాసేవకుఁడు. ఇతఁడు తల యెత్తునాఁటికి వంగదేశమున బ్రహ్మసమాజమతము స్థాపింపఁబడి యుండఁగా నితఁ డామతమును స్వీకరించి యాసంస్కారముచేఁ బ్రబోధితుఁడై కులభేదములు పనికిరావనియు, విగ్రహారాధనము చేయ రాదనియుఁ జిన్నచిన్న కథలను వ్రాసి ప్రచారము గావించెను. ఆంగ్లేయుల సహాయముతో నితఁడు ప్రప్రథమముగా ఒరియా అచ్చు యంత్రమును 'బాలసోరు' పట్టణములో నెలకొల్పెను. పత్రికలు నెలకొల్పి స్త్రీలకు, బాలబాలికలకు, యువకులకు, వృద్ధులకు, ముముక్షువులకు, భక్తులకు, రక్తులకు, విరక్తులకు, జానపదులకు నను వగురీతిని బెక్కురచన లందు వ్రాయించి ఒరియాప్రజలకు విద్యాజ్ఞానభిక్ష పెట్టెను. అతఁడు రచించిన 'భోమాణో అరొగుంఠొ' **ఆరెకరాల ఎనిమిది కుంటలు** అను నవల యాతని రచనలలో మిక్కిలి ప్రసిద్ధి చెందినది. ఇతఁడు భారత, భాగవత, రామాయణములను సులభతరభాషలో రచించి యాబాలవృద్ధము చదువుకొని తరించు నవకాశముఁ గల్పించెను. వంగదేశమున ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బంకించంద్ర ఛటర్జీ యనువారు సాంఘికదురాచారములను రూపుమాపు నూతనవాఙ్మయమును సృష్టింపఁగా నితఁడు వారిమార్గము ననుసరించి ఒరియాప్రజలను తీర్చిదిద్దుటకై బహుళ వాఙ్మయమును ఒరియాభాషలో సృష్టించెను. ఇతఁడు ఒరియాభాషకుఁ జేసినసేవను, దేశసేవను గొనియాడని యోఢ్రుడుండడు.

నవయుగకవిత్రయములో రెండవవాఁ డగు రాధానాధకవి బహుభాషా పండితుఁడు. జాతీయభావ విలసితుఁడు. ప్రకృతి సౌందర్యముతో నొప్పు ఒరిస్సా రాష్ట్రమును గనులారఁ గాంచి యుప్పొంగి యాకవీశ్వరుఁడు ఒరియాభాషలో

ఇప్పుపూదేనెను బోలిన పద్యకావ్యములను బెక్కింటిని వ్రాసెను. ఇతఁడు రచించిన పాండవుల మహాప్రస్థానము అనునది ఒరియాభాషలో నొకయుత్కృష్ట కావ్యము. ప్రాచీననవీనోత్కలకవులు చూపిన పెక్కుపోకడ లీతని కవిత్వములోఁ బ్రస్ఫుట మగుచుండును. ఇతఁడు వ్రాసిన 'చంద్రభాగ' యనుపద్యకావ్యము మిక్కిలి ప్రసిద్ధి చెందినది. అది చరిత్రాత్మకము.

మూఁడవవాఁడగు మధుసూదనరావు, వేదాంతి, భక్తుఁడు. ఇతనిభక్తి గీతములను గానము చేయనియోధ్రుఁడుండఁడు. ఇతఁడు బ్రహ్మసమాజమతమును స్వీకరించి యోఢ్రుల సాంఘికదురాచారములను ఖండించెను.

ఈముప్పురు కవీశ్వరుల మార్గములు వేఱయినను వారిగమ్యస్థానమొక్కటే. వారు కోరునది ఒరియాభాషాభివృద్ధి. ఈముప్పురు మహాకవులును నెందఱో ఒరియా కవులకు మార్గదర్శకులైరి. వీరిమార్గము ననుసరించి కవిత్వము చెప్పినవారిలో ముఖ్యులు గంగాధరమెహెర్, నందకిశోర్ అనువారు. ఇట్లు ఫకీరుమోహనసేనాపతి మొదలగు నవకవిత్రయముచే ఒరియాసాహిత్యమున నవ్యకవితోద్యమము సాగి ఒరియాప్రజలను విద్యావిజ్ఞాన భిక్షతో నుత్తేజితులను గావించెను.

## సత్యవాది సంఘోద్యమము (క్రీ.శ. 1925 ప్రాంతము)

ఆధునికయుగమునం దన్నిరంగములలోను నూతనత్వమును బెంపొందించుకొనిన యుత్కల సాహిత్యవేదికపైఁ బ్రకాశించినకవీశ్వరులలో గోపబంధుదాసు అనుకవి మిక్కిలి యెన్నదగినవాఁడు. ఇతఁడు సాక్షి (సధి) గోపాల్ అనుగ్రామమున నొకసుందరరామస్థలిలో 'సత్యవాదిసంఘము' అనుపేర నొక సంఘమును స్థాపించెను. ఈసత్యవాదికవిసంఘములోని వారందఱును ప్రత్యేకోత్కలరాష్ట్ర నిర్మాణమునకై ప్రబోధవాఙ్మయమును వివిధరీతులలో వెలయించిరి. రాజకీయార్థికసాంఘికవిషయములలో నోఢ్రులను ముందునకుఁ దీసికొని పోవుటయే యీ సత్యవాదిసంఘకవుల ధ్యేయము. వీ రన్ని రంగములందును నడుఁగు పెట్టి ఒరియాప్రజల కండదండ గా నిలిచి సారస్వతాలంబనముతో ఒరిస్సారాష్ట్రము యొక్కయు, నందలి ప్రజాజీవనము యొక్కయు స్వరూపస్వభావములను మార్చివైచి యొకనూతన శకమునకు సృష్టికర్త

లయిరి. వీరి ప్రతిరచనయందును భారతీయ సంస్కృతి పునఃప్రతిష్ఠ, భారతదేశదాస్యవిముక్తి, ప్రాచీనోత్కళభాషా వికాస నిరతి గోచరమగుచుండును. వీరు ప్రాచీనవృత్తములను వీడి క్రొత్తఛందస్సులను సృష్టించిరి. వ్యావహారికభాష దేశాభివృద్ధికి, భాషాభివృద్ధికి జీవగఱ్ఱ యని వీరు భావించిరి. వీరి వినూతన కవితాప్రభావము ఒరియాప్రజలలో నూతన వికాసమును రేకెత్తించెను. సత్యవాది సంఘములోని కృపాబంధుమిశ్రా, గోదావరిమిశ్రా, పండిత నీలకంఠదాసు మొదలగు వారు పేరెన్నిక గన్న ప్రబోధకవులు. నూతనోద్యమ నిర్మాతలు. సంఘస్థాపకుఁ డగు గోపబంధుదాసు మానవసేవయే మాధవసేవగాఁ దలఁచి యొరియాప్రజలను సముద్ధరించెను. ఒరియాప్రజ లీతనిని కవిగా, ఋషిగా, దేశబంధువుగా, విద్యావాచస్పతిగాఁ దమమనఃఫలకములందుఁ జిత్రించుకొని పూజింతురు. గాంధిమహాత్ముఁడు దేశములో నసహాయోద్యమము ప్రారంభించినపుడు గోపబంధుదాసు రాజకీయములలోఁ ప్రవేశించి కారాగారవాస శిక్షల ననుభవించెను. కారాగారమున రాజకీయబంధితుఁడుగా నుండిన కాలములో నితఁడు 'బందిర్–ఆత్మకథ', 'ధర్మపాద' అని రెండు గ్రంథములను విరచించెను. ఇట్లితఁడు పూర్తిగా రాజకీయరంగములో మునిఁగి పోవుటచే నీ 'సత్యవాది సంఘము' లోని తక్కినవారు మాత్రము సాహితీరంగములోనే నిలిచి భాషాసేవ చేసిరి. ఒరిస్సా దేశము లోని ఒరియా సాహిత్యమునకు సత్యవాదికవిసంఘము ప్రారంభించిన నూతనకవితోద్యమము వలన దేశభక్తిప్రపూరితమగు ప్రబోధవాఙ్మయము విస్తారముగా లభించెను.

## సబూజసంఘము అను నిత్యశ్యామలసంఘము
## (క్రీ.శ. 1935 ప్రాంతము)

అభ్యుదయకవితావాదులును, కళాశాలావిద్యార్థులును నీసమాజమునందు సభ్యులుగా నుండి వంగకవితాప్రభావము ఒరియాకవితపై ప్రసరింపకుండ నరికట్టుటకుఁ తోడ్పడిరి. ఈసంఘమువలనఁ జెప్పుకోనఁ దగిన సాహిత్యసేవ యేమియు జరుగలేదనియే చెప్పఁ దగును.

కళింగసాహిత్యసమాజము అనుపేర గంజాము మండలములో మఱొక సాహిత్య సంఘము స్థాపింపఁబడినది. ఇందు సభ్యులయిన కవులు ఉపేంద్రభంజి మొదలగు ప్రబంధకవుల మార్గము ననుసరించి కావ్యములు రచించిరి.

## అభ్యుదయ కవిత్వోద్యమము
### (క్రీ.శ. 1945 ప్రాంతము)

కొందఱు ఉత్కల కవులు అభ్యుదయకవిత్వమను పేరుతో పూర్వ సంప్రదాయములను, కవిసమయములను, ఛందోఽలంకారములను త్రోసిరాజు చేసి విదేశీయ కవితారీతుల ననుసరించి కవిత లల్లు చున్నారు. తమకవిత్వమును బ్రచారము చేసి కొనుటకై వీరు కొన్ని పత్రికలను గూడ నిర్వహించుచున్నారు.

## తమిళసాహిత్యము

ఉత్తరభారతభాషలలో ప్రముఖము లయిన హిందీ, బెంగాలీ, పంజాబీ, ఓఢ్ర భాషలలోని సాహిత్యోద్యమములనుగూర్చి కొన్ని వివరములను తెలిసికొంటిమి. ఇఁక దక్షిణదేశ భాషలలోని సాహిత్యోద్యమములనుగూర్చి యించుక పరిశీలింతము. తమిళము, కన్నడము, మలయాళము, మహారాష్ట్రము లను నీదక్షిణదేశభాషలలోఁ బ్రాచీనతనుబట్టి తొలుతఁ బేర్కొనఁదగిన తమిళభాషలోని సాహిత్యోద్యమములనుగూర్చి మొదటఁ దెలిసి కొందము.

తమిళసాహిత్యచరిత్రమును బరిశీలింపఁగా నందు ౧. తమిళకవిసంఘముల మూలమున సాగిన దేశికవిత్వోద్యమము, ౨. కావ్యసాహిత్యోద్యమము, ౩. భక్తి కవిత్వోద్యమము, ౪. అనువాదసాహిత్యోద్యమము, ౫. యుద్ధకావ్యోద్యమము, ౬. [illegible]ద్యమము, ౭. చారిత్రకనవలోద్యమము, ౮. శెందమిళ్ ఉద్యమము అని ప్రముఖముగా నెనిమిది యుద్యమములు సాగి యాసాహిత్య మభివృద్ధి చెందినట్లు తెలియుచున్నది.

## తమిళకవిసంఘములు - దేశికవిత్వోద్యమము
### (క్రీ.పూ. 1, క్రీ.శ. 1,2 శతాబ్దములు)

తమిళసాహిత్యములో సంగయుగము క్రీస్తుశకము మొదటిశతాబ్దమునకుఁ బూర్వమే ప్రారంభమయ్యె నని పలువుర విశ్వాసము. సంగము అనఁగా కవిసమూహ మని పేర్కొన వచ్చును. తమిళమున నిట్టి కవిసంఘములు మూఁడు వర్ధిల్లెను. దీనిని తలైచ్చంగం (తొలిసంగము), ఇడైచ్చంగం (మధ్యసంగము), కడైచ్చంగం (కడసంగము) అనియందురు. ఆకాలమునందు రచితము లయిన కవులకృతులలోని బాగోగులను బరిశీలించి సత్కావ్యనిర్ణయమొనరించుట యీా

సంగముల పని. సంగకవుల యామోదమును బడసినగ్రంథమే యాకాలమునఁ బ్రచారములోనికి వచ్చుచుండెను. దీనిలో తొలిసంగము మధురలో వర్ధిల్లె ననియు, నందు 549 మంది కవు లుండి రనియు శివుఁడు, మురుగన్, అగత్తియన్ అనువా రందు సభ్యులుగా నుండి రనియుఁ జెప్పుదురు. ఈతొలిసంగముకాలమున రచితము లయిన యుద్గ్రంథములలో 'అగత్తియం' అను లక్షణగ్రంథము పేర్కొనఁదగి యున్నది. మధ్యసంగము 'కపార' పురమున వర్ధిల్లెనఁట. అందు 59 మంది కవులుండెడివా రనియు, వారిలో అగస్త్యుఁడు, తొల్కాప్పియనార్ ముఖ్యులగువారు సుప్రసిద్ధులనియుఁ దెలియుచున్నది. వీరిలో తొల్కాప్పియనార్ రచించిన తొల్కాప్పియము ప్రప్రథమలక్షణ గ్రంథము. ఇది తరువాతి లాక్షణికుల కొల్లబంటి యయ్యెను. కడసంగమున 49 మంది కవులుండెడివా రనియు, 449 గ్రంథములందు సమీక్షింపఁబడె ననియుఁ జెప్పుదురు. నక్కీరుఁడు అను కవీశ్వరుఁడీ సంఘమున కధ్యక్షుఁడు. ఈ సంగమునకుఁ జెందిన కవిప్రవరులలో తిరువళ్లువర్ మహాకవి ప్రసిద్ధుఁడు. తిరుక్కురల్, పత్తుప్పాట్టు, ఎట్టుత్తొగై, పదినెణ్ కీల్కణక్కు మొదలగుసద్గ్రంథములు కొన్ని యీకాలమున వెలుఁగులోనికి వచ్చెను. వీనిలో తిరుక్కురల్ తమిళవేద మని సంభావింపఁబడుచున్నది. ఈయుద్గ్రంథమునకు ముప్పాల్ (త్రివర్గము) ఉత్తరవేదము, పొయ్యామొళి (యథార్థకావ్యము) తమిళ్‌మఱై (తమిళవేదము) మొదలగు నామాంతరములు కలవు. తిరువళ్లువరుకుఁ బిమ్మటఁ బ్రసిద్ధి చెందినకవయిత్రి అవ్వై. ఈమె ఆత్తిచూడి, కొండ్రైవేంద్రన్, వాక్కుండాం, నల్వళి మొదలగు నీతిగ్రంథములను రచించినట్లు చెప్పుదురు.

ఇట్లీవిధముగా తమిళకవిసంఘములును ప్రాచీనకాలమునఁ బెక్కు తమిళ గ్రంథములు రచితములగుటకుఁ గారణభూతము లయ్యెను. ఆయాకాలములయందలి తమిళకవీశ్వరు లీకవిసంఘములయందు సభ్యులై, కావ్యములు విరచించి, భాషాభివృద్ధికి విశేషముగా దోహదము కావించిరి. ఈసంగయుగమున సాగినసామూహికభాషాకృషి యనంతము, అద్వితీయము.

కడసంగకాలమున తమిళములోఁ గొన్ని సంకలనగ్రంథములు వెలుఁగులోనికి వచ్చెను. అట్టివానిలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్ కీల్ కణక్కు అనునవి ప్రసిద్ధిచెందినవి. ఎట్టుత్తొగై యెనిమిది కృతుల బృహద్గ్రంథము. పత్తుప్పాట్టులోఁ బదికావ్యములు కలవు. పదునెనిమిది కావ్యములు కలది పదినెణ్ కీల్ కణక్కు. ఇవి బహువిధవిషయములు. ఆ కవులును భిన్నభిన్నకాలములకుఁ జెందినవారు.

వీనిలోని పదరచనలు దేశిసాహిత్యమునకుం జెందినవి. వంటియు నీసంగయుగమునకుం జెందినకవులు సంస్కృతము నుండి తమ కావ్యవస్తువులను గ్రహింపలేదు. వర్ణనలయందుం గూడ వారిప్రత్యేకత గోచరించును. ఈయుగమున రచితము లయిన గ్రంథములలో నీత్యుద్బోధకగ్రంథములే యధికముగాం గానవచ్చును. సంస్కృతనిరపేక్షముగా సాగిన దేశికవిత్వ మీకాలమున వర్ధిల్లిన దని యూహింపపచ్చును.

## కావ్యసాహిత్యోద్యమము

**(క్రీ.శ. 2వ శతాబ్దము, క్రీ.శ. 8,9 శతాబ్దములు)**

సంగయుగమునకుం దరువాత తమిళములో జైన, బౌద్ధుల సమాచరణమునం గొన్ని కావ్యములు వెలుంగులోనికి వచ్చెను. శిలప్పదిగారము, మణిమేకలై, జీవకచింతామణి యనునవి వానిలో ముఖ్యము లయినవి. వానిలో జైనులయొక్కయు, బౌద్ధులయొక్కయు నాచారవ్యవహారములు, తాత్త్విక రహస్యములు ప్రతిబింబించుచున్నది. ఈకాలమున రచితము లయిన మణిమేకలై, శిలప్పదిగారం, జీవకచింతామణి, వళయాపతి, కుండలకేశి యనునవి తమిళపంచకావ్యములని ప్రసిద్ధి వహించెను. మణిమేఖల కావ్యమును శీత్తలైశాత్తనార్ అనుకవి రచించెను. ఇందు మణిమేఖల యనువేశ్యయొక్క జీవిత మభివర్ణింపంబడెను. శిలప్పదిగారము కణ్ణకి యను మహాపతివ్రతజీవితమును జిత్రించును. ఇళంగో అడిగళ్ అనురాజకవి దానిని సంతరించెను. అతండు జైనమతావలంబకుండు. ప్రసక్తానుప్రసక్తముగా జైనమతాచారముల వైశిష్ట్యము నాకావ్యము ప్రదర్శించును. ఇది తమిళుల జాతీయకావ్యముగా సంభావింపందగియున్నది. జీవకచింతామణి యను శృంగారప్రధానమైన కావ్యమును తిరుత్తక్క దేవర్ అనునొక జైనముని రచించెను. జైనుల తాత్త్వికరహస్యములు, వారి మతసంప్రదాయములు మొదలగునవి యీ కావ్యదర్పణమునందుం బ్రతి ఫలించుచున్నది. కుండలకేశి, వళయాపతి యను కావ్యములు కూడ జైన, బౌద్ధకవిరచితములే. జైనకవులు సంతరించిన గ్రంథములలో 'నాలడియార్' చతుష్పది పేర్కొనందగినది. ఇది తిరుక్కురళ్వలె నీత్యుద్బోధక మగుగ్రంథము.

సంఘయుగమునందలి సాహిత్యమున ముక్తకరచనములు, నీత్యుద్బోధక రచనములుం బ్రాధాన్యము వహింపంగా నాతరువాతి జైనబౌద్ధులయుగమునం

గావ్యసాహిత్యము ప్రాచుర్య మందినది. మతప్రచారమే వారి పరమాశయమయినను వారు తమిళమునఁ జక్కని కావ్యములను వెలయించి తమిళసాహిత్యమునకుఁ బుష్టి చేకూర్చిరి. నీతిపద్యములతోను, శృంగారవీరరసప్రధానములగు ముక్తకరచనలతోను దృష్టి పడుచుండిన తమిళులకు మొదటిసారిగాఁ గావ్యానందమును గలిగించిన కీర్తి యీకాలమునందలి జైన బౌద్ధకవులకు లభించుచున్నది.

## భక్తికవితోద్యమము (క్రీ.శ. 10,11 శతాబ్దములు)

జైనులయొక్కయు, బౌద్ధులయొక్కయు ప్రాభవమున కడ్డమాకలు వేయఁదలఁచిన హైందవులు కొంత ఆతరువాతికాలమున భక్త్యుద్యమమును లేవఁదీసిరి. భక్తి ప్రధానమగు నీమతము కులవివక్షను నిరసించెను. అందుచే నీయుద్యమమునకు మిక్కిలి సులభముగాఁ బ్రజాభిమానము లభించెను. భక్త్యుద్యమము బలపడుకొలఁది గుళ్లు గోపురములు ననేకములు వెలసెను. దేవోత్సవము లెక్కువయయ్యెను. జైన బౌద్ధులవలెనే – ప్రజాభాషలో హైందమమతప్రచారము చేయుట యతిసులభ మనువిషయము తెలియ వచ్చెను. ప్రజలభాష మయిన తమిళమునకు సాహిత్యగౌరవము లభింపఁ జొచ్చెను. ఆకాలమున భక్త్యుద్యోమమును సాగించి హైందవమతప్రచారము సాఁగించిన ఆళ్వారులును, నాయన్మారులును సంస్కృతభాషాభిజ్ఞులయినను వారు భక్త్యుద్రేకమునఁ బ్రజలభాష యగు తమిళమునందే తమగీతములను బాడిరి. లయప్రధానము లయిన యీగీతములు ప్రజలను మిక్కిలి విశేషముగా నాకర్షించెను. పదునొకండవశతాబ్ది ప్రారంభమున నంబియాండార్‌నంబి యనుభక్తుఁడు శైవులగీతముల నన్నిటిని సేకరించి వానిని పదునొకండు భాగములుగా వర్గీకరించెను. తిరుజ్ఞానసంబంధర్, తిరునావుక్కరశర్, సుందరమూర్తి, మాణిక్యవాచకర్ మొదలగు నాయన్మారులు పాడినగీతము లాసంకలనమునందు గలవు. భక్త్యుద్బోధకము లగునిట్టి గీతములమూలమున నాయన్మారులు తమిళదేశమున జైనబౌద్ధమతముల వ్యాప్తి నరికట్టి శైవమతము వ్యాపించుటకు విశేషముగాఁ దోడుపడిరి. వారికృషిమూలమున మతవ్యాపనముతోఁబాటు భక్తిగేయముల సృష్టిమూలమున తమిళ సాహిత్యమునకును మహోపకారము చేకూరినది.

నాయన్మారులువలెనే ఆళ్వారు లనబడు వైష్ణవమతాచార్యులు కూడ భక్త్యుద్బోధకము లగు పెక్కు గీతములను బాడిరి. నాథముని యనునొకవిష్ణుభక్తుఁ

డట్టి నాలుగు వేలగీతములను సేకరించి 'నాలాయిరదివ్యప్రబంధము' అను గ్రంథమున వాని నెల్ల సంకలనము గావించెను. నమ్మాళ్వార్, పెరియాళ్వార్, ఆండాళ్ మొదలగు పన్నిద్దఱాళ్వారులు రచించిన భక్తిగేయము లందు సంధానింపబడినది. ఈకాలమున భక్తిగీతములు రచించిన తమిళమునందు వారికిఁ గల యాదరము చేతను, ప్రజలభాష యయిన తమిళములో నాభక్తిగేయములు రచితము లగుచో హైందవమతతత్త్వము సులభముగా వారి కవగత మగుటకు నవకాశము కలుగునని భావించుటచేతను తమరచనముల నెల్లఁదమిళమునందే నిర్వహించి తమిళసాహిత్యమునకుఁ బుష్టి చేకూర్చిరి.

## అనువాదసాహిత్యోద్యమము (క్రీ.శ. 10, 11 శతాబ్దములు)

జైన, బౌద్ధుల ప్రాబల్యమును దగ్గించి హైందవ మతమును ప్రజలలోఁ బ్రచారము చేయుటకు కొకవంక నాయన్మారులును, నాళ్వారులును తమభక్తికీతముల మూలమునఁ దోడుపడుచుండఁగా – మఱియొకవంక హైందవమతప్రతిపాదకములగు సంస్కృతభాషలోని యుద్గ్రంథములను తమిళములోని కనువదించి వానిమూలమున హైందవమతప్రచారమును జైన, బౌద్ధమతముల నిరాసమును జేయుటకుఁ గొందఱు ప్రయత్నించిరి. తత్ఫలితముగా రామాయణము, భారతము వంటి యుద్గ్రంథములు సంస్కృతము నుండి తమిళభాష లోనికిఁ బరివర్తనము చేయఁబడెను. కంబమహాకవి, ఒట్టక్కూత్తర్, జయంగొండార్ మొదలగు మహాకవు లీయుద్యమమును జేపట్టిరి. చోళరాజుల యేలుబడిలో సంస్కృత భాషాసాహిత్యములకు బహుళవ్యాప్తి లభించెను. తత్ఫలితముగా సంస్కృతగ్రంథములు కొన్ని తమిళము చేయఁబడెను. వానిలో కంబమహాకవి రచించిన 'రామావతారము' అను నామాంతరముకల కంబరామాయణము ప్రసిద్ధి జెందినది. వాల్మీకిరామాయణము ననుసరించియే కంబఁడు తనరామాయణమును రచించినను నితఁ డక్కడక్కడ మూలమునకు భిన్నములయిన మార్పులను గొన్నిటిని గావించెను. శ్రీరాముఁడు దైవముగా సంభావించినవాఁ డగుటచే నీతఁడు తనకావ్యమున శ్రీరాఘవచంద్రుని గుణగణముల నత్యుద్భుతముగా వర్ణించి ప్రజలలో రామభక్తియుఁ దమ్మూలమున హైందవమతానురక్తియుఁ గలిగించినవాఁ డయ్యెను. మహాభారతములోని నలోపాఖ్యానము నాధారముగాఁ జేసికొని పుగళేంది యనుకవి 'నళవెణ్బా' యను నొకప్రశస్త కావ్యమును రచించెను.

## యుద్ధకావ్యోద్యమము (12, 13 శతాబ్దములు

జయంగొండార్ అనుకవి 'కలింగత్తుపరణి' యనునొక యుద్ధకావ్యమును రచించెను. శైవవైష్ణవాచార్యుల భక్త్యుద్యమము ఫలితముగా తమిళసాహిత్యమున భక్తి భరితము లగు గేయసాహిత్యము విశేషముగా సృష్టి గావింపఁ బడినను నాకాలమునఁ బ్రజలు భక్తిపరవశులై, దైవచింతతోఁ గాలక్షేపముచేయుచు నిర్వీర్యులై యుండిరి. తమిళజాతి చైతన్యరహిత మయ్యెను. తమిళులను మరలఁ జైతన్యపూరితులను జేయవలయుననునుద్దేశముతో, తమిళజాతిని వీరజాతిగా దీర్చి దిద్దవలయు ననుసంకల్పముతో జయంగొండార్ 'కలింగత్తుపరణి' యను నొక యుద్ధకావ్యమును రచింపఁగా నాకావ్యము ననుసరించి పెక్కురు కవులు తరువాతి కాలమునఁ బెక్కు యుద్ధకావ్యములు రచించిరి.

## వ్యావహారికభాషోద్యమము

(క్రీ.శ. 19వ శతాబ్ది యుత్తరభాగము, 20వ శతాబ్ది ప్రారంభము)

తమిళసాహిత్యమున నాధునికయుగము పందొమ్మిదవశతాబ్దముతో నారంభ మగుచున్నది. భారతదేశమును దాంగ్లేయులప్రభుత్వము స్థిరపడిన పిమ్మట నిందాంగ్ల భాషా వాఙ్మయములకు విశేషవ్యాప్తి కలిగెను. తత్ఫలితముగా నూతనభావములు తల యెత్తెను. ప్రాచీన భారతీయసంస్కృతిని బరిరక్షించు నుద్దేశముతోఁ గొందఱు నూతనోద్యమములను బ్రారంభించిరి. మఱి కొందఱు మూఢాచారములను రూపుమాప వలె నను నుద్దేశముతోఁ గ్రొత్తయుద్యమములను దలపెట్టిరి. స్వరాజ్యమును సంపాదించు నభిలాషముతో జాతీయోద్యమము స్థాపింపఁ బడెను. ఈయుద్యమము లన్నియు నాధునిక తమిళ సాహిత్యముపైఁ దమవిశేషప్రభావమును జూపి దాని రూపు రేఖలను దీర్చిదిద్దినవి. తమిళసాహిత్యములో నవయుగము సుబ్రహ్మణ్యభారతితోఁ బ్రారంభమయ్యెనని నుడువఁదగును. సుబ్రహ్మణ్యభారతి తమిళుల జాతీయకవి. సమకాలికసామాజిక జీవనము, ప్రాచీనతమిళసాహిత్యస్థితి, రాజకీయపరిస్థితులు మొదలగువాని నెల్లఁ జక్కఁగా గుర్తించినవాఁ డగుటచే భారతి సామాన్యమానవునికి సైతము సుబోధకమగు వ్యావహారిక భాషతో, దన రచనలు చేయఁదొడఁగెను. ఆయన ప్రారంభించిన యీ వ్యావహారికభాషోద్యమ ప్రభావము నేఁటి పత్రికారచనము నందును, పలువురు రచయితలమీఁదను స్పష్టముగా గోచరించుచున్నది. ఇందుచే నీయుగమునకు **భారతియుగ** మనియు, భారతికి **వ్యావహారిక భాషోద్ధారకుఁ** డనియుఁ దమిళసాహిత్యప్రపంచమునఁ బ్రశస్తి లభించినది.

## చారిత్రకనవలోద్యమము (20వ శతాబ్ది ప్రారంభము)

ఆధునిక సాహిత్యప్రక్రియలలో నవలకుఁ గలప్రచారము తక్కినవానికి లే దనవచ్చును. తమిళములోఁ గూడ నీనవలాప్రక్రియ విశేషవ్యాప్తి నంది యున్నది. అందును జారిత్రకనవలలు విశేషముగా వెలువడినవి, వెలువడుచున్నవి. ఆధునికనవలా వాఙ్మయమున 'కల్కి' యను పేరుతో రచనలు చేసిన రా. కృష్ణమూర్తి ప్రసిద్ధుఁడు. అతఁడు ప్రముఖకథారచయిత. ఎందరో యువరచయితలకుఁ బ్రోత్సాహ మొసఁగి వారిని వెలుఁగులోనికిఁ దెచ్చినసహృదయుఁడీతఁడు. ఇతఁడు ముఖ్యముగా చారిత్రక నవలలు రచించెను. అలైఓసై, పార్థివన్ కనవు, పొన్నియిన్ సెల్వన్ అనునవి కల్కి రచితము లగు నవలలలో సుప్రసిద్ధములు. ఇవి తమిళప్రజానీకములో విశేషవ్యాప్తిని గడించి యుండుటయే కాక యిటీవలి కాలమున రచితము లగుచున్నచారిత్రక నవలలకుఁ బథప్రదర్శకములయ్యె నని నుడువఁ దగును. ఈ 'కల్కి' ప్రభావముచేతనే నేఁటికిని దమిళపత్రిక లలోఁ జారిత్రకనవలలకు విశేష ప్రాధాన్యము కలదు. చారిత్రకనవల ప్రచురింపఁబడని వారమాసపత్రికలు నేఁడు తమిళమున లే వన్నను నతిశయోక్తి కాఁజాలదు.

## శెందమిళ్ఉద్యమము (క్రీ.శ. 1930 ప్రాంతము)

ఇది భాషకు సంబంధించిన యుద్యమము. తమిళదేశమున ద్రవిడకజగం, ద్రవిడమున్నేట్రకజగం అనురాజకీయసంస్థలు వెలసి ప్రత్యేకద్రావిడస్థానము, దాక్షిణాత్యులపై నౌత్తరాహుల యాధిక్యనిరాకరణము, ఆర్యసంస్కృతిచే ద్రావిడ సంస్కృతి కలుషితము కాకుండ దానిని పరిరక్షించుట, ఆర్యులభాష యయిన సంస్కృతమును బరిహరించి శుద్ధ తమిళమునే వ్యవహరించుట, అట్టి భాషయందే రచనలు వెలయించుట, ఆర్యుల సంతతికిఁ జెందినవా రనుకారణమున దక్షిణాదేశమునందలి బ్రాహ్మణులను ద్వేషించుట మొదలగు నాశయములతోఁ గృషిసేయఁ దొడఁగినవి. వారి యుద్యమములో సంస్కృతభాషా పదములను బరిహరించి, శుద్ధమయిన తమిళభాషయందు రచనలు వెలయించుట యొక భాగము. ఇట్లు భాషావిషయకముగా వారు సాగించిన యుద్యమమునకు 'శెందమిళ్ ఉద్యమము' అని పేరు. సంగీతవిద్వాంసులు కూడ నితరభాషాగ్రథితములగు పాటలను గీర్తనలనుకాక తమిళభాషలో రచితము లయిన పాటలనే, కీర్తలనే పాడవలయు నన్నంత వఱకు నీయుద్యమము పోయినది. సంస్కృతభాషాద్వేషముచే

సీసంస్థలకుఁ జెందిన నాయకులు కొందఱు, తదనుయాయులు, అభిమానులు తమకుఁ బెట్టబడినపేర్లు సంస్కృతభాషాపదములుగా నున్నచో వానిని బరిహరించి తదర్థకము లగు తమిళపదములతోడి పేర్లనో, లేక యట్టి సంస్కృతనామములతోఁ బిలువఁబడుట యిష్టము లేనివారు కొందఱు నూతననామధేయములుగా, తమిళనామధేయములను ధరించియో వ్యవహరింపఁబడుట కిచ్చగించెడివారు. సంస్కృతనిరపేక్షముగా తమిళము వ్యవహరింపఁబడుశక్తి కలిగియుండఁగా సంస్కృతపదముల నేల వాడవలయును? అది సంస్కృతభాషాదాస్యము. సంస్కృతభాషను తమిళములోఁ జొప్పించుట యార్యుల యాధిక్యము నంగీకరించుట. ఇట్టి భావములతో నచ్చ మయిన తమిళమునే వ్యవహరింప వలయు ననియు, నట్టిభాషయందే రచనలు వెలయింప వలయు ననియు నీరాజకీయ సంస్థలకుఁ జెందిననాయకు లొకయుద్యమమును లేవఁ దీసిరి. సంగీతవిషయమున వారు తలపెట్టిన యుద్యమము విఫలమయినను, సాహిత్యవిషయమున మాత్రము వారు చాలవరకుఁ గృతార్థులయి రనియే చెప్పవలసి యున్నది. సంస్కృతనిరపేక్ష మయిన శుద్ధ తమిళమున వారు తమరచనములను వెలయింపఁ గలుగుచున్నారు.

## కన్నడసాహిత్యము

భారతీయసాహిత్యములలో సంస్కృతతమిళములకుఁ దరువాతఁ బ్రాచీనతర మయినది కన్నడసాహిత్యము. అశోకచక్రవర్తి వ్యాప్తి గావించిన బౌద్ధమతమును, నాతని మునుమడగు సంప్రతిచంద్రగుప్తునికాలమున భద్రబాహుని నాయకత్వమున వర్ధిల్లిన జైనమతమును గన్నడసారస్వతముపై శాశ్వత మయిన ప్రభావమును బ్రదర్శించినవి. కన్నడదేశములో బౌద్ధమతమును వ్యాపింపఁ జేయుటకై బౌద్ధమతప్రచారకులు దేశభాష యగు కన్నడమును నేర్చుకొని యుందురు. అట్లే జైనులు కూడ తమమత సిద్ధాంతములను బ్రచారము చేయుటకై కన్నడభాష నుపయోగించి యుందురనుటకు సందేహము లేదు. దిగంబరజైన మతప్రచారకుల కారణముననే కన్నడ మొకవిధ మగు సారస్వతరూపమును బడసె నని చెప్ప వచ్చును. కన్నడసాహిత్యమునకుఁ బ్రధానముగా 'ధర్మమే' ప్రేరక మని యాసాహిత్య చరిత్రమునుబట్టి తెలియుచున్నది. పంపమహా కవి మొదలుకొని కన్నడ భాషయందుఁ గవిత్వము చెప్పిన ప్రసిద్ధకవు లందఱును దమమత సందేశములను

ప్రజలలోఁ బ్రచారము చేయుటకొఱకే సాహిత్యమును జేపట్టిరి. జైన మతావలంబకుఁ డగుపంపమహాకవి జినాగమమును విశ్వమున వెలిఁగింపఁ జేయ వలయుననునుద్దేశముతో 'ఆదిపురాణము' అను జైనకావ్యమును విరచించెను. అతని ననుసరించి తరువాతి జైనకవులందఱును మతప్రచారమునకే తమకావ్యములను విరచించిరి. జైనకవులవలంబించిన యామార్గమునే యితరమతములకుఁ జెందిన కన్నడకవులును ననుసరించిరని చెప్పఁదగును. బసవేశ్వరుఁడు మొదలగు 'వచన' కారులు వీరశైవమతప్రచారము చేయు నుద్దేశముతోనే పెక్కు వచనములను కన్నడభాషయందు వెలయించిరి. ఆతరువాత వెలసిన వైష్ణవదాససాహిత్యము కూడ వైష్ణవమతమును వ్యాపింపఁ జేయునుద్దేశముతోనే ప్రవర్తించినది. మనదేశములో మొన్న మొన్నటిదాఁకఁ గూడ రాజకీయవిప్లవములు ప్రజల మీఁదను, వారిసాహిత్యముమీఁదను నంతగాఁ దమప్రభావమును బ్రసరింపఁ జేయ లేదనవచ్చును. భారతదేశములోఁ బ్రధానముగా ధార్మికవిప్లవములే యధికముగాఁ గానవచ్చును. బౌద్ధ, జైన, వీరశైవ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతవిప్లవము లొకదాని వెంబడి నొకటి నిరంతరముగాఁ గొనసాగినది. ఆయాధార్మిక విప్లవములప్రభావ మాయాసమకాలమున వెలసిన సాహిత్యముపైఁ దమప్రభావమును ముద్రించి యుండుట యసహజము కాదు. ఇతర భారతీయ సాహిత్యములయందువలెనే కన్నడసాహిత్యమునఁ గూడ నీ ధర్మక్రాంతి పరిణామము విస్పష్టముగా గోచరించును. ఇట్టి ధార్మికవిప్లవముల కారణమున మతప్రచారోద్దేశముతోఁ గన్నడసారస్వతమున నాయాకాలములలో సాగిన యుద్యమములతో నాధునికకాలమునఁ బాశ్చాత్యభాషాసంపర్కముచేతను, రాజకీయ మగు జాతీయోద్యమప్రభావముచేతను వెలసిన నూతన కవిత్వోద్యమములను జోడించి పరిశీలించినపుడు కన్నడభాషలో నీక్రింది సాహిత్యోద్యమములు వెలసి సాహిత్యప్రగతికిఁ దోడ్పడిన వనువిషయము గోచరింపఁగలదు. ౧. మహాకావ్యకవిత్వోద్యమము లేక ధార్మిక లౌకిక కవిత్వోద్యమము, ౨. భక్తికవిత్వోద్యమము లేక దేశికవిత్వోద్యమము, ౩. దాసకూటోద్యమము, ౪. పునరుజ్జీవనోద్యమము, ౫. ఆధునికకవిత్వోద్యమము, ౬. ప్రగతిశీలసంఘోద్యమము, ఈయుద్యమముల యావిర్భావవికాసములను గూర్చి కొంత వివరముగాఁ బరిశీలింతము.

## మహాకావ్యకవిత్వోద్యమము లేక ధార్మిక లౌకిక కవిత్వోద్యమము
### (క్రీ.శ. 10, 11 శతాబ్దములు)

కన్నడసారస్వతమున వెలసిన మొదటిగ్రంథము 'కవిరాజమార్గము'. దీనిని క్రీస్తుశకము 813 మొదలుకొని 878 వఱకుఁ బాలించిన ప్రసిద్ధరాష్ట్రకూట చక్రవర్తియగు నృపతుంగుఁడు రచించెను. ఇది యొక లక్షణగ్రంథము. దీని రచనాకాలము నాటికే గద్యము, పద్యము, చంపువు లనుమూఁడువిధము లయిన ప్రక్రియలును గన్నడభాషలోఁ బ్రచురము లయి యున్నట్లు కవిరాజమార్గము పేర్కొనుచున్నది. మరియు విమలుఁడు, ఉదయుఁడు నాగార్జునుఁడు, జయబంధుఁడు, దుర్వినీతుఁడు అను ప్రాచీనగద్యకావ్యకర్తలును, శ్రీవిజయుఁడు, చంద్రుడు, లోకపాలుఁడు మొదలగుపద్యకావ్యకర్తలును నందుఁ బేర్కొనబడిరి. చత్తాణె, బెదండె యనుకావ్యములు దేశీయచ్ఛందములో రచింపఁబడిన పద్యకావ్యములని కూడ నందుఁ గలదు. వంటికొందఱు ప్రాచీనవిపులరచనముల నుండి గ్రహించినలక్ష్యములు కొన్ని యందుఁ బ్రదర్శింపఁ బడినవి. ఈపూర్వయుగమునఁ దల యెత్తిన యుత్తమసాహిత్యసంప్రదాయములు పంపమహాకవి యుగములోఁ బ్రౌఢత్వమును సంతరించుకొనినవి. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దమునకు ముందున్న కన్నడభాష హళగన్నడమునకంటేఁ బ్రాచీనరూపముతోఁ దమిళమునకు దగ్గఱి పోలిక గలదైయుండెను. సంస్కృతభాషా పరిచయము, దాని యనుసరణము నప్పటివారిలోఁ జాలవఱకున్నను 'దేశి' పద్ధతి కూడ 'మార్గ' పద్ధతితోఁ బాటు సమానగౌరవము నందియుండెను. ఇట్టిస్థితిలో 'కవిరాజమార్గము' అవతరించి దండిభామహుల సంస్కృతలక్షణము ననుసరించినప్పటికిని బెక్కువిషయములను స్వతంత్రముగాఁ జర్చించి తరువాతికవులకు మార్గదర్శక మయ్యెను. కన్నడకవిత్వములోని ప్రౌఢమార్గమునకు రాచబాట వేసెను. ఆరాచబాటలోఁ బయనించి పంపమహాకవి మార్గపద్ధతిలోని ప్రౌఢసంప్రదాయములకును, దేశిపద్ధతిలోని సరళరీతులకును దనకావ్యములలోఁ జక్కని సమన్వయమును సాధించి మహాకావ్యకవిత్వమున కొక యాదర్శము నెలకొల్పెను. చక్కనిపథము నొకదానిఁ దీర్చి దిద్దెను. అతఁడు ప్రతిభాసంపన్నుఁడగుమహాకవి యగుటచే దరువాతి కవులపై నాతనిప్రభావము విశేషముగాఁ గనఁబడును. అతనికావ్యముల యందుపయుక్త మయినభాష సంస్కృతీకరింపఁబడిన కన్నడము. అదియే యెల్లరకు నాదర్శ మయ్యెను.

ఆకాలమున జైనకవులు జైనసారస్వతమునుండియు, బ్రాహ్మణ కవులు సంస్కృతవాఙ్మయమునుండియుఁ దమకావ్యవస్తువులను గ్రహించుచుండిరి. అయినను వీరిది స్వతంత్రరచనములేయని చెప్పదగును. జైనకవుల గ్రంథములు ధార్మికములనియు, లౌకికము లనియు రెండువిధములుగా విభాగింపఁదగి యున్నవి. ధార్మికకావ్యములు జైనతీర్థంకరులయొక్కయు, మహాపురుషుల యొక్కయు జీవిత చరిత్రములను జిత్రించుచు జైనమతమును బ్రచారము చేయుసాధనములుగాఁ జూపట్టును. లౌకికకావ్యములు ప్రసిద్ధము లయిన రామాయణ, మహాభారతములనుండి కథలను గ్రహించి తమ్ముఁబోషించు రాజులచరిత్రములు సూచితము లగునట్లు రచింపఁబడిన ధ్వనికావ్యము లనఁదగును. ఇవి యన్నియుఁ జంపూకావ్యములే.

కవిరాజమార్గము కన్నడమున కాదిగ్రంథ మయినట్లే, పంపమహాకవి కన్నడ సారస్వతమున 'ఆదికవి'గాఁ బరిగణింపఁ బడుచున్నాఁడు. ఇతఁడు జైనమతావలంబకుఁడు. క్రీస్తుశకము పదియవశతాబ్దమున వేములవాడ నేలిన అరికేసరి యాస్థానకవీశ్వరుఁడై వాసికెక్కినాఁడు. ఇతఁడు విక్రమార్జున విజయము, ఆదిపురాణము లనురెండు గ్రంథములను రచించెను. దీనిలో ఆదిపురాణము మొదటిజైనతీర్థంకరుఁడైన 'వృషభనాథుని' జీవితచరిత్రము నభివర్ణించును. ఇది యొకధార్మికకావ్యము. ఇతఁడు తన భారతమున కథానాయకుఁ డయిన యర్జునునికిని, దనప్రభు వయిన అరికేసరికిని అభేదాధ్యవసాయముకల్పించి భారతకథకు స్వేచ్ఛానుసరణ మొనర్చెను. ఇతనితరువాతఁ గన్నడమునఁ గవిత్వము చెప్పిన మహాకవులు పెక్కు రీతని ననుసరించిరి. ఇతనివలెనే వారును ధార్మిక లౌకిక కావ్యములు రెంటిని రచించుట తమధ్యేయముగాఁ దలపోసిరి.

'రత్నత్రయ' మని కీర్తింపఁబడు ముగ్గురుకన్నడమహాకవులలో రెండవవాఁడగు 'పొన్నకవి' పంపనివలెనే శాంతిపురాణ మను నొక ధార్మికకావ్యమును, భువనైకరామాభ్యుదయ మనునొక లౌకికకావ్యమును రచించెను. ఇతనిశాంతి పురాణము పదునాఱవ తీర్థంకరుఁ డగుశాంతినాథుని జీవితము నభివర్ణించును. తన యాశ్రయదాత యగు రాష్ట్రకూటచక్రవర్తి 'కృష్ణుని' చరిత్రమును గర్భితము చేసి యీతఁడు భువనైకరామాభ్యుదయ కావ్యమును రచించియుండు నేమో యని విమర్శకు లూహించుచున్నారు. భువనైకరామాభ్యుదయము లభ్యముగుట లేదు.

'రత్నత్రయము' లో మూఁడవవాఁడగు రన్నకవి అజితపురాణము, సాహస భీమసేనవిజయము అను గదాయుద్ధము అను రెండుకావ్యములను రచించెను. దీనిలో 'అజితపురాణము' రెండవతీర్థంకరుఁ డయిన అజితనాథుని చరిత్రము నభివర్ణించును. ఇతఁడు మొదట సామంతమండలేశ్వరుఁడై యుండి పిదరిదినములలోఁ జాళుక్యచక్రవర్తి యగు తైలపుని యాస్థానముఁజేరి యువరాజగు 'సత్యాశ్రయుని' నాయకునిగా వరించి 'సాహసభీమసేనవిజయ' మను లౌకికకావ్యమును రచించెను. ఇందుఁ బంపని మార్గము ననుసరించి కథానాయకుఁ డయినభీమసేనునికిని, సత్యాశ్రయునికిని నభేదము కల్పింపఁబడినది.

గాంగరాజగురాచమల్లుని మంత్రియు, సేనాధిపతియు నగు చాపుండరాయఁడు త్రిషష్టిశలాకాలక్షణమహాపురాణము అనుపేర నొకధార్మిక కావ్యమును సరళ మయిన వచనములో రచించెను. దీనికే చావుండరాయపురాణ మని కూడ మఱొకపేరు కలదు. ఇందు అరువదిముగ్గురు శలాకాపురుషుల చరిత్రలు కలవు. అరువదిముగ్గురు శలాకాపురుషులనఁగా **24** మంది తీర్థంకరులు, **12** గురు చక్రవర్తులు, **9** మంది బలదేవులు, **9** మంది వాసుదేవులు, **9** మంది ప్రతివాసుదేవులు.

మొదటి నాగవర్మ కన్నడసారస్వతమునందలి మొదటి బ్రాహ్మణకవి. అతఁడు బాణుని సంస్కృతకాదంబరిని కన్నడమునఁ జంపువుగా రచించెను. ఇతఁడు చావుండరాయని యాశ్రితులలో రన్నునివలె సుప్రసిద్ధుఁడు. దుర్గసింహుఁడు అనుకవి వసునాగభట్టు సంస్కృతమున వ్రాసిన పంచతంత్రమును గన్నడమునఁ జంపూకావ్యముగా రచించెను. నాగచంద్రుడు అను జైనాచార్యుడు 'మల్లినాథ పురాణము' అను నొకధార్మికకావ్యమును రచించెను. అందుఁ బందొమ్మిదవ తీర్థంకరుఁడగు మల్లినాథుని చరిత్రము పదునాలుగాశ్వాసములలో నభివర్ణింపఁబడినది. ఇతఁడు పంపరామాయణ మనునామాంతరముకల రామచంద్రచరిత్రపురాణ మను మఱియొకకావ్యమును గూడ రచించెను. రామాయణ గాథకు జైనపార మీతనిరామాయణము. ఇది లౌకికకావ్యము. నయసేనుని ధర్మామృతమున జైనమతాచారములలోఁ జతుర్దశమహారత్నములని పేరు పొందినవ్రతముల నాచరించి సద్గతి నందిన మహాపురుషుల కథ లభివర్ణింపఁబడినది. ఈతని ధర్మామృతము కర్ణపార్యుని నేమినాథపురాణము - రెండును జంపూకావ్యములే. ఇట్లు కన్నడమున నాదికవి యగుపంపమహాకవి ప్రారంభించిన మహాకావ్యకవిత్వోద్యమము లేక ధార్మికలౌకికకావ్యోద్యమ

మించుమించుగా రెండుశతాబ్దములకాలము కన్నడసాహిత్యముపైఁ దనప్రభావమును బ్రసరింపఁజేసినది. దీనినే మార్గకవిత్వోద్యమము అని కూడఁ బేర్కొన వచ్చును. ఈయుద్యమముచేఁ బ్రభావితు లయినకవులు పంపని వలెనే ధార్మికకావ్యములను, లౌకికకావ్యములను రచించిరి. వారు చేపట్టిన కావ్యప్రక్రియ చంపూకావ్యము. వారు సంస్కృతీకరింపఁబడిన కన్నడమునే యభిమానించిరి.

## భక్తికవిత్వోద్యమము లేక దేశికవిత్వోద్యమము

**(క్రీ.శ. 12వ శతాబ్ది నుండి 15వ శతాబ్ది వఱకు)**

కన్నడసాహిత్యమున క్రీస్తుశకము 12వ శతాబ్ది మొదలుకొని 15వ శతాబ్ది వఱకుఁ గలకాలము బసవయుగము లేక స్వతంత్రయుగము అని వ్యవహరింపఁ బడు చున్నది. క్రీస్తుశకము 1160 ప్రాంతమునఁ గన్నడదేశమున బసవేశ్వరుఁడు ప్రసిద్ధికి వచ్చి కన్నడసాహిత్యమున కొక క్రొత్తరాచబాటను వేసెను. ఇతనికాలమునఁ గన్నడములో నొకనూత్నసారస్వతోద్యమము ప్రారంభమయ్యెను. దానితోఁ గన్నడసారస్వతమందలి యాడంబరముతోఁ గూడిన గ్రాంథికశైలీపద్ధతిపై - మార్గకవితాపద్ధతిపై నొకవిప్లవము చెల రేఁగిన దన వచ్చును. ఈకాలమున కొంకించుక పూర్వకాలమందే నయసేనుఁడు తన ధర్మామృతములోఁ గన్నడసారస్వతమున నధికముగా సంస్కృతపదముల నుపయోగించు విషయమునఁ దనయసమ్మతిని బ్రకటించి యుండెను. పండ్రెండవ శతాబ్ద్యంతమున బసవేశ్వరుఁడు వీరశైవమతోద్ధరణమునకు సంకల్పించుటలో నీయుద్యమము కార్యరూపము దాల్చెను. బసవేశ్వరాదులగు శివశరణులు తమమతమును బ్రచారము చేయునుద్దేశముతోఁ దాము రచించిన రచనములయందుఁ బ్రజాసామాన్యము యొక్క భాషనే యుపయోగింప మొదలిడిరి. ఈకాలమునఁ గన్నడసాహిత్యము మార్గపద్ధతి నుండి దేశి పద్ధతికిఁ బరివర్తనము చెంద నారంభించినది. విషయములో, భాషలో, ఛందస్సులో 'దేశి' ప్రాధాన్య మధికము కాఁదొడఁగెను. 'వచనము' అనునూత్నసాహిత్యప్రక్రియ ప్రచారములోనికి వచ్చెను. రగళె, త్రిపది, షట్పది అను అచ్చగన్నడచ్ఛందస్సుతో గ్రంథములు వెలసెను. శివలీలలు, శివశరణుల చరిత్రములు, కావ్యవస్తువులయ్యెను. భాషావిషయకముగా హళగన్నడమునకును, హొసగన్నడమునకును నడుమ 'నడు గన్నడము' వ్యాప్తిలోనికి వచ్చెను.

'వచనము' అనునది యొకప్రత్యేకలక్షణము గలిగిన సాహిత్యప్రక్రియ. దాని నేఁటివారు వచనపద్యమనుచున్నారు. అది కవిత్వమునకు పుట్టినిల్లు అనఁదగును. దానిని విరివిగ పాడుటయు నాచారమగుటచే దానికి సంగీతమువంటి చాయకూడ దగునని. కన్నడభాష మిక్కిలి సరళము. ఇందుఁ గ్లిష్ట మయిన సంస్కృతపదాడంబర ముండదు. అది సామాన్య జనులకొఱకై వ్రాయఁబడిన స్వతంత్రరచనములు. దీనిని పాటలుగాఁ గూడఁ బాడుకొన వచ్చును. భక్తిసాహిత్యమును వెలయించిన బసవేశ్వరుఁడు, వైరాగ్యరచనలు గావించిన అల్లమ ప్రభువు, కర్మయోగసంబంధు లగురచనలు గావించిన సిద్ధరాముఁడు, జ్ఞానప్రధానుఁడయిన చెన్నబసవేశ్వరుఁడు, అక్కమహాదేవి మొదలగువారు ప్రముఖవచనకారులు. ఇంకను బసవనిసమకాలికులలో మడివాళమాచయ్య, అంబిగర చౌడయ్య, సకలేశమాదరసు అనువారు కూడఁ బెక్కువచనములను రచించిరి. పండితత్రయ మని ప్రసిద్ధి వహించిన శివలెంక మంచన, శ్రీపతి పండితుఁడు, మల్లికార్జున పండితారాధ్యుఁడు అనువారిలో మంచెన మల్లికార్జునులు కన్నడవచనములను వ్రాసిరి.

పంద్రెండవశతాబ్దిలోఁ బేరెన్నిక గాంచినభక్తకవి 'హరిహరుఁడు'. ఇతనికి 'రగళె' మీఁద మక్కువ యధికము. 'రగళె' యను కన్నడదేశిచ్ఛందములోఁ బూర్తికావ్యమును వ్రాయుట కితఁడే ప్రథముఁడు. ఈదేశిచ్ఛందస్సును వ్యాప్తికిఁ దెచ్చి యితఁడు కన్నడసాహిత్యమున కొకనూతనాలంకారమును సంతరించెను. ఇతని 'శివశరణద రగళె' శివభక్తుల చరిత్రముల నభివర్ణించు పంద్రెండువందల లఘుకృతులు. ఇది యన్నియు రగడచ్ఛందస్సులోనే వ్రాయఁబడినది.

ఈహరిహరుని మేనల్లుఁ డయిన రాఘవాంకుఁ డనుకవి సంస్కృత పాండిత్యమును గడించినవిద్వాంసుఁడయ్యును జంపూపద్ధతిని జేపట్టక – సంస్కృతచ్ఛందస్సునే కూడ నుపయోగింపక దేశి యగు 'షట్పది' లోనే తనకావ్యములను విరచించెను. ఇతనికృతులలో సోమనాథచరితె, వీరేశచరితె, సిద్ధరామపురాణ, హరిశ్చంద్రచారిత్ర యనునవి ప్రకటింపఁబడినవి. వీనిలో వీరేశ్వరచరిత్ర ముద్దందషట్పదిలోను, దక్కిన మూఁడుగ్రంథములును వార్ధకషట్పదిలోను రచింపఁబడినవి. ఈకాలముననే చెందిన పాల్కురికి సోమనాథుఁడు 'శీలసంపాదనె' యను వచనమును, సద్గురు రగళె, చెన్నబసవస్తోత్ర రగళె, శరణుబసవ రగళె యను రగడకృతులను గన్నడములో రచించెను.

ఈకాలముననే చెందిన 'అండయ్య' యనుకవి (1235) పూర్వకవులవలెఁ జంపూకావ్యపద్ధతిని నాదరించియు వస్తువులో – భాషలో – శైలిలోఁ దన

ప్రత్యేకతను జాటెను. ఇతఁడు ఒక్క సంస్కృతపదమును గూడ వాడక యచ్చ గన్నడమున 'కబ్బిగరకావ' అను నొకకావ్యమును వ్రాసెను.

పాల్కురికి సోమనాథుని బసవపురాణమును పదునాలుగవ శతాబ్దమధ్యమున భీమకవి భామినీషట్పదిలో గన్నడములోనికి అనువదించెను. ఇతనివలెనే పద్మణాంకుఁ డనుకవి 'పద్మరాజపురాణ' మనుగ్రంథమును వార్ధకషట్పదిలో రచించెను.

పంద్రెండవశతాబ్దమున జైనమతము పూర్వౌన్నత్యమును గోలుపోయినది. వైదిక మతములు శుష్కాచారములలోఁ బడి యుండెను. నూతనోత్తేజమును గలిగించి సమాజమును జక్కని మార్గమున నడపించుటకు బసవేశ్వరాదు లగు శివశరణు లుదయించి కన్నడమున భక్తిసాహిత్యమును వెలయించి తమరచనలను ప్రజాసామాన్యమయొక్క భాషలో, దేశిచ్ఛందస్సులలో వెలయింపఁజేసిరి. వస్తువులో, రూపములో, భాషలో స్వాతంత్ర్యము నూతనప్రక్రియలమీఁద నానక్తి యీ యుద్యమకాలమందలి వెలువడిన రచనలలోఁ గాన వచ్చును. అందుచేతనే యీభక్తికవిత్వోద్యమము దేశికవిత్వోద్యమ మని కూడఁ బేర్కొనఁదగి యున్నది.

## దాసకూటోద్యమము (క్రీ.శ. 16, 17 శతాబ్దములు)

క్రీస్తుశకము 1500 ప్రాంతమునకుఁ జెందిన శ్రీపాదరాయులలో దాసకూటోద్యమము ప్రారంభమయినది. దాసు లనువారు విష్ణుభక్తులు. ద్వైతమతావలంబకులు. వీరు భక్తిమార్గమును బోధించిరి. దాసకూటమును స్థాపించినది వీరే. విష్ణుభక్తిని బ్రజలలోఁ బ్రచారము చేయుటకై వీరు పెక్కు భక్తి గీతములను విరచించిరి. వీరిగీతములు కన్నడిగులలో మిక్కిలి ప్రసిద్ధి పొందినది. అందు వారు జనసామాన్యము మాటాడుకన్నడమునే యుపయోగించిరి. ద్వైతమతప్రవక్త యగుశ్రీమధ్వాచార్యులవారి శిష్యుఁడగు నరహరి తీర్థులు దాసకూటనిర్మాత యై పేరు గాంచెను. అతని తరువాత పదునాలుగు పదునైదు శతాబ్దులలోఁ దగినినాయకులు లేక యీ దాసకూటము స్తంభించి యుండెను. అట్టి దానిని బదునాఱవ శతాబ్దమున శ్రీపాదరాయులు పునరుద్ధరించిరి. విజయనగర సామ్రాజ్యకాలములో నత్యుచ్చదశయందుండిన యీదాసకూట మాసామ్రాజ్యపతనానంతరము మఱల స్తబ్ధత్వము వహించెను. దానిని మరల విజయదాసు, జగన్నాథదాసాదులు లేప నెత్తిరి.

బసవయుగమునందలి వచనవాఙ్మయమువలె దాసకూటమునకుఁ జెందినభక్త కవులు సృష్టించిన దాసవాఙ్మయము ప్రజలలో నూతనచైతన్యమును గలిగించెను. తమకుఁ బూర్వము కన్నడమునఁ గవిత్వము చెప్పిన జైనకవులు, వీరశైవకవులవలె నీదాసకూటమునకుఁ జెందిన బ్రాహ్మణకవులు కూడ జనసామాన్యమున కందుబాటులో నుండు సాహిత్యనిర్మాణమును గావించి దానికి సంగీతమును గూడ జోడించిరి. దాసవాఙ్మయమున దేవరనామములనే వెలయింపఁజేసిన మహాపురుషుఁడు శ్రీపాదరాయలు. ఇతఁడు ద్వైత మతగ్రంథములను గన్నడములోనికిఁ బరివర్తింపఁ జేయుటకై యొకభాగవతసమూహము నేర్పఱిచి దైవపూజాసమయములలో వారిచే దేవరనామములను బాడించుట మొదలుపెట్టెను. 'రంగవిట్ఠల' మకుటముతో వీరు కన్నడములో రచించినకీర్తనలు కొన్ని మాత్రము లభించినవి. వ్యాసరాయలు శ్రీపాదరాయల ముఖ్యశిష్యుఁడు. ఇతఁ డనేకసంస్కృతగ్రంథములను వ్రాసి ప్రసిద్ధి నందుటయే కాక, కన్నడములోఁ బ్రసిద్ధము లయిన దేవరనామములను రచించెను. ఇతనికాలములో దాసకూటమున నొక చిన్న చీలిక యేర్పడి యది వ్యాసకూటమని వ్యవహరింపఁబడినది. ఇతఁడు నూర్లకొలదివుంనోహరము లయిన కీర్తనలను గన్నడ భాషలో రచించి దాసకూటమును మిక్కిలి యున్నతస్థానమునకుఁ గొని వచ్చెను. వ్యాసరాయలశిష్యులలోఁ బ్రముఖుఁడు పురందరదాసు. ఇతఁడు వ్రాసినన్ని కీర్తనలను మఱెవ్వరును వ్రాయలేదు. తెలుఁగువారికి త్యాగరాజెట్టివాఁడో కన్నడిగులకుఁ బురందరదా సట్టివాఁడు. వ్యాసరాయల ముఖ్యశిష్యులలో 'కనకదాసు' కూడఁ బేర్కొనఁదగినవాఁడు. ఇతఁడు వ్రాసినకీర్తనలు జనులలో విశేషప్రచారమున నున్నవి. వ్యాసరాయుల శిష్యకోటికిఁ జెందినవాఁడే యగు వాదిరాజతీర్థులు కూడ వ్యాసకూట, దాసకూటములకు ముఖ్యుఁడై యనేకసంస్కృతగ్రంథములను రచించెను. ఇతఁడు కన్నడములోఁ గూడఁ బెక్కుకీర్తనములను రచించెను. అవి ద్వైతమతసిద్ధాంతమును బ్రతిపాదించుచు సాహిత్య సౌరభముతో గుబాళించు చుండును.

విజయనగరరాజ్యపతనానంతరము పదునేడవశతాబ్దాంతమున దాసకూటము స్తబ్ధత నొందఁగా పదునెనిమిదవ శతాబ్దమున ప్రసన్నవేంకటదాసు, గోపాలదాసు, విజయదాసు, జగన్నాథదాసు అనువారు దానిని బునరుద్ధరించిరి. వారిలో దాసకూటపరంపరను మహోజ్జ్వలముగాఁ గొనసాగించిన మహాపురుషుఁడు జగన్నాథదాసు. ఇతఁడు తంత్రసారము, హరికథామృతసారము లనుగ్రంథములనే

కాక యనేకకీర్తనలను కన్నడములో రచించి దాసవాఙ్మయమును బరిపుష్టము గావించెను. దాసకూటోద్యమఫలితముగా సామాన్యజనులకు ద్వైతమతతత్త్వములు సంబోధ మయ్యెను. వారిలో భగవద్భక్తి బెంపొంది చక్కని సంస్కార మలవడెను.

## పునరుజ్జీవనోద్యమము (క్రీ.శ. 17వ శతాబ్దము)

క్రీస్తుశకము పదునేడవశతాబ్దమునఁ బ్రాచీనకవితావిధానమును బునరుజ్జీవింపఁ జేయుప్రయత్నములు జరగినవి. ఆకాలమున మైసూరును బాలించుచుండిన చిక్కదేవరాయలు స్వయము కవీశ్వరుఁ డగుటచేఁ బెక్కురు కవీశ్వరులను గవిత్వరచనమునకుఁ బ్రోత్సహించెను. అతనిప్రోత్సాహమున నాకాలపుఁ గవులు వరలఁ బ్రాచీన పద్ధతిలోఁ జంపూకావ్యములను గద్యకావ్యములను వ్రాయఁదొడఁగిరి. అతనియాస్థానమున నుండిన తిరుమలార్యుఁడు, చిక్కుపాధ్యాయుఁడు రచించిన విష్ణుపురాణము, రుక్మాంగద చరిత్రము మొదలగు చంపూగ్రంథములు విశిష్టాద్వైతతత్త్వములను వివరించు సంస్కృతమయములై ప్రౌఢము లై యున్నవి. అతఁడు రచించిన సాంగత్య గ్రంథములు మాత్రము సరళకన్నడములో నున్నవి.

## ఆధునికకవిత్వోద్యమము

### (క్రీ.శ. 19వ శతాబ్ది యుత్తరభాగము, 20వ శతాబ్దప్రారంభము)

పందొమ్మిదవశతాబ్దమున నాంగ్లేయసాహిత్యప్రభావము భారతదేశములోని తక్కినప్రాంతములయందువలెనే కన్నడదేశముపైఁ గూడఁ బ్రసరించినది. తత్ఫలితముగా కన్నడిగుల దృక్పథములో నూతన మయిన పరిణామ మేర్పడెను. క్రొత్త దృష్టియుఁ గ్రొత్తధోరణియు వారి కలవడినవి. కన్నడసాహిత్యములోఁ గూడ నవల, కథ, చరిత్ర, విషాదాంతనాటకములు, స్వీయచరిత్రములు, వ్యాసములు, విమర్శలు, గేయములు మొదలయిన వివిధసాహిత్యప్రక్రియలు తలయెత్తినవి. ఇరువదియవశతాబ్దమున గాంధీ మహాత్ముని జాతీయోద్యమశంఖారావము కన్నడదేశమునఁ గూడఁ బ్రతిధ్వనించెను. కర్ణాటకదేశమున జాతీయతా పాంచజన్యమును బూరించిన ఆలూరు వేంకటరాయని ననుసరించి శ్రీ బి. యం. శ్రీకంఠయ్య యనుకవీశ్వరుఁడు నవయుగవైతాళికుఁడై కర్ణాటకపూర్వవైభవమును గానము చేసెను. అతఁడు ఆంగ్లసాహిత్యరత్నాకరము నుండి కొన్ని యాణిముత్తెముల నేరి దానిని గన్నడములోని కనుపదించి 'ఇంగ్లీషు గీతగళు'

అనం నొక కవితాసంపుటిని బ్రచురించెను. అది కన్నడమున నొక నూతనోద్యమమునకు దారి తీసినది. అనేకు లాయనమార్గము నవలంబించి గేయకృతులు రచింప సాగిరి. ఇంగ్లీషు 'లిరిక్' పద్ధతిని కన్నడమునకుఁ దెచ్చి వారాపద్ధతిలోఁ బెక్కు గేయములను కన్నడములో రచించిరి. శ్రీకంఠయ్యగారి యనువాదసంకలనము ప్రకటింపఁబడినతరువాత కన్నడకవితారచనలో నపూర్వపరిణామ మేర్పడి తరువాతివారి కది యొరవడి యైనది. శ్రీకంఠయ్య గారి శిష్యవర్గమునకుఁ జేరిన వి. సీతారామయ్య, కే. వి. పుట్టప్ప, పు. తి. నరసింహాచార్యులు, రాజరత్నంగారలు వారివలెనే పెక్కు గేయకృతులను వెలయించిరి. అది స్తబ్దమై యున్న ప్రాచీనజగత్తునకు, నుత్తేజిత మయిన నూత్నజగత్తునకు నడుమ నొకమధురమనోహర కవితాసేతువును నిర్మించుచున్నది.

## ప్రగతిశీలసంఘోద్యమము (క్రీ.శ. 1945 ప్రాంతము)

సమకాలికసాహిత్యముపై నావరించి యుండినయంధకారమును దొలఁగించి క్రొత్తరచయితల నెందఱినో వెలుఁగులోనికిఁ దెచ్చినకీర్తి బెంగుళూరు నగరములోని ప్రగతిశీల సంఘమునకుఁ జెందును. సాహిత్యము సార్వజనిక మై ప్రజావాణి కావలయు ననుట యాసంఘముయొక్క యుద్దేశము. అగస్టువిప్లవానంతర మీసంఘమునకుఁ జెందిన యువకవులు కన్నడసాహిత్యమును ప్రగతిమార్గమునకుఁ బట్టించిరి. వ్యర్థము లయిన లతలమీఁదను, బుష్పములమీఁదను కవితలల్లు చుండిన కవీశ్వరులను హెచ్చరించి వీరు వారి దృష్టిని దేశారాధనమువైపునకు మళ్లించిరి. వీరు సృష్టించినసాహిత్య మొకవిధముగా నాంధ్రభాషలోని యభ్యుదయకవిత్వములో సరిపోలు ననవచ్చును.

1914వ సంవత్సరమున స్థాపింపఁబడిన కన్నడసాహిత్యపరిషత్తు, బి. యు. శ్రీకంఠయ్య, మాస్తి వేంకటేశయ్యంగార్, డి. బి. గుండప్ప యనువారు నడపిన 'తళిరుగుంపు', పంజె మంగేశరావు, గోవిందరై యనువారియాధ్వర్యమున సాగిన 'మంగళూరు మిత్రమండలి', 'బేంద్రే' నాయకత్వమున వెలసిన 'గెళెయరగుంపు' మొదలయినసాహిత్యసంఘముల మూలమునఁ గూడ కన్నడభాషలో విస్తారమయిన కృషి జరిగినది. ఈసంఘములకుఁ జెందినకవులమూలమున నవ్యకవిత్వము విశేషముగా వెలువడినది. వారి కవితలలో గేయములు, మాత్రాఛందస్సులు, గేయనాటికలు మొదలయిన వివిధనవ్యకావ్యప్రక్రియలు సాధింపఁబడెను. సాహిత్యసంఘములు సాగించిన కవితాప్రస్థానము కూడ కన్నడ సాహిత్యమునఁ జిరస్మరణీయము.

## (VII) మలయాళ సాహిత్యము

తమిళము, కన్నడము, తెలుఁగు మలయాళము అనునవి ద్రావిడభాషా కుటుంబమునకుఁ జెందిన నాగరక భాషలు. దీనిలో నాయాభాషలను వ్యవహరించు జనుల సంఖ్యనుబట్టి చూచినచో తెలుఁగునకును - భాషాసారస్వతముల ప్రాచీనతనుబట్టి చూచినచో తమిళమునకును నగ్రస్థానము లభించుచున్నది. మలయాళమున కీరెండువిషయములు లందుఁ గూడ నాలుగవస్థానమే లభించును. కాల్డ్వెల్‌మతము ననుసరించి మలయాళమునఁ గావ్యవాఙ్మయము క్రీస్తుశకము పదునాఱవ శతాబ్దినుండియుఁ బ్రారంభ మయ్యెనని నుడువవలసి యున్నది. కాని, మలయాళభాషాపండితు లీయభిప్రాయము నంగీకరించుట లేదు. మలయాళసాహిత్యమున 'ఎళుత్తచ్చన్' మహాకవికి విశిష్ట మయినస్థానము కలదు. అతనితోనే మలయాళమునఁ గావ్యవాఙ్మయము ప్రారంభమయ్యెనని కొందఱు తలఁచు చున్నారు. కాని, యదిసత్యము కాదు. అతనికిఁ బూర్వమే మలయాళమున గణనీయ మయినసారస్వతము వెలువడినది. తక్కినభాషాసారస్వతములయందువలెనే యీమలయాళ భాషయందును గొన్ని సాహిత్యోద్యమము లేర్పడి యాసాహిత్యప్రగతికిని, బరిణామమున కును దోహదము కావించినవి. వానిలో ముఖ్యముగా నీక్రింది సాహిత్యోద్యమములు పేర్కొనఁదగి యున్నవి.

| | |
|---|---|
| 1. శెందమిళు ఉద్యమము | 2. మణిప్రవాళభాషోద్యమము |
| 3. నిరణకవిత్వోద్యమము | 4. గాథాకవిత్వోద్యమము |
| 5. కిళిపాట్టు ఉద్యమము | 6. చంపూకావ్యోద్యమము |
| 7. సందేశకావ్యోద్యమము | 8. అట్టక్కథ యుద్యమము |
| 9. తుళ్లల్ ఉద్యమము | 10. ఆధునికకవిత్వోద్యమము |
| 11. మర్మకవిత్వోద్యమము | 12. అభ్యుదయకవిత్వోద్యమము |

ఈ యుద్యమములు ప్రధానముగా భాష, ఛందస్సు, ప్రక్రియ, కవితా పద్ధతి యనువానిమీఁద నాధారపడియున్నది. దీనియావిర్భావవికాసములనించుక పరిశీలింతము.

## 1. శెందమిళు ఉద్యమము (క్రీ. శ. 12వ శతాబ్దము)

మలయాళదేశమునఁ దమిళభూపతు లగు పెరుమాళ్ రాజవంశీయులు క్రీస్తుశకము 825 దాఁకఁ బరిపాలించిరి. వారిమూలమునఁ దమిళసంస్కృతి కేరళదేశమున వ్యాపించినది. అప్పటికి మలయాళమునఁ గావ్యభాష యేర్పడక పోవుటచేఁ దమిళము నందలి కావ్యభాషకుఁ గేరళమునఁ బ్రాధాన్య మేర్పడెను. ప్రాచీనకాలమునందలి తమిళ భాషకు 'శెందమిళు' అని పేరు. దాని ప్రాముఖ్యముకల మలయాళకావ్యములలో 'రామచరితము' ముఖ్యముగాఁ బేర్కొనఁ దగినది. ఇది పండ్రెండవశతాబ్దమున రచింపఁ బడెనని చెప్పుదురు. ఇందుఁ దమిళభాషాప్రభావ మెక్కువగా నుండుటయే కాక, కొన్ని మలయాళ శబ్దములకుఁ గూడఁ దమిళరూప మొసఁగఁ బడెను. ఈభాషకు 'పాట్టు' అను నొక పారిభాషికనామధేయము కూడఁ గలదు. ఈ తమిళభాషా ప్రభావము మలయాళకావ్యములయందుఁ బదునాలవశతాబ్దమువఱకు నేదో రూపమున నుండుచునే వచ్చెను.

## 2. మణిప్రవాళభాషోద్యమము (12, 13, 14 శతాబ్దములు)

మలయాళమునకు మణిప్రవాళభాష యొకప్రత్యేకత. మలయాళమున నది కొంతకాలము కవితాసామ్రాజ్యమునే యేలిన దని చెప్పవచ్చును. మణిప్రవాళ మనుహారమునందు మణులు మలయాళశబ్దములు, ప్రవాళములు సంస్కృత శబ్దములు నుండును. దీనిని జక్కఁగా గుదిగుచ్చవలయును. అప్పుడే యా హారము కన్నులపండువు సేయును. సంగ్రహముగఁ జెప్ప వలె నన్నచో మధురము లగు మలయాళసంస్కృతశబ్దములు సమ్మేళనమే మణిప్రవాళమనఁ దగును. ఇట్టిభాషకుఁ దొలుత దారి తీసినవారు నంబూద్రీలు. వీరి పూర్వు లార్యావర్తము నుండి వచ్చినవారు. శతాబ్దముల తరబడి కేరళమున నివసించినను దాము ద్రావిడుల మనుసంగతిని వారి హృదయము అంగీకరింప కుండెను. సంస్కృతము తెలియుని సామాన్యజనులలో వారి సంస్కృతరచనములకుఁ బలుకుబడి తగ్గిపోవుచుండెను. ఆవిషయమును గమనించి నంబూద్రీలు మణిప్రవాళభాషాశైలికి దారి తీసిరి. వారు తొలుత దానిని దవజాతి సభ్యులలోఁ బ్రచారమొనర్చిరి. పిదప నది నాయర్ స్త్రీలలోనికిఁ బ్రాకినది. క్రమముగా నది కవితామార్గమున నొకశాఖ యయ్యెను. మణిప్రవాళసారస్వతశాఖలో విశేషకృషి యొనర్చిన పి. శంకరన్ నంబియార్ లను విద్వాంసుఁడు తద్రచనావిధానమును గూర్చి యిట్లు తెలిపి యున్నాఁడు.

'సంస్కృతకావ్యములను బండితులు కానివారు కూడc జవి చూడ వలయునని కొందఱభిలషించి యుందురు. అట్టివారికి సంస్కృతశబ్దజాలమును, వ్యాకరణమును చిన్న చిన్న మోతాదులలోc జతురముగా నందించినచో వా రనాయాసముగా దానిని స్వీకరింపc గలుగుదురు. తత్ఫలితముగాc దమకుc దెలియకుండcగనే వారు కావ్యరసాస్వాదన మొనర్చుచు సంస్కృతవ్యాకరణ రహస్యములను గూడ గ్రహింపc గలుగుదురు.....'.[4]

మలయాళమున నీ విధమయిన రచనావిధాన మెప్పుడు ప్రారంభమయ్యెనో చెప్పc జాలము. కాని, కులశేఖర పెరుమాళ్ అను తమిళభూపతి (క్రీ.శ. 9వ శతాబ్దము) యాస్థానకవి యగు తోలన్ అనునతని హాస్యరసస్ఫోరక మగురచనతో నీపద్ధతి ప్రారంభమై యుండవచ్చునని కొందఱు నుడువుదురు. ఈశైలిలో దొరకిన మొదటి కావ్యము 'వైశికతంత్రము' అనునది. మణిప్రవాళకావ్యములలో 'ఉణ్ణునీలి సందేశము' గొప్పకావ్యము. ఈశైలియందు రచింపcబడిన కావ్యములలో సంస్కృత భాషాప్రభావ మెక్కువగాc గనcబడును.

### 3. గాథా కవితోద్యమము (క్రీ.శ. 15వ శతాబ్దము)

ప్రాచీన మలయాళ వాఙ్మయమునందలి ప్రశస్తకావ్యములో 'కృష్ణగాథ' యొకటి. గాథ యను మాటకు మలయాళమున నొక విశిష్ట మగు నర్థము కలదు. కృష్ణగాథ మంజరీ ఛందస్సున వ్రాయcబడెను. ఈ ఛందస్సున వ్రాయcబడిన కావ్యము నకే మలయాళమున 'గాథ' యను వ్యవహార మేర్పడెను. కృష్ణ గాథకుc (15వ శతాబ్దము) బిదప మలయాళమునం దెన్నియో గాథలు వెలసెను. వానిలో 'భారతగాథ' కూడ బేర్కొనc దగియున్నది.

### 4. నిరణ కవితోద్యమము (క్రీ.శ. 14, 15వ శతాబ్దములు)

'కణ్ణశన్ పాట్టుగళ్' అను కావ్యసంపుటములో కణ్ణశరామాయణము పేర్కొనc దగిన కావ్యము, దీనిని రామపణిక్కర్ అనునతcడు రచించెను. ఇంకను నీవంశములో మాధవపణిక్కర్, శంకరపణిక్కర్ అను మఱి యిరువురుకవులు కలరు. వారిని 'నిరణకవులు' అని పేర్కొందురు. కణ్ణశన్ అనునది వీరి వంశనామము. వీరు క్రీ.శ. 1375–1475 ప్రాంతములందు వసించి యుందురని

4. చూ. దక్షిణభారతసాహిత్యములు. పుట 126.

పండితుల యభిప్రాయము. వీరు తమ కావ్యముల యందొక క్రొత్త ఛందస్సునుపయోగించిరి. దానికి నిరణ వృత్తమని పేరు. వీరి కావ్యములలో, దమిళపుఁబాలుతక్కువగాను, సంస్కృతశబ్దములును, సమాసములును నధికముగాను నుండును. వీరు తమ కావ్యములందుఁ జేపట్టిన ఛందమును బట్టి వీరికి 'నిరణకవు' లనియు, వీరి కావ్యములకు నిరణ కావ్యము లనియుఁ బేరు వచ్చెను.

## 5. కిళిపాట్టు ఉద్యమము (క్రీ.శ. 16, 17వ శతాబ్దములు)

కిళిపాట్టు అనఁగా చిలుక పాట యని యర్థము. ఈ చిలుక పాటకు మలయాళ సాహిత్యమున నొకవిశిష్ట స్థానము కలదు. ఇది యొక ఛందో విశేషము. ఇది ఎళుత్తచ్చన్ మహాకవి సుకుమారహస్తమున నందాలు దిద్దుకొనినది. ఈతెగకుఁ జెందినకావ్యములలోఁ గావ్యప్రారంభమునఁ గావ్యమునజెప్పుచున్న పక్షి పేరు సూచింపఁ బడును. కొన్ని కావ్యములలోఁ జిలుకకు బదులుగా హంస గాని తుమ్మెద గాని యుండును. అయినను నిట్టికావ్యములకు 'కిళిపాట్టు' లనియే వ్యవహార మేర్పడెను. ఈతెగకుఁ జెందిన కావ్యములు క్రీస్తుశకము పదునాఱు పదునేడవ శతాబ్దులమధ్య వ్యాప్తిలోనికి వచ్చెను. దీనిని వ్యాప్తిలోనికిఁ గొనితెచ్చినవారిలో 'ఎళుత్తచ్చన్' ప్రథముఁ డని చెప్పుదురు. కాని యతనికిఁ బూర్వమే యిట్టికావ్యములు వెలసియుండెను. ఇది తమిళమునుండి గ్రహింపఁబడిన ఛందోవిశేషమని కొందఱి యభిప్రాయము. కాని, యది నిజము కాదు. తమిళమున ఛందస్సుకు 'అశై' ప్రధానము. మలయాళమునందలి ఛందోరీతులు గానప్రధానములు. కనుక నిది మలయాళచ్ఛంద మనియు, ఎళుత్తచ్చన్ మహాకవి దానికిఁ గావ్య గౌరవముఁ గలిగించె ననియుఁ జెప్పఁ దగును. ఎళుత్తచ్చన్ తరువాత నతనిమార్గము ననుసరించి కొందఱు కవులు కావ్యములను విరచించిరి.[౫]

## 6. చంపూకావ్యోద్యమము (క్రీ.శ. 16, 17 శతాబ్దములు)

సంస్కృతసాహిత్యములోని వివిధ సాహిత్యప్రకియలను మలయాళకవులు స్వీకరించిరి. అట్టివానిలో 'చంపువు' ఒకటి. మలయాళమున వెలసిన చంపూకావ్యములలోని పద్యము లన్నియు వృత్తములయందే యుండును. మఱియు భాష మణిప్రవాళము. అందలి వచనము లయాన్వితమై మలయాళమునందలి 'తరంగిణి' యను ఛందోవిశేషమునకు సన్నిహితముగా

౫. మా. తెలుఁగువిజ్ఞానసర్వస్వము – మలయాళభాషాసారస్వత చరిత్ర. పుట 393.

నుండును. 'చాక్కియారుల' కృషివలనను నీ చంపూకావ్యరచనము కేరళదేశమున బహుళప్రచారము గడించెను. 'కూత్తు' అనబడు నృత్యప్రదర్శనము లిచ్చు నీ చాక్కియారులు తమ 'కూత్తు'లలో నీచంపూపద్ధతినే స్వీకరించిరి. మలయాళమున మొత్తము రెండు వందలదాఁక చంపువులు కలవు. దానిలో రామాయణచంపువు చాల ముఖ్య మయినది. భారతచంపువు, నైషధచంపువు మొదలగునవి మఱికొన్ని కలవు. దీనిలో ననేకములు నంబూద్రి బ్రాహ్మణులచే రచింపఁబడెను.

## 7. సందేశకావ్యోద్యమము

(క్రీ.శ. 14 శతాబ్దము నుండి 17వ శతాబ్దము వఱకు)

సంస్కృతమునఁ గాళిదాసమహాకవివిరచిత మగు మేఘసందేశ మెందఱు కవులకో యొకనూతనోత్సాహమును గల్పించెను. ఉత్తరభారతమునందును, దక్షిణ దేశమునందును దానికిఁ బ్రతికృతులు పెక్కు బయలుదేరెను. కేరళదేశములో నీయలవాటు వెక్కస మగునట్లు పెరుగుచు వచ్చెను. కేరళదేశవిద్వాంసులు సంస్కృతమునందు లెక్కలేనన్ని సందేశకావ్యములు వ్రాసిరి. మణిప్రవాళమందును పెక్కు సందేశకావ్యములు పుట్టినవి. కేరళీయులు రచించిన సంస్కృతసందేశకావ్యములలో శుకసందేశము పేర్కొనఁ దగినది. దీని తరువాత నీపద్ధతి నెన్నియో మణిప్రవాళకావ్యములు పుట్టినవి. వానిలో ఉణ్ణునీలి సందేశకావ్యము ప్రశంసింపఁ దగినది. ఇట్టికావ్యము లొకకాలమునఁ బ్రచుర ప్రచారము నందుటచే సందేశకావ్యములను వెలయించుట యాకాలమునందలి కవీశ్వరులకుఁ బరిపాటి యై పోయెను. ఈ కారణముచేతనే ప్రతికవీశ్వరుఁడును నేదో యొక సందేశకావ్యమును రచించుట యాచారమయ్యెను. వేలమువెఱ్ఱిగా నీకావ్యములు రచింపఁబడుటచూచి యొకానొకకవి 'కాకసందేశ' మను నొకహేళనకావ్యమును గూడ రచించెను.

## 8. అట్టక్కథ యుద్యమము (క్రీ.శ. 17, 18 శతాబ్దములు)

అట్టక్కథ కథకళికి నుపయోగపడు నొకసాహిత్య ప్రక్రియ. కథకళి మన వీధినాటకమువంటి యొకనాటకప్రక్రియ. మలయాళదేశమున బహుళవ్యాప్తి గాంచిన యీ 'కథకళి' కి విదేశములయందును గొప్పప్రసిద్ధి కలదు. అది కేరళమున నావిర్భవించిన యొకకళావిశేషము. ఈ కథకళికి నుపయుక్త మగు

అట్టక్కథలరచనము మలయాళ భాషయందు విశేషముగా సాగెను. కొట్టారకార తంబురాన్ అనునతఁడు రచించిన 'రామనాట్టం' అనునది మలయాళభాష యందు వెలసిన మొట్టమొదటి 'అట్టక్కథ' యని చెప్పుదురు. కాని, యీ 'రామనాట్టం' అనునది 'కృష్ణనాట్టం' ను అనుసరించి వ్రాయబడె ననియు, కృష్ణనాట్టం గీతగోవిందము ననుసరించి వ్రాయఁబడె ననియుఁ గొందఱు చెప్పుదురు. తంబురాన్ పదునేడవశతాబ్దికిఁ జెందినవాఁడు. అతఁడు బకవధం, కల్యాణ సౌగంధికం, కాలకేతువధం మొదలగు మఱికొన్ని కృతులను గూడ వెలయించెను. ఇతని కృతులే 'కథకళి' నటులను మిక్కిలిగా నాకర్షించెను. ఇతఁడు కాక మఱికొందఱు కవులు కూడ నీ యట్టక్కథలను విరచించిరి. కాని, వాని కంత వ్యాప్తి కలుగ లేదు. ఇతని కృతులకుఁ గలిగినవ్యాప్తిని బురస్కరించుకొని 'తంబురాను' ను తరువాతికవులు కొందరనుసరించిరి. వారిలో కార్తికతిరునాళ్ (18వ శతాబ్దము). అశ్వతి తిరునాళ్ (18 శతాబ్దము) ప్రసిద్ధులు. అట్టక్కథసారస్వతములో 'తంబురాను' నకుఁ బిదపఁ బ్రముఖముగాఁ బేర్కొనఁ దగినవాఁడు 'ఉణ్ణాయివారియర్'. ఇతఁడు పదునేడవ శతాబ్ది చివరిభాగమున జీవించియుండెను. ఇతని నలచరిత్రమునకు మలయాళ సాహిత్యమున విశిష్ట మయిన స్థానము కలదు.

## 9. తుళ్లల్ ఉద్యమము (క్రీ.శ. 18వ శతాబ్దము)

కేరళదేశమందుఁ బ్రసిద్ధి చెందిన కళావిశేషములలో 'తుళ్లల్' ఒకటి. ఇది యొక జానపదనృత్తవిశేషము. ఇందు పరయన్, సీతంకన్, ఓట్టన్ అనుమూఁడు రకములు కలవు. మలయాళభాషయందు దీనికి సంబంధించిన వాఙ్మయము కొంత కలదు. పదునెనిమిదవ శతాబ్ది పూర్వార్ధమున జీవించిన కుంజన్ నంబియారు అను నతఁడు 'తుళ్లల్' రచనలోఁ గడు సమర్థుఁడని పేరుపెంపులు గడించెను. అతఁడు మొత్తము అఱువదినాలుగు తుళ్లల్ రచనలు చేసినట్లు చెప్పుదురు. కాని యతఁడు నలువదియైదు రచనలు మాత్రమే చేసె నని పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. తరువాతి కాలమున మలయాళభాషలో నివాతకవచకాలకేయవధం, శీతంకన్ తుళ్లల్, లంకామర్దనం, కృష్ణార్జునవిజయం, రావణ వధం మొదలగు 'తుళ్లల్' రచనలు వెలువడెను. వానియందు కుంజన్ నంబియారు ప్రభావము సుస్పష్టముగా గోచరించును.

## 10. ఆధునికకవితోద్యమము (క్రీ.శ. 20 శతాబ్ది ప్రారంభము)

ఇరువదవశతాబ్ది ప్రారంభమున మలయాళసారస్వతమునందు నూతనశక మారంభమయ్యె ననవచ్చును. వి.సి. బాలకృష్ణపణిక్కర్ అనునతఁడు ప్రప్రథమముగా మలయాళములో గేయరచన మొనర్చెను. అటుపిమ్మట 'ఆశయగంభీరన్' అని వినుతి కెక్కిన కుమరన్ ఆశాన్ గేయకవిత్వమును వ్యాప్తిలోనికిఁ గొనివచ్చెను. ఆశాన్ ప్రథమ కావ్యమగు 'వీణపూవు' (రాలినపూవు) ఆనాఁటి మలయాళకవిలోకమున గొప్ప సంచలనమును గలిగించెను. ఇతనికావ్యములలో 'చింతావిష్టయాయ సీత' యనునది చాలఁ బ్రసిద్ధిలోనికి వచ్చెను. వళ్లత్తోళ్‌మహాకవి యీగేయకవిత్వమును మఱింత వ్యాప్తిలోనికిఁ గొనివచ్చెను. అతఁడు రచించినకావ్యములలో 'మగ్దలన మరియం' అనునది మిక్కిలిప్రశస్తమయినది. అతఁడింది కాక బధిరవిలాపం, ఎంటె గురునాథన్, చిత్రయోగం మొదలగు పెక్కు కావ్యములను రచించెను. ఇవికాక యతఁడు రచించిన గేయములు కూడ ననేకము లున్నవి. ఎళుత్తచ్చన్ తరువాత నింతటి గొప్పకవి లేఁ డని కేరళీయుల విశ్వాసము. కుమరన్ ఆశాన్, ఉళ్లూరు పరమేశ్వర అయ్యర్, వళ్లత్తోళ్ అను నీ మువ్వురకును ఆధునికకవిత్రయ మని పేరు. ఆధునికమలయాళకవితకు వీరు మువ్వురును రూపురేఖలు దిద్ది రనుట యతిశయోక్తి కాదు. నల్లప్పాత్తు నారాయణమీనన్, సర్దార్ కె. యం. పణిక్కర్ అనువారు కూడ నాధునికకవులుగాఁ బేరుగాంచిన వారు. ఈ యుద్యమఫలితముగా మలయాళసాహిత్యము ప్రాచీనమార్గమును విడనాడి క్రొత్త రూపమునతోఁ బ్రకాశించినది. 'గేయము' అను సాహిత్యప్రక్రియ ప్రచారములోనికి వచ్చెను.

## 11. మర్మకవితోద్యమము (క్రీ.శ. 1930 ప్రాంతము)

కవిత్రయమువారి తరువాత 'శంకరకురూప్' ప్రసిద్ధుఁ డగు మహాకవి. ఇతనికవిత్వమును మర్మకవిత్వ మనియు, లేదా సాంకేతికకవిత్వ మనియుఁ జెప్పఁదగును. విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు ప్రభావ మీతనిపైఁ బరిపూర్ణముగాఁ గలదు. ఇతఁడు పెక్కు ఖండకావ్యములను వెలయించెను. 'ఓటక్కుఴల్' (పిల్లనగ్రోవి) యనునాతని కవితాసముచ్చయమునం దతనిఖండకృతులు పెక్కు సంతరింపఁబడినది. ఇతనికవితాప్రభావమిటీవలి మలయాళసాహిత్యమున విశేషముగాఁ గాన నగును. చంగంపుళ కృష్ణపిళ్లై, బాలామణియమ్మ, లలితాంబికా లంతర్ జనము అనువారి కవితలలో నీమర్మకవిత్వప్రభావము గోచరించునని చెప్పుదురు.

## 12. అభ్యుదయకవితోద్యమము (క్రీ.శ. 1937 ప్రాంతము)

దీనికే మలయాళమున 'జీవత్ సాహిత్యోద్యమము' అని కూడఁ బేరు. క్రీ.శ. 1936వ సంవత్సర ప్రాంతమున మలయాళములో నభ్యుదయ కవిత్వమునకుఁ బ్రాధాన్యము లభించె ననఁ దగును. 1937వ సంవత్సరమున 'తిరుమార్' నందు అభ్యుదయరచయితల మహాసభ జరిగెను. ఎ. బాలకృష్ణపిళ్లై, యం.పి. పాల్, జోసెఫ్ ముండస్సేరి ప్రభృతుల నీయుద్యమనాయకులుగాఁ బేర్కొన వచ్చును. వీరి రచనలకుఁ గాలక్రమమున 'పురోగమన సాహిత్యము' అను పే రేర్పడెను. యన్.ఎ.కృష్ణచారియర్. వయలార్ రామవర్మ మొదలగువారు మలయాళభాషలో నభ్యుదయకవులుగాఁ బ్రసిద్ధి కెక్కిరి.

ఆధునికమలయాళకవి ప్రాచీనకాలపుఁ గవీశ్వరునివలెఁ గాక సామాన్య మానవుని సంతృప్తి పఱచుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. కనుక నితివృత్తమునందును, భాషయందును మార్పు లేర్పడినవి. సంస్కృతపదభూయిష్ఠ మయినభాషను గాని, కృత్రిమమగు మలయాళ గ్రాంథికభాషను గాని వాడుట కాధునిక మలయాళకవి యంతగా నిచ్చగించుట లేదు. వ్యావహారికభాషకు సన్నిహితముగా నుండుభాష నతఁడు స్వీకరించెను. అభ్యుదయరచయితలు సామాన్యమానవుని జీవితమునే తమ రచనల కితివృత్తముగా గ్రహించిరి. అంతవఱకును సాహిత్యమునందు సామాన్యునికి స్థానము లభింపక పోవుటచే నీ యభ్యుదయరచయితల రచనలకుఁ బ్రచురప్రచారము లభించెను.

## (VIII) మహారాష్ట్ర సారస్వతము [౫]

సంస్కృతము, పాలీ, యర్ధమాగధి, పైశాచి, మహారాష్ట్రీ యనునైదు భాషల యపభ్రంశస్వరూపముల సంయోగమువలన మహారాష్ట్రభాష యుద్భవించిన దని పరిశోధకుల యభిప్రాయము.[౬] భారతదేశమునకుఁ బశ్చిమతీరమున దక్షిణమున

౫. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన 'దక్షిణ భారత సాహిత్యములు' అనుగ్రంథమున మహారాష్ట్ర సాహిత్యచరిత్రము తక్కిన దక్షిణ భారత భాషా చరిత్రములతోఁబాటు పరిశీలింపబడుటచే నిందు మహారాష్ట్రసారస్వతములోని యుద్యమములు దక్షిణదేశ భాషలలోని యుద్యమములతోఁబాటు పరిశీలింపఁబడుచున్నవి.

౬. చూ. దక్షిణభారత సాహిత్యములు. పుట 155.

గోవా నుండి యుత్తరమున నాగపూరు వఱకును వ్యాపించిన మహారాష్ట్ర ప్రాంతమున వసించు రెండుకోట్లమంది జనుల కిది మాతృభాష. క్రీస్తుశకము ఏడవశతాబ్దినుండియు మహారాష్ట్రభాష వ్యాప్తిలో నుండె ననుట కాధారములు లభించుచున్నవి. కాని క్రీస్తు శకము పండ్రెండవశతాబ్దివఱకు నందు సారస్వతము రూపొంద లేదు. క్రీ.శ. 1189లో ముకుందరాజు అనుకవీశ్వరుఁడు రచించిన 'వివేకసింధు' అనుగ్రంథమే మరాఠీసారస్వతమునఁ దొలిగ్రంథమని చెప్పఁ దగును. అతఁడే గ్రంథమును మాత్రమే కాక పరమామృతము, పవనవిజయము, రుక్మిణీస్వయంవరము మొదలగు గ్రంథములను రచించెను. ఇవి యన్నియుఁ దార్శనికగ్రంథములు. శంకరాచార్యుని యద్వైతవాదమును బ్రచార మొనర్చుటయే దీని యుద్దేశము. ఇతనికిఁ దరువాత మహారాష్ట్రదేశమున ఎనేక ధార్మికోద్యమములు బయలుదేరి మహారాష్ట్రసాహిత్యమును దీర్చిదిద్దెను. మహారాష్ట్రసారస్వతము నందలి యీయుద్యమముల నీక్రిందివిధముగా వర్గీకరింప వచ్చును. ౧. నాథపంథ యుద్యమము, ౨. మహానుభావపంథ యుద్యమము, ౩. భాగవతపంథ లేక వార్గరీపంథ యుద్యమము, ౪. పునరుజ్జీవనోద్యమము, ౫. రామదాసీపంథ యుద్యమము, ౬. పండితకవుల సాహిత్యోద్యమము, ౭. షాహిరీవాఙ్మయోద్యమము, లేక పోవాడలావణీ రచనోద్యమము, ౮. నిబంధరచనోద్యమము, ౯. నవ్య కవిత్వోద్యమము.

## 1. నాథపంథ యుద్యమము (క్రీ.శ. 12వ శతాబ్దము)

నాథసంప్రదాయ ముత్తరభారతమునుండి దక్షిణదేశమునకుఁ బ్రాకి మహారాష్ట్ర దేశమునఁ జెక్కువగా వ్యాపించినది. మహారాష్ట్రభాషలో నాదికవి యని ప్రసిద్ధిఁ గాంచిన ముకుందరాజు కాలములో నీనాథపంథ యను మతసంప్రదాయము మహారాష్ట్ర దేశమునఁ గొన్నితావులయందు విరివిగాఁ బ్రచారమునం దుండెను. యోగమువలన నద్వైతజ్ఞానమును బొంది మోక్షము నందవచ్చు నని వీరి నమ్మకము. గోరక్షగీత, గోరక్షామరనాథసంవాదము ననునవి యీసంప్రదాయమునకుఁ జెందినగ్రంథములు. ఈ సంప్రదాయమునకుఁ జెందిన గ్రంథము లధికముగా లేకున్నను దీనిప్రభావముమాత్రము ముకుందరాజుపైనను, జ్ఞానదేవునిపైనను నధికముగా నున్నట్లు తెలియుచున్నది. గోరక్షగీత 'ఓవీ' వృత్తములలోను, అమరనాథ

సంవాదము గద్యరూపమునను రచితము లయిన గ్రంథములు. ఇవి కాక యీభాషలో నవనాథ భక్తిసారము, నాథలీలామృతము అను మఱిరెండు గ్రంథము లీసంప్రదాయమునకుఁ జెందినవిగాఁ దలఁపఁబడుచున్నవి.

## 2. మహానుభావపంథ యుద్యమము
### (క్రీ.శ. 12, 13 శతాబ్దములు)

పండ్రెండు, పదమూఁడవ శతాబ్దములయందు మహారాష్ట్రమున ధార్మిక విప్లవములు చెలరేఁగినవి. వైదికాచారకాండయందును, వర్ణాశ్రమవ్యవస్థ యందును విశ్వాసము సడలిన సంస్కర్తలు నూతనోద్యమములను బయలుదేరఁ దీసిరి. ఇట్టి యాందోళనలవలన రూపొందిన నూతన సంప్రదాయములలో 'మహానుభావపంథ' పేర్కొనఁదగినది. ఆదికవియగు ముకుందరాజునకుఁ దరువాతను, జ్ఞానదేవునికిఁ బూర్వమందును నీక్రొత్తసంప్రదాయము స్థాపింపఁబడెను. చక్రధరుఁడు దీని స్థాపకుఁడు. అతఁడు విరచించిన సూత్రపాఠము ఈమతానుయాయులకుఁ బాదాయణ గ్రంథము. చక్రధరుని సిద్ధాంతములకుఁ దొలుతఁ బ్రజలలో నెక్కువప్రతిఘటన కలిగెను. అయినను నిరుత్సాహమును బొందక యతని యనుయాయులు మహారాష్ట్రభాషలో విస్తృతసారస్వతమును వినిర్మించి దానిమూలమునఁ దమమతమును బ్రచార మొనర్చిరి. వీరిగ్రంథము లన్నియు నొకవిధ మగుసంకేత లిపిలో రచింపఁబడెను. చక్రధరుఁడు శిష్య శిక్షకై చేసిన 'సూత్రపాఠము' తప్ప నతఁడు రచించినగ్రంథ మేదియు మనకులభించుట లేదు. అతని శిష్యుఁడగు మహేంద్రభట్టు తనగురువుజీవితమును వస్తువుగా గ్రహించి రచించిన 'లీలాచరిత్రము' అనుగ్రంథమును, చక్రధరునిగురు వగు గోవిందుని జీవితమును దెల్పుచు రచించిన 'గోవిందప్రభు చరిత' యు నుపలబ్ధము లగుచున్నవి. కేశవరాజు అనుకవి చక్రధరప్రోక్తము లగుసూత్రములకు టీకను రచించి 'దృష్టాంతసూత్రపాఠ్' అనుపేర వెలువరించెను. ఈపంథకుఁ జెందిన తక్కినగ్రంథములలో దామోదర పండితుఁడు రచించిన వస్త్రాపహరణము, పండితనరేంద్రుని రుక్మిణీస్వయంవరము, భాస్కరభట్టు రచించిన శిశుపాలవధ, ఉద్ధవగీత యనుగ్రంథములు, విశ్వనాథపండితుని జ్ఞానప్రబోధము, నారాయణ పండితుని బుద్ధిపురవర్ణనము అనునవి పేర్కొనఁదగి యున్నవి.

## 3. భాగవతపంథ లేక వార్కరీపంథ యుద్యమము

### (క్రీ.శ. 13, 14 శతాబ్దములు)

మహానుభావపంథలోఁబాటుగ వార్కరీపంథయు మహారాష్ట్ర సారస్వతమును వృద్ధిఁబొందించెను. దీనినే 'భాగవతపంథ' యనియు వ్యవహరింతురు. ఈపంథ వైదిక సిద్ధాంతములను ప్రోత్సహించుచుఁ గాలానుగుణమున నాసిద్ధాంతములకుఁ గొన్నినూత్న భావములను జోడించెను. ఈసంప్రదాయమునకుఁ జెందినకవులలో జ్ఞానేశ్వరుఁడు (క్రీ.శ. 1275–1296) పేర్కొనఁదగినవాఁడు. ఇతఁడు భావార్థదీపిక యనుపేర భగవద్గీతకు నొకవ్యాఖ్యానమును రచించెను. జ్ఞానేశ్వరి యనుపేర నీతఁడు మహారాష్ట్రమున రచించిన గ్రంథమహాసారస్వతమునకుఁ దలమానికము. వార్కరీలు దానిని పరమపూజ్య మగుమతగ్రంథముగా నారాధింతురు. అమృతానుభవము, చాంగదేవసావష్టి యనుం వంటి రెండుగ్రంథములనే కాక యితఁడు 'అభంగములు' అనుపేరఁ బెక్కు గేయములను గూడ రచించెను. క్రీ.శ. 1270–1350 నడిమికాలమున జీవించిన నామదేవుఁ డీతని శిష్యుఁడు. ఇతఁడు తనగురువగు జ్ఞానేశ్వరునికిజీవితమును గ్రంథస్థ మొనర్చుటయే కాక పెక్కు అభంగములను గూడ రచించెను.

మహమ్మదీయుల యాక్రమణమువలన క్రీ.శ. 1318లో దేవగిరిరాజ్యము పతన మయ్యెను. 1347లో బహమనీరాజ్యము స్థాపింపఁబడెను. అదే సమయమున విజయనగరసామ్రాజ్యము గూడ స్థాపింపఁబడినది. ఇట్టి పరిస్థితులలో నామదేవుని భగవన్నామసంకీర్తన ప్రచారమువలనఁ బ్రజలలో ధార్మికశ్రద్ధ యెడతెగక నిలిచి యుండఁ గలిగెను. దేశమునఁ బెక్కు రాజకీయోపప్లవము లేర్పడినను నీతనికృషి మూలమునఁ బ్రజలకు ధర్మ ముపై నభిమానము కదలకుండినది. నామదేవుఁడు పాటించినభక్తిరస ప్రవాహముముందు మహమ్మదీయుల ప్రతిబంధకములు నిలువఁజాలక పోయినవి. ఈతనిభక్తిభావముచేఁ బ్రబోధితు లై మహారాష్ట్రమునఁ బెక్కురు భక్తులను, గవులును వెలసిరి. వారు వివిధ జాతులకుఁ జెందినవారు. వారిలో విసోబాఖేచర్, పరిసాభాగవత్, గోరాకుంభార్, నరహరి సోనాత్ మొదలగువారు కలరు. వీ రెల్లరును మహారాష్ట్రమున భక్తిరసమును బ్రవహింపఁ జేసిరి.

## 4. పునరుజ్జీవనోద్యమము (క్రీ.శ. 16వ శతాబ్దము)

పదునాఱవశతాబ్ది చరమార్ధమున ఏకనాథుఁడను (1548-1599) కవీశ్వరుని మహత్తరకృషిమూలమున మరాఠీసారస్వతము పునరుజ్జీవిత మయ్యెన క్రీస్తుశకము పదునాలుగవశతాబ్దినుండి పదునాఱవశతాబ్దివఱకును మహారాష్ట్ర సారస్వతమంతగా నభివృద్ధి చెందలేదు. మహమ్మదీయుల దండయాత్రలవలనను కరవుకాటకములవలనను దేశ మార్థికముగానే కాక సారస్వతవిషయకముగాఁ గూ చిక్కులి పేదవడి యుండినది. అస్మానీ యనఁగా దైవికముగాఁ గలిగి యిక్కట్టులు. సుల్తానీ యనఁగా మహమ్మదీయసుల్తానుల దౌర్జన్యములవలన గలిగిన యిక్కట్టులు. ఈ రెండువిధము లయిన విపత్తులు నొకేమాఱు మహారాష్ట్రము నాచరించుటవలన నాకాలమునదేశమునకే కాక వాఙ్మయమునకున గొప్ప నష్టము సంభవించినది. భాషాభివృద్ధి పూర్తిగాఁ గుంటువడి పోయినది. ఇట్టి పరిస్థితులలో నేకనాథుఁడవతరించి తనగ్రంథములమూలమున మరాఠీ సారస్వతమును బునరుజ్జీవింపఁ జేసెను. అతఁడు భాగవతమునందలి ఏకాదశస్కంధమున కొకవ్యాఖ్యానమును రచించుటయే కాక రుక్మిణీస్వయంవరము, భావార్థరామాయణములను మఱిరెండు గ్రంథములను రచించెను. ఆకాలమున వెలసిన తక్కిన రచనలలో విష్ణుదాస నాముని మహాభారతమును, విష్ణుయాజ్ఞవల్క్యుని కథాకాసారమును, సరస్వతీ గంగాధరుఁడు రచించిన గురుచరితయుఁ బేర్కొనఁదగినవి. ఏకనాథుని సన్నిహితబంధు వగు ముక్తేశ్వరుఁడు భారతమునందలి తొలి యాఱుపర్వములను మహారాష్ట్రభాషయందు రచించెను. దేశోపంత్ (1551-1615), రమావల్లభదాసు, శివకల్యాణుఁడు షేక్ మహమ్మద్ అనువారు ఈపునరుజ్జీవనోద్యమకాలమునందుఁ బేరెన్నిక గాంచిన కవులు గాఁ బరిగణింపఁ బడుచున్నారు.

## 5. రామదాసీపంథ యుద్యమము (క్రీ.శ. 17వ శతాబ్దము)

క్రీస్తుశకము పదునేడవశతాబ్దిలో మహారాష్ట్రసారస్వతమునకుఁ గ్రొంగ్రొత్త శోభను సమకూర్చినవారిలో ముఖ్యులు తుకారాం, రామదాసులు. తుకారామ్ (1608-1650) అభంగములలోఁ దనయాధ్యాత్మికానుభవములను జక్కఁగ వివరించెను. రామదాసు (1608-1681) ఒకవిధ మగుకర్మయోగి. రావణాది దుష్టులసంహార మొనర్చి శిష్టరక్షణ మొనర్చిన శ్రీరామచంద్రుఁ డతని యిష్టదైవము తనసిద్ధాంతములను బ్రచారమొనర్చుటకై 'రామదాసీపంథ'

యను సంఘము నతఁడేర్పఱచెను. ఛత్రపతి శివాజీ యితనిని గురువుగా స్వీకరించెను. దాసబోధ, మనాచే శ్లోక్, సుందరకాండ, యుద్ధకాండము, కరుణాష్టకములు, పంచీకరణము, హోరతులు, ఓరీలు, మహారాష్ట్ర దేశవర్ణనపరమైన ఆనందభువనము మున్నగునవి యీతఁడు రచించిన గ్రంథములు. అతనిచేఁ బ్రబోధితులయిన కవులు కొందఱు కలరు. వారు అయిదుగురు. వారికి రామదాసపంచాయతనము' అని పేరు. వారును రామదాసీపంథకుఁ జెందినవారే. తమగురువు లయిన సమర్థస్వామి సిద్ధాంతములను దమగ్రంథముల మూలమునఁ బ్రచార మొనర్చిరి.

## 6. పండితకవుల సాహిత్యోద్యమము (క్రీ.శ. 17వ శతాబ్దము)

సమర్థరామదాసస్వామి యొకవంక తనగ్రంథముల మూలముననూ, శిష్యులమూలముననూ దనసిద్ధాంతములనుబ్రచారము చేయుచుండఁగా మఱియొకవంక నాకాలముననందే సంస్కృతకావ్యముల ననుకరించుచు, సంస్కృతమయమగుమహారాష్ట్రమునఁ గావ్యరచనము సాగించుసంప్రదాయ మొకటి బయలుదేరెను. ఇట్టికవులలోఁ బేర్కొనఁదగిన వాఁడు 'వామనపండితుఁడు' (1606-1695). ఇతఁడు వనసుధ, వేణుసుధ, నామసుధ, భామావిలాసము, రాధావిలాసము మొదలగు కావ్యములను రచించెను. ఈసంప్రదాయము ననుసరించిన తక్కినరచనలలో రఘునాథపండితుని నలదమయంతీ స్వయంవరాఖ్యానము పేర్కొనఁదగినది. ఇది శ్రీహర్షునినైషధగ్రంథము నకు మహారాష్ట్రానువాదము. ఇది కాక యతఁడు రామదాసవర్ణన, గజేంద్రమోక్షము అను గ్రంథములను గూడ రచించెను. శ్యామరాజు రచించిన ముద్గలాఖ్యానము, చిట్టల అనంతక్షీరసాగరుని రుక్మిణీస్వయంవరము పేర్కొనఁదగినరచనలు. వీరందఱును బండిత కవులు. వీరికావ్యములయందలి భాష సంస్కృతజటిలమై యుండును. మహీపతి, మోరోపంతు అనువారు కూడ నీవర్గమునకుఁ జెందిన కవులుగనే పరిగణింపఁబడుచున్నారు.

## 7. షాహిలీవాఙ్మయోద్యమము
### (క్రీ.శ. 18వ శతాబ్దము 19వ శతాబ్ది ప్రారంభము)

క్రీస్తుశకము పదునెనిమిదవశతాబ్దియందును, పందొమ్మిదవశతాబ్ది పూర్వార్ధ మునందును మహారాష్ట్రసాహిత్యమొకనూతనరూపమును సంతరించుకొని నటుల

గోచరించును. ఇదియే 'పోవాడ', 'లావణీ' యను నవ్యరచనారీతి. దీనికే 'షాహి వాఙ్మయ' మని సంకేతము. అరబ్బీభాషలో కవిని 'షాయర్' అందురు. ప్రాయ పయిశబ్దమే రూపాంతరము చెంది షాహిరీ గా మాఱి యుండవచ్చును.

'పోవాడా' అనునది వీరరసస్ఫోరక మయిన కావ్యము. అఫ్జల్‌ఖానుని వధించి శివాజీ యొక్క వీరకృత్యమును వస్తువుగా గ్రహించి అగ్నిదాసుఁ డనుకవి క్రీ.శ 1659లో రచించినగేయ మిందుఁ దొలుతటిది. తులసీదాస్, అనంతఫంది ప్రభాకర్ మొదలగువారు పీష్వాలను గుఱించి యిట్టి పోవాడలను బెక్కింటి రచించిరి. పోవాడ రచనలో మహారాష్ట్రప్రభువుల శౌర్య పరాక్రమాదిగుణముల మిక్కిలి యద్భుతముగా నభివర్ణింపఁబడినది.

పీష్వాల యనంతరము లావణీలు ఎక్కువ యాదరమును బొందినవి 'లావణీ' శృంగారమయ మయిన రచనారీతి, ధనికులు, విలాసప్రియులు దీః పోషకులు. కాని యది శిష్టజనుల యాదరము నందఁ జాలక పోయెను.

## 8. 'నిబంధ' రచనోద్యమము (క్రీ.శ. 19వ శతాబ్దము)

క్రీస్తుశకము పందొమ్మిదవశతాబ్దమున నాంగ్లసామ్రాజ్యపాలన ప్రారంభ దినములలో మహారాష్ట్రమునఁ బెక్కుపత్రికలు వెలసెను. వానిలో దర్పణ్, దిగ్దర్శన్ ప్రభాకర్ మొదలగునవి ప్రసిద్ధములు. అం దనేకశాస్త్రీయము లగువిషయములను గూర్చియు, నుపయుక్తము లగు సమస్యలనుగూర్చియు, బెక్కుచర్చలు జరుగుచుండెను. వానిమూలమునఁ బ్రజలలో స్వాతంత్ర్యభావములు రేకెత్తుచుండెను. విష్ణుశాస్త్రిచిప్లుంకర్ (1850-1882) అనునతఁడు తొలుత తనతండ్రి నడపుచుండిన 'శాలాపత్రిక'లోఁ బెక్కురచనలు ప్రకటించెను. పిదప నతఁడే క్రీ.శ. 1874లో 'నిబంధమాల' యనుపేర నొకపత్రికను స్థాపించెను. ఈనిబంధమాలలో విష్ణుశాస్త్రి తన విశ్వతోముఖప్రతిభాపాండిత్యములను బ్రదర్శించెను. ఈపత్రికమూలమున మహారాష్ట్ర సారస్వతమునకు గొప్పక్రాంతి కలిగెను. 'నిబంధములు' అనఁబడు రచనములకు శిష్టవాఙ్మయమునకువలె గౌరవము లభించెను. మహారాష్ట్రమున వ్యాసమునకు 'నిబంధనము' అనిపేరు. గోపాలగణేశ అగస్‌కర్ నడుపుచుండిన సుధాకర్ అను పత్రికవలనను తిలక్ యొక్క కేసరియను పత్రికవలనను నిబంధవాఙ్మయమునకు మిక్కిలి వన్నె కలిగెను. మరాఠీగద్యరచనల నవ్యశైలికి 'చిప్లుంకర్' జనకుఁ డని చెప్ప వచ్చును. ఇట్లు పత్రికల

మూలమున నాయాపత్రికాసంపాదకులను, ప్రసిద్ధరచయితలును మహారాష్ట్రమున 'నిబంధరచనము' నొకయుద్యమముగా నడపి సారస్వతవికాసమునకుఁ దోడ్పడిరి.

## 9. నవ్యకవితోద్యమము

### (క్రీ.శ. 19వ శతాబ్ది యుత్తరభాగము, 20వ శతాబ్ది ప్రారంభము)

ఆధునికయుగమునఁ బద్యకవిత్వములోఁ గ్రొత్తరీతులు బయలుదేరెను. అట్టి రచనలకు మూలపురుషుఁడు కేశవసత్ అను కృష్ణాజీ కేశవదామ్లె. ఇతని ప్రథమ కావ్యసంగ్రహము 'కేశవసంతాచీకవిత' యనుపేరఁ బ్రకటింపఁబడెను. ఈకవి స్వానుభవమును బ్రకటించుటకుఁ గవిత్వమును సాధనముగా గ్రహించెను. అనువాదమును రూపాంతరములను గావింపక ఇతఁడు పూర్వుల రచనావిధానమును త్యజించి స్వానుభవమును మనోభూమిపై గోచరించినరీతిని దనకవిత్వములో వెల్లడించెను. ఇతఁడు 'తుతారీ' యను ప్రథమగేయమును రచించి నవయుగకవితాశంఖమును బూరించెను. ఆత్మాశ్రయ కవిత్వమునం దీతనికిఁ బ్రత్యేకాభిమానము కలదు. నారాయణవామనతిలక్, వినాయక జనార్దనకరందీకర్ అనువారు కూడ నీరీతిలోఁ గావ్య రచనము సాగించిరి. రామగణేశగడ్కరీ, త్రండక బాపూజీ తాంబ్రే యనువారు అలంకారయుత మగు శైలికిని, ప్రకృతి కవిత్వము నకును బేరొందిరి. బి. ఆర్. తంబే మహారాష్ట్ర కావ్యసాహిత్యమునఁ దనకాల్పనిక కవిత్వముచే నొకప్రత్యేకస్థానమును గడించెను. కేశవసంతుని కవిత్వము నాదర్శముగా గ్రహించి కృషి యొనర్చిన మర్మకవి యన్.యం. గుప్తే. ద్వితీయప్రపంచ యుద్ధానంతరము ప్రసిద్ధి చెందినకవులలో ముఖ్యముగాఁ బేర్కొనవలసినవాఁడు బి.ఎస్. మర్ధేకర్, నవ్యభావములను, నవ్యశైలిలో నాధునికలోకమున కీతఁ డందించెను. శిశరాగమ్ కాహీఁకవిత యనునవి యీతని ప్రసిద్ధ రచనలు. 'భంగుఁదేకాతిన్యమాఝె' అను నీతినికవిత యెక్కువ యాక్షేపములకు గురి యయ్యెను. కావ్యక్షేత్రమున నిట్టి యాక్షేపణలకు గురి యయినను నితఁడు మహారాష్ట్రములో నవ్యకావ్యరచయితలకు మార్గదర్శకుఁడయ్యెను.

ఈయధ్యాయమునందుఁ జర్చింపఁబడిన యంశముల సారాంశము నీక్రింది విధముగాఁ బేర్కొనవచ్చును.

౧. వివిధ భారతీయ భాషలలో – ముఖ్యముగా హిందీ, బెంగాలీ, పంజాబీ, ఓఢ్రము, తమిళము, కన్నడము, మలయాళము, మహారాష్ట్రము అను

భాషలలో – నాయా కాలములందు సాహిత్యోద్యమములు గొన్ని యేర్పడి సాహిత్యము పురోభివృద్ధి నందుచుండిన విషయమా యా భాషల సాహిత్య చరిత్రములననుబట్టి తెలియుచున్నది. ఒక నిర్దిష్ట లక్ష్యముతో నుద్యమములుగానే ప్రవర్తిల్లినవి మాత్రమే కాక, యేకరూపమయిన రచనా పద్ధతి యొకకాలమునందలి రచనములలో నేఁటి దృష్టితో లక్షించు మనకుఁ బ్రస్ఫుటమగుచుండునప్పుడట్టివి కూడ నాయాకాలములందు సాఁగిన యుద్యమములుగానే పరిగణింపఁ బడినవి.

౨. హిందీసాహిత్యమున ఖడీబోలీ యుద్యమము, ఛాయావాద కవిత్వోద్యమము, ప్రగతివాదకవిత్వోద్యమము, ప్రయోగవాదికవిత్వము, హిందూస్థానీయుద్యమము, నయీకవిత, నయీకహానీ యుద్యమము అనుసాహిత్యోద్యములు ప్రధానము గాఁ బేర్కొనదగినవి.

3. బెంగాలీభాషలో శాక్తికసాహిత్యోద్యమము లేక మంగళకావ్య రచనోద్యమము, చైతన్యసాహిత్యోద్యమము, కవీరల డాయి యుద్యమము, గద్య సాహిత్యోద్యమము, చలితభాషోద్యమము, ఆధునికకవిత్వోద్యమము, అత్యాధునికకవిత్వోద్యమము, ఆకలితరముకవుల యుద్యమము అను నుద్యమములు కలవు.

౪. పంజాబీసాహిత్యమున రహస్యవాదకవిత్వోద్యమము, భక్తికవిత్వోద్యమము దేశభక్తికవిత్వోద్యమము, అభ్యుదయకవిత్వోద్యమము, శుద్ధ పంజాబీ యుద్యమము అను సాహిత్యోద్యమములు చూపట్టును.

౫. ఓఢ్రసాహిత్యమునఁ బ్రజాకవిత్వోద్యమము, వైష్ణవసాహిత్యోద్యమము కావ్యసాహిత్యోద్యమము, నవ్యకవిత్వోద్యమము, సత్యవాది సంఘోద్యమము, సబూజ సంఘము లేక నిత్యశ్యామలసంఘోద్యమము అను సాహిత్యోద్యమములు ప్రవర్తిల్లినది.

.. తమిళసాహిత్యమునఁ దమిళకవిసంఘముల మూలమున సాఁగిన దేశికవిత్వోద్యమము, కావ్యసాహిత్యోద్యమము, భక్తికవిత్వోద్యమము, అనువాదసాహిత్యోద్యమము, చారిత్రకనవలోద్యమము, యుద్ధ కావ్యోద్యమము, వ్యావహారికభాషోద్యమము, శెందమిళు ఉద్యమము లని ప్రముఖముగా నెనిమిది యుద్యమము లున్నట్లు గోచరించును.

౭. కన్నడసాహిత్యమున మహాకావ్యకవిత్వోద్యమము లేక మార్గకవిత్వోద్యమము, భక్తికవిత్వోద్యమము లేక దేశికవిత్వోద్యమము, దాసకూటోద్యమము, పునరుజ్జీవనోద్యమము, ఆధునికకవిత్వోద్యమము, ప్రగతిశీల సంఘోద్యమము అనునాఱు సాహిత్యోద్యమములు సాహిత్యాభివృద్ధికిఁ తోడ్పడినది.

౮. మలయాళసాహిత్యమున 'శెందమిళు' ఉద్యమము, మణిప్రవాళ భాషోద్యమము, నిరణకవిత్వోద్యమము, గాథాకవిత్వోద్యమము, 'కిళిపాట్టు' ఉద్యమము, చంపూకావ్యోద్యమము, సందేశకావ్యోద్యమము, 'అట్టకథ' యుద్యమము, 'తుళ్లల్' ఉద్యమము, ఆధునికకవిత్వోద్యమము, మర్మికవిత్వోద్యమము, అభ్యుదయ కవిత్వోద్యమము లేక జీవత్ సాహిత్యోద్యమము, అనుసాహిత్యోద్యమము లేర్పడి మలయాళ సాహిత్య ప్రగతికి దోహదము కావించినది.

౯. మహారాష్ట్ర సాహిత్యమున నాథపంథ యుద్యమము, మహానుభావ పంథ యుద్యమము, భాగవతపంథ లేక వార్కరీపంథ యుద్యమము, పునరుజ్జీవనోద్యమము, రామదాసీపంథ యుద్యమము, పండితకవుల సాహిత్యోద్యమము, షాహిరీ వాఙ్మయోద్యమము లేక పోవాడ లావణీ రచనోద్యమము, నిబంధరచనోద్యమము, నవ్య కవిత్వోద్యమము అను తొమ్మిదిసాహిత్యోద్యములు కలవు.

౧౦. వివిధభాషలయందలి యీ సాహిత్యోద్యమములు భాష, ప్రక్రియ, ఛందము, కవితాపద్ధతి యనువాని విషయమున నాయాకాలములందుఁ బరివర్తనము కలుగఁ జేసినవి. మతము, రాజకీయసాంఘికపరిస్థితులు, మహాపురుషుల ప్రభావము, సాహిత్యసంఘములు, నూతనత్వాభిలాష యనునవి యాయాసాహిత్యోద్యమముల యావిర్భావములకు వివిధభాష సాహిత్యముల యందు హేతువు లయి విరాజిల్లినవి.

# తృతీయాధ్యాయము

## ఆంధ్రసాహిత్యములోని యుద్యమములు - దక్షిణదేశభాషాసాహిత్యములలోఁ దులనాత్మక పరిశీలనము

భారతీయభాషలలోని సాహిత్యోద్యమములయొక్క స్థూలస్వరూపమును, నాయాయుద్యమములయొక్క యుత్పత్తివికాసములను వెనుకటి యధ్యాయమునఁ బరిశీలించితిమి. ఇఁక నీయధ్యాయమున నాంధ్రసాహిత్యములోని ప్రధానము లయిన యుద్యమములను గూర్చియు, నాయా యుద్యమములమూలమున నాంధ్రసాహిత్యమునందుఁ గాలక్రమమున నేర్పడుచు వచ్చిన యభ్యుదయ పరిణామములను గూర్చియు గొంత విపులముగానే తెలిసికొనుటకుఁ బ్రయత్నింతము. మఱియు నుత్తరభారతము నందు వర్ధిల్లిన భాషాసాహిత్యముల వలెఁ గాక దక్షిణదేశమునందలి తమిళము, తెలుఁగు, కన్నడము, మలయాళము, ననుభాషలు ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందినభాషలగుటచేతను - దక్షిణదేశమునందలి రాజకీయ, మత, సాంఘిక పరిస్థితులించుమించుగా నీ భాషల యందలి పరిణామములకుఁ జాలవఱకు సమానములే యయి పరస్పరసామ్యము గలయుద్యమము లాయాభాషలలో వెలయుట కవకాశము మిక్కిలిగా నుండుట సంభావ్య మగుటచేతను - ఇరుగు పొరుగు భాషలలో నొక భాషకు సంబంధించిన సాహిత్యమునం దొకనూతన పద్ధతియో, ప్రక్రియయో వెలయఁగా దాని వ్యాప్తియుఁ, బ్రభావమును దక్షిణదేశమునందలివే యగు నితరభాషలయందును బొడసూపుట సహజ మగుటచేతను - దక్షిణదేశభాషాసాహిత్యములయందలి యుద్యమములను బరస్పరము పోల్చి తులనాత్మకపరిశీలనము చేయుట కూడ నావశ్యకమయియున్నది. అట్టి తులనాత్మక పరిశీలనమువలన నొక భాషయందలి వాఙ్మయముపై మఱొకభాషయందలి వాఙ్మయమున కేదేనిఁ బ్రభావ మున్నచో దానిని గూర్చియు, నాప్రభావము పడుటకుఁ గలహేతువులనుగూర్చియుఁ దెలిసికొను నవకాశము కలుగఁ గలదు. ఇట్లుకాక యాయాభాషలలో యాదృచ్ఛికముగానే కొన్ని సమానధర్మములుగలయుద్యమము లాయాభాషా సాహిత్యములందలి పరిస్థితుల కనుగుణముగా భిన్నభిన్న కాలములందుఁ బ్రారంభింపఁ బడుటయు - వాని మూలమున నాయాసాహిత్యముల కపూర్వాభ్యుదయము సమకూరుటయుఁ గూడ నసంభావ్యము కాఁజాలదు. ఒకప్పు డొక భాషలో నవసర మయిన యుద్యమమో, మార్పో

యాసమకాలమునందే యితరభాషలయందాభాషాపరిస్థితులను బట్టియు, మతసాంఘికపరిస్థితులను బట్టియు నావశ్యకములు కాక పోవచ్చును. కాని, యట్టియుద్యమ మట్టియవసరములనుబట్టియే భిన్నకాలములనందుఁ బొరుగుభాషలోఁ బ్రారంభింపఁబడుట యసహజ మేమియుఁగాదు. కనుక నీయుభయదృష్టులతోను నాంధ్రసాహిత్యమునందలి యుద్యమములనుగూర్చి పరిశీలించిన పిమ్మట దక్షిణదేశభాషలయందలి సాహిత్యములతోఁ గొంతతులనాత్మకపరిశీలనము కూడఁ జేయఁ గడుగుదము. తొలుత నాంధ్రసాహిత్యములో వివిధ కాలములం దేర్పడిన ప్రధానములయిన యుద్యమము లేవో తెలిసికొందము. ఆంధ్రసాహిత్యమునందలి యుద్యమముల నీక్రింది విధముగాఁ బేర్కొనవచ్చును. ౧. మార్గకవిత్వోద్యమము, ౨. దేశికవిత్వోద్యమము, ౩. హరిహరనాథతత్త్వోద్యమము, ౪. ప్రబంధ కవిత్వోద్యమము, ౫. అచ్చతెనుఁగు కవిత్వోద్యమము, ౬. యక్షగాన రచనోద్యమము, ౭. భావ కవిత్వోద్యమము, ౮. వ్యావహారికభాషోద్యమము, ౯. అభ్యుదయకవిత్వోద్యమము, ౧౦. అధివాస్తవిక కవిత్వోద్యమము, ౧౧. దిగంబరకవిత్వోద్యమము.

ఈ పదునొకండు సాహిత్యోద్యమములను నాంధ్రసాహిత్యపథమునందలి మైలురాళ్లు. ఆంధ్రసాహిత్యస్రవంతియొక్క ప్రగతిపథము నప్పుడప్పుడు మార్చుచు వచ్చిన మలుపులు. దీనిలో అచ్చతెనుఁగు కవిత్వోద్యమము, వ్యావహారిక భాషోద్యమము ననునవి కావ్యములందును, రచనములందును నుపయోగింపఁదగిన భాషకు సంబంధించి యేర్పడినట్టివి. హరిహరనాథ తత్త్వోద్యమము సాహిత్యమునందు మతవిషయకముగా నేర్పడిన యుద్యమము. మతము నాధారము చేసికొని, తత్సిద్ధాంతప్రచారము కొఱకై యితరభాషయం దట్టి యుద్దేశముతోనే ప్రధానముగాఁ గాక – యానుషంగికముగా సాఁగిన హరిహరనాథతత్త్వప్రచారమును గూడ నొకయుద్యమముగాఁ బరిగణించుట జరిగినది. దేశికవితోద్యమము యొక్క లక్ష్యము మతప్రచారమే యయినను నది కవిత్వరూపమున సాధింపఁబడిన యుద్యమము. ఇఁక యక్షగానరచనోద్యమము ప్రక్రియకు సంబంధించిన యుద్యమము. తక్కిన వన్నియు నాంధ్రబాష యందలి కవిత్వమునకు సంబంధించిన యుద్యమములు. ఇట్లు భిన్న భిన్న రంగములకు సంబంధించి సాఁగిన యీ యుద్యమము లన్నియు నాయాకాలములయందా రాంధ్ర భాషాసాహిత్య పరిణామమునకు యథాశక్తి దోహదము కల్పించి చరితార్థములయినవి. ఇఁక

నాంధ్రసాహిత్యములోని యుద్యమములను గూర్చి ప్రత్యేకప్రత్యేకముగాఁ బరిశీలింతము.

## 1. మార్గకవిత్వోద్యమము

నన్నయభట్టారకునికిఁ బూర్వము శాసనములయందలి పద్యములే కాక దేశిమార్గమునకుఁ జెందిన పదములును, పాటలును నుండి యుండు నని తలంచుట కవకాశము కలదు. దేశిమార్గమునకుఁ జెందిన యాకవిత్వ మంతయు నాకాలమునఁ బ్రజాదరమును బొందియుండ వచ్చు నేమో కాని, పండితకవుల యాదరగౌరవములకు మాత్రము పాత్రము కాలేదు. పైపెచ్చు వా రా దేశికవిత్వమును నిరసించుచుండి రనియుఁ దలంపఁ దగును. నన్నయకుఁ దరువాత నాతఁ డారంభించిన మార్గకవితా పద్ధతి ప్రచారము నొంది పండితకవుల నాకర్షించినది. పాల్కురికి సోమనాథాదు లగు కవులు కొందఱు దేశికవిత్వము నభిమానించి యామార్గమునఁ గవిత్వము చెప్పినను వారి కాకాలమునను ననంతరకాలమునను నంత ప్రశస్తి యుండినట్లు గోచరింపదు. పూర్వకవిస్తుతులలోఁ దరువాతికవు లెవ్వరును వారిని బేర్కొనకుండుటయే యందులకుఁ దార్కాణము. మహాకవి యైన సోమనాథుని స్థితియే యిట్లుండ నన్నయకుఁ బూర్వము జనప్రీతికొఱకై దేశికవిత్వము చెప్పిన సామాన్యులయెడ నాకాలమువారి కెట్టియాదరము గాని యుండియుండదని తలంచుటలోఁ దప్పు లేదు. మఱియు మహాకావ్య రచనానుకూల మయినవిస్తృతి కాని, ఛందస్సామగ్రి కాని యానాఁడు తెలుఁగునకు లేకుండెను. ఉన్న భాష యయినను స్థిర మయిన రూపమును వహింపక భిన్నప్రదేశములందు భిన్న రూపములలో నుండెను. ఇట్టి పరిస్థితిలో నన్నయభట్టు రాజరాజనరేంద్రునికోరిక ననుసరించి మహాభారతము నాంధ్రీకరించుటకు సంకల్పించెను. అద్యంతము శ్లోకమయముగా సాఁగిన మహాభారతమును బద్యకావ్యముగా సంతరింపవలెనో, గద్యకావ్యముగా సంతరింప వలెనో, చంపూకావ్యముగా సంతరింప వలెనో – యంతకుఁ బూర్వ మాతని కనుసరణీయ మయినమార్గమెద్దియు లేక పోవుటచే – నాతనికిఁ దెలియ దయ్యెను. సంస్కృత భారతము వేదతుల్యముగాఁ బరిగణింపఁబడుటచేత దానినాంధ్రీకరించు విషయమునఁ గూడఁ బండితులలోఁ జాలవఱకు వైముఖ్యము పొడసూపు చుండెను. ఆ సంస్కృతభారత మయినను నేకరూపమున నుండక ప్రక్షేపములలో

నిండి బహురూప మైయుండెను. ఇట్టిచో మహాకావ్యనిర్మాణకర్మఠుఁ డయిన నన్నయభట్టారకునికిఁ గావ్యోపయోగు లయిన భాషాచ్ఛందములవిషయమున స్వతంత్రముగా నొకప్రణాళికను రచించుకొన వలసినమహాక్లేశమొకటి యెదు రయ్యెను. అంధకారబంధురము, నగమ్యము నయిన యాభాషామహారణ్యములో నాతఁడు సకలజనసుగమ మైన యొక ఘంటాపథము నతి కష్టముతోఁ గల్పించుకొనవలసినయవసరమేర్పడెను. తరువాతి కవు లాతఁడు తీర్చిదిద్దిన యాఘంటాపథముపై నల్లేరుపై బండివలెఁ దమకవితా యానములు సాగించిరి.

సామాన్యముగాఁ దత్సమపదబహుళ మయిన భాష శిష్టజనులయందును, దేశ్యపదబహుళ మయినభాష సామాన్యజనులయందును వ్యాప్తిజెంది యుండును. రాజాస్థానములలో శిష్టజనులకే యెక్కువ పలుకుబడి యుండును. గనుక వా రభిమానించు తత్సమభాషకే ప్రాముఖ్యము లభించును. కన్నడమునఁ గవిరాజమార్గమునాఁటికే (క్రీ.శ. 9వ శతాబ్దము) జనవ్యవహారమునం దుండిన పళగన్నడమును ద్రోసిరాజుచేసి సంస్కృతభూయిష్ఠ మయిన తత్సమభాష (సమసంస్కృతోక్తి) ప్రచారమునకు వచ్చినట్లు తెలియుచున్నది. కన్నడమునఁ గన్నట్లు నీపరిస్థితియే తెలుఁగుదేశమునఁ గూడ వర్తిల్లినది. నన్నయకుఁ బూర్వకాలమందు దేశిపదములసంఖ్యయే యధికముగాఁ గానవచ్చినను నన్నయనాఁటికి తత్సమభూయిష్ఠమయినభాష ప్రాచుర్యమునకు వచ్చుట తటస్థించినది. నృపతుంగుఁడును, నాతనికాలమునందలి కవిపండితులును కన్నడభాషకుఁ జేసినట్టి సంస్కారమునే నన్నయభట్టారకుఁడు తెలుఁగుభాషకుఁ గూడఁ జేయవలసి వచ్చెను. సంస్కృతమునందలి యజంత, హలంత శబ్దములను, విశేషణములను, క్రియలను తెలుఁగునకుఁ దెచ్చుకొనునపు డేయేపద్ధతు లవలంబింప వలసి యుండునో నిర్ణయించి దేశిపదములలో వానిని గూడఁ గలిపి తత్సమబహుళముగా రచన చేయుపద్ధతి కాతఁడు వ్యవస్థ కలిగించెను. అంతకుఁ బూర్వమీతత్సమీకరణపద్ధతి యుండినను నది పరిణామదశలో నుండగా నన్నయ దాని కొకస్థిరరూపమును గల్పించి భారతము నాభాషయందు రచించెను. ఈ కాలమున సంస్కృతశబ్దములను వాడుటయే సంభవించినచో వానినెట్టివికారమును గల్పింపక యథాతథముగా వాడవలయునని వాదించువారు కొందఱుండిరి. అట్టి సంస్కృతసిద్ధరూపములను తెలుఁగు పదములలోఁ గలిపి వాడుపద్ధతికే మణిప్రవాళపద్ధతి యని పేరు. కన్నడకవిరాజమార్గమున నట్టిపద్దతి పరిహరణీయ

మని చెప్పఁబడి యున్నది. నన్నయ యాకవిరాజమార్గపద్ధతినే యాదర్శముగా గ్రహించి మణిప్రవాళపద్ధతి నభిమానించు సంస్కృతవిద్వాంసులకు నచ్చఁజెప్పి తనమార్గమును సుగమముఁ గావించుకొనెను. మఱియుఁ దనకాలమునఁ బ్రజల వ్యవహారమునందును, శాసనాదులందును గలదేశ్య భాష నంతను బరిశీలించి భిన్న భిన్న రూపములలో వైవిధ్యము నంది యుండిన యాదేశ్య పదరూపములకుఁ దత్సమశబ్దములకు వలెనే యొకస్థిరమైనరూపము నొసంగుటకుఁ బ్రయత్నించెను. శాసన భాషలోఁ గల వైరిసమాసముల నతఁడు పూర్తిగాఁ బరిహరించెను. సంధివిషయమునఁ గూడ నొకవ్యవస్థ తనకాలముదాఁక లేకపోయినందున దాని కొకవ్యవస్థ తానుగాఁ గల్పించుకొనెను. నన్నయకుఁబూర్వము పెక్కుశాసనములలో సమాపక క్రియలులేని వాక్యములే హెచ్చుగా గోచరించుచుండును. అట్టివానిలోఁ దచ్ఛబ్దాను ప్రయుక్తము లయినక్రియాజన్య విశేషణములే యాక్రియావ్యాపారము నొనరించు చుండును. నన్నయ సమాపకక్రియల ప్రయోగమును దన వాక్యరచనలోఁ బ్రారంభించెను. యత్తదర్థకములలోఁ గూడిన వాక్యములను సంస్కృతపద్ధతి ననుసరించి తెలుఁగునఁ బ్రచారములోనికిఁ గొనివచ్చెను. సంస్కృతవ్యాకరణ సంప్రదాయము ననుసరించి ద్రావిడ భాషలలో లేని కర్మార్థకప్రయోగమును దెలుఁగులోనికిఁ దెచ్చి సంస్కృతవృత్తములలో ఛందస్సౌకర్యము కలుగునట్లు చేసికొనెను.

నన్నయకుఁ బూర్వ ముండినశాసనములలో దేశిచ్ఛందమునకుఁ జెందిన తరువోజ, మధ్యాక్కర, సీసము, రగడ, కందము అనుపద్యములు కానవచ్చుచున్నవి. మాత్రాచ్ఛందస్సునకుఁ జెందిన జాత్యుపజాతిపద్యములే యాకాలమున హెచ్చుగా వాడఁబడుచుండెను. సంస్కృతపదములను దత్సమీకరించుపద్ధతి యేర్పఱిచినట్లే యాతఁడు సంస్కృతమునుండి మత్తేభ, శార్దూల, చంపకోత్పలమాలాది వృత్తములను గ్రహించి తెలుఁగు నందలి ఛందస్సంపదను గూడ నభివృద్ధిఁ గావించెను. ఛందోవిషయమునఁ బంపాది కన్నడ కవులును నిట్లే యొనరించిరి. వారి పద్ధతియే నన్నయకు మార్గదర్శక మయ్యెను.

ఛందోవిషయమునందువలెనే కావ్యమును జంపువుగా వ్రాయువిషయము నందును నన్నయ కన్నడకవుల మార్గము ననుసరించెను. మఱియు నన్నయకుఁ బూర్వకాలమునందలి శాసనములలోఁ గూడఁ బద్యము తరువాత గొంత వచనము వ్రాయఁబడుచుండెను. కన్నడకవులు తమకావ్యములయం దవలంబించిన

చంపూపద్ధతిని, శాసనములయందలి గద్యపద్యోభయరీతిని జక్కఁగా బరిశీలించి నన్నయ చంపూమార్గమునఁ దనభారతమును వ్రాయఁ గడంగెను.

ఇట్లు మహాకావ్యరచనానుకూలము లయిన భాషాచ్ఛందములను, రచనా పద్ధతిని నిర్ణయించుకొని నన్నయ మహాభారతరచనమును మిక్కిలి సమర్థముగా నిర్వహించి కృతార్థుఁడు కాఁగలిగెను. భారతరచనమునకుఁ బూర్వరంగముగా సాఁగిన యీ ప్రణాళిక కల్పనమునందు దాతనికి సహాధ్యాయి యయిన నారాయణ భట్టు తోడయ్యెను. ఇట్లుగా నన్నయభట్టు తెలుఁగులో మార్గకవితాపద్ధతికి ఘంటాపథము తీర్చెను. అందుచేతనే కొలని గణపతిదేవకవి శివయోగసారావతారికలో 'ఆంధ్రకావ్యపథము తీర్చినవాఁడు' గా నన్నయను సంభావించి యుండెను. నారాయణభట్టు తోడ్పాటుతో, రాజరాజనరేంద్రుని యాదరప్రోత్సాహములలో, సమకాలమునందలి పండితపరిషత్తుల యామోదప్రమోదములతో నన్నయ ప్రారంభించిన యీమార్గకవిత్వోద్యమము తరువాతి కవులపైఁ బ్రసరింపఁ జేసిన ప్రభావ మనంతము. ప్రబంధయుగముదాఁకఁ గూడ నాయుద్యమప్రభావము చెక్కుచెదరక నిలిచినది. నడుమ మహోద్ధతముగా సాఁగిన దేశికవిత్వోద్యమము కూడ దీని నేమియుఁజేయఁజాలక ప్రక్కకుఁ దప్పుకొని పోయినది. పాల్కుఱికి సోమనాథుఁడు దేశికవిత్వోద్యమమును మహాదీక్షతో, మహోవిజృంభణములో సాగించినను – వానియూసైనను నెత్తక తరువాతికవులు నన్నయ మార్గకవితామార్గమునే యనుసరించిరి. ఈయుద్యమము నకు సాఁగినంత చెల్లుబడి యాంధ్రసాహిత్యమున నిటీవలి భావకవిత్వముదాఁక నిఁక నేయుద్యమమునకును లేదనియే చెప్పవచ్చును.

## 2. దేశికవిత్వోద్యమము

మార్గకవిత్వోద్యమమునకుఁ దరువాత తెలుఁగున దానికిఁ బ్రతియోగిగా సాఁగిన మహోద్యమము దేశికవిత్వోద్యమము, ఈదేశి కవిత్వోద్యమ స్వరూపస్వభావములను దెలిసికొనుటకు ముందు తదుద్యమ ప్రారంభవికాసములను గూర్చి యెఱుఁగుట కర్తవ్యము. చాళుక్యప్రభువులు దేశభాషాభిమానము కలవా రగుటచేఁ దమకాలమున వ్యవహారములో నున్న దేశభాష యగు తెలుఁగులోఁ దమశాసనములను వేయించిరి. తమకాలమునందుఁ గన్నడభాషలో మార్గకవితాపద్ధతి యేర్పడి ప్రాచుర్యము నంది యుండఁగా నీచాళుక్య ప్రభువులు దేశభాషయందలి యాదరముచేఁ దెలుఁగున శాసనములు వేయించి వానియందు దేశికవిత్వము కొంత

వెలయుటకుఁ గారణభూతు లయిరి. ఈ విషయమునే నన్నెచోడుఁడు తనకుమారసంభవమునందు –

*'మును మార్గకవిత లోకం*
*బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం*
*గు నిలిపి రంధ్రవిషయం*
*బునఁ జనఁజాళుక్యరాజుమొదలుగఁ బలువుర్.'*

కుమా. అవ. *23*ప.

అనుపద్యమునందుఁ దెలిపి యుండెను. చాళుక్యయుగమునందు దేశిమార్గమునకుఁ జెందినయిట్టిరచనలే కాక మార్గపద్ధతికిఁ జెందిన రచనలు కూడఁ గొన్ని వెలయక పోలేదు. కాని యామార్గపద్ధతి ప్రచురము కాక పరిణామదశలోనే యుండెనని చెప్పఁదగును. ఈ యుగమున క్రీస్తుశకము పదవ శతాబ్దమునకుఁ బూర్వము లభించిన సారస్వత మంతయు దేశిమార్గమునకుఁజెందినదే. అద్దంకి, కందుకూరు, బెజవాడ యనుస్థలములందు వేయఁబడినశాసనము లీవిషయమును నిర్ధరించుచున్నవి. ఇట్టిశాసనములందుఁ గాననగు పద్య రూపవాఙ్మయమే కాక యాకాలమునందు – పాల్కుఱికి సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రమునందుఁ బేర్కొనిన కొన్ని పదరచనములు – తుమ్మెదపదములు, ప్రభాత పదములు మొదలగునవి – కూడ నుండి యుండుట సంభావ్యము. క్రీస్తుశకము పదవ శతాబ్దమునకుఁ తరువాత రచితము లయినట్లు చెప్పఁబడుచున్న పద్మ, సర్వదేవాదుల జైన కావ్యములును, విరియాల కామసాని గూడూరు శాసనమును మార్గపద్ధతినే యవలంబించెను. అంతకుఁ బూర్వమునుండియు మౌఖికప్రచారమున వినవచ్చుచుండిన పద వాఙ్మయమాకాలమునఁ గూడ సాగుచునే యుండవచ్చును. దీనినిబట్టి యీయుగమున క్రీస్తుశకము పదవశతాబ్దికిఁ బూర్వము దేశికవిత్వమును, పదవశతాబ్దికిఁ బిమ్మట దేశిమార్గకవిత్వములు రెండును వ్యాప్తిలో నుండెనని యూహింపఁదగి యున్నది. ఇట్టిస్థితిలో నన్నయభట్టారకుఁడు కన్నడమునందలి మార్గకవితాపద్ధతి ననుసరించి తెలుఁగునఁ గావ్య రచనోపయోగియైన కవితాపద్ధతిని స్వతంత్రముగా రూపొందించుకొని మార్గకవిత్వ పద్ధతికిఁ గట్టిపునాదులే వేసెను. తరువాతికవుల కందఱకు నీపద్ధతియే మార్గదర్శక మయినది.

నన్నయకుఁ దరువాత నన్నెచోడుఁడు తొలిసారిగా దేశికవిత్వప్రస్తావము చేసి తనకుమారసంభవమును జానుతెనుఁగులో రచింతు నని సంకల్పించెను.

జానుతెనుఁగు అనువమాటను తొలిసారిగాఁ దెలుఁగు కావ్యలోకమునఁ బ్రవేశపెట్టినవాఁడు నన్నెచోడుఁడు. జానుతెనుఁగనఁగా అందమైన తెలుఁగని, యింపైన తెనుఁగని యర్థము. దేశిశబ్దములను, జనవ్యవహారములో బాగుగా నలఁగిన సంస్కృతశబ్దములను సముచితప్రమాణములో మేళవించినప్పుడే తెనుఁగునకు జానుతనము సిద్ధించును. నిఘంటువులను మాత్రమే యాశ్రయించి బ్రతికెడు నప్రసిద్ధపదములను బ్రయోగించినచోఁ బ్రజల కవి యింపు నింపవు. కనుక జనమండలి కత్యంతము సన్నిహితము లయిన సుందరసంస్కృతాంధ్ర శబ్దముల నేర్చికూర్చిన రచనారీతి 'జానుతెనుఁగు' అని నిర్ధరింప వచ్చును. నన్నెచోడుఁడు జానుతెనుఁగునఁ గావ్యముఁ గూర్తు నని ప్రతిజ్ఞ చేసినను నతఁడు దానిని బూర్తిగా నెఱవేర్పఁజాలకపోయె ననియే చెప్పఁదగును. నన్నయ కవిత్వములోని సంస్కృతపదజాల బాహుళ్యమును, సమాసాధిక్యమును జూచి నన్నెచోడుఁ డట్టి ప్రతిజ్ఞను జేసి యుండుననవచ్చును. కన్నడపదములను, విలక్షణాంధ్రపద రూపములను బ్రయోగించి యాతఁడు తనకవిత్వభాషను గొంతక్లిష్టపరిచినమాట నిజమే యయ్యును, నన్నయ ప్రయోగింపని పెక్కు దేశిపదములను దనకావ్యమునందు బ్రయోగించి యాతఁడు కొంతవఱకుఁ దనప్రతిజ్ఞను నిర్వహించుకొనుటకు స్వల్పప్రయత్నము కావించెను. ఇట్లైతఁడు జాను తెనుఁగు రచన చేయుటకు యత్నించినను నతనికవిత్వమునందు మార్గకవితావిధానమే యెక్కువగాఁ గాన వచ్చును. కాని, నన్నయభారతమునందుఁ గంటె నీతని కవిత యందు దేశికవితాచ్ఛాయ లధికముగా గోచరించు ననుటకు సందియము లేదు. నన్నయ నన్నెచోడుల రచనలు రెండును మార్గపద్ధతికే చెందినను నన్నయలో దేశికవితా గుణము చాలఁ దక్కువగను, నన్నెచోడునిలో నంతకంటె నెక్కువగను నుండినట్లు గోచరించును. నన్నెచోడునికి దేశికవిత్వ మాదర్శముగా మాత్రమే నిలిచిపోయెను. ఆచరణలో నాయాశయమునకు రూపు దిద్దు సాహస మానాఁటి కాతనికి లేక పోయి యుండవచ్చును. సుప్రతిష్ఠితమయిన – పండితజనాదరపాత్రమయిన – కవితాపద్ధతిని గా దని క్రొత్త మార్గమును దీర్చుటకు వలసిన శక్తియుక్తు లాతనిలో లేక పోవుట కూడఁ గొంత కారణము కావచ్చును.

నన్నెచోడునికిఁ దరువాత పాల్కుఱికి సోమనాథుఁడు వస్తువు, ఛందస్సు, భాష యనుమూఁడు విషయములందును మార్గకవితాపద్ధతిని నిరసించి తన బసవపురాణ, పండితారాధ్య చరిత్రములందు దేశిమార్గమున కత్యంత ప్రాధాన్యమొసఁగెను. నన్నయ యేర్పఱచినమార్గకవితాఘంటాపథమును గా దని,

దేశికవితాకంటకపథమునఁ గా లూని దానిని పూలబాటగా మార్చుకొనిన అపూర్వ ప్రతిభాసమున్మేషుఁడు పాల్కుఱికి సోమనాథుఁడు.[౧] నన్నెచోడుని మనస్సులో మొలకెత్తిన దేశికవితాభిమానము పాల్కుఱికి సోమనాథునిలో మహావట మై యెన్నియొ యూడలనో దింపినది. ఎందఱెందఱకో యాశ్రయమిచ్చినది. దేశికవితావిశ్వరూపము పాల్కుఱికి సోమనాథుని రచనలలో రూపుకట్టుకొనినది. పూర్వాంధ్రసాహిత్యమున దేశికవిత్వమునకుఁ బునాదులు వేసినవాఁ డీతఁడు. దేశి కవిత్వమొకమహోద్యమముగా సాఁగించి యెన్నో నూతనప్రయోగములు చేసి తన యనుయాయులకు మార్గదర్శకుఁడయినాఁడు. శైవమతప్రచారమునఁ గృతకృత్యుఁడయినాఁడు. సోమనాథునికి ముందు దేశీయచ్ఛందస్సుల కంతగా నాదరము లేదు. తరువోజలు, మధ్యాక్కరలు మొదలయిన కొన్ని దేశి పద్యములు మాత్రమే యాతని మన్నన లందినవి. అవి యయినను సంస్కృతవృత్తముల యుజ్జ్వల సంప్రకాశముముందు వెలవెల పోయినవి. అప్పుడయిన తెలుఁగు ఛందస్సులో మహాకావ్యరచనము నిర్వహింతునని శంఖము పూరించిన దేశికవి సోమనాథుఁడు. వస్తుపరిగ్రహణమునందును సోమనాథుఁడు దేశీయాభిమానమును బ్రదర్శించెను. నన్నెచోడుఁడు ప్రతిపాదించిన 'జానుతెనుఁగు' సిద్ధాంతము నీతఁడు విస్తరింపఁ జేసెను. తెనుఁగు మాటకు, తెనుఁగుపలుకుబడికిఁ గిరీటము పెట్టెను.

ఈతఁడు సాఁగించిన యీదేశికవిత్వోద్యమము తరువాతి కాలమునఁ బ్రత్యక్షముగాఁ గొందఱిపైనను, బరోక్షముగాఁ గొందఱిపైనను దనయమేయ ప్రభావమును నెఱపినది.

## ౩. హరిహరనాథ తత్త్వోద్యమము

పం[డ్రెండవశతాబ్దమున నొకవైపు బసవేశ్వరునిచే స్థాపింపఁబడిన వీరశైవమతమును, శ్రీరామానుజులవారు ప్రతిపాదించిన వైష్ణవమతమును దక్షిణదేశమున విజృంభించి యుండెను. ఉభయమతములకుఁ జెందినవారును దమమతమే గొప్పదని చాటుచు నితరమతమును, తదనుయాయులను దుయ్యఁబట్టుచుండిరి. పదుమూఁడవ శతాబ్దిలో మధ్వాచార్యులు ప్రతిపాదించిన ద్వైతమత మదివఱకే ప్రజ్వలించుచుండిన మతవైషమ్య మహాగ్నిని మఱింత ప్రజ్వరిల్లఁ జేసెను. ఇట్లు మతకలహములు విజృంభించి దక్షిణదేశ మంతయుఁ గల్లోలములతోను, రక్తపాతములతోను నట్టుడికి పోవుచుండెను. తత్ఫలితముగా నద్వైతమతము

౧. ఆధునికాంధ్రకవిత్వము : పుట 118.

నానాంటికి క్షీణింపఁ దొడఁగెను. వైదికధర్మప్రతిపాదక మయిన మహాభారత మప్పటికి రెండువందలసంవత్సరములకుఁ బూర్వమే కొంతవఱకుఁ దెలిఁగింపబడి యుండినను దానిని తుదముట్ట నిర్వహించుట కాంధ్రదేశమున నెవరును ముందునకు రాకపోవుట కాకాలమునందలి యామితకలహములే కారణము లని భావింప వలసి యున్నది. అట్టిపరిస్థితిలో దేశీయు లయిన యాంధ్రప్రజానీకమును సరియయిన మార్గమున నడిపించి వారి నేకముఖముగావింప వలసినయావశ్యక మెంతేనియు నుండినది. వేదప్రతిపాదిత మయిన యద్వైతతత్త్వమును గవితారూపమున నందించి ప్రజలను బ్రబోధితులను జేయుట యొక్కటే యానాంటి మతవైషమ్యము లడఁగుట కనుసరణీయ మయిన యేకైకమార్గము. తిక్కనసోమయాజి యామహాకార్యమును నిర్వహించుటకు బద్ధకంకణుఁ డయ్యెను. హరిహరు లొక్కరే యనియు, భగవత్తత్త్వ మొక్కటే యనియు నాతఁ డెలుఁగెత్తి చాటెను. హరిహరుఁడను పరతత్త్వమునకు విగ్రహరూపమునఁ గాక మానసికముగా మూర్తికల్పనముఁ గావించి యాతఁడు హరిహరాద్వైతమును బ్రతిష్ఠాపించి ప్రచారముఁ గావించెను. తిక్కనకుఁ బూర్వ మాంధ్రదేశమున హరిహరోపాసనము గాని, హరిహరాలయము గాని లేదు. కన్నడదేశమునఁ గూడ నప్పటికి హరిహరాలయము లేదు.[2] తిక్కనయే తనభారతావతారికలోఁ దనకు స్వప్నమున హరిహరనాథదైవము సాక్షాత్కరించినట్లు పేర్కొని 'కిమస్థిమాలాం కివు కౌస్తుభం వా' అను శ్లోకమువలన నాతనికి మూర్తికల్పనము కావించుటయే కాక తనజనకుని యాదేశముమేరకుఁ దనభారతము నతనికే యంకితము గావించెను. ఇతని యీ హరిహరాద్వైతసిద్ధాంతము, హరిహరోపాసనము తరువాతికవుల కనేకులకు మార్గదర్శకమయ్యెను. ఇతనికిఁ దరువాత నాచనసోమనాథుఁడు తిక్కన సోమయాజినే యనుసరించి తన యుత్తరహరివంశమును హరిహరనాథాంకితముఁ గావించెను. అంతమాత్రముతోఁ దృప్తి నందక యాతఁడు తనయుత్తరహరివంశములోని ద్వితీయాశ్వాసములో శ్రీకృష్ణుఁడు పుత్త్రార్థియై పరమేశ్వరునిగూర్చి తపస్సు చేసినట్లును, పరమశివుఁ డాతనికిఁ బ్రత్యక్షమై పుత్త్రుననుగ్రహించినట్లును దెలుపు సందర్భమునను బదరికాశ్రమమునందలి మునీశ్వరు లాయిరువురికి నభేదము కల్పించి స్తోత్రము చేసినట్లు వర్ణించి యున్నాఁడు. ఆస్తోత్రభాగము నాచన సోమనాథుని కాతత్త్వముపైఁ గలయట్టి గట్టిప్రత్యయమునకుఁ దార్కాణమై శోభిల్లుచున్నది. విక్రమార్క

2. ఆధునికాంధ్రకవిత్వము - డా. సి. నారాయణరెడ్డి. పుట. 117.

చరిత్రము అను ప్రౌఢ ప్రబంధమును రచించిన జక్కన హరిహరారాధకుఁడు. పంచతంత్రమును దెనిఁగించిన దూబగుంట నారాయణకవి తనకావ్యమును హరిహరాంకితముఁ గావించెను. అతఁడును గొప్ప హరిహరభక్తుఁడు.

పాల్కురికి సోమనాథుఁడు తన బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలో హరిహరులకు సమానత్వమును, అద్వైతమును బ్రతిపాదించువారిమతమును ఖండించి యుండెను.[3] దీనిఁబట్టి సోమనాథుని నాఁటికే యీవాదము సన్నసన్నగాఁ బొడ సూపుచుండె నని తెలియుచున్నది. సోమనాథుఁ డట్టివాదము చేయువారిని తనకావ్యములందు ఖండింపఁగా తిక్కనసోమయాజి మఱల నావాదమునకుఁ బ్రాణము పోసి, తనకావ్యమున దానిఁ బ్రతిపాదించి మతవైషమ్యములతో దగవులాడుకొనుచుఁ బరస్పరము సంహారకాండ జరుపుకొనుచుండిన ప్రజలకు సంస్థితిని జేకూర్చెను. తరువాతి కవులు కొందఱు తిక్కన ప్రారంభించిన యీయుద్యమమును జేపట్టుటతో దానికిఁ గొంత బలము చేకూరినది. ఇట్లు హరిహరనాథ తత్త్వోద్యమముతోఁ దిక్కన సోమయాజి కవిత్వరంగమునందే కాక యాధ్యాత్మికరంగమునందును దరువాత కవులకుఁ గొందఱకు మార్గదర్శకుఁ డయ్యెను.

## 4. ప్రబంధ కవిత్వోద్యమము

ఆంధ్రసాహిత్యచరిత్రమున శ్రీకృష్ణదేవరాయలయుగము ప్రబంధయుగ మనుపేర వ్యవహరింపఁబడుచున్నది. తెలుఁగువాఙ్మయమున నీప్రబంధశాఖ కున్న ప్రాధాన్యము కాని, ప్రాచుర్యము కాని మఱి యే శాఖకును లేదని చెప్పినచో నతిశయోక్తి కాదు. ప్రబంధ కవిత్వ మనునది మనయాంధ్రభాషయందుఁ బదునాఱవ శతాబ్ది ప్రారంభమునుండియే యేర్పడినప్పటికిని దానియుత్పత్తిమాత్రము హఠాత్సంభవము కాదు. ఆంధ్రసాహిత్యమున స్థూలముగా రెండుమార్గములు కానవచ్చును. ఒకటి పురాణమార్గము. రెండవది ప్రబంధమార్గము. నన్నయ పురాణ మార్గమునకుఁ బ్రవర్తకుఁడు. నన్నెచోడుఁడు ప్రబంధమార్గమునకు జనకుఁడు. భారతమును బురాణముగాఁ, గుమారసంభవమును బ్రబంధముగాఁ బరిగణించుట కితివృత్తభేదమే కారణము.

---

3. బసవపురాణము. పుటలు *480, 481.*
పండితారాధ్య చరిత్రము. పుటలు *644* నుండి *650* వఱకు

సంస్కృతమున నీ 'ప్రబంధ' పదము కావ్యసామాన్యవాచిగా మాత్రమే ప్రయోగింపఁబడినది. ప్రాచీనాంధ్రకవులు కూడా నీశబ్దమును సంస్కృతాలంకారికులు వాడినయర్థములోనే వాడిరి. దీని నొక సారస్వతప్రక్రియా విశేషముగా వారు భావింప లేదు. తిక్కన, కేతన, ఎఱ్ఱన, సోమన, శ్రీనాథుడు మొదలగు మహాకవులు తమ కావ్యములను బ్రబంధములుగానే పేర్కొనిరి. తిక్కన తన భారతభాగమును 'ప్రబంధ మండలి' యని పేర్కొనెను. అతనికి ముందు నన్నెచోడుఁడు 'ప్రబంధ' శబ్దమును కావ్యసామాన్యార్థములోఁ బ్రయోగించి యుండెను. ఎఱ్ఱన 'ప్రబంధపరమేశ్వరుఁ' డను బిరుదుముతోఁ బ్రఖ్యాతి వడయుట వ్యాత్రమేకాక యీ నాతని గ్రంథములోఁ గూడా నీప్రబంధశబ్దము కావ్యసామాన్యార్థమునఁ బ్రయోగింపఁబడి యున్నది.

ఆంధ్రలాక్షణికులు ప్రబంధము నొకప్రత్యేకకావ్యవిశేషముగా నూహించి దానికి లక్షణనిర్దేశముఁ గావించిరి. సంస్కృతభాషయందు దండి సర్గబంధ మనెడిమహాకావ్యమునకుఁ జెప్పిన లక్షణములనే యాంధ్రలాక్షణికులు ప్రబంధ లక్షణములుగా స్వీకరించిరి. ప్రబంధ మనునది యష్టాదశవర్ణనాత్మకముగా నుండవలయు ననియు, ధీరోదాత్తాదినాయకులలో నొకఁడు కథానాయకుఁడుగా నుండ వలయు ననియు వారియాలక్షణముల యొక్క సారాంశము. ఈలక్షణము ననుసరించి రచింపఁబడిన మను, వసు చరిత్రాది గ్రంథములు మనభాషలోఁ బ్రబంధములుగాఁ బరిగణింపఁబడినవి. అయినను నది మనభాషయందు వెలువడిన ప్రబంధముల లక్షణములను సమగ్రముగా నిర్వచించుట లేదు. ఆలక్షణములను దెలిసికొనవలయు నన్నచోఁ బదునాఱవ శతాబ్దియందు వెలువడిన ప్రబంధముల నన్నిటిని బరిశీలించి వానిలోని సామాన్య ధర్మముల నెల్లఁ గ్రోడీకరించి, యాక్రోడీకరణమువలనఁ దేలిన సారాంశములను బ్రబంధ లక్షణములుగా నంగీకరింప వలసియుండును. అప్పుడు ప్రబంధలక్షణ మీక్రిందివిధముగా నుండును. పురాణేతిహాసములయందలి కథనో, యుపాఖ్యానమునో చేపట్టి, స్వకపోలకల్పనలచే దానిఁ బెంపుఁ గావించి, యష్టాదశవర్ణనల నందందుఁ జొన్పి, రసాభివ్యక్తికిని, బాత్రచిత్రణమునకును నెక్కుడు ప్రాధాన్య మొసఁగి, శబ్దార్థాలంకారసహితముగా రచింపఁబడిన స్వతంత్రకావ్యము ప్రబంధము. ప్రబంధోచిత మయినవస్తువు యొక్క యునికిమాత్రమే కాక యాప్రబంధశరీరమున కావశ్యక మగు సంధిసామగ్రియు, సౌందర్యాపాదకము లగు నితరావయవసౌష్ఠవములు నం దుండవలయును. అప్పుడే యది ప్రబంధ మగును. కావ్యమునందంగాంగిభావసంబంధము చక్క నెలకొని నప్పుడు కాని, సౌందర్యము

సంప్రాప్తము కాదు. కావ్యమునందలి వస్తుశరీరమునకును నితరావయవములకును బ్రస్తుతములు బంధమునందును గనుకనే యాశిల్పమూర్తికిఁ బ్రబంధ మను పేరు వచ్చినది.

శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు ప్రబంధలక్షణముల నిట్లు తెలిపిరి.[౪]

౧. ప్రబంధమునకు ఏకనాయకాశ్రయత్వము, దానితోఁబాటు వస్త్వైక్యము ప్రధానములు.

౨. ప్రబంధము అష్టాదశవర్ణనాత్మకమై యుండవలెను.

౩. ఇందు శృంగారము ప్రధానరసము, ఆవశ్యకతనుబట్టి తక్కిన రసములు గౌణములు కావచ్చును.

౪. ఆలంకారికమైన శైలి ప్రబంధమునకు జీవము.

౫. ప్రబంధము భాషాంతరీకరణము కాఁగూడదు. స్వతంత్రరచన యై యుండవలయును.

ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'ప్రబంధ' లక్షణముల నిట్లు నిర్దేశించిరి.[౫] వారి యభిప్రాయమున స్థూలముగాఁ బ్రబంధలక్షణములు నాలుగు.

౧. ఏకనాయకునియొక్క తృతీయపురుషార్థమునకు చెంది తద్వివాహ సంబంధి యగుట.

౨. శృంగారము అంగి రసముగా నుండుట.

౩. వర్ణనాబాహుళ్యము కలిగి యుండుట.

౪. రీతిప్రాధాన్యము కలిగి యుండుట.

పదునారవశతాబ్దియందు వెలువడిన మనుచరిత్రాదు లగుకావ్యముల కన్నిటి కిని పైప్రబంధలక్షణము లన్నియు సమగ్రముగాఁ బట్టినను బట్టకున్నను నవి యెల్ల స్వతంత్రరచనము లగుటచేతను – అలాంకారికశైలీశోభితములగుటచేతను నవి యెల్లెడలఁ బ్రబంధములుగానే పరిగణింపఁ బడుచున్నవి. ఇట్టి ప్రబంధయుగమునకు నల్లసాని పెద్దన మనుచరిత్రము వరవడి పెట్టినది. ప్రబంధకర్తగాఁ బెద్దన చేసిన కవితాప్రయోగము ప్రథమ గణ్యము. అతని ప్రభావ మా సమకాలమునందలి కవీశ్వరులందఱి మీఁదను బడి యీ పారస్వతప్రక్రియ ప్రాచుర్యమునందినది.

---

౪. తెలుఁగువిజ్ఞానసర్వస్వము : మూఁడవసంపుటము : పుట 608.

౫. ఆధునికాంధ్ర కవిత్వము : పుట 126.

పదునాఱవ శతాబ్దియందు దక్షిణదేశమున మహమ్మదీయులు మహాప్రాభవముతో వెలిఁగిపోవు చుండిరి. వారి సంస్కృతి, వారి యాచార వ్యవహారములు, వారివస్త్రములు నాంధ్రదేశమునఁ గూడ వారి దండయాత్రలతో, నప్పుడప్పుడు వారి రాజ్య పాలనముతోఁ గ్రమముగా వ్యాప్తిలోనికి రాసాగెను. పాలకులయిన వారి రాజ్యవైభవము, వారి భోగప్రియత్వము హైందవపాలకులనుఁ గూడ భోగాభిలాషను రేకెత్తించినది. వారిప్రభావమువలన రాజస, తామసశృంగారములు సాత్త్వికశృంగారమును ద్రోసిరాజు చేసి ప్రాధాన్యము వహించినవి. విజయనగరపాలకులపైఁ గూడ నీప్రభావము సోకక పోలేదు. వారు శృంగారరసప్రధానము లయినకావ్యములనే యభిమానింప సాఁగిరి. వారియభిరుచి ననుగుణముగా వారిమెప్పును సంపాదించుటకై కవులును పద్యకావ్యములనే విరచింపఁదొడఁగిరి. పదునైదవశతాబ్దినాఁటికి సంస్కృతమున గల వివిధ సాహిత్యప్రక్రియలు తెలుఁగులోనికి దిగుమతి చేయఁబడినవి. నాఁటికి సంస్కృతసాహిత్యములోని సమస్తసాహిత్యప్రక్రియలను తెలుఁగునకుఁ దెచ్చుకొనుట పూర్తి యయ్యెను. కృష్ణదేవరాయలకాలమునాఁటి కవులకు సంస్కృతసాహిత్యము నుండి తెలుఁగులోనికి దిగుమతి చేయుటకు కే సాహిత్యప్రక్రియయు మిగులదయ్యెను. అందుచే స్వతంత్రకావ్యనిర్మాణము వారి కావశ్యక మయ్యెను. ఈపరిస్థితులే 'ప్రబంధ' మనెడి వినూత్న సాహిత్యప్రక్రియ తెలుఁగులో నవతరించుటకు దోహదము చేసినది.

మనుచరిత్రము రచింపఁబడిన పిమ్మట నాపరవడిలో పారిజాతాపహరణము, వసుచరిత్రము, పాండురంగమాహాత్మ్యము, కాళహస్తిమాహాత్మ్యము, ప్రభావతీ ప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము, కవికర్ణరసాయనము మొదలగు పెక్కు ప్రబంధములు రచింపఁ బడుట యాకాలమునం దీప్రబంధకవిత్వోద్యమమెంత తీవ్రముగా సాఁగినదో తెల్లము చేయగలదు. కథా సంవిధానమందును, వర్ణనలందును మనుచరిత్రము ననుకరించినను గావ్యము నందంతట దృఢ ధ్వన్యలంకారములను నిక్షిప్తము చేసి రామరాజ భూషణుఁడు తన వసుచరిత్రమునందుఁ బ్రబంధరచనమునఁ గూడఁ గ్రొత్తపోకడలు చూపెను. పింగళి సూరన్న మఱియొక యడుగు ముందునకుఁ బోయి కల్పితకథతోఁ గథావైచిత్ర్యముతోఁ గూడుకొనిన మహాకావ్యమును గళాపూర్ణోదయమును రచించి ప్రబంధరచనమున నూతనప్రయోగము చేసినవాఁ డయ్యెను.

ఇట్లు రాయలకాలమున బహుముఖముగా సాఁగి ప్రాచుర్యము నందిన యీప్రబంధకవితోద్యమమును ప్రథమాంధ్రనవ్యకవితోద్యమముగా నభివర్ణించు శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు వ్రాసిన యీక్రింది వాక్యము లీయుద్యమముయొక్క స్వరూపమును, ప్రాచీన కవిత్వములో దీనికిఁ గలవైలక్షణ్యమును దెల్లముచేయఁజాలి యున్నది.

ఈవర్గములో అగ్రగణ్యుఁడును, ఆంధ్రకవితాపితామహుఁ డనుబిరుద మునకుఁ దగినవాఁడును నయిన అల్లసాని పెద్దనచే రచింపఁబడిన మనుచరిత్రముతో ప్రథమాంధ్రనవ్యకవితోద్యమము ప్రారంభ మయ్యెను. ఆంగ్లవాఙ్మయచరిత్రలో ఎలిజబెత్ రాణి శకమును నాటకయుగ మనియు, అప్పటినాటకములను నవ్య కవితానాటకము (Romantic Dramas) లనియు చెప్పుదురు. అంతకు మున్ను ఆంగ్లమున నాటకములు లేక పోలేదు. కాని, షేక్స్పియర్ మున్నగు మహాకవులు గ్రీకునాటకములవరవడిని వదలిపెట్టి స్వతంత్రనూతననాటకములను తమజాతి మనస్తత్త్వమునకు అనుగుణముగా దేశీయపద్ధతిని రచించుటచే ఆనాటకములకు 'రొమాంటిక్ డ్రామాస్' అని పేరు వచ్చినది. అట్లే, మనసారస్వతమునందు పెద్దన ప్రభృతికవులు సంస్కృతకావ్యముల కంటె భిన్నములుగా దేశీయపద్ధతులలో స్వతంత్ర నూతనకావ్యసృష్టి చేయుటచేత ఆనాడు ఒక నవ్యకవితోద్యమము (రొమాంటిక్ మూవ్‌మెంట్) ప్రవర్తిల్లె నని చెప్ప నగును.'[౬]

ఈ ప్రబంధకవితోద్యమఫలముగా మనుచరిత్రము వంటి రసవత్తర ప్రబంధము లాంధ్రభాషలోఁ బుంఖాను పుంఖములుగా రచింపఁబడినవి. మనుచరిత్రములోఁ బ్రారంభమయిన యీ 'ప్రబంధ' కావ్యప్రక్రియ దక్షిణాంధ్రయుగమునాఁటికిఁ బ్రతిభయుఁ బ్రాయమును దగ్గి – భావనాశక్తియు రచనాసామర్థ్యమును గొఱవడి యంధానుకరణములలో వెఱ్ఱితలలు వేసినది. శృంగారము కామకలుషిత మయినది. అయ్యును నారంభకాలమున నీయుద్యమ మాంధ్ర భాషాయోషకు సమర్పించిన 'ప్రబంధ' నీరాజనము మాత్రము చిరస్మరణీయము. అట్టి శిల్పసృష్టి సంస్కృతమున లేదు. అది యాంధ్రులు సమగ్రభారతీయ సరస్వతికి తమకానుకగా సమర్పించిన ఒక మాణిక్యాలంకారము.[౭]

౬. తెలుఁగువిజ్ఞానసర్వస్వము : మూఁడవసంపుటము : పుట 609-610.
౭. తెలుఁగువిజ్ఞానసర్వస్వముః మూఁడవసంపుటము : 610. శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారి వ్యాసము.

## ౫. అచ్చతెనుఁగు కవితోద్యమము

నన్నయయోపజ్ఞ మయినమార్గకవితాపద్ధతి ననుసరించి తరువాతికవులు తత్సమ పదప్రచురముగానే తమకావ్యములను వెలయించిరి. జానుతెనుఁగునఁ గవిత్వము చెప్పుదునని శపథముఁ బూనిన నన్నెచోడుఁడు కూడ దేశ్యపదప్రయోగమును గొంత యభిమానించినను జాలవఱకు నాతని కుమారసంభవము కూడ సంస్కృతపదబహుళముగానే సాఁగినది. పాల్కుఱికి సోమనాథుఁడు తనగ్రంథముల యందుఁ దెలుఁగు పదముల ప్రయోగమునకే ప్రాధాన్యము కల్పించి సంస్కృతపద ప్రయోగమును దగ్గించి యుండినను నాతఁడు సంస్కృతనిరపేక్షముగాఁ గవిత్వము నిర్వహింపఁ డయ్యెను. తిక్కన సోమయాజి తనకుఁ బూర్వము చక్కఁగా నెక్కొని యున్న యాభాషా మార్గమును గాదన లేక తత్సమదేశ్యపదబహుళముగాఁ దనకావ్యములను బ్రయోగించుటలోఁ దనయభిమానమును బ్రకటించుకొనెను. భాషా విషయమున సంస్కృతపద విరహితముగాఁ జెప్పుట యసాధ్యమయిన కార్యము కా దని వారు నిరూపింపఁ దలఁచిరి. అట్టి సంకల్పమే యచ్చ తెలుఁగుకావ్యముల రచనమునకు మూలహేతు వయ్యెను.

లక్షణగ్రంథకర్తలు అచ్చతెనుఁగు, దేశితెనుఁగు ననుదానిని నిర్వచించు సందర్భములందు అచ్చతెనుఁగులోఁ గవిత్వము చెప్పుపద్ధతికి శ్రీకారము చుట్టిరి. తరువాత నాచన సోమనాథుఁడు, ముక్కు తిమ్మన మొదలగుకవులు కొందఱు తమ కవితాకౌశలమును జాటుటకై యందందుఁ గొన్ని యచ్చతెనుఁగు పద్యములను విరచించిరి.[౮] వారిలో ముక్కు తిమ్మన యుభయవిధము లయిన కవిత చెప్పుటలోను దనకు సామర్థ్యము కలదని చాటుటకు ముందు వెనుకలుగా నొక అచ్చతెలుగు పద్యమును, దాని వెనువెంటనే సంస్కృతబహుళముగా నొక పద్యమును రచించి చూపెను.[౯] ఇట్లు చెదరుచెదరుగా సాఁగుచుండిన యీ

---

*౮. ఉత్తరహరివంశము : ద్వితీయాశ్వాసము. పద్యములు* ***126, 474, 472.***

*౯. పారిజాతాపహరణము : పంచమాశ్వాసము* ***104, 105*** *పద్యములు చూడుఁడు:*

*క. తలిరులతుదఁ జినుకులు జల*
*జల వడియఁగఁ దడిసి మెలఁగుచలికరువలి న*
*న్వాలవమున విరియుపరువపుఁ*
*దొలుమొగడల వలపు దెలుపు తోఁటలలోనన్.* ***5*** *ఆ.* ***104*** *ప.*

*క. దరదళదంబుజముకులో*
*దరదళమిళదళికులచ్ఛదప్రహతి స*
*త్వరసరజోధూసరపరి*
*సరసరసీతీరకుంజసదనస్థలులన్.* ***5*** *ఆ.* ***105*** *ప.*

యచ్చతెనుఁగు రచనము పదునాఱవశతాబ్దినాఁటికిఁ గాని కావ్యరూపము ధరింప లేదు. పొన్నిగంటి తెలగనార్యుఁడు రచించిన యయాతిచరిత్ర మచ్చ తెనుఁగున రచింపఁబడిన కావ్యములలో మొదటిది. అంతకుమును పెవ్వరు నిట్టిబృహత్ప్ర యత్నమునకుఁ దలపెట్ట లేదని యయాతిచరిత్రములోని యీక్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

క. మున్నెవ్వరు నొడువని యీ
తెన్నిది కడు మీఱి యచ్చతెనుఁగుంగబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁ గలఁడె నెలతాల్పయినన్. 1–11 ప.

కావ్యములో నొక్క యచ్చ తెనుఁగుపద్య ముండినను నది యొక ఘనతగా భావింపఁబడుచుండిన స్థితిలో తెలగన్న కావ్యమంతయు నచ్చతెనుఁగున రచించి యారీతి కావ్యరచనమునకు మార్గదర్శకుఁ డయ్యెను. ఆ యీవిషయ మీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. అచ్చతెనుంగుపద్య మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తమెల్లని
ట్లచ్చతెనుంగున న్నొడువ నందులచంద మెఱుంగువారు నిన్
మెచ్చరొ? యబ్బురం బనరొ? మే లనరో? కొనియాడరో నినున్. 1–12

అచ్చతెనుఁగు కావ్యము రచించుటలో పొన్నిగంటి తెలగన్న యనుసరించిన విధానమిది :

క. తెనుఁగునను మాఱు పేర్లిడి
పెనచిన వినఁగూడ దనుచు బిరుదులుఁ బేర్లున్
మును వేల్పుబాసవెంబడి
నునిచెదఁ గా దనకుఁ డయ్య యుల్లములందున్. 1–14

బిరుదములు, సంజ్ఞాపదములు తక్కఁ దక్కిన కావ్యభాగము నంతను తద్భవదేశ్యపదములతో నిర్వహించినయాతని మార్గమే అచ్చతెనుఁగుకావ్యకర్తల కనుసరణీయమయ్యెను. గోలకొండనవాబులలో మహాఁడవాఁ డగు మల్కిభరామునికడ నుద్యోగిగా నుండిన అమీనుఖానున కీయయాతిచరిత్ర మంకితము చేయఁబడినది. మల్కిభరాముని రాజ్యకాలము 1550–1581 యగుటచే నీగ్రంథమామధ్యకాలమున 1574–1581 నడుమ రచింపఁబడినట్లు శ్రీకందుకూరి వీరేశలింగముగా రభిప్రాయపడుచున్నారు.

తెలగనార్యునికిఁ దరువాత నచ్చతెనుఁగుకవిత్వమును జేపట్టిన కవిసత్తముఁడు కూచిమంచి తిమ్మకవి. అతఁడు రచించిన అచ్చతెనుఁగు రామాయణము, నీలాసుందరీ పరిణయము అను గ్రంథములు సుప్రసిద్ధములు. ఇతఁడు క్రీస్తుశకము పదునేడవ శతాబ్ది చతుర్థ పాదమున జనించి పదునెనిమిదవ శతాబ్ది యుత్తరార్ధమువఱకును జీవించి యుండెను. తెలగన్న ప్రారంభించిన యచ్చతెనుఁగు ఉద్యమ మీతనిచేతిలో వికాస మందెను. ఇతనితరువాత పాటిబండ పురుషోత్తమకవి కంసవిజయమును, అయ్యనకోట పార్థసారథిసెట్టిగారి సత్యవిజయము, ఆధునికకాలమున కందుకూరి వీరేశలింగము పంతులు గారి శుద్ధాంధ్రభారత సంగ్రహము, శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచననైషధము, మచ్చ వెంకటకవి శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచనకుశచరిత్రము, శ్రీ దేవులపల్లి నరసింహశాస్త్రిగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనసారంగధరచరిత్రమును, దాసు శ్రీరాములు పంతులుగారి శుద్ధాంధ్ర శాకుంతలనాటకము అచ్చతెనుఁగున రచింపఁబడిన గ్రంథములు. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు 'నుడికడలి' యను పేర నొక యచ్చతెనుఁగు నిఘంటువును రచింప సంకల్పించి దానినసంపూర్ణముగాఁ గొనసాగించుటయే కాక యచ్చ తెనుఁగు రచనము నొకయుద్యమముగా నాంధ్రదేశమునఁ గొంతకాలము ప్రచారము చేసిరి.

ఈ యచ్చతెనుఁగు గ్రంథము లాయాకవుల శక్తియుక్తులను జాటుట మాత్రము తోనే పర్యవసన్నము లయినవి కాని రసవత్కావ్యములుగా నాదరపాత్రములు కాలేదు. తత్సమాంధ్రపదసమ్మిళిత మయినభాషలోఁ జెప్పఁబడిన కవిత్వము రుచించినంతగా నీకావ్యము లాంధ్రులకు రుచింప లేదు. దానికిఁ గారణములు మూఁడు. ౧. నన్నయాదుల సంస్కృతాంధ్రపదబహుళమగు కావ్యరచనమున కాంధ్రు లలవాటుపడి యుండుట, ౨. సంస్కృతభాషతోడి సంబంధ మాంధ్రకావ్యములకు వీడరానిదియు, సహజమును నగుట. ౩. అచ్చతెనుఁగుకావ్యములలోని రచనము కృత్రిమముగాను రసహీనముగాను దోఁచుట.

ఈమూఁడు కారణములచేతను నచ్చతెనుఁగు కవిత్వ మొక 'గారడీ' వలె నద్భుత మనిపించెనే కాని హృదయస్పర్శి కాలేక పోయినది. అందుచేతనే యీ యుద్యమప్రయత్నము తెలుఁగునఁ గృతార్థము కాలేదు. అచ్చతెనుఁగునందే కవిత్వము చెప్పి యొప్పించుటయు, మెప్పించుటయు నసాధ్యమని – అది వ్యర్థప్రయత్నమే యగు నని – తెలుఁగుకవిత్వమునకు తత్సమ తద్భవ దేశ్యసమ్మిళిత

మయిన భాషయే యుత్తమ వాహికయగు నని యీ యుద్యమమువలనఁ దెలియవచ్చిన సత్యములు.

శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు 'అచ్చతెనుఁగు కవిత్వము' ను గూర్చి తెలిపిన యీయాంశము లిట గమనార్హములు.

'ఈ అచ్చతెనుఁగురచనలు శుద్ధకృత్రిమములని నా తలంపు. దీనిలో అచ్చతెనుఁగు లేదు, సరికదా, తత్సమ తద్భవదేశ్యాత్మక మైన ఆంధ్రభాషలో తత్సమము పరిహరింపఁబడుటచే భాషాసౌష్ఠవము కూడ లోపించినది.'౧౦

## ౬. యక్షగానరచనోద్యమము

ఆంధ్రసాహిత్యమున యక్షగానమును రచనావిశేషమొక ప్రత్యేకశాఖగా వర్ధిల్లినది. అది వట్టిసాహిత్యప్రక్రియమాత్రమే కాదు. సంగీతనృత్యకళలతోను దానికి సంబంధము కలదు. 'ఆంధ్రతాముద్రను భద్రముఅచిన దేశిసాహిత్యప్రక్రియలకెల్ల తలమానికము యక్షగానము'.౧౧ కథకళి యను నృత్యసంప్రదాయము కల కేరళదేశము నందుఁ దప్పఁ దక్షిణ దక్షిణదేశప్రాంతములయందు వ్యాపించి యుండిన కళాస్వరూపమిది. కాని, యిది తొలుత నాంధ్రదేశమునందే జన్మించినది. తరువాత తరువాతఁ దమిళ కన్నడ దేశములు దీనికి విహారభూము లయినవి.

శ్రీనాథుని భీమఖండములో దాక్షారామప్రశంసనసందర్భమున –

*'కీర్తించు రెడ్డానికీర్తి గంధర్వులు*
*గాంధర్వమున యక్షగానసరణి'*

అను సీసపద్యపాదమునందు 'యక్షగాన' మనుపదము తొలిసారిగాఁ గానవచ్చుచున్నది. క్రీడాభిరామమునందు 'జక్కులపురంధ్రి' యొక్క గానకళా ప్రావీణ్యము విశేషముగాఁ బ్రశంసింపఁబడినది. అందే యక్షకన్యల నృత్యము కూడఁ బ్రస్తావింపఁ బడినది. ఆంధ్రదేశమునందు 'జక్కులవారు' అనుపేరుతోఁ గళావంతులకోవకుఁ జెందిన యొక జాతి కలదు. వారియాటపాటలే యక్షగానప్రాదుర్భావమునకుఁ గారణము లై యుండును. తరువాత నా

౧౦. తెలుఁగువిజ్ఞానసర్వస్వము : మూఁడవసంపుటము : పుట 617. శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారి వ్యాసము.

౧౧. తెలుఁగువిజ్ఞానసర్వస్వము : మూఁడవసంపుటము : డా. యస్వీ జోగారావుగారి వ్యాసము.

జక్కులపాటలభక్కి చే నాకర్షింపంబడి కొందఱు శిష్టకవులు యక్షగానములను విరచించిరి. దీనిలోఁ గనుపట్టు ప్రధానరచనాంగములు మూఁడు. ౧. రగడవికారము, తాళప్రధానము నయిన రేకు, ౨. ద్విపద, ౩. ఏలలు, అర్ధ చంద్రికలు, ధవళములు, శోభనములు, అల్లోనేరేళ్లు మొదలగు పదములు. ఈమూఁడును దేశిచ్ఛందఃప్రక్రియలే. ఇవి చాలవఱకుఁ బ్రదర్శనమున కుద్దిష్టము లయినరచనములు. ఆనుషంగికముగా శ్రవ్యప్రయోజనము కూడ దీనిమూలమున సిద్ధించుచుండెను. దీని యందు దాఖ్యానశైలికంటె సంవాదశైలికే ప్రాధాన్య మధికము. సంభాషణములు చాల వఱకు దరువులలో సాగును. కథానుసంధానమునకై నడుమఁ జిన్నిచిన్నివచనములుండును. వానిని సూత్రధారుఁడు పలుకుచుండును.

మనకుఁ దెలియవచ్చినంతవఱకు చెన్నశౌరిసౌభరిచరిత్ర మాంధ్ర సాహిత్యమున వెలసిన మొదటి యక్షగానరచనము. కాని, యాగ్రంథమిపుడు లభించుట లేదు. ఉపలబ్ధము లగుచున్న యక్షగానములలో కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవవిజయము మొట్టమొదటిది. తరువాత క్రీ.శ. **1600** ప్రాంతము చక్రపురి రాఘవాచార్యుని విప్రనారాయణ చరిత్రము, అక్కమహాదేవిచరిత్రము ననయక్షగానములు పుట్టినవి. కంకంటి పాపరాజకవి విష్ణుమాయావిలాస మను యక్షగానమున విరచించెను. చిత్రకవిపెద్దన, అప్పకవి మొదలగుకొందఱు లాక్షణికులు యక్షగానమునకు లక్షణనిర్దేశము చేయుటకు యత్నించిరి. పదునేడవ శతాబ్దమున కూచిపూడి భాగవతులవలన యక్షగానప్రదర్శనముల కెక్కువగాఁ బ్రచారము లభించెను. నృత్యప్రధాన మయిన వారి 'భామాకలాపము' యొక్క ప్రభావ మాతరువాతి యక్షగానములపైఁ బడక పోలేదు.

ఇట్లు దృశ్యరూపముననను, శ్రవ్యరూపముననను నీయక్షగానరచనము లాంధ్రదేశమునందు వ్యాపించుచుఁ గొందఱు కవుల కట్టి రచనములయెడ మక్కువను గలిగించుచుండఁగా నాయకరాజులకాలమునఁ దంజావూరులో నీకళావిశేషమునకు రాజాశ్రయము లభించినది. సంగీతసాహిత్యములం దాదరము కల నాయకరాజులు దీనిని బోషించిరి. తమయాస్థానములందు యక్షగానములను గొన్నిటిని బ్రదర్శింపం జేసిరి. తామే స్వయముగాఁ గొన్నియక్షగానములను విరచించిరి. తంజావూరు రఘునాథనాయకుఁడు యక్షగానరచనమును చేపట్టినను నాతనికుమారుఁడగు విజయరాఘవనాయకునికాలమున దాని ప్రతిష్ఠ మిన్నంటినది. అతనికాలమున యక్షగానమున కాపేరు పోయి నాటక మనునామము కలిగినది. విజయరాఘవనాయకుని యనంతరము తంజావూరునకు

మహారాష్ట్రులు ప్రభువులయిరి. వారు జాతిచే మహారాష్ట్రు లయినను నాఁడు ప్రజలకు విద్యావినోదములు కూర్చుచుండిన యీ యక్షగాననాటకములయెడ నత్యంతాదరము కలిగియుండుట మిక్కిలి యాశ్చర్యకరము. వారిలో శహాజీ యనునతఁడొక్కఁడే యిరువదినాటకములను రచించి యుండెను. అతని యాస్థానమునం దుండిన దర్భా గిరిరాజునకవి రాజసంబంధేతివృత్తము కల యాఱు యక్షగానప్రాయము లయినరచనలు చేసెను. శహాజీ నాఁటినుండి చిట్టచివరి శివాజీ కాలము వఱకు తెలుఁగునఁ బెక్కు యక్షగానములు రచింపఁబడెను. రాజాశ్రయమునకు నోచుకొనని కొందఱు కవులు కూడ యక్షగానములను విరచించిరి. వారిలోముఖ్యులు నారాయణతీర్థులు, త్యాగరాజు, మేలత్తూరు వెంకటరామశాస్త్రి. క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దములో మధుర, పుదుక్కోట, మైసూరు రాజాస్థానములలోఁ గొన్ని యక్షగానములు రచింపఁబడినవి. మైసూరు ప్రభు వగు కంఠీరవనరసరాజు స్వయము గాఁ గొన్ని యక్షగానములు రచించెను. ఆకాలముననే తమిళ, కన్నడభాషలయందును యక్షగానములు రచింపఁబడుట యొక విశేషము. ఆభాషలయందలి యీరచనములకు తెలుఁగు యక్షగానముయొక్క ప్రభావమే కారణము.

దక్షిణదేశమునందువలెనే తెలంగాణమునందును యక్షగానములు పెక్కు రచింపఁబడినవి. పదునెనిమిదవశతాబ్దమునం దాప్రాంతమున నతివిరళముగాఁ బ్రారంభింపఁ బడిన యక్షగానరచనము పందొమ్మిది, యిరువది శతాబ్దులలో నధిక మయినది. వానిలో ధర్మపురిరామాయణము, మంథెన రామాయణము అనునవి ప్రసిద్ధి చెందినవి.

ఇట్లీ యుభయప్రాంతములందును యక్షగానరచన మొకమహోద్యమముగా సాఁగినది. తంజావూరు నాయకరాజు లీయుద్యమమును స్వయముగాఁ జేపట్టిరి. సహజముగా సంగీతసాహిత్యనృత్యకళలయందు విశేషాదరము కలవీరు తమ యాస్థానములలో నిట్టిరూపకములను బ్రదర్శింపఁజేసి ప్రజావినోదము కూర్ప నెంచుటయు, నప్పటికిఁ బ్రదర్శనయోగ్యము లయిన రచనము లభావ మగుటయుఁ గ్రొత్త క్రొత్తరూపకములతోఁ బ్రజలకు వినోదము కల్పించుట వారియాశయ మగుటయు నీయక్షగానముల రచనమునకును, బోషణమునకును గారణమయి యుండును. రాజులు చేపట్టిన రచనోద్యమ మగుటచే దీనికి విశేషవ్యాప్తి కలిగెను. తరువాత వచ్చిన మహారాష్ట్రప్రభువులును బ్రజానురంజనమునకై పూర్వరాజు లనుసరించిన కళాపోషణ మార్గమునను సరింపక తప్ప లేదు. ఇతర

రాజాస్థానములును దాని ననుసరించి యక్షగానములను ప్రోత్సహించి పోషించినది. ఇట్లు సాఁగిన యీయుద్యమఫలముగాఁ దెలుఁగున యక్షగానగ్రంథములు పరశ్శతముగా వెలసినవి. వివిధకాలములందు, వివిధప్రాంతములందు నానాఁటఁ గొన్ని క్రొత్తసొంపులను సంతరించుకొని యీ వాఙ్మయ శాఖ విస్తరించినది.

## 7. భావకవిత్వోద్యమము

ఇరువదవ శతాబ్దమున దాదాపు మూఁడుదశాబ్దములకాలము భావకవిత్వోద్యమ మాంధ్రసాహిత్యకేదారమునఁ బసిఁడిపంట పండించినది. 1940వ సంవత్సరమునకుఁ బూర్వము తెలుఁగునఁ గలము పట్టినవా రెవరును దీనిప్రభావమునుండి తప్పించుకొనలేక పోయి రనియే చెప్పవచ్చును. భావకవులలోఁ బ్రముఖులగు రాయప్రోలు, విశ్వనాథ, దేవులపల్లి, నాయని, తల్లావజ్ఝల, అబ్బూరి మున్నగువారు కళాశాలలలో నాంగ్లవిద్య నభ్యసించినవారు. పందొమ్మిదవశతాబ్దిలో నాంధ్రకవిత్వము శబ్దాలంకార ప్రధానమును, జైతన్యరహితము నై యనుకరణప్రాయమై యుండినది. శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారి సరస్వతీనారద సంవాదములో నాకాలమునందలి కవిత్వ పరిస్థితి మిక్కిలి చక్కఁగా నభివర్ణింపఁబడినది. అట్టిస్థితిలో నాంగ్లేయభాషాపరిచయము కల యువకులు నూతనమార్గముల నన్వేషింపఁ దొడఁగిరి. విద్యాభ్యాసకాలమున వారికిఁ బాఠ్యములుగా నుండిన వర్డ్సువర్త్, షెల్లీ, కీట్సు మున్నగు నింగ్లీషు భావకవుల ప్రేమ గీతములు, Sonnets అను లఘురచనములు వారిని ముగ్ధులను గావించినవి. సహజముగా సారస్వతప్రియులయిన యాయువకులు తమకుఁ బాఠ్యములుగా నుండిన యాకవితాఖండములనుమాత్రమే కాక పాశ్చాత్యరము లయిన యాంగ్లకవిత్వగ్రంథము లనుగూడఁ జదివి తమసంస్కారమును మతింతగాఁ బెంపొందించుకొనిరి. అట్టి సంస్కారము చేఁ బ్రభావితులై వీరు తెలుగున నూతనపద్ధతిలోఁ గవిత్వము వ్రాయఁ దొడఁగిరి. దానికా కాలమున 'భావకవిత్వ' మనుపేరు ప్రచారములోనికి వచ్చెను. రాయప్రోలు కృష్ణశాస్త్రి, వేదుల, నండూరి, నాయని మున్నగుకవులు భావకవు లనియు, వారి కవిత్వము భావకవిత్వ మనియు సాహిత్యలోకమున రూఢమై పోయినది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగా రాంధ్రపత్రికసహాయసంపాదకులుగా నున్నప్పుడు వారీ 'భావకవిత్వ' మనుపదమును సృష్టించి రనియు, వారీపదమును మాటిమాటికి నాంధ్రపత్రికలోఁ బ్రయోగించుచుండఁగా నది నవ్యకవిత్వమునకుఁ బర్యాయ మయ్యె ననియు శ్రీ

గిడుగు వెంకటసీతాపతిగారు తెలిపిరి.[02] రాయప్రోలువారి 'తృణకంకణము' లోని ప్రకాశకుల విజ్ఞప్తిలో 'భావకవిత్వ' మనుపదము తొలిసారిగా వాడఁబడినది. క్రమముగా సాహితీసమితిలోని కవులకును, తరువాతఁ దరువాత నవ్యసాహిత్యపరిషత్తులోని యధికసంఖ్యాకకవులకును 'భావకవు' లని పేరయ్యెను. కవిత్వమునందే కాక వీరు కట్టులో, జుట్టులో, నడకలో, నాణెములో గూడఁ దమప్రత్యేకతను బ్రదర్శించిరి. చెవులమీఁదుగా వ్రేలాడు గిరజాలు, నడిమిపాపట, వల్లెవాటుగా వేసికొనిన యంగవస్త్రము, వేళ్ళమీఁదుగా జీరాడెడి బెంగాలీబాబుల జుబ్బా, తళతళ మెరసెడి సులోచనములు, నెప్పుడును గుప్పు మను నత్తరుపరిమళము – ఇది భావకవిని గుర్తించువేషధారణముగాఁ బరిణమించినది. దేవులపల్లివారి గిరజాలు, కండువా మున్నగునవి తరువాతి యువకవుల కనుకరణీయము లయినవి.

'కవియొక్క ఒక అనిష్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢతాపము ఒక చిన్న కావ్యములో ఊదఁబడినచో అది భావకవిత్వ' మని శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు భావకవిత్వమును నిర్వచించిరి.[03]

కవిత్వమునకుఁ గావలసినవస్తు, భావ, రచనల మూఁడింటిలో భావ మగ్రేసర మయినది. భావకవిత్వమున నీభావమునకే యగ్రతాంబూలము లభించినది. వీరు కేవల మూహాలతో నింద్రజాలము చేయక భావనాబలము నెక్కువ ప్రదర్శించిరి. శైలీ సారళ్యము కూడ భావకవిత్వలక్షణ మయినది. పదప్రయోగము నందును వీరు తమప్రత్యేకత బ్రదర్శించిరి. సమకాలికసమాజములోఁ జెలామణి యగుచున్న పదము లకుఁ బట్టము గట్టి వీరు నవ్యతను జూపెట్టిరి. గేయరచనమునకుఁ బ్రాధాన్యము లభించెను. గురజాడవారు మాత్రాచ్ఛందస్సులో మహనీయము లయినభావములను వెల్లడింప వచ్చుననియు, రసముల నన్నిటి నొప్పింప వచ్చు ననియు దీక్షగాఁ బెక్కు గేయములను రచించిరి. క్రమముగా వారి ననుసరించి పెక్కురు భావకవులు గేయములు, గీతములు రచించి నవ్యతకు నాంది పల్కిరి. ప్రక్రియాబాహుళ్యము కూడ నీభావకవిత్వము యొక్క లక్షణములలో నొకటి. ప్రణయకవిత్వము, ప్రకృతికవిత్వము, పల్లీజన కవిత్వము, దేశభక్తికవిత్వము, సంఘసంస్కరణకవిత్వము, మర్మకవిత్వము, స్మృతిగీతములు మున్నగు ననంతప్రక్రియలు భావకవిత్వములో వెలసినవి. 'ఖండకావ్యము' అను

02. History of Telugu Literature - Part II.
03. లిరికల్ పొయిట్రీ (వ్యాసము) : విశ్వనాథ : భారతి అక్టోబరు **1939**.

నూతనసాహిత్యప్రక్రియకుఁ బ్రాధాన్యము లభించెను. కావ్యమునకుఁ గద్య విధిగా నుండి తీరవలయు ననెడియభిప్రాయ మడుగంటె యొక్క సన్నివేశము, యొక్క భావావేశమో కావ్యరచనమునకుఁ జాలు నన్నయభిప్రాయము బలపడినది. అభిధ, లక్షణ, వ్యంజన యనెడు శబ్దవృత్తులే కాక శబ్దములకు రంగులు, వాసనలు నుండు నని భావకవులభిప్రాయపడిరి. స్త్రీ పురుషుల బాహ్య సౌందర్యమునకు బదులుగా నాంతర సౌందర్యము, గుణసౌందర్యము వీరికి వర్ణ్యములయినవి. ప్రకృతివర్ణనలలో బాహ్య విషయములకు బదులుగా సుకుమార మయిన సౌందర్యతత్త్వమును నిర్దేశించుట జరిగినది. అమలినశృంగారము వీరిలోఁ గొందటికి ధ్యేయ మయ్యెను.

ఈ నవ్యకవిత్వోద్యమమునకుఁ బ్రవర్తకులు గురుజాడ అప్పారావుగారని, కొందఱును, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగా రని మఱికొందఱును – నిరువురుము బ్రవర్తకు లని వేఱొకకొందఱును భావించుచున్నారు. పి.వి. రాజమన్నారుగారు నవ్యాంధ్ర కవిత్వమునకు మూలపురుషులుగా వీరిరువురిని సంభావించిరి. 'అప్పారావు గారు ముత్యాలసరాలతో, నీలగిరిపాటలతోఁ గ్రొత్తదారి త్రొక్కినవా రైనను రాయప్రోలు వారి కావ్యాలతోనే భావకవిత్వం ప్రారంభమైనదని చెప్పక తప్పదు.'[౧౪] 'వయోరీత్యా సాహిత్యసేవదృష్ట్యా అప్పారావు గారే పూర్వు లనియు, కవిత్వప్రమురణదృష్ట్యా, తరువాతి కవులపైఁబడిన ప్రభావముదృష్ట్యా రాయప్రోలువారే యాద్యు లనియు' శ్రీ గిడుగు సీతాపతిగారి యభిప్రాయము.[౧౫]

**1915**వ సంవత్సరమునఁ బ్రారంభింపఁబడిన గ్రంథాలయసర్వస్వము రాయప్రోలు వారి రమణీయకవిత్వమునకు రంగస్థల మయ్యెను. తరువాత క్రీ.శ. **1917**వ సంవత్సరమున నవ్యసాహితీసమితి స్థాపింపఁబడెను. **1922**వ సంవత్సరమున 'సాహితి' యను ప్రతిక నెలకొల్పఁబడెను. భారతి, శారద, ప్రతిభ మొదలగు సాహిత్య పత్రికలు భావకవిత్వోద్యమమునకు మంచిప్రచారముఁ గల్పించినవి. **1930**వ సంవత్సరమువఱకు నీభావకవిత్వ మాంధ్ర కవిత్వరంగమున నప్రతిహతమయినప్రభావముఁ గలిగి యుండినది. కవిత్వము వ్రాయ నేర్చిన కవులెల్లరు నించుమించుగా దీనిప్రభావమునకు లోఁబడినవారే యయిరి.

౧౪. నూరేండ్ల తెలుగుసాహిత్యము. వాణి : *22-9-1957.*

౧౫. మా. ఆధునికాంధ్రకవిత్వము. పుట *191.*

కాని, యీయుద్యమమునవలె సమకాలమున హేళనకు, నిందకు గురి యయిన మతొక కవితోద్యమము లే దని చెప్పవచ్చును. సంప్రదాయవాదు లయిన విద్వాంసులు, కవులు దీనిని హేళన చేయ సాగిరి. ఆంధ్రసాహిత్యపరిషత్తువంటి సాహిత్య సంస్థలు దీని నెదురొడ్డి నిలచినవి. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారివంటి విద్వాంసులు దీనిని విమర్శించుచుఁ బద్యములు, వ్యాసములు ప్రచురించిరి. భావకవిత్వము నధిక్షేపించుచు గ్రంథములు వ్రాసినవారు కూడఁ గలరు. వారు అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు, అనంతపంతుల రామలింగస్వామి యనువారు. వీరిలో ఉమాకాన్త పండితులు భావకవిత్వమును 'పులుముడు' కవిత్వ మనిరి. రామలింగస్వామిగారు 'శుష్కకషము' అను గ్రంథములో భావకవిత్వము నధిక్షేపించిరి. ఇంకను బెక్కురు పత్రికలలో నీకవిత్వముపై వ్యాసముల రూపమున దుమ్మెత్తి పోసినసందర్భములు కలవు. కొందఱు భావకవిత్వమును 'బావకవిత్వము' అని యెగతాళి చేసిరి. మఱికొందఱు భావము లేని కవిత్వముండునా యని యధిక్షేపించిరి. ఇంకఁ గొందఱు 'అభావకవిత్వ' మని వెక్కిరించిరి. వేఱొక కొందఱు దీని పరమార్థము నెఱుఁగక దీనిని 'అపస్మారకకవిత్వ' మని తేల్చివేసిరి. ఈవిమర్శకుల యాగ్రహమున కెక్కువగా గురి యయినవారు 'భావకవిత్వము'ను దేశములోని మూలమూలలకుఁ బాధేయము గట్టుకొని పోయి ప్రచారము చేసిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

ఇట్లు దీనికిఁ బ్రతిగా నెంత ప్రతిఘటనము వచ్చినను, నెన్ని పాటు పోటులు వచ్చినను నప్రతిహతముగా మూఁడు నాలుగు దశాబ్దుల కాల మాంధ్రకవిత్వరంగమున రాజ్యము చేసిన కవితామహోద్యమ మిది.

## 8. వ్యావహారికభాషోద్యమము

ఇటీవలికాలమున ననఁగా నిరువదవశతాబ్ది తొలిదశకములలో నొకవంక భావకవితోద్యమము తల యెత్తి విజృంభించుచుఁ దెలుఁగుపొలమునఁ గ్రొత్తనీరు పాఱించుచుండఁగా మఱొకవంక భాషావిషయకముగా వ్యావహారికభాషోద్యమము మిక్కిలి తీవ్రముగాఁ గొనసాఁగినది. పందొమ్మిదవశతాబ్ది యుత్తరార్ధమునను, నిరువదవశతాబ్ది ప్రథమపాదమునను చిన్నయసూరి మయిన గ్రాంథికవచనము తెలుఁగున గ్రంథకరణము చేయఁ దలఁచినవారికెల్ల నుపాదేయ మయ్యెను. ఆకాలమున నాంధ్రములో బాలురకుఁ బఠనీయముగా నుండఁదగిన లలిత మగు వచనగ్రంథము లేనిలోపమును బూరించుటకై చిన్నయసూరి మిత్రలాభ,

మిత్రభేదములతో నీతిచంద్రికను క్రీ.శ. 1853లో నావిష్కరించెను. అదియే తరువాతికాలమున గ్రాంధికవచనరచనములకుఁ జాలవఱకు వరవడి యయిన దని చెప్పవచ్చును. తరువాత కందుకూరి వీరేశలింగము పంతులుగారు సరళగ్రాంధికమును దమగ్రంథములయందు దధికముగా నుపయోగించి గ్రాంధికాంధ్రము నకుఁ గొంత సారళ్యమును ఘటించిరి. శిష్టజనుల వ్యవహారమునం దండుభాషకును, గ్రంథములలో నుపయోగార్హమయినభాషకును నెక్కువ వ్యత్యాస ముండుటయు – వ్యావహారికభాష సహజముగా నుండి గ్రాంధికభాష కృతకముగా నుండుటయు గుర్తించి శిష్టవ్యావహారికమును గ్రంధరచనోపయోగిగాఁ జేయుటకు శ్రీ గిడుగు వెంకటరామమూర్తి గారొక మహోద్యమమును లేవఁదీసిరి. అదియే వ్యావహారికభాషోద్యమము. మొదట గిడుగువారు, గురజాడ అప్పారావుగారు వంటియొక రిద్దఱు మాత్రమే ఆయాయుద్యమమును బ్రారంభించిరి. క్రమముగా విశాఖపట్టణము కళాశాలాధ్యక్షులయిన శ్రీ పి.టి. శ్రీనివాస అయ్యంగారుగారును, విశాఖపట్టణమున విద్యాధికారిగా నుండిన జె.యే. యేట్సుదొరయు వీరియుద్యమమునకు మూలస్తంభము లై నిల్చిరి. శ్రీనివాసయ్యంగారు ఇంగ్లీషులో 'Life or death, a plea for vernaculars' అను గ్రంథమునే రచించి ప్రకటించి రన్న నీయుద్యమ మెంత తీవ్రముగా సాగినదో తెలియఁ గలదు. జయంతి రామయ్యపంతులుగారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మున్నగు నుద్దండపండితు లీ యుద్యమమును దీవ్రముగాఁ బ్రతిఘటించిరి. గిడుగువారిని గ్రామ్యవాదు లని పరిహసించిరి. వేదమువారు గ్రామ్యపదప్రయోగ నిరసనము అనుపేర నొకగ్రంథమును రచించి ప్రకటించిరి.

'వాడుకభాష యొకటి కాదు. తెనుఁగుదేశములో తెనుఁగు పదముల వాడుక, వాని యర్థము, ఉచ్చారణ, యాస ఒకటి కాదు గదా. అట్టి సందర్భములలో దేనినవలంబింప వలయును. దేనిని తిరస్కరింప వలయును?' అని వారు ప్రశ్నించిరి. వారియాక్షేపములకు గిడుగువా రిట్లు సమాధానము చెప్పిరి. 'ఇంగ్లీషుభాషలోఁ గూడ నిట్టి యిబ్బంది లేక పోలేదు. దీని నధిగమించుట కింగ్లీషువా రవలంబించుమార్గమునే తెలుఁగువారును నవలంబింప వచ్చును. ఆదేశములో ప్రమాణ మయిన భాషకు 'King's English' – రాజభాష యని పేరు. ఇంగ్లీషువారి రాజు, వారినాశ్రయించి వారి దర్బారున నుండు ప్రభువులు

వాడునదియు - విశ్వవిద్యాలయముల యందుపాధ్యాయులపయో గించునదియు, నింగ్లీషుక్రైస్తవ దేవాలయములలో బిషప్పులు మతబోధలు చేయునప్పుడు వాడునదియు, బహిరంగసభలలో విద్యావంతులు వాడుక చేయునదియు నగు భాష యేదో యదియే యింగ్లీషువారికిఁ బ్రమాణము. అదియే 'King's English' – అనఁగా రాజభాష. అట్లే, యించుమించుగా రెండు మూఁడు శతాబ్దములనుండి నేఁటి వఱకుఁ దెనుఁగునందు విద్వాంసులు, విద్యావంతులు మాటాడు నప్పుడుపయోగపఱచుభాష యించుమించుగా దేశమున కంతటికిని నొకటే. దానినే ప్రమాణముగాఁ దీసికొని తెలుఁగువారు గ్రంథరచనము చేయఁదగును. తెలుఁగుదేశమును బరిపాలించురాజులు లేరు కాబట్టి, తెలుఁగు శిష్టజనులు వ్యవహరించుభాషయే ప్రమాణభాష కాఁదగును. దీనినే శిష్టజనవ్యావహారికభాష యని కాని, క్లుప్తముగా వ్యావహారికభాష యని కాని పేర్కొనవచ్చును.'

తమ్ముగ్రామ్యవాదు లని పరిహసించినవారికి వారు ప్రాచీనకాలమునకుఁ జెందిన కొన్ని తాళపత్రగ్రంథములను, లిఖితగ్రంథములను జూపి యందు శిష్టజనవ్యావహారికమే వాడఁబడి యుండుటను నిరూపించిరి. 'విద్య నెఱుఁగనిగ్రామములవారు, అనాగరకులు గ్రామ్యులు. వారిభాష గ్రామ్యము. విద్వాంసులును, వారి సంపర్కము గలవారును నాగరకులు. వారిభాష నాగరకము.' అని వారిని ఖండించి 'శిష్టజన వ్యవహారములో నున్నది గ్రామ్యము కానేరదు. దానిని గ్రామ్యమనుట తప్పు' అని వారు వాదించిరి. వీరేశలింగముపంతులుగారు వీరివాదమునఁ గొంత యథార్థమున్న దని యంగీకరించిరి. క్రమముగా వీరివ్యావహారికభాషావాదము బలపడినది. క్రీ.శ. **1919–20** సంవత్సరములో వీరు వ్యావహారికభాషోద్యమప్రచారముకొఱకు 'తెలుఁగు' అనుమాసపత్రిక నొకదానిని బ్రారంభించిరి. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు **1925**వ సంవత్సరమున 'తణుకు'లో సమావేశపఱచిన వార్షికసభలో వీరు పండితులసమక్షమునందు నాలుగు గంటలసేపు తమవాదమును సమర్థించుకొనుచు మహోపన్యాసము గావించిరి. ప్రాచీనగ్రంథములలోని వ్యావహారిక భాషారూపముల నెత్తిచూపిరి. ఆసభలో వీరి కనుకూలముగా నొకతీర్మానము చేయఁబడినది. సాహితీసమితి, నవ్యసాహిత్యపరిషత్తు మొదలయిన సంస్థలు కూడ వీరివాదమును బలపఱచినవి. తిరుపతి వెంకటకవులలో నొకరగు శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు చివరికాలములో వ్యావహారికభాషలోనే రచనలు గావించిరి. వారు ప్రకటించిన 'కథలు–గాథలు' అను గ్రంథములోని వ్యాసములు వ్యావహారిక

భాషలోనే రచితము లయినవి. విశ్వవిద్యాలయములయందు మాత్రమునేఁటికిని దీనికిఁ బీరవు లభింప లేదు. విశ్వవిద్యాలయాధికారులు వ్యావహారిక భాషాప్రయోగము ననుమతింప లేదు. ఇచ్చట నొకచిత్ర మయిన ముచ్చట యొకటి. విశ్వవిద్యాలయస్థాయిలో వ్యావహారిక భాష ననుమతింపని గ్రంథనిర్ణాయక సంఘసభ్యులు 'అందరూ ఆలోచించి వేదము వెంకటాచలమయ్యగారు వ్రాసిన 'విధి లేకవైద్యుడు' అనే వ్యావహారికములో వ్రాసిన నాటకమును పార్యగ్రంథముగా నిర్ణయించిరి.'[౧౬]

శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు తమవాదమును స్థాపించుటకై యవలంబించినమార్గములను మనము పరిశీలింప వలసియున్నది.

౧. శ్రీ కొక్కొండ వెంకటరత్నంపంతులు, శ్రీ వేదము వెంకటరాయశాస్త్రి మున్నగుదిగ్గంతుల రచనలలోని యపప్రయోగముల నెత్తి చూపి నిర్దుష్ట మయినగ్రాంథిక భాష వ్రాయుట యెవ్వరికిని దరము గా దని నిరూపించిరి.

౨. వీరిని బ్రతిఘటించిన విద్వాంసులు కొందఱు 'వీరికి గ్రాంథికము తెలియక గ్రామ్యవాదము చేయుచుండి రనిరి. వారు పొరబడుచున్నా రని బుజువు చేయుటకై 'ప్రౌఢ వ్యాకరణము' యను నొక రచనమును గ్రాంథికములో రచించి చూపిరి. అందు వెదకుదమన్నను మచ్చునకు వ్యాకరణవిరుద్ధము లయిన మాటలు కాని, గ్రాంథికములు కాని పదప్రయోగములు కాని కానరావు. అందలి విషయము గ్రామ్య – గ్రాంథికవాదముల పంచిచెడ్డలు.'

౩. ప్రాచీన గ్రంథములలోని వ్యావహారికరూపములను, వ్యాకరణ దుష్టము లయినరూపములను నెత్తి చూపిరి.

౪. ప్రాచీనకాలమునందు కావ్యములకు రచింపఁబడిన టీకలు, వ్యాఖ్యానములు, కొన్ని ఇతరవచనరచనములు వ్యావహారికభాషయందే యుండుటను నిరూపించిరి.

౫. చిన్నయసూరి వ్యాకరణములోని నియమముల కాయన నీతి చంద్రికలోనే విరుద్ధ ప్రయోగము లున్నవని బుజువు చేసిరి.

వాదప్రతివాదములలో నొకవంక నిమహోద్యమము పొంగులువారుచుండగా మఱొకవంక గురజాడవారు లక్షణభాగములోఁ దృష్టిపఱక క్రీ.శ. **1897** లో

౧౬. నవ్యాంధ్రసాహిత్యవీధులు (ద్వితీయభాగము) పు. *189.*

కన్యాశుల్కమను నాటకమును వ్యావహారికభాషలో రచించి దానికి లక్ష్యసిద్ధిని గూడఁ జేకూర్చిరి. ఆనాటకరచనముతో వ్యావహారికభాషకు దసోత్సాదనశక్తి లే చనువాదము పరాస్తమయినది. క్రమముగా వ్యావహారికభాషారచయితలసంఖ్య యధిక మగుచు వచ్చినది. చిన్నయ సూరి సింహస్వప్నము చెదరిపోయి విద్యావంతు లయినయువకు లనేకులు స్వచ్ఛంద ముగా సరిక్రొత్తరచనలు చేయఁ దొడఁగిరి. పత్రికలు, రేడియో వ్యావహారికమునే యుపయోగించినవి. పత్రికా సంపాదకీయములు, వ్యాసము, కథలు, కథానికలు, నాటకములు, నాటికలు, నవలలు మొదలగు ప్రక్రియలు దంతట వ్యావహారికభాష చొచ్చుకొనిపోయినది. కవిత్వముకూడ వ్యావహారికములో రా నారంభించినది. 1964వ సంవత్సరమున ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వమువారి యాజమాన్యమున తిరుపతి యందు జరిగిన విద్వద్గోష్ఠిలోఁ బాఠశాలలయందు మూఁడవఫారము వఱకు పాఠ్య గ్రంథములను వ్యావహారికభాషలో రచించుటకుఁ దీర్మానింపఁబడినది. ఇట్లు గిడుగువారు ప్రారంభించిన వ్యావహారికభాషోద్యమము సమకాలమునాఁటి యాంధ్ర భాషారచనముపై నద్భుత మయినప్రభావము నెఱపినది.

## ౨. అభ్యుదయ కవిత్వోద్యమము

ఆధునికాంధ్రకవిత్వములో భావకవిత్వమునకుఁ దరువాతఁ జెప్పుకొనఁ దగినయుద్యమ మభ్యుదయకవిత్వోద్యమము, దానివలెఁ గాక యిది యొక నిర్దిష్ట లక్ష్యముతో భారతదేశమునందలి సమస్తదేశభాషలలోను నొకేకాలమందు వ్యాప్తమయినది. క్రీ.శ. 1935 సంవత్సరమునాఁటికి భారతదేశమునందలి కొందఱు మేధావులును, రచయితలను మార్క్సిస్టు దృక్పథముచేతఁ బ్రభావితు లయిరి. 1935వ సంవత్సరమున లక్నో మహానగరమున నఖిలభారతకాంగ్రెసు మహాసభలు జరగినప్పుడు నవభారతనిర్మాత యగు జవహరు పండితుఁడు గావించినయధ్యక్షోపన్యాసము భారతదేశములోని ప్రగతిశీలురకుఁ గొండంతబలము నిచ్చినది. దానిలో వారియంతరాంతరములలో మెదలుచుండిన యభ్యుదయభావముల కొక యాలంబన మేర్పడినది. సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకముగాఁ గంచుకోటవలె నిలఁబడి ప్రతిఘటించుచుండిన రష్యా దేశము వారిహృదయములలోఁ గ్రొత్త యాశలను జిగురింపఁజేసినది. ఆంగ్లప్రభుత్వము యొక్క సామ్రాజ్యవాదతత్త్వమునకు – దమననీతికి నిరసనగా – నడుగడుగునఁ గయ్యమునకుఁ గాలుదువ్వుచుండిన ఫాసిజము నకును, నాజిజమునకును

వ్యతిరేకముగా – సమాజములోని యార్థికవ్యత్యాసములకుఁ బ్రతికూలముఁగాఁ బ్రగతిశీలురలో నపూర్వ మయినసముత్తేజమును, సంచలనమును గలిగినది. తత్ఫలితముగా రచయితలు సాహిత్యముద్వారా తమ యభిప్రాయములను భారతప్రజానీకములోఁ బ్రచారము గావించి, వారిలో నపూర్వచైతన్యము గలిగించుటకై సంఘటితులు కావలసినయవసర మేర్పడినది. దీనిఫలితముగానే 1935వ సంవత్సరమున నఖిలభారతాభ్యుదయరచయితలసంఘ మవతరించినది. అచిరకాలముననే భారతదేశములోని వివిధప్రాంతములయందు దీనికి శాఖ లేర్పడినవి. దక్షిణప్రాంతమున నొక్కతమిళభాషలోఁ దప్పఁ దక్కినయన్ని భాషలలోను నభ్యుదయకవిత్వ మొకయుద్యమమునఁ బ్రవహించినది. భారతీయభాషలలో నఖిలభారతకీర్తి నార్జించిన వంగకవి నజరుల్ఇస్లాం. ఇతఁడు వ్రాసిన 'బిద్రోహి' యనుగేయము, సమస్తభారత దేశములోను గొప్ప సంచలనమును గలిగించినది. ఈగేయరచనములో భారతదేశములోని యనేకాభ్యుదయకవుల కీతఁడు మార్గదర్శకుఁడయ్యెను. నజరుల్ఇస్లాం ఈధోరణిలో వ్రాసినయనేకగీతముల ప్రభావము చే వంగభాషలో నభ్యుదయకవితోద్యమము బలపడినది. జీబనానందదాస్, గోకుల్‌నాగ్, బుద్ధదేవబోస్, ప్రేమేంద్రమిత్ర మొదలగుయువకవులు వంగభాషలో నభ్యుదయకవిత్వమునకు దోహదమొనర్చిరి. ఉర్దూభాషలో 1931 సంవత్సరమునుండియే యభ్యుదయకవితాబీజములు పడినవి. 1935 తరువాత ఉర్దూసాహిత్యరంగమున నీయభ్యుదయ కవితోద్యమము తీవ్రరూపమునఁ దాల్చినది. హిందీభాషలో ప్రేమచంద్ అభ్యుదయకవిత్వమునకు దారితీసినాఁడని చెప్పవచ్చును. ఈయుద్యమమునకు హిందీభాషలో 'ప్రగతివాదము' అనుపేరు వచ్చినది. అస్సామీభాషలో ద్వితీయప్రపంచసంగ్రామానంతరము మార్క్సిస్టుదృక్పథముచేతఁ బ్రభావితు లై కొందఱు యువకవులు సామ్య వాదసిద్ధాంతమును వస్తువుగా గ్రహించి, ప్రాతఛందస్సును ద్రోసిరాజు చేసి వచనగేయములో నభ్యుదయకవిత్వమును వెలయించిరి. మహారాష్ట్రభాషలో 1930 సంవత్సరమున 'రవికిరణమండల్' అను సంస్థ స్థాపితమై యభ్యుదయకవిత్వమునకు బాటలు వేసినది. ఓఢ్రభాషయందు 'సబుజాస్' అనుకవితాశాఖకుఁ బ్రతియోగముగా 'ప్రజాకవిత్వము' అనుపేర నభ్యుదయకవిత్వము తల యెత్తినది. కన్నడమున 1939వ సంవత్సరమునుండి యీయుద్యమము ప్రారంభమయినది. 'బేంద్రే' యను ప్రముఖ కన్నడకవి విప్లవపూరిత మయినయభ్యుదయగేయములను విరచించి యీయుద్యమమునకుఁ

దోడ్పడెను. మలయాళభాషయందు **1936**వ సంవత్సరమున **'పురోగమన'** వాద మనుపేర నీయుద్యమము ప్రారంభ మయ్యెను.

ఈభాషలలోని యభ్యుదయకవు లందఱును మార్క్సిజముచేతఁ బ్రభావితులయినవారే యని చెప్పవచ్చును. దానికిఁ దోడుగా వారంతర్జాతీయ విఖ్యాతి నార్జించిన నాజిం హిక్మత్, మైకోవస్కీ మొదలగువారి గేయవచనముల ననువాదరూపమునఁ జదువుకొని యుత్తేజితు లయిరి. పరస్పరానువాదముల మూలమునఁ గూడ వీరిలోఁ గొందఱు ప్రభావితులయిరి. ముఖ్యముగా వంగభాషలోని 'నజురుల్ఇస్లాం' ప్రభావము భారత దేశములోని యభ్యుదయ కవులందఱిపైఁ బ్రసరించినది.

అఖిలభారతాభ్యుదయరచయితలసంఘములోఁ బ్రముఖుఁడయిన ప్రఖ్యాత ఉర్దూకవి సర్దార్‌జాఫ్రీ యీసంఘముయొక్క స్థాపనోద్దేశము నిట్లు విశదీకరించెను.[౧౨] 'సాహిత్యము గాలివలె నిర్వేలముగా, మహానదివలె ప్రవాహరమ్యముగా, పక్షుల కలకూజితములవలె స్వచ్ఛంద సుందరముగా నుండవలెనని మాకోరిక. ఈలక్ష్యసాధనకేమేము అభ్యుదయ రచయితలసంఘమును స్థాపించినాము.'

ఆంధ్రప్రాంతమున క్రీ.శ. **1943**లో నీయభ్యుదయరచయితలసంఘము స్థాపింపఁబడినది. ప్రథమాభ్యుదయరచయితలమహాసభ తెనాలిలో జరిగినది. దానికి శ్రీ తాపీ ధర్మారావుగా రధ్యక్షత వహించిరి. శ్రీశ్రీ, అనిసెట్టి, సోమసుందర్, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, చదలవాడ పిచ్చియ్యవంటి యువరచయిత లీసంఘమునఁ బ్రముఖపాత్ర వహించిరి. వా రాంధ్రదేశమునందు వివిధ ప్రాంతములలో వార్షికసభలు నిర్వహించిరి. సాహిత్యపాఠశాలలు నడిపిరి. అభ్యుదయ, తెలుగుతల్లి, ప్రజాశక్తి అనుసాహిత్య పత్రికలను దమయాశయప్రచారమునకుఁ గొంత కాలము నిర్వహించిరి. వీరేశలింగము, గురజాడ, గిడుగు మొదలగుమహారచయితల వర్ధంతుల నాంధ్రదేశమునందంతట జరపి సాహిత్యము ప్రజలకొఱకే యనులక్ష్యమును బ్రచారము చేసిరి. తాము రచించినయభ్యుదయగేయములను సంపుటములుగాఁ బ్రమరించిరి. ఇట్లాంధ్రదేశమున నభ్యుదయకవిత్వ మొకయుద్యమముగా నొక దశాబ్దకాలము వీరవిహార మొనర్చినది.

౧౨. *తరక్కీ పసంద్ అదబ్. పుట. 93 డా. సి. నారాయణరెడ్డి గారి యనువాదము. ఆధునికాంధ్రకవిత్వము. పుట 586.*

పాకాల వెంకటరాజమన్నారుగారు అభ్యుదయరచయితల మహాసభలో నిచ్చిన యధ్యక్షోపన్యాసమున నభ్యుదయమనుదానిలో రెండుగుణము లున్న వనియు – ఒకటి మార్పు, రెండు వృద్ధి యనియు – సంఘవృద్ధికిఁ దోడ్పడుమార్పే యభ్యుదయ మనియు సూచించిరి. వారభ్యుదయరచనకుఁ గావలసినగుణముల నిట్లు వివరించిరి.[౧౮] 'అభ్యుదయరచన సమకాలిక మైనజీవితపరిస్థితులకు, రాజకీయవాతావరణానికి, ఆర్థిక సమస్యలకు, సమాజసంఘర్షణలకు, నైతికసందర్భాలకు, ఐహికాముష్మికసిద్ధాంతాలకు వైజ్ఞానిక విశేషాలకు, అనుగుణ్యంగా అనుకూలంగా తగినట్టి అవసరమైనట్టి మార్పులతో విలసిల్ల వలెను.'

శ్రీ దేవులపల్లికృష్ణశాస్త్రిగా రీయభ్యుదయకవిత్వము నిట్లు నిర్వచించిరి.

'పీడింపబడేవాళ్లూ, పీడించేవాళ్లూవున్న యీవర్గసమాజం ఉండా లని ఎవరూ కోరరు. రానున్నవిధానంలో సాధారణమానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటింపజూచేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈధనిక సమాజం పోవాలనుకోవడమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన.'[౧౯]

శ్రీశ్రీగారు 'అభ్యుదయరచయిత – విప్లవదృష్టి' యనువ్యాసమునఁ గొంతవఱకు నీకవిత్వముయొక్క నిర్వచనము చేయుటకు యత్నించిరి.

'వీరు తెచ్చినవిప్లవం రసావిష్కరణకు, రసాస్వాదానికీ సంబంధించినది. సాహిత్యం ఒకభోగవస్తువుగా పరిగణించే దృక్పథంమీద వీరు తిరుగుబాటు చేస్తున్నారు. నేటి రచయితలకు ప్రజలే ప్రమాణము. కొన్ని కారణాలవల్ల సాహిత్యానికి దూరమై పోయిన ప్రజలజీవితాలను మళ్లీ సారస్వతోన్ముఖంగా తిప్పటానికి నేటి రచయితలు పాటు పడుతున్నారు.'[౨౦]

అభ్యుదయకవిత్వవికాసదశలో 'నయాగరా' కవితాసంపుటి ప్రథమసోపానము. అది ప్రచురింపఁబడినతరువాత పలువురు తమయభ్యుదయ గేయములను గ్రంథరూపమున వెలువరించిరి. వానిలో నెన్నఁదగినవి దాశరథి అగ్నిధార, రుద్రవీణ, సోమసుందర్ 'వజ్రాయుధం', ఆరుద్ర 'త్వమేవాహం', అనిసెట్టి 'అగ్నివీణ'. ఇంకను బెక్కు అభ్యుదయ కవితాసంపుటులు వెలువడినవి.

౧౮. అభ్యుదయకవిత్వము – *1947* మార్చి : అభ్యుదయ : పుట *37*.

౧౯. తృతీయాభ్యుదయరచయితలమహాసభ అధ్యక్షోపన్యాసము. తెలుగుతల్లి : *1946* మార్చి సంచిక.

౨౦. అభ్యుదయరచయిత – విప్లవదృష్టి : తెలుగుతల్లి *1946* మార్చి.

## 10. అధివాస్తవిక కవిత్వోద్యమము

ఇరువదవశతాబ్దమున ఫ్రెంచికవితారంగముననూ, ఇంగ్లీషుకవిత్వములోను విచిత్ర కవితాధోరణులు కొన్ని వెలసినవి. 1940 సంవత్సరప్రాంతమున నాంధ్రదేశములో శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు మొదలగు కొందఱు పెపులాభాషలలోని ఇమేజిజము, సర్రియలిజము, రియలిజము, డాడాయిజము ఎన్నిగు కవిత్వోద్యమములస్వరూపమును జక్కఁగా నాకళించుకొని వానిప్రభావముచే దెలుఁగున నూత్నప్రయోగములు చేసిరి. తత్ఫలితముగా నవతరించినదే యధివాస్తవికకవిత్వోద్యమము.

ఆంగ్లమున టి.యస్.ఇలియట్, ఎజ్రాపౌండు, ఆడెన్ వంటి నవ్యకవుల రచనలు, వారు చేసిన నవ్యప్రయోగములు వీరిని సమ్మోహితులను జేసినవి. డిలాన్ థామస్, గ్యాస్కొయిస్ వంటి యధివాస్తవికకవుల గేయములు వారి కెంతో నచ్చినవి. ఫ్రెంచిసాహిత్యరంగమునందు సర్రియలిజమును బ్రవేశపెట్టిన ఆండ్రీబ్రిటన్(Andre Briton), పాల్ఎల్వర్డు మొదలగు కవులరచనములను జదివి వీరు ముగ్ధు లయిపోయిరి. 1924వ సంవత్సరమునఁ బ్రచురింపబడిన 'Mani Feste du Surrealisme' (Manifesto of Surrealism) అను సర్రియలిస్టు సిద్ధాంత పత్రము, తదుద్యమనాయకుఁ డయిన ఆండ్రీ బ్రిటన్ వ్రాసినవ్యాసములు, ఇంగ్లీషు సాహిత్యములో 'New Signatures' అనునుద్యమము మూలమున విప్లవధ్వజ మెత్తిన ఆడెన్ ప్రభృతుల గేయములు వీరి కుద్బోధకము లయి యుత్తేజనము కలిగించినవి. దీనికన్నింటికంటెను గూడ ఫ్రాయిడ్ ప్రతిపాదించిన మనోవిశ్లేషణ సిద్ధాంత (Psycho-Analysis) మీ యధివాస్తవికోద్యమమున కుజ్జీవన మయినది. మానవుని మనస్సులో వ్యక్తము, వ్యక్తావ్యక్తము, అవ్యక్తము అనుమూఁడుగదు లున్న వనియు, మానవుని పూర్వసంవేదన అనేకము లవ్యక్తదశలో నిగూఢముగా నుండు ననియు, వ్యక్తావస్థలో మానవుని తీరని కోరికలు తీయతీయని యూహలు సుప్తభుజంగములవలె నడఁగి యుండు ననియు, స్వప్నావస్థలో – అనఁగా వ్యక్తావ్యక్తదశలో నవి యెల్ల నవ్యక్త దశనుండి పడగలు విప్పుకొని పైకి వచ్చుననియు ఫ్రాయిడ్ నిర్ణయించెను. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన యీసిద్ధాంతము నాధారముగాఁ జేసికొని యధివాస్తవికులు కళారంగములోఁ గ్రొత్త విప్లవము తీసికొని వచ్చిరి.

'The Freudan concept of the unconscious plays an important role in theoritical Surrealism, it being claimed as the origin of the arrangements of incongruities which produce these effects. Andre Briton, leader and the most representative poet of the movement in his Manifeste du Surrealisme (Surrealist Manifesto), 1924 defines Surrealism as pure Psychological automatism ... thought's dictation in the absence of all control exercised by the reason and outside all aesthetic or moral pre-occupations. Later however, some surrealists claimed to be able to control the operations of the unconscious in the production of particular effects and the selection and combination of particular elements in their work.[21]

మానవుఁడు సాంఘికనియమములకుఁ గట్టుపడి కొన్నియనుభూతులను, గోరికలను మాత్రమే వెల్లడించు ననియు, దక్కినవానిని నవ్యక్తములో దాఁచియుంచుకొను ననియు నట్టి వాని నున్న వున్నట్లుగా బహిర్గత మొనర్చుటయే యధివాస్తవికుల మత మనియు విశ్వసింపఁబడుచున్నది. ఇందుచే సమాజము నిర్ణయించిన నీతిసూత్రములు, నిబంధనములు వీరికి రుచింప లేదు.

'Unique among 20th century revolutionary movements in art and Literature Surrealism centered its particular revolution in its subject Matter, making use of extremely conventional style and technique.'[22]

శ్రీరంగం నారాయణబాబుగారు సంఘర్షకు వ్రాసిన 'ప్రవర' లో అధివాస్తవిక తత్త్వమునుగూర్చి యిట్లు తెలిపి యున్నారు.

'యధార్థాన్ని గుర్తించము. కలలు మాకు యధార్థాలు. ఈజగత్తుతో మాకు పని లేదు. మాది స్వప్నజగత్తు. సంపన్నులు, భాషాసంపన్నులు మాకు విరోధులు. కావ్యలక్షణాలే అవలక్షణాలు. అందరు కవులమే, వ్యక్తాన్ని వదలిపెడతాము. వ్యక్తావ్యక్తంలో ఈతకొడతాము. ఏదో విధమైన శక్తి మమ్మల్ని పూనుతుంది. అదేదో రాయిస్తుంది. అదేది రాయిస్తే అదే కవిత్వం. ఇది ఆధివాస్తవికుల మతం.'

తెలుఁగున అధివాస్తవికగేయములను వ్రాసినవారిలో శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబుగారు పేర్కొనఁదగినవారు. వీరువ్రాసిన గేయములనుబట్టి హాస్యము, శబ్ద చమత్కారము, అర్థములు అసంబద్ధత, విశృంఖలపదప్రయోగము

21. *The Reader's Encyclopaedia.*
22 *The Reader's Encyclopaedia.*

ననుసవి యధివాస్తవికతా లక్షణము లని తెలియుచున్నది. దీనితోఁబాటు జుగుప్సా ప్రియత్వము, కామోద్రేక ప్రకటనము నను లక్షణములు కూడ నందు గోచరించును. భావకవిత్వమువలెను, నభ్యుదయకవిత్వమువలెను నీయధివాస్తవిక కవిత్వోద్యమము తెలుఁగుదేశమునఁ జాలకాలము కాలూని నిలువ లేదు. కారణ మది తెలుఁగునేలను సహజముగాఁ బుట్టినధోరణి కాక పోవుట. ఫ్రెంచికవులును, నింగ్లీషుకవులును జరపిన వినూత్నప్రయోగముల ననుసరించి వానికిఁ దెలుఁగు దుస్తులు మాత్రము తొడుగుటకుఁ బ్రయత్నించినఫలిత మది. దీనికిఁ బ్రజాదరము కూడ నంతగా లభింపలేదు. ఈయుద్యమము మూలమున శబ్దప్రయోగ మునందును, భావవ్యక్తీకరణమునందును గొప్ప మార్పేర్పడినది. వచనగేయము – అను సాహిత్యప్రక్రియ ప్రచారములోనికి వచ్చి నిలచిపోయినది. (శ్రీశ్రీ) రచించిన అభిసారికి కడసారి, రుబాయత్, కొంటెకోణాలు, విదూషకుని ఆత్మహత్య యను గేయములును – నారాయణబాబు రచించిన చిన్నా, మౌనశంఖం అనుగేయములును – అధివాస్తవికకవిత్వమున కుదాహరణములుగాఁ బేర్కొనఁ దగును.

## 11. దిగంబర కవిత్వోద్యమము

తక్కిన కొన్ని సాహిత్యోద్యమములవలెనే యీదిగంబరకవిత్వోద్యమము కొన్ని చారిత్రకపరిస్థితులలో నుద్భవించినది. ఆంధ్రదేశమిరువదియొకటవ శతాబ్ది ప్రథమసోపానము నధిరోహింపఁబోవుచుండినప్పటికిని 1900 నాఁటి మనస్తత్వభారముతోఁ గ్రుంగి పోవుచుండినది. ప్రజలలో సర్వత్ర రకరకము లయిన చాదస్తములు ప్రబలి యుండెను. కులము, జాతి, శాఖ మొదలగువర్గవైషమ్యములు విలయతాండవము చేయుచుండెను. రాజకీయవాతావరణము మిక్కిలి కలుషితమై యుండెను. మరాతత్త్వములలోఁ బ్రజానాయకులు చీలిపోయి దేశక్షేమమును గాక యాత్మోన్నత్యమునే కాంక్షించుచుండిరి. రాష్ట్రములో నలుమూలల దారిద్ర్యదేవత వికటాట్టహాసము చేయుచుడెను. దేశములో నవినీతి పెచ్చుపెరిఁగి పోయెను. ప్రజాభిప్రాయమును తీర్చిదిద్దుచు మానసికవికాసమును గలిగింప వలసిన పత్రికలు వ్యాపారమనస్తత్వముతోఁ గాలక్షేపసాహిత్యమును బ్రోత్సహింపఁ దొడఁగెను. రచయితలు తమపవిత్రకర్తవ్యమును విస్మరించి పొట్ట పోసికొను దృష్టితోఁ – దమ యభిప్రాయములను ధైర్యముగాఁ బ్రకటించుటకు దమ్ములు చాలక యితరుల యభిరుచుల కనుగుణముగా సాహిత్యసృష్టి చేయుచుండిరి. విద్యావంతులయిన

యువకులు తమయాదర్శములకుఁ దిలోదకము లిచ్చి వరకట్నముల కాశించుచు నైతికముగా దిగజారి పోవుచుండిరి. చలనచిత్రములు విజ్ఞానము - వినోదము అను ముసుఁగుతో నసహజములయినవిలువలను వెదజల్లుచుండెను. భ్రమపూరిత మయిన మిధ్యాజీవితములోని కవినేఁటి యువకసమాజమును లాగికొని పోవుచుండెను. ఇట్టి పరిస్థితులలో సాహిత్యము కూడ - కొందఱు కవులను, కథకులను దప్పించి - యథార్థమును విస్మరించి శవప్రాయ మై యుండెను.

ఇట్టి కుత్సితపరిస్థితులలో నాంధ్రసాహిత్యమున దిగంబరకవితోద్యమ మవతరించినది. వారి మాటలలో నిక్రొత్తరకపుఁగవిత్వము[23] 'ఈదేశంలో యీగోళంలో ఊపిరి పీల్చే ప్రతి మనిషి ఉనికికోసం తపనపడి, అతడిభావిని చూసి వెక్కి వెక్కి యేడ్చి పిచ్చెత్తి ప్రవర్తించినకవిత.' దిగంబరకవు లనుపేర నాంధ్రసాహిత్య రంగమున నడుఁగు పెట్టిన కవులారుగురు. వారు నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్న. పూర్వాశ్రమములో వారాధునికకవిత్వమును, గధానికలను వ్రాయుచుండినవారే. అంతకుఁ బూర్వము వారి నామధేయముల చివర నుండిన రెడ్డి, రావు, చారి మొదలయినతోఁకలను బరిత్యజించి వారు తమతమ వాస్తవగుణసూచకము లయిన, ధ్వనిప్రధాన మయిన పేర్లను బెట్టుకొనిరి. వారి ప్రాఁతపేర్ల మతమును, గులమును సూచించుచుండుట వారికి గిట్ట లేదు. సమకాలికపు వచనకవిత్వములో గుమాస్తా మనస్తత్వము, శైథిల్యము, జడత్వము నావహించియుండెనని వా రభిప్రాయపడిరి. తద్భిన్నముగాఁ దావు వెలయించిన వచన కవిత్వమునకు వారు 'దిగంబరకవిత్వ' మని నామకరణము చేసిరి. ఇందలి 'దిగంబర' అను పదమును గేవలము నిరాదరణకు, శారీరకనగ్నత్వమునకుఁ బ్రతీకగా భావింప రాదు. నేఁటి చెత్తవ్యవస్థను సమూలముగాఁ దొలఁగించి నిత్యనూతనమహత్తరవ్యవస్థకొఱకై తపన పడుచున్న దిగంబరకవులు సాహిత్యములో - జీవితములోని యధార్థ మను మహాసత్య మభి వ్యక్తీకరింపఁబడవలయునని కోరుచున్నారు. ఈనాఁటిజీవితములో మానవుఁడు ముసుఁగు తొలఁగించుకొని, తటస్థముగాఁ సహజముగా - సక్రమముగా జీవింప వలయు నని వారు వాంఛించుచున్నారు.

దిగంబరకవులు తమ నూతనోద్యమముయొక్క యాశయములనుగుఱించి ప్రకటించినయంశములు గమనార్హములు.

---

23. చూ. దిగంబరకవులు - ప్రథమసంపుటము : దిగంబరశకంలోకి అను కావ్యసంపుటి పీఠిక. ప్రమరణ 1965.

[౨౪] మానసికదిగంబరత్వంకోసం నిత్యసచేతన ఆత్మస్ఫూర్తితో జీవించడమే మా ఆశయం. శ్వాసించేప్రతివ్యక్తితో సారూప్యం చెంది వ్యక్తిఅస్తిత్వపరిరక్షణకోసం అంతరంగంలో అణగిపడివున్న ఆరాటాన్ని, అసంతోషాన్ని, విసుగును అక్షరాల్లో వ్యక్తీకరించి నూతనవిశ్వాసాన్ని, ఆశను కలిగించాలని మా తత్పరత. మానవుణ్ణి అశ్లీలత, వికృతి, మూఢనమ్మకాలు, చాదస్తాలనుండి వేరు చేయాలని మా ప్రయత్నం.

[౨౫]'ఈదొంగనాటకానికి యింక తెర వేసెయ్. నీ అసలు రూపానికి అడ్డంగా దించినముసుగును చించెయ్! లే! నీ నిజస్వరూపంతో లోకాన్ని పరిపాలించుకో', అని యీకవులు ప్రపంచమానవుని బ్రబోధించుచున్నారు.

'మంచికోసం, మనిషిలోని నిప్పులాంటి నిజమయినమనిషికోసం, కపటం లేని చిరునవ్వులు చిందేసమాజంకోసం అహోరాత్రులు అతని అగ్నిలో నడచిన ఆత్మలలోంచి పలుకుతున్న గొంతుకలు.'

'మేం పుస్తకాల్లోంచి మాట్లాడ దలచుకో లేదు. అనుభవాల్లోంచి పలకదలచుకొన్నాం. మేం మేం గ మాట్లాడదలుచుకొన్నాం. మా దిగంబర గొంతుకతో చెప్పదలచుకున్నాం.'

ఇట్టి స్పష్టమయిన యాశయములతో నీదిగంబరకవు లాంధ్రసాహిత్య క్షేత్రమునఁ బ్రవేశించి 1965వ సంవత్సరము మేనెల అరవతేది అర్ధరాత్రి 'దిగంబరకవులు – ప్రథమసంపుటి' ని నాంపల్లి పాండు అను నొకరిక్షావానిచే నావిష్కరింపఁజేసిరి. గ్రంథావిష్కరణసభలలో జరగు తంతు నవహేళన చేయునుద్దేశముతో జరపిన గ్రంథావిష్కరణ మిది. తరువాత వారే 'దిగంబరకవులు రెండవసంపుటిని' గూడఁ బ్రకటించిరి. తమయీనూతన కవితోద్యమములో నాంధ్రకవిత్వమున దిగంబరశక మారంభ మగుచున్న దని వారు ప్రకటించిరి. ఆశకములోని కాలమాన వివరములు కూడ నందు వా రొసఁగిరి. ఆకాలమానము ప్రకారము నగ్ననామసంవత్సరము, నిఖిలేశ్వరనామసంవత్సరము, జ్వాలాముఖినామ సంవత్సరము, చెరబండనామసంవత్సరము, భైరవనామసంవత్సరము,

---

౨౪. చూ. ధర్మయుగ్ – హిందీవారపత్రిక. దిగంబరకవుల లేఖ. అనువాదము – నిఖిలేశ్వర్. భారతిలో ప్రపంచసాహిత్యంలో యువతరం తిరుగుబాటు – వ్యాసం. జనవరి *1967*.

౨౫. దిగంబరకవులు – పీఠిక.

మహోస్వప్ననామ సంవత్సరము – అనునాఱు సంవత్సరములు – ఆశఋతువు, తపనఋతువు, అశ్రుఋతువు, మదిరఋతువు, విరహఋతువు, విషాదఋతువు అను నాఱుఋతువులు – స్నేహవారము, విశృంఖలవారము, క్రాంతివారము, సృజనవారము, వికాసవారము, అనంతవారము అనునాఱువారములు కలవు.

ఆత్మయోగి యను కవితాఖండికలో శ్రీ నిఖిలేశ్వర్ –

'దిగంబరకవితలో మరొకరు మరొకరు
నిండుగా నిజంగా ఊపిరి పీల్చేవాడు
ఆత్మయోనినుండి పుట్టుకొస్తున్నాడు.'

అని యీదిగంబరకవితోద్యమావిర్భావమును ధ్వనింపఁజేయుచున్నాఁడు. ఇట్లే 'జ్వాలాముఖి' సూర్యస్నానం అను తనకవితాఖండికలో –

'మానవు లంతా కొత్తకుటుంబాలుగా ఏర్పడ్డారని
తిరుగుబాటునాయకుడు 'దిగంబరదేవుఁడు'
అర్ధరాత్రి 'నూత్నదిగంబరయుగాన్ని' ఆరంభించా డని
ఐరావనుండి ఆకాశవాణిలో శాంతిబాల ప్రేమభాషతో
వార్తలు వేదంలా చదువుతూంటే చెవి కోసుక వినాలనుంది –
అని దిగంబరయుగమును గూర్చి కలలు గనుచున్నాఁడు.

ఌ దిగంబరకవులు సృష్టించిన యీ దిగంబరకవిత్వము హిందీ, అస్సామీ, ఒరియా భాషలలోని కిటీవల ననువదింపఁబడినది. హిందీసాహిత్యలోకములో నీదిగంబరకవులను గుఱించి కొంత యభిరుచియు, నుత్సాహమును గనఁబడుచున్నవి. హిందీసాహిత్యపత్రికలలో నీకవితలయనువాదములును, వానిపై విమర్శవ్యాసములును బ్రకటింపఁబడినవి. 'లహర్' అను సాహిత్యమాసపత్రికలో – శ్రీకృష్ణగోపాల్ అగర్వాల్ అను సాహిత్యవిమర్శకుఁడు దిగంబరకవుల యనూదితకృతుల నాధారము చేసికొని యొకవిమర్శవ్యాసమును వెలయించెను. అందు వారు 'కవులు ప్రజలను షాక్(Shock) చేసి తమ్మాలమునఁ బ్రచారముకొఱకై యత్నించుచున్నా రనియు, నసలు నిరాపరణముగా జీవించుట సాధ్యము కా దనియు' విమర్శించిరి. అందుఁ గొంతవఱకు సత్యము లేక పోలేదు.

ఌ. చూ. ప్రపంచసాహిత్యంలో యువతరం తిరుగుబాటు – నిఖిలేశ్వర్ రచన. భారతి – జనవరి *1967*.

## (II) తులనాత్మక పరిశీలనము

ఆంధ్రసాహిత్యమునందు మొట్టమొదట వెలసిన మార్గకవిత్వోద్యమము నకును, కన్నడ భాషయందుఁ బంపాదులకాలమున వెలసిన మహాకావ్యకవిత్వోద్యమమునకును గొంత పోలిక కలదు. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దమునకు ముందున్న కన్నడభాష హళ గన్నడమునకంటెఁ బ్రాచీనరూపముతోఁ దమిళమునకు దగ్గఱిపోలిక గలదై యుండెను. చత్తాణ, బెదండె యనుకావ్యములు దేశీయచ్ఛందముతో రచింపఁ బడెను. మఱొకవంక నాకాలముననే సంస్కృతవృత్తములును, సంస్కృతాలంకార రీతులును గన్నడకవితలోఁ బ్రవేశించినవి. క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్దినాఁటి శ్రమణ బెళగోళ శాసనమున స్రగ్ధరావృత్తములో రచింపఁబడినకన్నడపద్యముగుపడుచుండుటయే దీనికి నిదర్శనము. ఇట్లు మార్గదేశి పద్ధతులు రెండును నాకాలమున సమానగౌరవము నంది యుండఁగా క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దిలో దండి, భామహాదుల యాలంకారికలక్షణము ననుసరించి రాష్ట్రకూటప్రభు వగు నృపతుంగునిచేఁ బ్రచారములోనికిఁ దేఁబడిన 'కవిరాజమార్గ' మవతరించి తరువాతికవులకు మార్గదర్శక మయ్యెను. అది కన్నడమునఁ బ్రౌఢమార్గమునకు రాచబాట వేసెను. అట్టి శిష్టకవితాపద్ధతి ననుసరించి పంపమహాకవి చంపూపద్ధతిలో - సంస్కృతీకరింపఁబడినకన్నడభాషలో - సంస్కృతవృత్తముల ప్రాధాన్యములోఁ గవిత్వము చెప్పి తరువాతి కవులకుఁ గావ్యనిర్మాణ పద్ధతులందు మార్గదర్శకు డయ్యెను. అతఁడు సాఁగించిన యాయుద్యమ మించు మించుగా రెండుదశాబ్దులపాటు కన్నడసాహిత్యముపైఁ దన ప్రభావమును బ్రసరింపఁజేసినది.

తెలుఁగున నన్నయ ప్రారంభించిన మార్గకవిత్వోద్యమము కూడ సరిగా నిట్టి పరిస్థితులందే యవతరించి యిట్టిప్రభావమునే తరువాతిసాహిత్యముపైఁ గలిగి యుండినది. నన్నయకుఁ బూర్వము దేశికవిత్వ మధికముగా నుండి యుండునని యనుమానింప బడుచున్నది. సంస్కృతభాషా పరిచయమువలన మార్గపద్ధతి కూడఁ గొంత తెలుఁగుకవిత్వమున నప్పటికే ప్రవేశించుచుండెను. కాని, యాపద్ధతి కొకస్థిరరూపముగాని వ్యవస్థ గాని కల్పింపఁబడలేదు. అట్టి స్థితిలో నన్నయభట్టారకుఁడు కావ్యరచనోపయోగి యయిన తత్సమ రూపభాష కొక వ్యవస్థను గల్పించుకొని, యేయే సంస్కృతవృత్తములను దెలుఁగు కవిత్వమునందు స్వీకరించుట సమంజసమో నిర్ణయించుకొని, దేశిమార్గమునకుఁ జెందిన

పద్యజాతులకుం గూడఁ బ్రవేశముకల్పించి ప్రౌఢమయిన యొకకావ్య పద్ధతికిఁ బ్రారంభవు గావించెను. దేశికవిత్వోద్యమ మీవర్గ కవిత్వపద్ధతిని బ్రతిఘటించుటకయియే యవతరించి బహుముఖముగా విజృంభించినను నావహోర్ముంర్ముకుఁ గూడ నేవూత్రము చెక్కుచెదరక యీ యుద్యమ మప్రతిహతముగా దాదాపు రాయలయుగము దాఁకఁ గూడ సాఁగి పోయినది.

ఆంధ్రసాహిత్యమున మార్గ కవిత్వోద్యమమునకుం దరువాత వెలసిన దేశి కవిత్వోద్యమముతో – తమిళసాహిత్యమునందలి తమిళకవి సంఘములకాలమున సాఁగిన దేశి కవిత్వోద్యమమును, కన్నడభాషయందలి దేశికవిత్వోద్యమమును బోల్పవచ్చును. ఆంధ్ర కర్ణాటక దేశములవలెఁ బ్రాచీనకాలమున తమిళదేశ మార్యజనాక్రాంతము కాలేదు. అగస్త్యుఁడు అనుమహర్షియు, జైనబౌద్ధమతముల ప్రచారమునకై యావంత ప్రచారకులును తమిళ దేశమున నివసించినను వారిమూలము సంస్కృతభాషాప్రభావమాదేశభాషయం దంతగాఁ బ్రసరింపలేదు. అందుచేతనే సంగయుగమున వెలసిన రచనలు దేశిసాహిత్యమున చెంది యున్నవి. వారిలో నెవరును దమ కావ్యవస్తువును సంస్కృతమునుండి పరిగ్రహింప లేదు. అందలి ఛందస్సు దేశిఛందస్సు. వర్ణనలయందును వారి ప్రత్యేకత గోచరించును. ఇఁక తెలుఁగునందలి దేశికవిత్వోద్యమ మవతరించుటయొట్టిపరిస్థితులందు జరిగెనో సరిగా నట్టిపరిస్థితుల యందే కన్నడభాషలోఁ గూడ దేశికవిత్వోద్యమ మవతరించెను. కన్నడమునందు బసవేశ్వరుని కాలమున నారంభమయిన యీయుద్యమమే తెలుఁగుభాషయందలి దేశికవిత్వోద్యమమున కుద్బోధక మయియుండు నని కూడ భావింప వచ్చును. ఉభయభాషల యందును మతప్రచారముకొఱకే యీయుద్యమములు ప్రారంభింపఁ బడుట విశేషము. ఉభయభాషలయందును విషయములలోను, భాషలోను, ఛందస్సులోను దేశిప్రాధాన్యము హెచ్చెను. రగళె, త్రిపది, షట్పది అను అచ్చగన్నడ ఛందస్సులు కన్నడమునఁ బ్రాచుర్యము నందఁగా తెలుఁగున ద్విపద, రగడ, సీసము మొదలగుదేశిచ్ఛందోభేదములు ప్రాచుర్యము నందెను.

తెలుఁగునందు వెలసిన హరిహరనాథతత్త్వోద్యమమును మహారాష్ట్ర సారస్వతమునందలి నాథపంథయుద్యమము, మహానుభావపంథ యుద్యమము ననువానితోఁ బోల్పవచ్చును. నాథసంప్రదాయ ముత్తరభారతమునుండి దక్షిణదేశమునకుఁ బ్రాకి మహారాష్ట్ర దేశమున నెక్కువగా వ్యాపించెను.

దీని ప్రభావము మహారాష్ట్రభాషలో నాదికవి యని ప్రశస్తిఁ గాంచిన ముకుందరాజు పైనను, జ్ఞానదేవునిపైనను నధికముగాఁ గలదు. కాని, యీ సంప్రదాయమునకుఁ జెందిన గ్రంథము లాభాషలో నధికముగా వెలువడ లేదు. పండ్రెండు పదుమూఁడు శతాబ్దులలో మహారాష్ట్రమున ధార్మికవిప్లవములు చెలరేఁగఁగాఁ గొందఱు సంస్కర్తలు నూతనోద్యమములను లేవఁదీసిరి. మహానుభావపంథ యుద్యమ మట్టి యాందోళనలవలన రూపొందిన యొకానొక యుద్యమము. సరిగా నిట్టి పరిస్థితుల యందే మతవైషమ్యములలో సతమత మగుచుండిన యాంధ్రదేశమున హరిహరనాథ తత్త్వప్రచారమూలమున శైవవైష్ణవమతములకు సామరస్యము కూర్పుటకుఁ దిక్కన సోమయాజి సంకల్పించి తనభారతమును హరిహరనాథాంకితము కావించి మహాంధ్రమున నాతత్త్వప్రచారమునకును, దరువాతికవులు కొంద ఱాయుద్యమప్రచారమును గావించుటకును విశేషముగాఁ దోడ్పడినవాఁ డయ్యెను.

తెలుఁగుభాషయందలి ప్రబంధకవిత్వోద్యమమునకును మలయాళభాష యందలి 'కిలిప్పాట్టు' ఉద్యమమునకును గొంత సామ్యము కలదు. ప్రబంధ మను కావ్య ప్రక్రియకు నల్లసాని పెద్దన ప్రసిద్ధి గొనివచ్చినట్లే, మలయాళభాషయందు 'ఎళుత్తచ్చన్' అను కవీశ్వరుఁడు 'కిలిప్పాట్టు' అను కావ్యప్రక్రియకుఁ బ్రసిద్ధి గొని వచ్చెను. మలయాళ సాహిత్యమున 'ఎళుత్తచ్చన్' మహాకవికి విశిష్ట మగుస్థానము కలదు. అతఁడు రచించిన గ్రంథములలో రామాయణము, భారతము ననునవి ప్రసిద్ధములు. వర్ణనలయందును, రసపోషణమునందును, పాత్రపోషమునందును నితనికిఁ గల ప్రతిభ యితని భారతమున గోచరించును. ఎళుత్తచ్చన్ మలయాళకవిత్వమున నొకక్రొత్తశైలిని బ్రవేశపెట్టెను. అతఁడు ప్రవేశపెట్టిన యీక్రొత్తశైలి తరువాతికాలమునందలి మలయాళకవులకు మార్గదర్శకమయ్యెను. ఇట్లే, అల్లసాని పెద్దన తన మనుచరిత్రమునందుఁ బ్రవేశపెట్టిన ప్రాబంధికశైలి ప్రబంధయుగమునందలి కవుల కెల్లరకు శిరోధార్య మయ్యెను.

ఇట్లే, తమిళభాషయందు అనువాదసాహిత్యోద్యమమునకును నీప్రబంధకవిత్వోద్యమముతోఁ గొంతపోలిక కానవచ్చుచున్నది. తమిళమున కంబమహాకవి, ఒట్టక్కూత్తర్, జయంగొండార్ అనుకవులు రామాయణము, భారతము వంటి యుద్గ్రంథములను తమిళములోనికిఁ బరివర్తించు మహోద్యమము జేపట్టిరి. కంబమహాకవి 'రామావతారము' అనుపేరుతో సంస్కృత రామాయణమును తమిళములోని కనువదించెను. వాల్మీకి రామాయణము ననుసరించియే యితఁడు తనరామాయణమును రచించినను,

నక్కడక్కడ మూలమునకు భిన్నములయిన మార్పులను గొన్నిటిని గావించి స్వతంత్రముగానే కావ్యమును నిర్వహించెను. మహాభారతములోని నలోపాఖ్యానము నాధారముగాఁ జేసికొని 'పుగళేంది' యనుకవి 'నళవెణ్బా' యనునొకప్రశస్త కావ్యమును రచించెను. మనప్రబంధకవులును నిట్లే సంస్కృతగ్రంథములోని యేకదేశమును గావ్యవస్తువుగా స్వీకరించియు, సంస్కృత వృత్తమునే స్వీకరించినను దానిని స్వతంత్రముగా నిర్వహించియుఁ బ్రబంధరచనము సాఁగించి యుండుట గమనార్హము.

తెలుఁగుభాషయందలి యచ్చతెనుఁగుకవితోద్యమమువంటివి యితరభాషా సాహిత్యములయందును మనకుఁ జూపట్టును. తమిళసారస్వతమునందలి శెందమిళు ఉద్యమము, మలయాళభాషయందలి 'శెందమిళు ఉద్యమము' - పచ్చమలయాళము - నిట్టివే. కన్నడభాషయందు ఉద్యమరూపమునఁ గాక చెదరులు చెదరులుగా నిట్టిప్రయత్నములు కొన్ని జరిగినట్లు కన్నడసారస్వత చరిత్రమునుబట్టి తెలియుచున్నది. తమిళభాషయందలి 'శెందమిళు' ఉద్యమము చాల నర్వాచీనము. మలయాళసారస్వతమునఁ గ్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దము నాఁటికే మలయాళము గావ్యభాష వేర్పడెను. అందుఁ గొన్ని మలయాళశబ్దములకుఁగూడ తమిళరూపము లొసఁగఁబడెను. కాని, నిజమున కిది మలయాళ భాషకు దేశీయము కాదు. 'పచ్చమలయాళ' మనఁగా శుద్ధమలయాళమని, సంస్కృత తమిళభాషల ప్రభావము లేని మలయాళభాష యన్నమాట, ప్రారంభదశలో గ్రాంథిక మలయాళమును దీర్చిదిద్దుట కీ పచ్చమలయాళము మిక్కిలిగాఁ దోడ్పడెను. క్రీ.శ. అయిదవ శతాబ్దినుండియు శుద్ధమలయాళభాషాప్రభావము మలయాళసారస్వతమునఁ గాన వచ్చును. కాని దీనిని నిరూపింపఁ గల ప్రబలసాక్ష్యమేదియు లేదు. ఎనిమిదవ శతాబ్దినాఁటికి భద్రకాళిపాట్టు అను గేయరచనమును - దక్షిణ ఉత్తరమలబారులలో కొన్ని పదములను వ్యాప్తిలోనికి వచ్చెను. ఇవి 'పచ్చమలయాళము' లోనే రచితములయినవి. తరువాత **12, 16** శతాబ్దులలో తమిళభాషయు, **14, 17** శతాబ్దులయందు సంస్కృత భాషయు మలయాళభాషపైఁ దమ ప్రభుత్వమును, విశేషముగా సాఁగించెను. అయినను పచ్చమలయాళమే చాలవఱకు నారెండుభాషలను గొంతవఱకుఁ దీర్చి దిద్ది కావ్యరచనోపయోగి గావించె నని చెప్పుట తప్పు కాదు. ఇట్లు పచ్చమలయాళము కొంతకాలము మాత్రమే సంస్కృతతమిళవిరహితముగా మలయాళకవితయందు వాడఁ బడుచుఁ దరువాత

సంస్కృతతమిళభాషలను దిద్దిదిద్దుటకు విశేషముగాఁ దోడ్పడి యామూఁటి యొక్క మధుర సమ్మేళనముచే నొక కావ్యభాషగా స్థిరపడెను.

కన్నడభాషయందు నయసేనుఁ డనుకవి ధర్మామృత మనుగ్రంథమును రచించెను. ఇతనికి శుద్ధకన్నడమున గ్రంథమును విరచింప వలెనని కోరిక యుండెను. పంపనికాలమునఁ బండితజనరంజనమునకై గ్రంథరచనము చేయఁబడఁగా నితఁడు తెలుఁగునఁ బాలకులకై సోమనాథుని వలెఁ బామరులకై రచన చేసి వాసిఁ గాంచెను. తరువాత క్రీ. శ. 1235 ప్రాంతములకుఁ జెందిన 'అండయ్య' యనుకవి యొక్క తత్సమశబ్దమును గూడ వాడక, దేశ్యతద్భవములను మాత్రమే వాడి అచ్చ గన్నడమున 'కబ్బిగరకావ' యనుకావ్యమును వ్రాసెను. సంస్కృతపదములు వాడనిదే కావ్యమునకు శోభ లే దని వాదించు వారి కీతఁడు అచ్చగన్నడపదములలోఁ గావ్యరచనము చేసి కన్నడమాధుర్యమును జవిచూపెను. ఇతని తరువాత నీతనిపద్ధతి ననుసరించి యెవరును గావ్యము అల్లలేదు కాని, యీతని యీ అచ్చగన్నడరచనా ప్రయత్నము మనసాహిత్యములోని అచ్చతెనుఁగుకవిత్వోద్యమము తలపెట్టిన వారి ప్రయత్నము వంటిదే యయి యున్నది.

మలయాళసారస్వతమునందలి 'అట్టకథ' రచనోద్యమమునకును నాంధ్రభాష యందలి యక్షగానరచనోద్యమమునకును సన్నిహితసామ్యము కలదు. 'అట్టక్కథ' యనఁగా నాటకవేషము వేసికొనినకథ. మనయక్షగానము కూడ సరిగా నిట్టిదే. అట్టక్కథ కేరళమునందావిర్భవించిన కళావిశేషము కాఁగా యక్షగాన మాంధ్ర దేశమును దావిర్భవించినకళావిశేషము. రెండును నభినయార్థముద్దేశింపఁ బడినరచనములే. కాని, మలయాళమున కథకళి నృత్యము చేయువారు ముద్రలద్వారమున భావప్రకటనము చేయుచుండఁగా ప్రధానవటులకు వెనుకభాగమునఁ గొందఱు నిలఁబడి యుండి శ్లోకములు, పాటలు పాడుదురు. ఇట్లు వెనుకపాటకు గావలసిన సాహిత్య మీ 'అట్టక్కథ'ల నఁబడురచనములు దుండును. మన యక్షగానములందట్లు కాక యక్షగాననాటకములను బ్రదర్శించు నటీనటులే సంభాషణలు పలుకుట, పాటలు పాడుట యనుకార్యములను చేయుదురు. ఈయొక్క భేదము తప్ప రెంటిలక్ష్యమును నొక్కటే. ప్రదర్శనానుగుణముగా నుండుట. కాలదేశభేదములఁ బట్టి రెంటియందును పరస్పరము భిన్నములయిన కొన్ని పద్ధతులు కూడ నుండ వచ్చును. తమిళమునందలి యక్షగానములు మన యక్షగానములనుబట్టి యేర్పడినవే యగుట విశేషముగా భేదము కానరాదు.

తమిళభాషయందలి వ్యావహారికభాషోద్యమమునకును మనభాషయందలి వ్యావహారికభాషోద్యమమునకును దగ్గఱి సంబంధము కలదు. తమిళమున నీయుద్యమమునకు సుబ్రహ్మణ్యభారతి ప్రవర్తకుఁడు. ఆధునికయుగమున వచనశాఖకుఁ గలప్రచారము మఱి యేయితరశాఖకును లే దనియు, నందును వ్యావహారికభాషా గ్రథితములగు రచనములకు బహుళప్రచారము లభించు ననియుఁ గనుఁగొనిన తమిళకవులలో సుబ్రహ్మణ్య భారతి యగ్రగణ్యుఁడు. సమకాలిక సామాజికజీవనమును, దమిళసాహిత్యముయొక్క స్థితిగతులను, రాజకీయ పరిస్థితులను మొదలగువానిని బాగుగా గుర్తించినవాఁ డగుటచే సుబ్రహ్మణ్యభారతి సామాన్యమానవునికి సైతము సంబోధ మగుభాషలో రచనలు చేయఁ దొడఁగెను. అతనికావ్యరచన మంతయు వ్యావహారికభాషలోనే సాఁగినది. అయనరచనా ప్రభావము నేఁటి పత్రికారచనమునందును, పలువురు రచయితలమీఁదను స్ఫుటముగాఁ గాన వచ్చును. తమిళమున భారతి వ్యావహారికభాషోద్ధారకుఁ డని చెప్పఁ దగును. కాని, మనసాహిత్యము నందువలె నాయుద్యమము పండితులవాదోపవాదములకుఁ దావలము కాలేదు. భారతి లక్షణరూపమునఁ గాక లక్ష్యరూపముననే యీయుద్యమమును బ్రారంభించుటవలనను – నాభాషలో రచితము లయిన యాతనికవితలు జనాదరపాత్రము లగుట చేతను – నతని మీఁది గౌరవముచేతనో, మఱి యేకారణముననో సమకాలమునందలి విద్వాంసు లట్టి భాషాప్రయోగము నాక్షేపించినవారు కాకపోవుట చేతను, నాతఁడు సాఁగించిన యా యుద్యమము నిరాఘాటముగా సాఁగి పోయినది.

ఆధునికయుగమున భారతదేశములోని తక్కినప్రాంతములయందలి భాషా సాహిత్యములందువలెనే యాంగ్లేయసాహిత్యప్రభావము దక్షిణదేశభాషలయందలి సారస్వత ములమీఁదను బ్రసరించినది. తత్ఫలితముగా నాయాభాషలయందుఁ గవిత్వము చెప్పఁదలఁచిన యువకుల దృక్పథములోఁ గూడ నూతన మయిన పరిణామ మేర్పడెను. తత్ఫలితముగాఁ గ్రొత్తదృష్టియుఁ గ్రొత్తధోరణియు వారి కలవడెను. ప్రతి దక్షిణదేశభాషయందును నవల, చరిత్ర, నాటకము, స్వీయచరిత్ర, వ్యాసము, విమర్శ, గేయము మొదలగు వివిధసాహిత్యప్రక్రియలలో బహుముఖముగాఁ గృషి జరుగుట ప్రారంభమయ్యెను. ముఖ్యముగా నాంధ్రభాష యందలి భావకవిత్వోద్యమమువంటియుద్యమము లొక్క తమిళభాషయందుఁ దప్పఁ దక్కిన దక్షిణదేశముభాషలయం దెల్ల నేకకాలముననే ప్రభవించెను. కన్నడమునఁ

ప్రారంభింపఁబడిన యాధునికోద్యమఫలితముగా ఇంగ్లీషు 'లిరిక్' పద్ధతిని గేయములు రచింపఁబడఁజొచ్చెను. మలయాళమున బాలకృష్ణపణిక్కర్, కుమరన్ ఆశాన్ అనుకవులవలనను గేయకవిత్వము వ్యాప్తిలోనికి వచ్చెను. మహారాష్ట్రమునఁ గూడఁ బద్యకవిత్వములోఁ గ్రొత్తరీతులు బయలుదేరెను. మహారాష్ట్రమున నట్టి రచనలకు మూలపురుషుఁడు 'కేశవసంత్'. అతఁడు ప్రాచీన రచనావిధానమును బరిత్యజించి స్వానుభవమును దనమనోభూమికపై గోచరించినరీతిని దనకవిత్వములో వెల్లడించెను. ఈభాషయందుఁ గూడ నీయాధునికకవిత్వోద్యమ ఫలితముగా గేయరచనము వ్యాప్తిలోనికి వచ్చెను. ఇట్టిభాషలయందలి యీయుద్యమములెల్ల స్వభావమునుబట్టి మనభాషయందలి భావకవిత్వోద్యమమును బోలుచున్నవి.

కన్నడభాషయందు ప్రగతిశీలసంఘోద్యమమునకుఁ జెందినకవులు సృష్టించిన సాహిత్యమొకవిధముగా మనసాహిత్యములోని యభ్యుదయ కవిత్వముతో బోలిపోలుసనవచ్చును. మలయాళసాహిత్యమునందలి యిట్టియభ్యుదయ కవిత్వోద్యమమునకు 'జీవత్సాహిత్యోద్యమము' అని కూడఁ బేరు. క్రీ.శ. 1936 సంవత్సరప్రారంభమున మలయాళభాషలో నీవిధ మయిన యభ్యుదయ కవిత్వమునకుఁ బ్రాధాన్యము లభించె ననవచ్చును. ఈయుద్యమ నాయకులయిన బాలకృష్ణపిళ్లె మొదలగువారి రచనములకుఁ గాలక్రమమున '**పురోగమన సాహిత్యము**' అని పేరేర్పడెను.

ఇట్లు మనభాషయందలి సాహిత్యోద్యమములు కొన్ని దక్షిణదేశమునందలి యితరభాషాసారస్వతములందు వెలసిన సారస్వతోద్యమములు కొన్నింటితో సంపదించుచు నాయాసారస్వతముల క్రమపరిణామమునకు దోహదము గావించినవి. పరస్పరసామ్యములు లేక యా యాభాషలయందే యాయాభాషా స్వభావపరిస్థితులనుబట్టి యేర్పడుచు వచ్చినసాహిత్యోద్యమములు కూడఁ గొన్ని లేక పోలేదు. కన్నడభాషయందలి దాస కూటోద్యమము, పునరుజ్జీవనోద్యమము – మలయాళసారస్వతమునందలి సందేశకావ్యోద్యమము, మణి ప్రవాళ భాషోద్యమము, గాథాకవిత్వోద్యమము, – మహారాష్ట్రసారస్వతమునందలి పండిత కవులసాహిత్యోద్యమము, షాహిరీవాఙ్మయోద్యమము, నిబంధరచనోద్యమము నిట్టివి. ఇవి యా యాభాషలయందలి ప్రత్యేక పరిస్థితులప్రభావమున, నాయాభాషల యావశ్యకములనుబట్టి యేర్పడిన యుద్యమములు. వానికి

సోదరభాషలలోని సాహిత్యోద్యమములతో సామ్యము లేక పోవుట సహజము. అంతమాత్రమున నది యా యాభాషలయందలి సాహిత్యములయభివృద్ధికిఁ జేసినదోహదము తక్కువ కాఁజాలదు.

ఈయధ్యాయమునందుఁ జర్చింపఁబడినయంశముల సారాంశము నీక్రింది విధముగాఁ బేర్కొన వచ్చును.

౧. ఆంధ్రసాహిత్యములో వివిధకాలములు దేర్పడిన యుద్యమములు పదునొకండుఁ గలవు. అవి మార్గకవిత్వోద్యమము, దేశికవిత్వోద్యమము, హరిహరనాథతత్త్వోద్యమము, ప్రబంధకవిత్వోద్యమము, అచ్చతెనుఁగు కవిత్వోద్యమము, యక్షగానరచనోద్యమము, భావకవిత్వోద్యమము, వ్యావహారికభాషోద్యమము, అభ్యుదయకవిత్వోద్యమము, అధివాస్తవిక కవిత్వోద్యమము, దిగంబరకవిత్వోద్యమము. వీనిలో నచ్చతెనుఁగు కవిత్వోద్యమము వ్యావహారికభాషోద్యమము ననుకవి కావ్యములందును, రచనవములందును నుపయోగింపఁ దగినభాషకు సంబంధించి యేర్పడిన యుద్యమములు. హరిహరనాథతత్త్వోద్యమము మత సంస్కరణలక్ష్యముతో నేర్పడినది. దేశికవిత్వోద్యమము యొక్క లక్ష్యము మతప్రచారమే యయినను నది కవిత్వరూపమున సాధింపఁ బడినయుద్యమము. యక్ష గానరచనోద్యమము ప్రక్రియకు సంబంధించినది. తక్కిన వన్నియు నాంధ్ర భాషయందుఁ గవితాపద్ధతులలో నిర్దిష్టపరిణామమును లక్షించి యేర్పడిన యుద్యమములు. భిన్నభిన్న రంగములకు సంబంధించి సాఁగిన యీయుద్యమము లన్నియు నాయాకాలములం దాంధ్రభాషా సాహిత్యపరిణామమునకు యథాశక్తి దోహదము కావించినవి.

౨. తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము ననునవి ద్రావిడ భాషకుటుంబమునకుఁ జెందినభాషలగుట చేతను – దక్షిణదేశమందలి రాజకీయ సాంఘిక పరిస్థితు లించుమించుగా నీభాషలయందలి పరిణామములకుఁ జాలవఱకు సమానములే యయి పరస్పరసామ్యము కలయుద్యమము లాయాభాషలలో వెలయుట సంభావ్య మగుటచేతను – ఇరుగుపొరుగుభాషలలో నొకభాషయందలి యుద్యమప్రభావమును, వ్యాప్తియు నితరభాషలయందును బొడసూపుట సహజ మగుట చేతను – దక్షిణదేశభాషా సాహిత్యములయందలి యుద్యమములను బరస్పరము పోల్చి తులనాత్మక

పరిశీలనము చేయుట యావశ్యక మయినది. అట్లు కాక యాదృచ్ఛికముగానే కూడఁ గొన్ని సమానధర్మములు గల యుద్యమములు భిన్నకాలములం దీదక్షిణదేశభాషలయం దేర్పడుట యు సంభవమే. ఒకప్పు డొకభాషయం దాభాషా పరిస్థితులనుబట్టి యేర్పడినయుద్యమ మాసమకాలమున నితర దక్షిణదేశ భాషయం దనుసరము కాక – మఱేదో కాలాంతరమున నాభాషా పరిస్థితులనుబట్టి యట్టి యుద్యమమే యేర్పడుటయు సంభవమే.

3. కన్నడమునందలి మహాకావ్యకవిత్వోద్యమము లేక మార్గకవిత్వోద్యమము నకును తెలుఁగునందలి మార్గకవిత్వోద్యమమునందును పోలిక గలదు. తెలుఁగునందలి దేశి కవిత్వోద్యమముతోఁ దమిళమునందలి సంగకాలపు దేశికవిత్వోద్యమమును, కన్నడమున బసవయుగమునందలి దేశికవిత్వోద్యమమును పోల్కఁ దగి యున్నది. తెలుఁగున వెలసిన హరిహరనాథతత్త్వోద్యమమునకును, మహారాష్ట్రసాహిత్యమునందలి నాథపంథ, మహానుభావ పంథ యనెడు నుద్యమములకును పోలికలు గలవు. మలయాళభాషయందలి 'కిళిప్పాట్టు' ఉద్యమము, తమిళభాషయందలి శెందమిళు ఉద్యమము – కన్నడభాషయందలి అచ్చగన్నడ కావ్యరచనాప్రయత్నము అనువానితో సంవదించుచున్నది. మలయాళసారస్వతమునందలి అట్టక్కథ యాంధ్రభాషలోని యక్షగాన రచనోద్యమమును బోలును. ఆంధ్రభాషయందలి వ్యావహారికభాషోద్యమము, తమిళమున సుబ్రహ్మణ్యభారతి ప్రారంభించిన వ్యావహారికభాషోద్యమము నించుమించుగా సమానాశయములతో వెలువడినవి. మనభాషయందలి భావకవిత్వోద్యమమువంటి యుద్యమము లొక్క తమిళభాషలోఁ దప్పఁ దక్కిన యన్ని దక్షిణదేశ భాషలయందును బయలుదేరినది. అవి బయలుదేరిన పరిస్థితులను, వాని యావశ్యకతయు నన్నిభాషలయందును సమానములు. మనభాషయందలి యభ్యుదయకవిత్వోద్యమమునకు కన్నడమునందలి ప్రగతిశీల సంఘోద్యమము – మలయాళసారస్వతమునందలి 'జీవత్‌సాహిత్యోద్యమము' అనువానితోఁ బోలికలు కలవు. ఈ తులనాత్మక పరిశీలన మీక్రింది పట్టికలో విశదముగాఁ గన నగును.

ఇట్లు పరస్పరసామ్యములు లేక యాయాభాషలయందలి పరిస్థితుల కనుగుణముగా నేర్పడిన సాహిత్యోద్యమములు కొన్ని కలవు. అవి యా యా భాషలకుఁ బ్రత్యేకములు.

# దక్షిణదేశ భాషలలోని యుద్యమములు - తులనాత్మక పరిశీలనము

| తెలుగు | తమిళము | కన్నడము | మలయాళము | మహారాష్ట్రము | ఉత్తరభారత సాహిత్యములు |
|---|---|---|---|---|---|
| మార్గకవిత్వోద్యమము<br>క్రీ.శ. 11వ శతాబ్దము. | | మార్గకవిత్వోద్యమము లేక మహాకావ్యకవిత్వోద్యమము<br>క్రీ.శ. 10వ శతాబ్దము. | | | హిందీలో ఖడీబోలీయుద్యమం.<br>బెంగాలీలో పురాణానువాదోద్యమము<br>ఒడ్రియాలో గద్యసాహిత్యోద్యమము |
| దేశికవిత్వోద్యమము<br>క్రీ.శ. 12వ శతాబ్దము. | సంగకాలమునందలి దేశి కవిత్వోద్యమము క్రీ.పూ. 1-క్రీ.శ 1,2, శతాబ్దములు. | బసవయుగమునందలి దేశికవిత్వోద్యమము క్రీ.శ 12,13 శతాబ్దములు | | | బెంగాలీలో మంగళకావ్యోద్యమము,<br>ఒడ్రభాషలో ప్రజాకవిత్వోద్యమము |
| హరిహరనాథతత్త్వోద్యమము<br>క్రీ.శ. 13వ శతాబ్దము. | | | | నాథపంథయుద్యమము,<br>క్రీ.శ. 12వ శతాబ్దము<br>మహానుభావపంథయుద్యమము.<br>క్రీ.శ. 12,13 శతాబ్దములు. | బెంగాలీలోని చైతన్యసాహిత్యోద్యమము<br>ఓఢ్రభాషలో వైష్ణవసాహిత్యోద్యమము |
| ప్రబంధకవిత్వోద్యమము<br>క్రీ.శ. 16వ శతాబ్దము. | అనువాదసాహిత్యోద్యమము<br>క్రీ.శ. 10,11 శతాబ్దములు | | పాట్టు ఉద్యమము<br>క్రీ.శ 16,17 శతాబ్దములు | | |
| అచ్చతెనుగుకవిత్వోద్యమము<br>క్రీ.శ. 16,17 శతాబ్దములు. | 'శెందమిళ' ఉద్యమము<br>క్రీ.శ. 1930 ప్రాంతము. | 'అచ్చగన్నడ' ఉద్యమము<br>క్రీ.శ. 13వ శతాబ్దము | మలయాళభాషోద్యమము.<br>క్రీ.శ. 5 నుండి 8 శతాబ్దములు. | | [illegible] |

| తెలుగు | తమిళము | కన్నడము | మలయాళము | మహారాష్ట్రము | ఉత్తరభారత సాహిత్యములు |
|---|---|---|---|---|---|
| యక్షగానరచనోద్యమము క్రీ.శ. 17,18 శతాబ్దములు | | యక్షగానరచనోద్యమము క్రీ.శ. 17,18 శతాబ్దములు. | అట్టక్కథ రచనోద్యమము క్రీ.శ. 17,18 శతాబ్దములు | | |
| భావకవిత్వోద్యమము క్రీ.శ. 1915-1930 | | ఆధునికకవిత్వోద్యమము క్రీ.శ. 19వ శతాబ్దియుత్తర భాగము 20వ శతాబ్ది ప్రారంభము | ఆధునికకవిత్వోద్యమము క్రీ.శ. 20వ శతాబ్ది ప్రాంతము. | నవ్యకవిత్వోద్యమము క్రీ.శ 19వ శతాబ్దియుత్తరభాగము, 20వ శతాబ్ది ప్రారంభము. | హిందీలో ఛాయావాదకవిత్వోద్యమము. ఓఢ్రభాషలో నవ్యకవిత్వోద్యమము. బెంగాలీలో ఆధునికకవిత్వోద్యమము. |
| వ్యావహారికభాషోద్యమము క్రీ.శ 1920 సం. ప్రాంతము | వ్యావహారికభాషోద్యమము క్రీ.శ. 19వ శతాబ్దియుత్తర భాగము, 20వ శతాబ్ది ప్రారంభము. | | | వ్యావహారికభాషోద్యమము 20వ శతాబ్ది ప్రారంభము. | హిందీలో హిందూస్తానీ యుద్యమము బెంగాలీలో చలితభాషోద్యమము |
| అభ్యుదయకవిత్వోద్యమము క్రీ.శ. 1940 సం. ప్రాంతము. | | ప్రగతిశీలసంఘోద్యమము క్రీ.శ. 1945 సం ప్రాంతము. | జీవిత్‌సాహిత్యోద్యమము క్రీ.శ. 1937 ప్రాంతము. | | హిందీలో ప్రగతివాదము. ఓఢ్రములో సబూజ సంఘోద్యమము. పంజాబీలో అభ్యుదయ కవిత్వోద్యమము |

# చతుర్థాధ్యాయము

# పాల్కుఱికి సోమనాథునికి బూర్వకాలమునాఁటి యాంధ్రవాఙ్మయ స్థితి

ఆంధ్రసాహిత్యములోని వివిధ సాహిత్యోద్యమములను గుఱించియు, నాయా యుద్యమము లారంభ మగుటకు హేతువులయిన పరిస్థితులను గుఱించియుఁ బూర్వాధ్యాయమున విపులముగాఁ జర్చించితిమి. దానిలో సోమనాథుఁడు ప్రవర్తింపఁజేసిన దేశి కవిత్వోద్యమస్వరూపమునుగూర్చియుఁ, దదుద్యమమును విజయవంతముగా సాఁగించుటకు వలసిన వివిధము లగు యోగ్యతలును, బాండిత్యాదికమును సోమనాథుని యం దెంతవఱకుఁ గలవో యను విషయమునుగూర్చియుఁ బరిశీలించుటకు ముందుసోమనాథునికిఁ బూర్వకాలమునాఁటి యాంధ్రవాఙ్మయస్థితిని గూర్చి కొంత తెలిసికొన వలసి యున్నది. సోమనాథునియుద్యమమునకుఁ బూర్వరంగముగా నేర్పడిన యాంధ్రవాఙ్మయస్వరూపస్వభావములను, నాకాలమునాఁటికవిత్వమునందు నెలకొని యుండిన సంప్రదాయములను, పద్ధతులను జక్కఁగా నాకళింపునకుఁ దెచ్చుకొనిన తరువాతఁ గాని సోమనాథుని యుద్యమముయొక్క యావశ్యకమును, దదుద్యమ స్వరూపస్వభావము లట్లుగానే యుండుటకుఁ గలహేతువుల సామంజస్యమును మనము చక్కఁగా గుఱుతింపఁజాలము. అతనికిఁ బూర్వకాలమునాఁటి యాంధ్రవాఙ్మయస్థితి యెట్టిదో పరిశీలింపవలసి వచ్చినప్పుడు ముందుగా నాతనికాల మేదో నిర్ధరించుకొని యాపిదప ముందునకు సాఁగవలసి యుండును. అప్పుడు గాని యాతనికిఁ బూర్వము వెలసిన యాంధ్రవాఙ్మయపరిమితిని గూర్చిన విస్పష్టజ్ఞానము కుదురుట కవకాశము లేదు.

పాల్కుఱికి సోమనాథునికాలమునుగూర్చి వాఙ్మయపరిశోధకులలో ననేక భేదాభిప్రాయము లున్నవి. బసవపురాణమును దొలుత వెలుఁగులోనికిఁ గొని తెచ్చి సోమనాథుని వివిధరచనములను, నందలి రచనావిశేషములను నాంధ్రలోకమునకుఁ దొలు దొల్తగా నెఱుకపఱచిన మహావిద్వాంసులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, విమర్శకాగ్రేసర శివశ్రీ బండారు తమ్మయ్యగారును సోమనాథుఁడు మొదటిప్రతాపరుద్రుని కాలమునకుఁ జెందినవాఁ డని విశ్వసించుచున్నారు. వారియభిప్రాయమున సోమనాథుడు క్రీ.శ. 1160–1240 నడిమికాలమున జీవించి యుండెను. విద్యారత్న శ్రీ నిడుదవోలు వెంకట

రావుగారు సోమనాథుడు క్రీ.శ. **1190-1260** మధ్యకాలములో జీవించియుండునని యభిప్రాయపడుచున్నారు. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తాము పండితారాధ్య చరిత్రమునకు వెలయించిన పీఠికలో సోమనాథుని కాలమునుగూర్చి చర్చించి యాతఁడు క్రీ.శ. **1247–1280, 1300** మధ్యకాలమున జీవించి యుండునని నిర్ధరించి యున్నారు. 'ఎవరెంత గింజుకున్నా సోమనాథుఁడు క్రీ.శ. **1240** ముందుకు రాఁడు.'[1] అని వారు తమ పూర్వాభిప్రాయమును బునరుద్ఘాటించి యావిషయమునఁ దమ నిశ్చితాభిప్రాయమును వెల్లడించి యున్నారు. శ్రీ చాగంటి శేషయ్యగారు తమ యాంధ్రకవితరంగిణి ద్వితీయసంపుటమునందు సోమనాథుని కాలము క్రీ.శ. **1240-1320** దాఁక నని నిర్ణయించిరి. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'రెంటాల మల్లినాథుఁడు క్రీ.శ. **1290**లో ఉండినట్లు శాసనము లనుబట్టి విస్పష్టమగుచున్నందున పాలకుఱికి సోమనాథుఁడును అప్పటివాఁడే యనుటకు అభ్యంతరముండదు. అట్లయినను బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు క్రీ.శ. **1290** కిని క్రీ.శ. **1320** కిని నడిమికాలమునఁ బుట్టిన గ్రంథములు'[2] అని వ్రాసి యాతఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమున జీవించి యుండెనని తమ యభిప్రాయమును బ్రకటించిరి. డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు 'సోమనాథుఁడు ఎప్పటివాఁడు?'[3] అను గ్రంథమున సోమనాథుని కాలమును గూర్చి సుదీర్ఘముగా జర్చించి యతఁడు 'సుమారు **1280** నుండి **1340** వఱకును జీవించె ననుకొనవచ్చును' అని తమ నిర్ణయమును దెలిపిరి. ఈ గ్రంథమునందు వారు చూపిన యుపపత్తులను ఖండించుచు మఱలఁ దమ వాదమునే మఱికొన్ని యుపపత్తులతో సమర్థించుకొనుచు శివశ్రీ బండారు తమ్మయ్యగారు 'పరిశోధన' పత్రికలో 'సోమనాథుఁ డెప్పటి వాఁడు? అను పేర నొక సుదీర్ఘ వ్యాసమును వ్రాసి ప్రకటించిరి. డాక్టరు నేలటూరు వెంకటరణయ్యగారు దానికి నేటివఱకు సమాధానము నీయ రయిరి. ఇట్లు సోమనాథుని కాలమునుగూర్చి పండితలోకమున నిన్నియభిప్రాయము లున్నను సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రునికాలమునకుఁ జెందినవాఁ డనువాదమునకే యధికజనాంగీకారము కలదు. ఆవాదమును బ్రామాణికముగాఁ బరిగ్రహించినచో సోమనాథుఁడు క్రీ.శ. పండ్రెండవ శతాబ్ది యుత్తరార్ధమునందును, బదుమూఁడవ

1. *భారతి 1948, నవంబరు సంచిక*
2. *భారతి 22వ సంపుటము, పుటలు 107, 108.*
3. *వావిళ్ల ముద్రణాలయమువారిచే బ్రకటితము.*

శతాబ్ది పూర్వార్ధమునందును జీవించి యుండినట్లు తలఁపవలసి యున్నది. మొత్తము మీఁద నతఁడు నన్నయ, తిక్కనలకు నడిమికాలమున జీవించి యుండు నని భావింపఁ దగును. అట్లు స్థూలముగాఁ జెప్పుకొనఁ దగి యున్నను సోమనాథునికిఁ బూర్వ మాంధ్రవాఙ్మయమునఁ బేరెన్నికఁ గాంచిన కవీశ్వరులను, వారు మన కందించిన సాహిత్యసంపదస్వరూపమును దెలిసికొనవలసినప్పుడు కొంత నిశ్చయపరిజ్ఞానమే యవసరమై యున్నది. శివశ్రీ బండారు తమ్మయ్యగారు నన్నెచోడుఁడు సోమనాథునికిఁ దరువాతికాలమునకు జెంది యుండు నని యభిప్రాయపడుచున్నారు. కాని, శ్రీ వేటూరి పభాకర శాస్త్రిగారు, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు మొదలగు పెక్కురు పండితులు నన్నెచోడుఁడు సోమనాథునికిఁ బూర్వుఁ డనియే విశ్వసించుచున్నారు. గ్రంథస్థనిదర్శనములును వారి యావిశ్వాసమున కనుగుణముగానే యున్నదని వారి యభిప్రాయము.

సోమనాథునికిఁ బూర్వకాలమునందు వెలసిన యాంధ్రవాఙ్మయస్వరూప మునుగూర్చి తెలిసికొనునపుడు శాసనాదికములవలనఁ దెలియవచ్చుచున్న వాఙ్మయము యొక్క స్వరూపమును రెంటెని లక్షింపవలసి యుండును. గ్రంథములమూలమునఁ దెలియవచ్చుచున్న సారస్వతముకూడ నుపలబ్ధసారస్వత మనియు, ననుపలబ్ధ సారస్వత మనియు రెండుదెఱఁగులఁ బరిశీలింప వలసి యున్నది. చాళుక్యయుగమునందు దేశి మార్గమునకుఁ జెందినవియు, మార్గపద్ధతికిఁ జెందినవియు నగురచనములుండినట్లు తెలియవచ్చుచున్నది. అందు క్రీ.శ. పదియవశతాబ్దికిఁ బూర్వ కాలమునకుఁ జెందినవిగా లభించిన దంతయు దేశిరచనమే. దీనికి అద్దంకి, కందుకూరు, బెజవాడ యను స్థలములయందు వేయఁబడిన శాసనములే తార్కాణము. అద్దంకి శాసనమున నొక తరువోజవృత్తమును, కందుకూరు శిలాశాసనమున నొకసీసపద్యమును, యుద్ధమల్లుని బెజవాడ శాసనమున నయిదుమధ్యాక్కరలును కలవు. ఆకాలమునఁ బాల్కుఱికి సోమనాథుఁడు పేర్కొనిన తుమ్మెదపదములు, ప్రభాతపదములు మొదలగు పదరచనములతోఁ గూడిన దేశి వాఙ్మయము కూడఁ గొంత యుండి యుండు నని యూహింపవచ్చును. క్రీస్తుశకము పదియవశతాబ్దికిఁ బిమ్మట రచితము లయినట్లు కొందఱు చెప్పు జైనకవుల కావ్యములును, విరియాల కామసాని గూడూరు శాసనమును మార్గపద్ధతి నవలంబించినట్లు తెలియుచున్నది. అంతకుఁబూర్వకాలమునుండియు వాగ్రూపమున జాలువాఱుచుండిన పదవాఙ్మయ మీకాలమునఁ గూడ సాగుచునే యుండెనని యూహింప వచ్చును. పద్మకవి జినేంద్రపురాణము,

సర్వదేవకవియాదిపురాణము, విరాటపర్వము అనునవి యీకాలమునందు వెలసినకావ్యములుగానే తలపఁబడుచున్నవి. అందలి పద్యములు ప్రబంధరత్నావళిలో నుదాహరింపఁబడి యున్నవి. ఇట్లు, చాళుక్య యుగమున క్రీస్తుశకము పదునొకాబ్దికిఁ బూర్వము కేవల దేశికవిత్వమును దరువాత దేశిమార్గకవిత్వములు రెండును తెలుఁగుభాషయందు బ్రచురములై యుండెనని తెలియును. ఈసందర్భమున శ్రీ బండారు తమ్మయ్యగారు తమ 'పాలకుఱికి సోమనాథకవి' యనుగ్రంథమున వ్రాసిన యీక్రింది వాక్యములు గమనింపఁదగి యున్నవి.

'నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగునఁ బద్యరచనము వృత్తరూపమున వెలసినను, వెలయకున్నను మాత్రాగణబద్ధములగు గద్యములును, గొబ్బి పదములు, తుమ్మెదపదములు, ప్రభాతపదములు, ఆనందపదములు, వాలేసుపదములు మొదలగు గేయకృతులును – అక్కరలు, ద్విపదలు, సీసములు మున్నగుజాతీయరచనములను నన్నయకుఁ బూర్వము చిరకాలమునుండియే కొంతవఱకు నెలకొనియుండినట్లు మనకు దొరకిన దీర్ఘాసిశాసనము (A.D. 1065), గుణగవిజయాదిత్యుని సాతలూరిశాసనము (A.D. 850-900), పాండురంగని యద్దంకి శాసనము (A.D. 848), యుద్ధమల్లుని బెజవాడశాసనము (A.D. 898) మున్నగు ప్రాచీనశాసనసామగ్రియుఁ బాలకుఱికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమందలి వర్ణనలు నాతని గ్రంథపరికరమును సాక్ష్య మొసంగుచున్నవి.'[४]

సోమనాథునికిఁ బూర్వ మాంధ్రభాషలో శాసనములందును, బదరచనము లందును గానవచ్చు వాఙ్మయస్వరూపమునుగూర్చి తెలిసికొన్న పిదప గ్రంథరూపమునఁ గానవచ్చువాఙ్మయస్వరూపమునుగూర్చి మనము తెలిసికొన వలసి యున్నది. నన్నయ భట్టారకుని మహాభారతము, పావులూరి మల్లన రచిత మగు సారసంగ్రహగణితము అను పావులూరి గణితము. మల్లియరేచన కవిజనాశ్రయము, నన్నెచోడుని కుమారసంభవము మల్లికార్జునపండితారాధ్యుని శివతత్త్వసారము, అను గ్రంథములయం దిట్టివాఙ్మయము కానవచ్చును. ఇంకను సోమనాథునికిఁ బూర్వకాలమందు వెలసినట్లు తలంపఁబడుచున్న వేములవాడభీమకవి, అథర్వణాచార్యుఁడు, కవిభల్లటుఁడు అనువారిరచనములను బట్టి కూడ నిట్టి వాఙ్మయస్వరూపము కొంత గోచరించును.

४. పాలకుఱికి సోమనాథ కవి : శ్రీ బండారు తమ్మయగారు. పుట 145.

తాను తెలుఁగుదేశమునకు నేలిక యై యుండఁగాఁ దెలుఁగువారు తమ భాషాకావ్య మని చెప్పుకొని గర్వింపదగిన యుద్గ్రంథమేదియు నాంధ్రభాష యందుఁ లేకపోవుట యొక్క గొప్పకొఱంతగా రాజరాజనరేంద్రుఁడు తలపోసెను. అట్టి చింతయే యాతని యాస్థానియగు నన్నయభట్టారకునికిఁ గూడ జనించియుండును. తనకుఁ బూర్వము జైనమతావలంబకుఁ డైన పంపమహాకవి పంచమవేద మని ప్రసిద్ధి గాంచిన మహాభారతమును గొన్ని మార్పులతో విక్రమార్జునవిజయ మనుపేరఁ గన్నడములో రచించి యుండెను. అట్లే వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లమగునట్లు తెలుఁగుభాషలో వైదిక మతాభిమానులును చేయక పోవుట ఒకలోపముగా నన్నయభట్టారకునికి స్ఫురించెను. వేదోక్తమయినపరమధర్మముల నాంధ్రులు సులభముగాఁ జదివి యర్థము చేసికొనఁ గలుగుట, యుదాత్తసాహిత్యసృష్టిచేఁ బ్రజలచిత్తవృత్తులను సంస్కరించి వారిని విజ్ఞానవంతులను చేయుటయను మహత్తరలక్ష్యములు మహాభారతాంధ్రీకరణముచే సిద్ధించునని రాజరాజనరేంద్రుఁడును, నన్నయభట్టారకుఁడును దలపోసిరి. కాని, తెలుఁగున నాదర్శముగా గ్రహించుట కానాఁటి కుత్తమగ్రంథము లేవియు వెలువడియుండలేదు. శాసనకవితయు, వాగ్రూపమునఁ బ్రజాసామాన్యమున వ్యాపించి యుండిన కతిపయ పదరచనములును మాత్రమే యానాఁటికి వెలసియుండినసాహిత్యము. అప్పటిభాషయు మహాకావ్యోపయోగి కాఁగలిగినంత సంపన్నమై యుండలేదు. మహాభారతమువంటి యుద్గ్రంథమును రచించుట కానాఁడు ప్రాచుర్యము వహించి యుండిన దేశిఛందస్సులును,పరిమితశబ్దజాలము మాత్రమే కలిగినభాషయు నక్కఱకురావని నన్నయకుఁ దోఁచెను. ఇట్టిస్థితిలోఁ గావ్యనిర్మాణమునకు నే మార్గము నవలంబింపవలసియుండునో దిక్కుతెన్నుతెలియక కొట్టుమిట్టాడు చుండిన నన్నయ్యభట్టారకునికి – మహాభారతమున నర్జునునికి శ్రీకృష్ణునివలె – నారాయణభట్టనుమహాపండితుఁడు సాహాయ్య మొనర్చెను. అతఁడు అష్టభాషాకవితాప్రవీణుఁడు. విశేషించి, యాతనికిఁ గన్నడభాషయం దాకాలము నాఁటికే కావ్యసాహిత్యము కొంత వెలసి యుండెను. దానిఁగూర్చిన చక్కని పరిజ్ఞానముకల నారాయణభట్టు నన్నయభట్టారకుఁ డనుసరింపదగినకావ్య నిర్మాణపథమును సూచింపఁగా నాపథము నవలంబించి నన్నయ మహాభారతాంధ్రీకరణ మను మహాకార్యమునకుఁ గడంగెను. కన్నడ భాషయందాకాలమునాఁటికే ప్రాచుర్యము వహించి యుండిన చంపూకావ్యపద్ధతి,

సంస్కృతవృత్తప్రయోగము, సంస్కృతశబ్దజాలమును తత్సమీకరించుకొను విధానము ననువానిని నారాయణభట్టుమూలమున నెఱిఁగినవాఁడై నన్నయ యాంధ్రమున ఁగావ్యనిర్మాణమున కవలంబింప వలసిన ప్రణాళికను స్వయముగా రూపొందించుకొని యాప్రణాళికచొప్పునఁ గావ్యనిర్మాణముఁ గావించెను. ఇష్టదేవతాస్తుతివంటి మఱికొన్ని చిల్లరసంప్రదాయములనుగూడ నతఁడు కన్నడమునుండియే యెరవు తెచ్చుకొనెను. 'నన్నయరచనమునందుఁ దత్సమశబ్దము లెక్కువగా నుండును. కేవలదేశ్యపదములు తక్కువగా నుండును. అయినను నాతఁడు వాడినసంస్కృతశబ్దములు సుప్రసిద్ధములై రసానుకూలముగా నుండును. మాఱుమూల సంస్కృతపదముల నెచ్చటను బాండిత్య ప్రకటనముకొఱకై యీమహాకవి వాడి యుండలేదు.'[౫] అని యాంధ్రులచరిత్ర – సంస్కృతి యనుగ్రంథమున శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారు వ్రాసినవాక్యములు సత్య సన్నిహితము లనుటకెట్టి సందేహమును లేదు. శివశ్రీ బండారు తమ్మయ్యగారుకూడ నించుమించుగా నిదే యభిప్రాయమును దమ 'పాలకుఱికి సోమనాథకవి' యను గ్రంథమునఁ దెలిపి యున్నారు.[౬] 'కావుననే నన్నయభట్టారకుని యాంధ్ర మహాభారతమునందలి పద్యరచనమునందు ముఖ్యముగ వృత్తరచనము మూఁడుపాళ్లు సంస్కృతపదములలో జరుగుటకుఁగారణమయినది.'

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు కూడఁ దమ తెలుఁగుకవులచరిత్రలో నన్నయలోని భాషావిశేషములనుగూర్చి తెలియచేయుచు 'మూఁడువంతులు తత్సమ పదములనే ప్రయోగించుట' యొకవిశేషముగాఁ బేర్కొనిరి.[౭] నన్నయ యవలంబించిన తత్సమీకరణవిధానమును గూర్చి శ్రీ ఆరుద్రగారు తమ 'సమగ్రాంధ్ర సాహిత్యము' ప్రథమసంపుటమున వ్రాసినయీవాక్యములు చూడుఁడు : 'తన కాలంలో ఉన్న తెలుగుమాటలు ఉత్తమకావ్యరచనకు సరిపోవని నన్నయగారు సంస్కృత శబ్దాలను తెలుగులోనికి తీసువచ్చా రని మఱొక ఊహ పండితులలో ఉంది. అప్పటికే కన్నడ భాషలోనికి బోలెడన్ని తత్సమాలు జొరబడ్డాయి. తెలుగుశాసనాలలో కూడ అవి కనబడతాయి. పంపడు, రన్నడు

---

౫. చూ. పుట *216*.

౬. చూ. పుట *146*.

౭. చూ. పుట *151*.

మొదలైనవారు సంస్కృతశబ్దాలను ఎలాగ కన్నడీకంచారో, అలాగే తెలుగు కవులు కూడ తత్సమాలను తెలుగు చేసారు. నన్నయగారు ఈ సంప్రదాయాన్నే అనుసరించారు. దీనివల్ల భాషలో పదసంపద హెచ్చినా కొంత నష్టం కూడ కలగక పోలేదు.[1] పయివిద్వాంసుల యభిప్రాయము లన్నియు నన్నయ రచనమునందు సంస్కృతపదములధికముగా నుండు ననియు, నా సంస్కృతపదములను తెలుగులోనికిఁ దత్సమీకరించుకొని వాడుటకు నన్నయభట్టారకుఁ డొకవ్యవస్థను గల్పించె ననియు, నంతకుముందు శాసనాదులందుఁ గాననగుభాషలో నట్టివ్యవస్థ కాన రాదనియు, నీ తత్సమీకరణవిధానములోఁ బదసంపదను బెంపు చేసికొనుపద్ధతి నీతఁడు కన్నడకవులనుండి గ్రహించి యుండు ననియుఁ దెలుపుచున్నవి. తత్సమశబ్దములకు వలెనే దేశ్యశబ్దములకుఁ గూడ నాతఁ డొక వ్యవస్థను గల్పించెను. తనకాలమునందుఁ బ్రజలవ్యవహారమునను, శాసనాదులయందును గల దేశ్యభాష నంతను బరిశీలించి యాతఁడు వైవిధ్యముతోఁ గూడి చిత్రవిచిత్రముగా నుండిన యందలిరూపములకుఁ దత్సమశబ్దములకువలెనే యొకస్థిరమైన రూపము నొసఁగుటకు యత్నించెను. నన్నయకు శబ్దశాసనత్వమును గలిగించినప్రధాన గుణములలో నతఁ డవ్యవస్థితమైన తెలుఁగు శబ్దముల కొక వ్యవస్థ నేర్పఱచి, వానికి రూపస్థైర్యము నొసఁగుట యొకటి యని పండితులు విశ్వసించుచున్నారు.

నన్నయకుఁ బూర్వ ముండినశాసనములలో దేశీయచ్ఛందమునకుఁ జెందిన తరువోజ, మధ్యాక్కర, సీసము, అనుపద్యములు కానవచ్చుచున్నవి. మఱియు రగడ, కందము, చంపకమాల యున్నగునితరపద్యములు కూడ నప్పు డుండెననుటకుఁ దార్కాణము లున్నవి. మొత్తముమీఁద నాకాలమునందు మాత్రాఛందస్సునకుఁ జెందిన జాత్యుపజాతులే హెచ్చుగా వాడఁబడుచుండెను. నన్నయ వానికిఁతో డక్షరచ్ఛందమునకుఁ జెందిన పలువృత్తములను సంస్కృతమునుండి గ్రహించి తెలుఁగునందలి ఛందస్సంపదను విస్తృతము గావించెను. బహుసంఖ్యాకము లయిన సంస్కృతవృత్తములనుండి ధారాళగమనము గల చక్కనివృత్తములనెన్నుకొనుటలో నాతనికిఁ గర్ణాటకకవులు మార్గ దర్శకులయిరని భావింపఁ దగి యున్నది. వారు కూడ కన్నడమునఁ గావ్యనిర్మాణ మునారంభించినపు డిట్లే యొనర్చిరి. 'ప్రాచీన సంస్కృతకవులచే నుపయుక్తము కాక దాక్షిణాత్యులగు కవులచేతఁ బ్రయుక్త మయిన మత్తేభ చంపకోత్పలమాలికా

---

[1] చూ. పుట 118.

వృత్తములను కన్నడమునుండియే తెలుఁగువారు గ్రహించి యుండుట నిర్వివాదాంశము.[౯] నన్నయభారతమున సంస్కృతవృత్తములును, జాత్యుపజాతులును నెన్ని కలవో యీ పట్టిక మూలమునఁ దెలియును.[౧౦]

| సంస్కృతవృత్తములు | | మాత్రాచ్ఛందములు | |
|---|---|---|---|
| శార్దూలవిక్రీడితము | ౧౮ | కందము | ౧౨౯ |
| మత్తేభము | ౬౧ | ఉత్సాహము | ౪ |
| ఉత్పలము | ౧౮౪ | మధ్యాక్కర | ౩౯ |
| చంపకము | ౨౪౦ | మధురాక్కర | ౧ |
| మత్తకోకిల | ౨౬ | ఆటవెలఁదులు | ౧౯౭ |
| తరలము | ౨౭ | సీసములు | ౨౭౧ |
| స్రగ్ధర | ౧ | తేటగీతులు | ౧౫౭ |
| మహాస్రగ్ధర | ౨ | తరువోజలు | ౧౨ |
| పృథ్వీ | ౭ | | |
| మాలిని | ౫ | | |
| ద్రుతవిలంబితము | ౧ | | |
| ఇంకను కవిరాజవిరాజితము, వసంత తిలకము, స్వాగతము, తోటకము మొదలగు సంస్కృత వృత్తములు కూడ నిందుఁ బ్రయుక్తములు. | | | |

పయిపట్టిక ననుసరించి నన్నయ దేశివృత్తములనే యెక్కువగా వాడెను. కాని సంస్కృతవృత్తము లింతయధికముగా తెలుఁగునఁ బ్రవేశించుట కదియే ప్రారంభము. నన్నయ సంస్కృతవృత్తములలోఁ జంపకమాలను, దేశివృత్తములలోఁ గందమును నధికముగా వాడినట్లు పయిపట్టికనుబట్టి విశద మగుచున్నది. సంస్కృతవృత్తములలో నుత్పలమాలలును, దేశివృత్తములలో సీసములును ద్వితీయస్థానము నాక్రమించును. నన్నయ తనకవిత్వమునందు ఛందోవిషయమై

౯. *చూ. తెలుఁగుకవుల చరిత్రము. పుట* ***130.***

౧౦. *ఈపట్టికను శ్రీ నిడుదవోలు వెంకటరావుగా రొసఁగిరి. చూ. తెలుఁగు కవులచరిత్రము. పుట* ***130.***

చూపిన యీప్రాధాన్యమే తరువాతికాలమున వెలసిన యాంధ్రసాహిత్యమునందుఁ గూడఁ గానవచ్చుచున్న దని స్థూలముగాఁ జెప్పవచ్చును. తత్సమాంధ్రప్రయోగము విషయమై యొకవ్యవస్థ యేర్పడినట్లే యాంధ్రకావ్యములందుఁ బ్రయోగింపఁదగు ఛందోవిషయ మై కూడ నన్నయ యొక వ్యవస్థను గల్పించె నని దీనిఁబట్టి విశద మగుచున్నది. తెలుఁగుకవిత్వమున సంస్కృతప్రవృత్త ప్రయోగమునకుఁ బ్రాచుర్యము కలిగించినవాఁడు నన్నయభట్టారకుఁ డని నుడివినచో నతిశయోక్తి కాఁజాలదు.

భాషాచ్ఛందోవిషయములందే కాక యనువాదపద్ధతియందుఁ గూడ నన్నయ యొకవ్యవస్థ కల్పించె నననగు. రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకుని 'వ్యాసముని ప్రణీతపరమార్థము' తెల్లము చేయవలసినదని కోరెనే కాని దానికనువాదము వెలయింపవలసినదని కోరలేదు. అందుచేతనే నన్నయ భారతాంధ్రీకరణము కొన్నిచోట్ల కుదించుట, కొన్నిచోట్ల విస్తరించుట జరిగి చాలవఱకు స్వతంత్రముగా సాగినది. అతని యాంధ్రీకరణవిధానమును గూర్చి డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు తెలిపిన యీ వాక్యములు చూడుఁడు.

'ప్రధానముగా వ్యాసభారతమునందలికథనే యనుసరించినను ఎడనెడ దనకుఁ బూర్వముండిన సంస్కృతకర్ణాటకకవుల కావ్యములనుండి కూడఁ గొన్ని భావములను గ్రహించియు, కొన్నిచోట్ల సందర్భానుగుణముగా నూతనకల్పనలు గావించియు, ననుచితములని తోఁచిన యంశములను బరిహరించియుఁ, గొన్ని వర్ణనలు పెంచియుఁ, గొన్ని తగ్గించియు నాంధ్రభారతమును సర్వాంగ సుందరముగా వెలయించెను. అందుచేతనే యనువాద మనుపే రున్నను నతి స్వతంత్ర గ్రంథమువలెనే శోభిల్లుచు నన్నయ ప్రతిభావిశేషమును వేయివిధముల వెల్లడి చేయుచున్నది.'[౧౧]

నన్నయ సంస్కృతవ్యాకరణమర్యాదలను గొన్నింటిని దెలుఁగులోనికిఁ దెచ్చెను. ఉదా: 'ద్రోణుఁడు మఱి ద్రుపదుండు .... సఖు లయి ధనుర్వేద మగ్నివేశులతోడ నర్థిం గఱచి' (భార. ఆది. 7-5), అభిమన్యుఁడు ధౌమ్యుతో వేదము చదువుట -

ధనంజయునితో ధనుర్వేద మభ్యసించుట (భార. ఆది. 8-227)
వనచరభయంబువలన రక్షింప నోపమి (ఆది. 1-64)
వానివలన సురక్షితముగ జేసి చనుము (ఆది. 1-98)

---

౧౧. సమగ్రాంధ్రసాహిత్యము : పుట 125.

ప్రమద్వరను బంచత్వంబువలను బాపె (ఆది. 1-150)
అపాయంబులవలనం బాయుచు (ఆది. 3-15)
పాయంగ వలయు దాస్యమువలనన్ (సభా. 2-261)
ఆపదలవలనం బ్రజల సముద్ధరించిరి (ఆర. 1-39)
దురితంబులవలనం దొలంగుదురు (ఆర. 2-271)

నన్నయ తత్సమశబ్దముల నధికముగా వాడినను – సంస్కృతవ్యాకరణ మర్యాదల ననుసరించి సంస్కృతకారకానుగుణముగా నందందు వాక్యములను వెలయించినను – నతనిరచనమునందు తెలుఁగుసామెతలు, జాతీయములు కూడఁ గొన్నినెక్కొని కావ్య శోభాహేతువు లగుచున్నవి. 'కుంతికడుపు చల్లఁగాఁ బుట్టిన ఘనభుజుఁడు' (భార. ఆది. 6-19), వెదకంబోయినతీఁగ కాళ్లకుఁ దగిలినది అను సామెత రోయుతీగె కాళ్లం బెనగం దా ననుచు (భార. ఆది 5-220), అర్జునువలనిభయము సెడి రొమ్మునఁ జేయిడి నిద్రవోయె (ఆది. 6-63) అనుచో గుండెలమీద చేయి వేసికొని నిద్రించుట. వంటయింటికుందేలు అనుజాతీయము 'వంటయిల్కుందెలుసొచ్చె' (ఆది. 6 ఆ.) మొదలగు స్థలములలోఁ జక్కని తెలుఁగుసామెతలును, జాతీయములును నాతనిభారతమునఁ గానవచ్చుచున్నవి. కాని, యిట్టి సామెతలును, జాతీయములును నాతని రచనమునం దితరకవులతోఁ బోల్చినపుడు చాలఁ దక్కువ యనియే చెప్పఁదగును.

నన్నయభారతములోని యితివృత్తము సంస్కృత మూలకము. కాని యాంధ్రీకరణవిధానము మాత్రము స్వతంత్రము. తత్సమపదములప్రయోగ మం దధికము. మూఁడువంతులు సంస్కృతశబ్దములును, ఒకవంతు మాత్రమే తెలుఁగు శబ్దములును నాతని రచనమునందుఁ గాన నగును. సంస్కృతవ్యాకరణ సంప్రదాయములు, సంస్కృతకారకచ్ఛాయలుఁ గొన్ని యాతనికవిత్వమున గోచరించును. తెలుఁగు సామెతలను, జాతీయములను నాతఁడు ప్రయోగింపక పోలేదు కాని, వాని సంఖ్య యత్యల్పము. దేశివృత్తముల నధికముగా వాడి యుండినను సంస్కృతవృత్తముల నధికసంఖ్యతోఁ దనకవిత్వమునఁ జొప్పించి వానికిఁ బ్రాచుర్యము కల్పించెను. అతఁడవలంబించిన చంపూకావ్యపద్ధతి సంస్కృతముననుసరించినది. చంపూశబ్దము ద్రవిడభాషా పద మనియుఁ, జంపూకావ్యములు దండికంటె ముందు అనఁగా క్రీస్తుశకము ఏడవ శతాబ్దికి ముందు

ప్రాచీనసంస్కృతవమునఁ గాన వచ్చుట లేదనియు - గనుక నది దాక్షిణాత్యసాహిత్యమునకు సంబంధించిన సాహిత్యప్రక్రియ యనియుఁ గన్నడమున నీసాహిత్యప్రక్రియ తొలుత వెలయఁగా నందుండి నన్నయ దానిని గ్రహించెననియు శ్రీ నిడుదవోలు వెంకటరావుగా రభిప్రాయపడుచున్నారు.[౧౨]

నన్నయభారతమున నాతఁ డవలంబించిన సాంస్కృతికమయినశైలిని ఈక్రింది పద్యములయందుఁ జూడుఁడు:

శా. పాతాళైక నికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్ర దహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథుమనమున్ భీతిల్లెఁ గల్పాంతసం
జాతప్రోద్ధత బాడబానలశిఖా శంకాధికాతంకమై

మ. మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పద లోలిం గొని వచ్చి యిచ్చి ముద మొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయుల్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయుల్.

ఉ. దారుణ మై వృకోదరు గదాకులిశాహతి నన్యవాహినీ
వారణసంచయం బభినవక్షతశోణితధార లొప్ప సం
చారిత ధాతునిర్ఝరవిశాలశిలోచ్చయసంచయాభమై
వీరరణంబునం బడియె విక్షతహస్తివృక్ష పంక్తితోన్

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవ గంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములంబరపూరితంబులై

ఇట్లు నన్నయ్యవృత్తవచనము చాలవఱకు సంస్కృతసమాసఘటితముగా, సాంస్కృతిక మంయినశైలిలో సాఁగునను. అట్లయ్యును నాతఁడు కూడఁ బ్రసన్నతయు, జాతీయతయు వలయు చిన్ని చిన్ని పద్యములను రచించు సందర్భమున నలఁతియలఁతి తెలుఁగుపదములలో జానుతెనుఁగున గొన్ని పద్యములను రచింపక పోలేదు.

---

౧౨. చూ. తెలుఁగుకవుల చరిత్రము : పుట 107.

*ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు*
*బేల నీకుఁ జెప్ప నేల వలసెఁ*
*జిఱుతవాని కిట్టి తఱుసంటిపల్కులు*
*సన్నె వృద్ధజనము లున్నచోట*

*అఱపొఱడు కుఱుచచేతులు*
*నొఱవ శరీరమ్ము గలిగి యొరులకుఁ జూడం*
*గొఱ గాకుండియు మన్మధు*
*నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై.*

క. *ఒక్కొక కన్నును జెవియును*
*జెక్కను జను బొడ్డు మూఁపు చెలు వగుచేయుం*
*బ్రక్క యుఁ బిఱుఁదును గాలును*
*నక్కజముగ మనుజశకల మపు డుదయించెన్.*

ఇట్లు క్వాచిత్కముగా నన్నయ కొన్ని చిన్నిచిన్ని పద్యములను తేటతెనుఁగున రచించి యుండినను మొత్తముమీఁద నాతని శైలి మాత్రము సాంస్కృతిక మైనశైలి యనియే చెప్పఁదగును.

నన్నయభారతమునకుఁ దరువాత వెలసినగ్రంథము పావులూరి గణితము. దానికి సారసంగ్రహగణిత మను నొకనామాంతరము కలదు. అది క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దమున వెలసిన మహావీరాచార్యుఁడను జైనపండితుఁడు రచించిన 'గణితసారసంగ్రహము' అనుగ్రంథమునకుఁ దెలుఁగుసేఁత. రాజరాజనరేంద్రుని ధర్మమా యని పంచమ వేద మగుమహాభారతము తెలుఁగులోని కనూదిత మగుటచే నట్లే శాస్త్రీయగ్రంథములను సైతము తెలుఁగులోని కనువదించు కొనినచోఁ దప్పు లే దనుభావము తెలుఁగు కవులకుఁ గలిగి యుండును. తత్ఫలితముగాఁ దెలుఁగులోని కనువదింపఁబడిన తొట్టతొలుతటి శాస్త్రీయ గ్రంథ మిది. రాజరాజనరేంద్రునిచే 'నవఖండవాడ' యను నగ్రహారమును దానముగాఁ బడసిన మల్లన్నకు మనుమఁ డగుపావులూరి మల్లన దీనికిఁ గర్త. కనుక నితఁడు నన్నయభట్టారకునకుఁ దరువాత నించుమించుగా నేఁబదియేండ్లకు బిమ్మట జీవించి యుండు నని భావింపఁబడుచున్నది. దీనిఁబట్టి యితనికాలము క్రీ.శ. **1100** ప్రాంతము కాఁగలదు.

మహావీరాచార్యుని గణితసారసంగ్రహమున ౧. పరికర్మగణితము, ౨. భిన్నగణితము, ౩. ప్రకీర్ణగణితము, ౪. త్రైరాశికగణితము, ౫. మిశ్రగణితము, ౬. క్షేత్రగణితము, ౭. ఖాతగణితము, ౮. ఛాయాగణితము నని యష్టవిధగణితములు వివరింపఁబడి యున్నవి. కాని, తెలుఁగునందలి పావులూరిగణితములో నం దయిదవ దగు మిశ్రగణితమే సూత్ర, సంవర్గగణితములని రెండుగా విభక్తమయినది. సంస్కృతమున నెనిమిదివ్యవహారములలో నున్నగణితసారసంగ్రహము – తెలుఁగున మిశ్ర వ్యవహారము సంవర్గసూత్రగణితములుగా విభక్త మగుటచేఁ – దొమ్మిదివిధవము లయిన గణితములు గలది యగుచున్నది. నన్నయ తనభారతములోని కృత్యవతరణికలోఁ గృత్యాదిపద్యమును సంస్కృతశ్లోకముగా రచించినట్లే పావులూరి మల్లనయుఁ గృత్యాదిని సంస్కృతశ్లోకమునందే రచించి యున్నాఁడు. అంతేకాక యతఁడు ప్రతి యధ్యాయ ప్రారంభమునందును గూడ నొకసంస్కృతశ్లోకమును రచించి యున్నాఁడు. ఇది నన్నయకు విలక్షణ మయినపద్ధతి.

మఱియు నీ గ్రంథమునుగూర్చి వ్రాయుచు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ 'యాంధ్రకవుల చరిత్రము' లో నిట్లు వ్రాసియున్నారు.

'ఈ పావులూరి గణితము మహావీరాచార్యులవారి సంస్కృతగణితసార సంగ్రహమునకు భాషాంతరీకరణము. ఇందలి పద్ధతులు మాత్రమే పయిగ్రంథమునుండి తెలిఁగింపఁబడినవి కాని, లెక్కలన్నియు మల్లినార్యునిచేత స్వతంత్రముగాఁ గల్పింపఁ బడినవే.'

దీనినే యనువదించుచు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ 'తెలుఁగు కవుల చరిత్ర' లో మూలమునుండి పద్ధతులు, సూత్రములు గ్రహింపఁబడినవే కాని, యుదాహరణము లన్నియుఁ గవి స్వంతముగఁ గల్పించినవే యని వ్రాసి యున్నారు. కాని, పావులూరి గణితమును బరిశీలించి చూడఁగా పద్ధతులు, సూత్రములు మాత్రమే కాక యుదాహరణములుగా నిచ్చిన లెక్కలనుగూడఁ బెక్కింటి నాతఁడు తెలుఁగులోని కనువదించినట్లు తెలియుచున్నది. కొన్ని కొన్ని లెక్కలలో మూలములో నిచ్చినంత పెద్ద యంకెలనీయ లేదు. అందుకు బహుశః ఛందస్సు అడ్డు వచ్చి యుండును. లేదా యంతపెద్దలెక్క యిచ్చుటకంటె దానినే సూక్ష్మీకరించి చిన్నలెక్కగా నిచ్చి గణితవిద్యార్థులకు సుకరము చేయుటయాతని యుద్దేశ మయి యుండవచ్చును. స్థూలీపులాకముగాఁ జూచినపుడు తాను సొంతముగాఁ గల్పించినవానికంటే ననుసరించి రచించినవే యెక్కువగాఁ

గానవచ్చును. మఱియు నన్నయభట్టునకువలెనే యితఁడు కూడ మూలములోని పెక్కు శ్లోకములలోని విషయము నొక్కపద్యములోనికిఁ గుదించి రచింపఁ గలనేర్పు కలవాఁడు. మూలమున గణితశాస్త్రప్రాశస్త్యమునాతఁ డేడుశ్లోకములయందు వివరింపఁగా నితఁడు వానినెల్ల నొక్క శార్దూలములోనికిఁ గుదించెను. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమతెలుఁగుకవులచరిత్రలో నీ గ్రంథమునుగూర్చి యిట్లు వ్రాసిరి. 'ఇది యాంధ్ర జైనవాఙ్మయమునకు సంబంధించినది. ఆంధ్రజైన వాఙ్మయమునందలి కావ్యములు నశించినను శాస్త్రీయగ్రంథములు నిత్యవ్యవహారమున కుపయుక్తములగుటచే నిలిచినది.'

కాని, ఇది యథార్థము కాదు. పావులూరిగణితమునకును, జైనవాఙ్మయమునకును నెట్టి సంబంధమును లేదు. మూలకారుఁ డయిన మహావీరాచార్యుఁడు జైనమతావలంబకుఁ డగుటచేత గాఁబోలు శైవుఁ డయిన పావులూరి మల్లన్న తన గ్రంథమునం దాతని పేరైన నెత్తలేదు. మఱియు నితఁడు మూలములో 'జినభవనము' అని వ్రాసియున్న చోట్లను 'శివాలయములు' గా ననువదించి తన శైవమతాభిమానమును బ్రకటించుకొని యున్నాఁడు. జినభవనములను శివాలయములుగా మార్చి కూర్చుకొనినట్లే మూలములోని జైనతీర్థంకరులను శివుని యాత్మబంధువులుగా లెక్క యందు మార్చి ప్రదర్శించినాఁడు. ఇట్లు పావులూరి మల్లన[౧౩] 'పరతంత్రములో నే స్వతంత్రమును బ్రకటించి' నన్నయ యాంధ్రీకరణవిధానమునే యనుసరించిన వాఁ డయ్యెను. ఇట్టిది యొక వంక ననువాదగ్రంథ మయినను నాకాలమునందలి వివిధ మానములను, క్షేత్రగణితపద్ధతులను, సాంఘికవిశేషములను బ్రదర్శించుచుఁ దెలుఁగు దేశములోని గ్రామకరణములకు జిక్కని యుపయోగకారిగా నుండుచు వచ్చెను. అందుచేతనే నానాఁట నందుఁ బెక్కుప్రక్షిప్తములు చేరి పావులూరి మల్లన రచితమగు గ్రంథభాగ మిది యని వేర్పఱుప వీలు లేనంతగాఁ బెరిగిపోయినది. ఇట్టిది యనువాద గ్రంథముగా నుండుచునే తెలుఁగుదేశమునకు సంబంధించిన కొలఁతలు, సాంఘికపరిస్థితులు, మొదలగువానిని దెలుపుచుఁ బ్రజలకు సన్నిహితము కూడ నయినది. కవిత్వ విషయకముగా నన్నయభారత మాంధ్రులకు స్వతంత్రకావ్యముభాతి భాసించి పరమ పూజ్య మయినట్లే యీ పావులూరి గణితము శాస్త్రవిషయమునగా నాంధ్రులకుఁ జాలకాలము వఱకుఁ బరమాదరణీయ మయిన ప్రామాణికశాస్త్రగ్రంథముగా వెలయుచు వచ్చినది.

౧౩. సుమగాంధ్రసాహిత్యం : శ్రీ ఆరుద్ర : పుట 150.

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారీగ్రంథము క్రీ.శ. **1158–1195** సంవత్సరముల నడిమికాలమున రచితమైయుండవచ్చునని యభిప్రాయ పడుచున్నారు.[౧౪] దానికి వారు చూపినహేతువులు : ౧. నవఖండవాడ క్రీ.శ. **1186**లోఁ గుంతీమాధవ స్వామి కర్పితమై యుండుట. ౨.పద్యమునందలి రాజరాజు, రాజరాజనరేంద్రుఁడే యని నిర్ధరించుటకు వీలులేక పోవుట. ౩. కన్నడమున రాజాదిత్యు డనురాజకవి క్రీ.శ.**1120** ప్రాంతమున రచించిన రాజాదిత్యగణితమునందలి పద్యములు కొన్ని పావులూరిగణితమున ననుకరింపఁబడి యుండుట. ౪. కొన్ని ప్రతులలో నొకపద్యమునఁ బ్రతాపరుద్రునిపేరు ప్రస్తావింపఁ బడి యుండుట. ౫. క్రీ.శ. **1145**లో గోపరాజు రామన నియోగులకుఁ గరణీకవృత్తులనేర్పాటు చేసి యుండుట.

తొలుతఁ జెప్పినట్లు పావులూరి గణితమునఁ బెక్కు ప్రక్షిప్తములు చేరుట కెక్కువ యవకాశ ముండుటచే రాజాదిత్యగణితానుకరణములును, ప్రతాపరుద్ర ప్రస్తావము కల పద్యమును జేరి యుండుటవకాశ మున్నది. గ్రంథరచనమునకును – కరణిక నియోగమునకును సంబంధముండ వలసినయవసరము లేదు. కనుకఁ బెక్కురు పండితులయభిప్రాయము ప్రకారము పావులూరి మల్లన్న క్రీ.శ. **1100** ప్రాంతమున నన్నయభట్టారకుని కించుమించుగా నేఁబదియేండ్లకాలమున జీవించి యుండు నని తలఁప దగును. అట్లుకాక, నిడుదవోలువారి యభిప్రాయము ప్రకారము పావులూరిగణితము **1158–1195** నడిమికాలమున రచితయిన దని భావించుచో నప్పుడది యించుమించుగా పాల్కురికి సోమనాథునికి సమకాలమునందు రచింపఁబడిన గ్రంథ మగును. అధిక సంఖ్యాకు లగుపండితుల యభిప్రాయము ప్రకారము పావులూరి మల్లన క్రీ.శ. **1100** ప్రాంతమునకుఁ జెందినవాఁ డనియే మనము భావింప దగును.

సోమనాథునికిఁ బూర్వము వెలసినయాంధ్రగ్రంథములలోఁ బావులూరి గణితమునకుఁ దరువాతఁ బేర్కొనఁదగిన గ్రంథము కవిజనాశ్రయము. తెలుఁగున వెలసిన ఛందోగ్రంథములలో నీ కవిజనాశ్రయము మొట్టమొదటిదిగాఁ గానవచ్చుచున్నది. తెలుఁగుభాషయందు వెలసిన మొదటి లక్ష్యగ్రంథము మహాభారతము కాఁగా, మొదటి లక్షణగ్రంథము కవిజనాశ్రయము. దీనికర్తృత్వమునుగూర్చి పండితలోకమున భిన్నాభి ప్రాయము లున్నవి. దీనిని వేములవాడ భీమకవి రచించినట్లు ప్రతీతి. గ్రంథాంతమునఁ గలగద్యలోఁ దత్కర్తకుఁ

౧౪. తెలుఁగుకవులచరిత్రము : శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు : పుట *283*.

గలబిరుదములును, నాతని గురువు యొక్క నామధేయమును బేర్కొనఁ బడి యున్నవే కాని కర్తపేరు తెలుపఁబడ లేదు. ఆగద్యకుఁ బూర్వము కలకంద పద్యమునందు 'మల్లియరేచన సుకవిజనాశ్రయుఁ డీఛందముఁ జెప్పె' ననియు - గ్రంథారంభమునందలి మూఁడవపద్యమున 'కవిజనాశ్రయుఁడు మల్లియ రేచనసుకవి కవిజనాశ్రయ మనుఛందము దెనుఁగుబాస నరుదుగఁ జెప్పెన్' అనియు నుండుటచే మల్లియ కుమారుఁ డయిన రేచన కవిజనాశ్రయమునకుఁ గర్త యని తెలియుచున్నది. గ్రంథమునం దచ్చటచ్చట 'మల్లియ రేచా' యనుసంబోధన ముండుటనుబట్టి కూడ నాతఁడాత్మ సంబోధనముఁ గావించుకొని కొన్ని పద్యములు రచించియుండ వచ్చు ననియు, మల్లియ రేచనయే తత్కర్త యయి యుండు ననియు విశ్వసింపఁ దగి యున్నది. అతనికిఁ గలకవిజనాశ్రయమను బిరుదమునుబట్టియే యాగ్రంథమునకుఁ గూడఁ గవిజనాశ్రయ మనుపేరు పెట్టఁబడి యుండుట కూడ సంభావ్యమే. ఇది యిట్లుండఁగా భీమకవియే యాగ్రంథమును రచించి ద్రవ్యలోభముచే రేచపేరు పెట్టి యుండు నని కొందఱు తలఁచుచున్నారు. అట్లు తలఁచుట కవకాశ మిచ్చుపద్యములు కూడఁ గొన్ని యందుఁ గలవు. కాని, భీమకవికిఁ గర్తృత్వము నంటఁగట్టునుద్దేశముతో నెవరో యా పద్యముల నందుఁ జేర్చి యుండుట కూడ సంభావ్యమే. ఇది కాక, వేములవాడ భీమ కవిని స్తుతించిన శ్రీనాథాదు లెవ్వరు కాని యాతఁడు ఛందోగ్రంథకర్త యని కాని, కవిజనాశ్రయకర్త యనికాని చెప్పి యుండలేదు. దీనిఁబట్టి కవిజనాశ్రయకర్త వేముల వాడ భీమకవి కా దనియు, మల్లియ రేచన యయి యుండుననియుఁ దలఁపఁబడు చున్నది.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రాజరాజనరేంద్రపట్టాభిషేకసంచికలో 'నన్నయకుఁ బూర్వము ఛందస్సు' అనునొక వ్యాసము వ్రాయుచు నందుఁ గవిజనాశ్రయము రేచనకృతమనియు, నది క్రీస్తుశకము పదునొకండవశతాబ్దికిఁ దరువాతిది కాదనియుఁ దెలిపి యున్నారు. వారి యా వ్యాసమునందలి వాక్యము లను దిలకింపుఁడు.

'ద్రావిడభాషలో 'యాప్పిరంగలమ్' అను ఛందోగ్రంథము పదునొకొండవ శతాబ్దిది కలదు. అందు సంస్కృతకర్ణాటాంధ్రఛ్ఛందస్సు ప్రస్తావ మున్నది. '**వాంచి యార్ శెయ్‌ద వడఘుచందవుం**' అని యందున్నది. అనఁగా వాంచియ రచించినట్లు గ్రంథకర్త చెప్పుకొనుటలోఁ గలదు ... ప్రాచీనలిపిరీతిని బరిశీలించినవారు 'వాంచియార్' అనుపదము 'రేచియార్' గా నుండఁదగుననిరి.

కొన్ని సంస్కృతశబ్దములు కూడ నిం దట్లే వికృతిని బొరసియున్నది. రేచియార్ అని యగునేని యాగ్రంథము (రేచియ) రేచన రచించిన కవిజనాశ్రయ మగును. ఆద్రవిడగ్రంధకర్త జైనుఁడు. ఈ రేచియ యును జైనుఁడే. ఇది యొకపొందిక యగును. ఇట్లగు నేని కవిజనాశ్రయము పదునొకండవ శతాబ్దికిఁ దర్వాతిది కాక పోవును.'[౧౫]

రేచియ (రేచన) యాప్పిరంగలమ్ కర్తకుఁ బూర్వుఁ డగుటచే క్రీ.శ. పదునొకండవశతాబ్ది లోనివాఁడు. అనఁగా నతఁడు నన్నయకు సమకాలికుఁడో యించుక తరువాతివాఁడో కాఁదగును. ఇతని కాలమును నిర్ణయించుటకు మఱికొన్ని యాధారములు కూడఁ గానవచ్చుచున్నవి.

కన్నడభాషలోఁ గవిర్జాజకులహంస యనెడి బిరుదము వహించిన నాగవర్మ యను కవీంద్రుడు 'ఛందోంబుధి' యను నొక ఛందోగ్రంథమును రచించి యున్నాఁడు. అతఁడు క్రీస్తుశకము పదియవశతాబ్ది తుదిపాదమున నుండినవాఁడు. అతని ఛందోంబుధి యాఱుప్రకరణములుగా విభజింపఁబడి యున్నది. కవిజనాశ్రయమునం దయి దధికారములు కలవు. ఈరెండుఛందోగ్రంధములకును విషయవిభాగమునందును, నింకను బెక్కువిషయములయందును సాదృశ్యము కానవచ్చుచున్నది. దీనికిఁ గల సాదృశ్యములను శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు తమ తెలుఁగుకవుల చరిత్రమునఁ జూపి యున్నారు.[౧౬] ఇది కాక నాగవర్మ తన 'ఛందోంబుధి' యందు నుతించిన 'జయదేవాద్యరఛందము'ను రేచన కూడఁ దన గ్రంథాంతమునఁ బ్రస్తుతించి యున్నాఁడు. ఇందుచే రేచన పదియవశతాబ్ది తుదిపాదమునకుఁ జెందిన నాగవర్మ ననుసరించి యుండె ననియు, నాతనికిఁ తరువాతికాలమునకుఁ జెందినవాఁ డనియు విశద మగుచున్నది.

మఱియుఁ గవిజనాశ్రయమునందలి దోషాధికారముమొదట 'శ్రీ శ్రితవక్షు' ఁ డిత్యాదిగా నొక కందపద్యము కలదు. అదేపద్యము నన్నెచోడుని కుమారసంభవము నందలి సప్తమాశ్వాసప్రారంభమునఁ గొలఁది మార్పులతో ననుసరింపఁ బడి యున్నది. నన్నెచోడుఁడు క్రీస్తుశకము పండ్రెండవశతాబ్ది పూర్వార్ధమున నుండినట్లు విమర్శకులు పలువురు విశ్వసించుచున్నారు. అందుచే గవిజనాశ్రయకర్త యగుమల్లియరేచన్న కన్నడ 'ఛందోంబుధి'ని రచించిన నాగవర్మకును, నన్నెచోడునికిని నడిమికాలమున నుండి నట్లు నిశ్చయింపఁ దగి యున్నది.

---

౧౫. రాజరాజనరేంద్రపట్టాభిషేక సంచిక. పుట 30.

౧౬. చూ. తెలుఁగుకవులచరిత్రము. పుటలు 173-174.

మఱియుఁ గవిజనాశ్రయమునందలి గద్యమునుబట్టి తత్కర్త – రేచన – వాదీంద్రచూడామణి యనునాతనికి శిష్యుఁ డని తెలియుచున్నది. అది బిరుదునామమో లేక స్వీయనామమో చెప్పుటకు వీలు లేదు. కుమారసంభవకృతిపతి యయిన జంగము మల్లికార్జునుఁడు వాదీంద్రుఁ డనునాతనిని వాదమున నోడించినట్లు కుమారసంభవము లోని నవమాశ్వాసాంతమున నున్న యొకపద్యమునందలి 'పరవాదీంద్ర ఘనానిలుఁ' డనువిశేషణమునుబట్టి ధ్వనించుచున్నది. ఇదియు రేచన క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దిలో యుండె ననువిషయమునే నిర్ధరించుచున్నది.

కాని, శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి గారు 'తెలుఁగుతొలికావ్యము కవిజనాశ్రయము' అని భారతి (1959 అక్టోబరునెలసంచిక) లో నొకవ్యాసము వ్రాసి యందు వేంగీచాళుక్యులలో దానార్ణవుఁ డనురాజు క్రీ.శ. 956-972 మధ్యకాలమున నుండి జైనమతము నవలంబించె ననియు, నతఁడు శ్రావకాభరణుఁ డయిన రేచనతో సహకరించి కవిజనాశ్రయమును బూర్తి చేయించె ననియు నందుచే రేచన క్రీ.శ. 956-972 మధ్య కాలమునకుఁ జెందినవాఁ డనియు నొక నూతనవాదమును బ్రతిపాదించిరి. కవిజనాశ్రయములోని పద్యములలో నొకదానియందుఁ గల 'విమల' పదము విమలాదిత్యుని – మఱొకదానియందుఁ గల 'దాన' పదము దానార్ణవుని సూచించుననియు, నది గూఢ కవిత యనియు వారి వాదము. కాని, యీనూతనవాదము నెవరు గాని యామోదించి నట్లు కానరాదు. ఇంతకు మునుపు చూపిన యితరము లయిన యాధారములను బట్టి మల్లియ రేచన క్రీ.శ. 1100 ప్రాంతమువాఁ డనియే పెక్కురు విద్వాంసులు విశ్వసించుచున్నారు.

కవిజనాశ్రయ మను నీ ఛందోగ్రంథమునకు క్రీ.శ 517 ప్రాంతమునకుఁ జెందిన విష్ణుకుండిన మాధవవర్మ రచించిన 'జనాశ్రయి' యనుఛందోగ్రంథము మూలము. ఇందు మాత్రాచ్ఛందస్సులలోని వగు రగడలనుగూర్చి యెట్టి ప్రస్తావము కాని లేదు. ఆకాలమునాఁటికిఁ దెలుఁగు కావ్యములలో నది రచింపఁబడక పోవుటయే యందులకుఁ గారణమయి యుండు నని యూహింపఁబడుచున్నది. నలనామకగణములు, గీతియలు, అక్కరలు మొదలగు ప్రాచీనాంధ్రచ్ఛందోవిశేషము లిందుఁ దెలుపఁబడినవి. అలంకార శాస్త్రవిషయ మగుదోషాధికారము కూడ నిందుఁ జేర్పఁబడి కావ్యదోషముల గూర్చి యందుఁ దెలుపఁబడియున్నది. రేచన తన కాలములోని పాటలఁ బాడు నపుడు తాళమునకొఱకై పాటలలోని

హ్రస్వములను దీర్ఘములుగాఁ జేసి పాడుట నాతఁడు గమనించి యుండును. అందుచేతనే యాతఁడు దోషాధికారములో 'చెఱకువిలు', 'వివాహులు' అని హ్రస్వములను దీర్ఘములు చేసి పలుకుట నొకదోషముగాఁ బేర్కొని దానిఁ బరిహరింప వలె ననెను.

ఈగ్రంథమునందలి పద్యములు చాలవఱకుఁ గంద పద్యము లయియుండుట ముఖ్యముగా గమనింపఁ దగి యున్నది.

ఇంక సోమనాథునికిఁ బూర్వము వెలసినకావ్యములలో నన్నెచోడుని కుమార సంభవము పేర్కొనఁదగినది. కాని, యీనన్నెచోడునికాలమును గుఱించి గూడఁ బరిశోధకులలో భేదాభిప్రాయము లున్నవి. కుమారసంభవమును దొట్టదొలుత వెలుగులోనికిఁ గొనివచ్చిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుఁడు క్రీ.శ. **940** ప్రాంతమునకుఁ జెందినవాఁ డని యభిప్రాయపడిరి. వారి ననుసరించి శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారును, డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య గారును నన్నెచోడుఁడాకాలమునకే చెందినవాఁ డని విశ్వసించుచున్నారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, శ్రీ జయంతి రామయ్యపంతులుగారు నతఁడు క్రీ.శ. **1120** ప్రాంతమువాఁడు కాఁ దగు నని యభిప్రాయపడుచుండఁగా శ్రీ నిడుదవోలు వెంకటరావుగా రతఁడు క్రీ.శ. **1130–1150** ప్రాంతమున జీవించియుండు నని యభిప్రాయపడుచున్నారు.[౧౨] శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు నన్నెచోడుఁడు క్రీ.శ. **1160–1170** ప్రాంతమునకుఁ జెందినవాఁ డని విశ్వసించుచున్నారు. శ్రీ చాగంటి శేషయ్యగారు నన్నెచోడుఁడు నన్నయకు సమకాలికుఁ డనియు, ననఁగా క్రీ.శ. **1027–1078** ప్రాంతమువాఁ డనియుఁ దలఁచుచున్నారు. శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు కుమారసంభవరచనము క్రీ.శ. **1053** మార్చినెల 30వ తేదికి సరియయిన విక్రమార్కశకము **1110** విజయసంవత్సరము చైత్రశుద్ధ అష్టమి జయవారము నాఁడు సమాప్తమయి యుండు నని యూహించుచున్నారు. శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు నన్నెచోడుఁడు క్రీ.శ. **1325** ప్రాంతమువాఁడు కాఁ దగు నని తమ 'కుమారసంభవవిమర్శనము' అను గ్రంథమునఁ గొన్ని యుపపత్తులను జూపి నిర్ణయించుటకుఁ బ్రయత్నింపఁగా నిటీవల శ్రీ వేదము వెంకటరాయశాస్త్రి

౧౨. చూ. తెలుఁగుకవులచరిత్రము: శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు: పుట 200.

గారు వారివాదమునే బలపఱుచుచు నన్నెచోడుండు తిక్కనకు ముందుకాలమున నుండుట కాస్కారము కనిపింప దనియు, నతనికిఁ తరువాతికాలమువాఁడే కాఁదగు ననియు, నతఁడు క్రీ. శ. 1300 ప్రాంతములకుఁ జెంది యుండు ననియుఁ దమ 'నన్నెచోడుని కవిత్వము' అను గ్రంథమునందు సిద్ధాంతీకరించిరి. ఇట్లు నన్నెచోడునికాలమునుగూర్చి పండితలోకమునఁ బెక్కువాదము లున్నను నతఁడు నన్నయ తిక్కనల నడిమికాలమున జీవించియుండునని యే పలువురువిద్వాంసులభిప్రాయపడుచున్నారు. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారు, డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు, (శ్రీ) నిడుదవోలు వెంకటరావుగారు మొదలగు విద్వాంసులు నన్నెచోడుఁడు నన్నయ తిక్కనల నడిమికాలమునకుఁ జెందినవాఁ డను వాదమునే సమర్థించుచున్నారు. ఇట్లితనికాలమునుగూర్చి బహుజనాంగీకృత మయిన యొకనిర్ణయమునకు వచ్చినపిమ్మట నితనికావ్యములోని కవిత్వాదిక మగు విషయమును గూర్చి యించుక పరిశీలింతము.

కుమారసంభవము పండ్రెండాశ్వాసములు కల రసవత్తర మగుకావ్యరాజము. అందలివస్తువు పురాణమౌలికము. శివపురాణము దానికి మూలగ్రంథమే యనఁదగి యున్నను నందలి కథాసంవిధానము, సన్నివేశసందర్భము మూలానుసారులు కావు. కాళిదాసు కుమారసంభవ మితనికుమారసంభవములో నేకదేశము మాత్రమే. ఉద్భటుని కుమారసంభవమునుండి యీతఁడు కొన్నిభావములను గ్రహించి యుండక పోలేదు. శివపురాణము, కాళిదాసు కుమారసంభవము, ఉద్భటుని కుమారసంభవము నను గ్రంథముల నెల్ల నవలోకించి, యందలి విషయముల నెల్లనాకళింపునకుఁ దెచ్చుకొని యాతఁడు దనకావ్యమునకు స్వతంత్రముగా నొకకథాసూత్రమును బరికల్పించుకొని యాకథాసూత్రముబడిఁ గావ్యరచనముఁ గావించినాఁడు. ఇందుచే మూలకథకు భిన్నము లయిన కూర్పు లితని గ్రంథమున నందందుఁ గాన వచ్చును. మూల కథకు భిన్నముగా నీతఁడు కావించిన మార్పుకూర్పు లెల్ల నాతఁడుద్దేశపూర్వకముగా జేసినదియు, నొకకొన్ని కావ్యప్రయోజనముల సాధించునవియు నయి యుండును. కుమార సంభవములోని ద్వితీయాశ్వాసమునందలి దక్షాధ్వరధ్వంస మను కథాఘట్టము మూలకథకు భిన్నముగాఁ గావించినట్టిదే.

నన్నయభారతమువలెనే యిది చంపూకావ్యపద్ధతిని రచింపఁబడినది. ఛందోవిషయముగాఁ జూచినపు డితఁ డీకావ్యమున రచించిన 2005

గద్యపద్యములలో నైదింట నొకభాగము వచనమును – నాలుగుభాగములు పద్యములును గలవు. నన్నయకవిత్వమున సగభాగము వచనముగాఁ గానిపించుచున్నది.[10] ఆ పద్యములలోఁ గూడ సంస్కృతవృత్తములు 454 – దేశిచ్ఛందస్సునకుఁ జెందిన జాత్యుపజాతులు 895 కలవు. ఇతనికవిత్వమునఁ గూడ దేశివృత్తముల సంఖ్యయే అధికముగ నున్నను నన్నయ కవిత్వ మునందువలెనే యితఁడును సంస్కృత వృత్తములకుఁ బ్రాచుర్యము కల్పించె ననువిషయ మాతఁడు వాడిన సంస్కృతవృత్తములసంఖ్యనుబట్టి తెలియుచున్నది. మొత్తము గద్య పద్యములలో నైదవవంతు కందపద్యములు కలవు. నన్నయరచనములోను కందపద్యములే యధికముగాఁ గలవు. కవిజనాశ్రయమునను గందపద్యములే యధికము. దీనిఁబట్టి దేశిచ్ఛందములలోఁ గందపద్యమునే యాదికాలపుఁ దెలుఁగుకవు లభిమానించు చుండి రని విశదమగుచున్నది.

ఇతివృత్తము, కావ్యప్రక్రియ, కవిత్వవిధానము నను విషయములందు మార్గపద్ధతినే యవలంబించినను నితఁడు తెలుగు కవిత్వమునఁ దొలిసారిగా దేశిపద్ధతివైపు మొగ్గు చూపి యందందు గొన్ని దేశిసంప్రదాయములను నెలకొల్పెను. అందలి గజాననజన్మవృత్తాంత మితనిదేశీయాభిమానమును వ్యక్తము చేయును. అది శివుడే త్రిమూర్తిత్వమును బొంది విశ్వసృష్టికిఁ గారణభూతుఁ డయ్యె నను శివపురాణ కథను సంగ్రహించి దక్షుఁ డాదిశక్తిపరమేశ్వరుల నావాహనము చేసి వారిని మిథునచర్యాసక్తికిఁ బురికొల్పఁగా వారు కరికరిణీరూపములను దాల్చి క్రీడించినపుడు వారికి గజాననుఁడు జన్మించినట్లు దభివర్ణింపఁబడినది. ఈ వృత్తాంతము శివపురాణము నందీరీతిగా లేదు. ఈకథ యిట్లే ప్రాచీనతమిళ గ్రంథముల యందుఁ బ్రసిద్ధ మై యుండఁగా నతఁడు దానిని దక్షిణదేశీయగాథల నుండి సంగ్రహించి యుండును. తమిళవాఙ్మయమున క్రీస్తుశకము ఏడవశతాబ్దియందు రచింపఁబడిన 'తేవార' మనుగ్రంథమునం దీవిషయము సూచింపఁబడినది. ఇట్టి దేశీయతాలక్షణములు కుమారసంభవమునందు మరికొన్ని కూడఁ గలవు. సంస్కృతకవుల గ్రంథములలోని మేలిభావమును గ్రహించి తమకావ్యమును వానిచే నలంకరింపఁ జేసికొనినన్నెచోడుఁడు తమిళకన్నడభాషల నుండియుఁ గొన్ని విషయములను బరిగ్రహించెను. తమిళభాషా పదములను, కన్నడపదములను, పదబంధములను నీతఁడు తనకావ్యమునందుఁ బ్రయోగించి యుండెను. భాషావిషయకముగా నితఁడు

---

10. తెలుఁగుకవులచరిత్రము : పుట 225.

'జానుతెనుఁగు'నఁ దనకావ్యమును రచించునట్లు కావ్యావతారికయందుఁ జెప్పుకొని యున్నాఁడు. తమిళకన్నడపదములను, నట్లే రుచికరము లయిన తెలుఁగుపదములను, పదబంధములను నితఁడు తనకావ్యమునందు విశేషముగాఁ బ్రయోగించి యున్నను నితని కవిత్వము సంస్కృతప్రచురముగానే సాఁగె ననియు – ఇటనికాలమునఁ గవిత్వము నందు జానుతెనుఁగు ప్రయోగ మొకయాదర్శము మాత్రముగానే యుండిన దనియు నాజానుతెనుఁగు రచనము సోమనాథుని కవిత్వమునందుఁగాని చక్కఁగా రూపు దిద్దుకొన లేదనియుఁ దలఁపఁ దగి యున్నది. ఇతనికావ్యమునందు నన్నయలోకంటె నధికముగా సామెతలును జాతీయములును బ్రయోగించి యుండుట యీతని దేశిరచనాభిమానమునే ప్రకటించుచున్నది. కనుక నితనికవిత్వము దేశిపాలు కొంత యెక్కువగా నున్న మార్గకవిత్వమనియే తలఁపఁదగి యున్నది. దేశికవిత్వవిషయమున నితనిగ్రంథమునఁ గొంతప్రాథమికప్రయత్నము మాత్రమే జరగిన దని చెప్పవచ్చును.

ఇతని కవిత్వమునందలి 'జానుతెనుఁగు'ను గూర్చి పరిశోధకులు తెలిపిన యభిప్రాయముల నిటఁ బరిశీలింపఁ దగి యున్నది.

'నన్నెచోడుఁడు సోమనాథునివలెనే తనకుమారసంభవమున జానుతెనుఁగు మయి పలపును బ్రకటించి యున్నాఁడు. ఇతనిగ్రంథము సోమనాథునికిఁ బూర్వము రచింపఁబడినను, తరువాతఁ గూర్పఁబడినను నదికూడఁ బండితజనైకవేద్య మగు ప్రౌఢ ప్రబంధ మయి యున్నది. ఎడనెడ నందు జానుతెనుంగుసంతన బెడంగు కొని యున్నను మొత్తముమీఁద దానియందుఁగూడ గీర్వాణాతిశయమే కానగును' అని శివశ్రీ బండారు తమ్మయ్యగారు తమ 'పాలకుఱికి సోమనాథకవి' యను గ్రంథమునఁ దెలిపి యున్నారు.[౧౯] శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు 'నన్నెచోడుఁడు, పాల్కురికి సోమనాథుఁడు జానుతెనుఁగుననే కవిత్వము చెప్పిరి. 'సరళము గాఁగ భావములు జానుతెనుంగున' అని నన్నెచోడుఁడును – 'జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు' ననియు నారూఢగద్యపద్యాది ప్రబంధ పూతసంస్కృత భూయిష్ఠరచనవమానుగా సర్వసామాన్యంబుగావి .. జానుతెనుఁగుననే యుత్తమకవితావిశేషములఁ జూపియు సోమనాథుఁడును జానుతెనుఁగును విశేషముగా గౌరవించిరి.'[౨౦] అని తమ 'తెలుఁగు

౧౯. చూ. పుట 148.

౨౦. చూ. తెలుఁగుకవుల చరిత్రము పుట 217.

కవులచరిత్రమున వ్రాసి యున్నారు. ఈయుభయుల యభిప్రాయములలోను శివ(శ్రీ) బండారు తమ్మయ్యగారి యభిప్రాయమే సమంజసమై, సత్య సమ్మతమై యున్నది. నన్నెచోడునికావ్యమునందు జానుతెనుఁగువిషయమై ప్రసక్తి యున్నను నందుఁ బ్రాథమికప్రయత్నము మాత్రమే జరిగినదనియు – సోమనాథుని రచనమున నాయాదర్శము సఫలీకృతమయ్యె ననియు మనము విశ్వసింపఁదగి యున్నది.'

నన్నెచోడుని కుమారసంభవమునకుఁ దరువాతఁ బేర్కొనఁ దగిన గ్రంథరాజము శివతత్త్వసారము. మల్లికార్జునపండితుఁడు దీనికిఁ గర్త. ఇతనిచరిత్రమునే పండితారాధ్య చరిత్రము అనుపేరఁ బాలకుతికి సోమనాథుఁడు ద్విపదకావ్యముగా సంతరించెను. అతఁడు వీరమాహేశ్వరాచారమార్గానుసారి యై 'కేవలభక్తి గతి' ప్రతిష్ఠించుటకై శివతత్త్వసారమును రచించినట్లు పాల్కురికి సోమనాథుఁడు పేర్కొనియున్నాఁడు. (శ్రీ) ఆరుద్రగారు సెలవిచ్చినట్లు 'వాస్తవమునకు శివతత్త్వసార మానాఁటి శివభక్తుల మాన్యువల్'. నేఁటి యతి వాదకమ్యూనిస్టుపక్షమువారి క్రమశిక్షణప్పత్రివంటిది. ఈ గ్రంథమును జక్కఁగాఁ బరిష్కరించి విపులమయినపీఠికలో మొట్టమొదటగా (శ్రీ) కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు గారు ఆంధ్రసాహిత్యపరిషత్తువారి యాజమాన్యమునఁ బ్రకటించిరి. పండితారాధ్యునికి సమకాలికు లగు వెలనాటి చోడుఁడు **(1163–1180)**, ఉదయావనీశుఁడు **(1162)** ప్రాంతములందు జీవించి యుండఁ దగు నని (శ్రీ) కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు తమ శివతత్త్వసారపీఠిక యందుఁ దెలిపిరి. (శ్రీ) నిడుదవోలు వెంకటరావుగారు తమ తెలుఁగు కవుల చరిత్ర ప్రారంభమున నొసఁగిన సూచికలో నాతనికాలము క్రీ.శ. 1150 ప్రాంతమని సూచించిరి. ఇట్లతఁడు నన్నెచోడునికి సమకాలికుఁడో, ఒకించుక తరువాతివాఁడో యగుచున్నాఁడు. సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రమునందుఁ బండితయ్య వ్రాసిన కృతులను బెక్కింటిని వివిధప్రకరణములలో వివిధ స్థలములయందుఁ బేర్కొని యున్నాఁడు. అతఁ డాగ్రంథమునం దక్కడక్కడఁ బేర్కొనినవాని నన్నిటిని గ్రోడీకరించినచో నాతని రచనములు నలుపదినాలుగుదాఁక నున్నట్లు తేలునని (శ్రీ) ఆరుద్రగారు వ్రాయుచున్నారు. వాని సంఖ్య యెంత యయినను నాతనిగ్రంథముగా మనకు లభించి యున్నది యొక్క శివతత్త్వసారము మాత్రమే. అతని యితరరచనములను గుఱించి కూడఁ గొంతకుఁ గొంత తెలిసికొనుట కం దాస్కారము లేక పోలేదు. చందవోలు రాజగు వెలనాటి చోడుని సభలోఁ బండితుఁడు సర్వమతములవారి వాదములను ఖండించి,

యనేక ప్రతిజ్ఞలు గావించి, రుద్రముహిమ యనుకృతి నవల రచించిన ట్లుందు గలదు. చందవోలులో నున్నప్పుడు లింగోద్భవదేవునిపై 'లింగోగద్యవగద్య' ను రచించె నఁట. అమరావతిఁ జేరినపిదపఁ బండితుఁడు శివనింద వినిన పాపమును, ఘోడునితో సంభాషించిన పాపమును బోవుటకు 'సహస్రగణనామసంకీర్తనము' c గావించెను. మఱియు నచ్చట నుండఁగనే యాతఁడు 'అమరేశ్వరాష్టకము' అను కృతిని గూడ రచించినట్లు తెలియుచున్నది.

*'క్రమమున దశాధ్వరంబు వ్యాప్తి*
*కమును గణాంబరము శాంబరంబు*
*నొత్తిలి చదువుచు నుబ్బుచుఁ జనుచు*
*నత్తఱి భట్టు గై వారముల్ సేయ*
*శ్రుతిపంచగద్యముల్ రుద్రమహిమయు*
*శతకంబు శివతత్త్వసార మాదిగను'*

లనుచోఁ బేర్కొనఁబడిన దశాధ్వరము, గణాడంబరము అనునవి శివతత్త్వసారములోనే యంతర్భాగములుగా నున్నవి.

శివతత్త్వసారమునందు నాలుగువందలయెనుబది తొమ్మిది (**489**) కంద పద్యము లున్నవి. శతకమున సంఖ్యానియమములను, మకుటనియమమును నుండవలెను. ఈరెండు నియమములును నిందుఁబాటింపఁబడక పోవుటచే నిది శతకము కాదనియు, నతఁ డివి కాక మఱికొన్ని పద్యములను గూడ రచించి యుండు ననియుఁ గొందఱు విద్వాంసు లభిప్రాయపడుతున్నారు. వానిలో **191** పద్యములు కసలు మకుటములే లేవు. తక్కిన **298** పద్యములకు వివిధము లగుమకుటములు గలవు. వానిలో 'శివా' యనునమకుటమే యెక్కువ పర్యాయములు వాడఁబడి యున్నది. 'ఇట్లిందుఁ గొన్నిచోట్ల శతకలక్షణము కానరాకున్నను మొత్తముమీఁద నిది శతకమనియే చెప్పవచ్చును' అని శ్రీ కొవ్వలి లక్ష్మణ వెంకటలక్ష్మణరావుగారి యభిప్రాయము. శ్రీ వేదము వెంకటకృష్ణశర్మగారు కూడ నట్లేయభిప్రాయపడుచున్నారు. కాని 'శివతత్త్వసారము వాస్తవానికి శతకం కాక పండితయ్యగారి వివిధరచనల సముచ్చయంకింద మనకు లభించిం దనుకోవాలి' యని శ్రీ అరుద్రగారు వ్రాయుచున్నారు.[20]

20. సమగ్రాంధ్రసాహిత్యం. పుట *241*.

ఇది పూర్తిగాఁ గందపద్యములలో రచింపఁబడిన గ్రంథ మనుట గమనింపఁదగిన విషయము. కందము జాతులలోఁ జేరినపద్యము. కన్నడమునఁ బ్రాచీనరచనము లగు 'చెత్తాణి, బెదండె' యనుకావ్యభేదములందుఁ గందపద్య బాహుళ్యమున్నట్లు తెలియుచున్నది. కన్నడకవిరాజమార్గమునఁ గొన్నివృత్తములును, గీతికలును నున్నను నందుఁ గూడఁ గందపద్యముల సంఖ్యయే యధికము. క్రీ.శ. 980 ప్రాంతమున నుండిన అయ్యనభట్టు రచించిన 'ఆరుంబాక' శాసనకావ్యములో సంస్కృతశ్లోకముల మధ్యఁ దెలుఁగునకు నిసర్గము లయిన యతిప్రాసములతో గూడిన కందపద్య మొకటి కాన వచ్చుచున్నది. అది సంస్కృతభాషలో వ్రాయఁబడిన కందపద్యము. దానిఁబట్టి యా కాలమునఁ దెలుఁగునఁ గూడఁ గందపద్యరచనము బాగుగా వ్యాప్తిలో నుండినట్లు తెలియును. నన్నయవాడిన దేశిచ్ఛందములలోఁ గూడఁ గందపద్యములే యధికము. నన్నెచోడుని కుమారసంభవమునను, కవిజనాశ్రయమునందును గందపద్యము లధిక సంఖ్యలోఁ గలవు. కనుక, సోమనాథుఁడు ద్విపదను జేపట్టి యందుఁ గావ్యనిర్మాణము చేయుదాఁక తెలుఁగున 'కందమే' రాజ్యము చేయుచుండిన దని తెలియును. ఇట్లు, శివతత్త్వసారము దేశిచ్ఛందములోఁ బూర్ణముగా రచింపబడిన తొలిగ్రంథము. శివభక్తి ప్రచార మాశయ మగుటచేతను, సూత్రప్రాయముగా శైవమతధర్మములను దెలుపుట యీరచనము యొక్కపరమలక్ష్యమగుటచేతను నది స్తోత్రరూపమున ముక్తకములుగా రచింపఁబడినది. అందుచే నందేయితివృత్తముగానిలేదు. మఱి, భాషావిషయకముగా నీగ్రంథమునఁ గొంత వైలక్షణ్యమే గోచరించును. మసిపాతను గట్టినమాణిక్యము, ఓడునఁ బోసిన నీళ్లు, బంగారమునకుఁ దావి యబ్బినట్లు, పువ్వులవలన నారలు తలకెక్కుట మొదలగు కొన్నిజాతీయము లీ గ్రంథమునందుఁ గానవచ్చుచున్నవి. 'బ్రతికితి' నను జాతీయము (140 ప) ప్రయోగింపఁబడినది. ఇతఁ డీగ్రంథమున వాడినపదములు కొన్ని నేఁడు ప్రచారములో లేవు. కొన్ని వ్యాకరణవిరుద్ధము లయిన ప్రయోగములు కూడ నిందుఁ గలవు. అవి యాకాలమునందలి శిష్టులవ్యవహారమునం దుండి యుండవచ్చును. నన్నెచోడునిచే నారంభింపఁబడిన 'జానుతెనుఁగు' ప్రయోగమితని శివతత్త్వసారమునందు మూఱాకు తొడిగినది. సోమనాథుని భాషాప్రయోగమున కిందలిభాషాప్రయోగము పూర్వరంగముగాఁ బని చేసి యుండునని భావించినచో నతిశయోక్తి కాఁజాలదు. వస్తువుమాట యెట్లున్నను భాషాచ్ఛందోవిషయము లందు దేశితనమును సంతరించుకొనిన గ్రంథము శివతత్త్వసారము. తరువాతికాలమునఁదెలుఁగు నందు శతకములు పెక్కు కందపద్యములలో రచింపఁబడుటకు వరవడి పెట్టినది యీ గ్రంథమే.

ఇంతవఱకును బాలకుఱికి సోమనాథునికిఁ బూర్వము గ్రంథరూపమున లభించుచున్నవాఙ్మయముయొక్క స్వరూపమును దెలిసికొంటిమి. ఇట్లు గ్రంథరూపముగఁ గాక చాటువులరూపమునను – గ్రంథములుగా రచింపఁ బడినట్లు తెలియుచున్నను నవి పూర్తిగా లభింపక యేకొన్నిపద్యములో మాత్రమే లభించుచున్న వాని మూలమున నూహింపఁదగిన వాఙ్మయమును గొంత సోమనాథునికిఁ బూర్వము వెలసియున్నది.

వేములవాడ భీమకవి రచించినచాటువులును, తిట్టుకవిత్వమును మనకు లక్షణగ్రంథములందును, నితరాకరములందును గొంత లభించుచున్నవి. అతఁడు రచించి నట్లు చెప్పఁబడు గ్రంథము లొక్కటియు మనకు లభించుట లేదు. ఎంచతో తెలుఁగు కవులీతనిని నుతించిరి. ఇతని తిట్లు, దీవనలు, మహిమాదికము మొదలగువానిని గూర్చి తెలుఁగు కట్టుకథలు కొన్ని ప్రచారమునం దున్నవి. కాని యితనికాల మేదో నిర్ణయించుటకుఁ దగిన యాధారములు నేఁటికిని లభించుట లేదు. భీమకవి తిట్టిన రాజకళింగగంగు అనంతవర్మచోడగంగదేవుఁ డనియు, అతనికాలము క్రీ.శ. **1076-1147** అనియు శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు వ్రాసిరి. క్రీ.శ. **1118**లో సుత్కళము కళింగమునుండి వే అయిన దనియు, కాలచుర్య లీ యనంతవర్మనోడించి రనియు శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు వ్రాయుచున్నారు. కనుక నాతనిని తిట్టిన భీమకవి యాకాలమువాఁడు కాదగు నని వారి యభిప్రాయము. ఇట్లు చూడఁగా నాతఁడు సోమనాథునికిఁ బూర్వకాలమునందు వెలసినవాఁడే యగుచున్నాఁడు. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ తెలుఁగుకవులచరిత్రములో వేములవాడ భీమకవిని గురించి వ్రాయుచు 'ఈతఁడు క్రీ.శ. **1100-1180** ప్రాంతముల విలసిల్లెనని పూసపాటి రాజరాజరచిత మాలికనుబట్టి నిర్ణయించితిని' అని వ్రాసిరి.

చాటువులవలనను, తద్రచితము లగు నొకటి రెండు పద్యములవలనను నొక కవీశ్వరుని యొక్క శైలి, ప్రత్యేకత, భావనాశక్తి మొదలగువానిని గూర్చి యంత సంతృప్తికరముగా నిర్ణయము చేయుటకు వీలు లేదు. కవీన మాకవీశ్వరుఁడు రచించిన యొక ఘట్టమును బరించినఁ గాని మనకు రసానందము కలుగదు. వేములవాడ భీమకవి కవిత్వము నాస్వాదించుటకును, విలువకట్టుటకును నాతఁడు మైలమభీమన మరణించి నప్పుడు చెప్పిన పదునాలుగు పద్యములు నేఁడు మనియున్నట్లుగాపమున మనకు లభించుచున్నవి. అతనిచాటువులను, నతఁడు మైలమ

భీమన మరణించినపుడు రచించినపద్యములను బరిశీలించినప్పుడాతని కవిత్వము నన్నయమార్గమునే యధికముగా ననుసరించుననియు, సంస్కృతసమాస భూయిష్ఠ మగురచనము చేయుటయందే యాతని కాస్థ యెక్కువయనియు మనకుఁ దెల్లము కాఁగలదు. 'వీరగుణప్రతాప', 'భండనభీమ' యనుపదములలోఁ బ్రారంభము లగు పద్యము లాతని శ్లేషకవితాసామర్థ్యమును దెలుపుచు రెండర్థంబుల ద్వ్యర్థివాక్యమును చెప్పఁగల కవీశ్వరునిరచనము లనుటను రూఢిపఱుచుచున్నవి.

అధర్వణుఁడు రచించిన 'అధర్వణభారతము' నేఁడు మనకు లభించుట లేదు. అతని భారతమునుండి కొన్ని పద్యములను, అధర్వణచ్ఛందము నుండి కొన్ని పద్యములను లాక్షణికు లుదాహరించిరి. అతఁడు 'వికృతివివేక' మనుపేర నొకవ్యాకరణగ్రంథమును రచించెను. అది సంస్కృతభాషలో రచింపఁబడినది. అందలి లిపి, శ్లోకములలో నుదాహరింపఁ బడిన యక్షరవిన్యాసమునుబట్టి డాక్టరు బర్నెలు దొరవా రాతనిని బండ్రెండవ శతాబ్దముందుండినవానిఁగా భావించిరి. నన్నయభట్టారకునికిఁ బిమ్మటఁ దిక్కన సోమయాజికిఁ బూర్వము భారతమును బూరించుటకుఁ బూనుకొనినయాంధ్రకవి యధర్వణుఁడు. లభించిన పద్యములనుబట్టి చూడఁగా నాతనికవిత్వము సంస్కృతభూయిష్ఠముగా సాఁగినట్లు తెలియుచున్నది.[౨౨] అందుచేతనే యది యంతగా వ్యాప్తిలోనికి వచ్చి యుండక పోవచ్చును. మఱియు సోమనాథునికిఁ దరువాత నాతని దేశికవిత్వోద్యముముచేఁ గొంత వఱకుఁ బ్రభావితుఁ డయిన తిక్కన సోమయాజి తెనుఁగుతనంపు సొంపులు పిసాళించునట్లు రచించిన భారతము మున్దీతని భారతము నిలువఁజాలకపోయియుండవచ్చును.

అధర్వణునికిఁ దరువాతఁ బేర్కొనఁ దగినకవి కవిభల్లటుఁడు. అతఁడు శూద్రక రాజచారిత్రమును, బేతాళపంచవింశతిని రచించినట్లు లక్షణ గ్రంథములవలనఁ దెలియుచున్నది. అతఁడేరచించిన 'పదమంజరి' యను గ్రంథమును బట్టి యాతఁడు క్రీ.శ. **1160 – 1161** ప్రాంతమునకుఁ జెందినవాఁడని తెలియుచున్నది. అతఁడు కొండపడుమటి బుద్ధరాజు కాలమున నుండినట్లును, ద్రాక్షారామనివాసి యయినట్లును దెలియుచున్నది.[౨౩]

---

*౨౨. చూ. నాన్యాసము. అధర్వణభారతము. భారతి. విజయమార్గశీర్షము.*
*౨౩. చూ. తెలుఁగు కవుల చరిత్రము, పుట. 306.*

లక్షణగ్రంథములందుదాహరింపఁబడిన యాతని పద్యములనుబట్టి చూడఁగా నతఁడు కూడ సంస్కృత భూయిష్ఠ రచనమునే యభిమానించినట్లు తెలియును.

సోమనాథుఁడు తన బసవపురాణమునను, పండితారాధ్య చరిత్రమునను 'జాను తెనుఁగు'ను గూర్చి పేర్కొనుచు వ్రాసిన యీ క్రింది పదపంక్తులను దిలకింపుఁడు.

'అరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు'

– పండితారాధ్యచరిత్రము

'ఉరుతరగద్య పద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జానుతెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱ'

– బసవపురాణము

దీనిమూలమున సోమనాథునికిఁ బూర్వము పద్యగ్రంథములును, పద్యరచనమునకంటె ముందుగా వెలసినట్లు తలంపఁ దగు మాత్రాగణబద్ధము లగు గద్యరచనములును జాలకాలమునుండి సంస్కృతపదభూయిష్ఠములుగాఁ గూర్పఁబడుచుండినట్లు తలంచుట కవకాశము కలదు. సోమనాథునికిఁ బూర్వము వెలసిన పద్యగ్రంథములు చాలవఱకు సంస్కృతభూయిష్ఠములను విషయము నింతకుముందు మనము విపులముగాఁ దెలిసికొంటిమి. అతనికిఁ బూర్వ ముండిన గద్యకృతులు కూడ సంస్కృతభూయిష్ఠములు గానే యుండె ననువిషయము నీపంక్తులు వెల్లడి చేయుచున్నవి. సోమనాథుఁడు రచించిన పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య మున్నగుగద్యకృతులు సంస్కృతభూయిష్ఠములే కదా! ఇట్టి గద్యరచనములు మఱికొన్ని సోమనాథునికిఁ బూర్వము వివిధకవి విరచితములు జనులయందుఁ బ్రాచుర్యము వహించి యుండును.

పాలకుఱికి సోమనాథునికిఁ బూర్వము శాసనకవిత, పదకవిత, గ్రంథరూపమున లభించుచున్నవాఙ్మయము, అనుపలబ్ధవాఙ్మయము, చాటువులు మొదలగు

చిల్లరరచనలు ననువానియందుఁ గల కవిత్వస్వరూపమును వంన మీ యధ్యాయమునందు విపులముగాఁ దెలిసికొంటిమి. నన్నయయు, నన్నయచేఁ బ్రభావితులయినకవులును మార్గకవిత్వమును వెలయింపఁగా, నన్నెచోడుఁడు, మల్లికార్జునపండితుఁడు దేశికవిత్వము వంక మ్రొగ్గు చూపుటను దిలకించితిమి. నన్నయాదులగుమార్గకవులలోఁ గూడ దేశిలక్షణము లటనటఁ బొడసూపుచు సంతోషావహము లగుచుండె నని కూడఁ దెలిసి కొంటిమి. ఇట్టి వాఙ్మయ పూర్వరంగములో సోమనాథుని దేశికవిత్వోద్యమము విశ్వరూపము దాల్చి వివిధ గతుల విహాయసము నంటినది.

## సోమనాథుఁడు ఉద్యమకారుఁడు

పాల్కుఱికి సోమనాథునికిఁ బూర్వకాలమందు వెలసిన యాంధ్రసాహిత్య స్వరూపస్వభావములనుగూర్చి మనము పూర్వ ప్రకరణమునందుఁ దెలిసికొంటిమి. ఇఁక నీప్రకరణమున సోమనాథునికి దేశికవిత్వోద్యమసంకల్ప మేల కలిగెనో, యుద్యమ కారుఁ డగుటకు దగ్గియోగ్యతలను, శక్తియుక్తులను గలిగి యుండవలయునో, యాయాయి యోగ్యతలు సోమనాథునియందు మన మెంతవఱకుఁ గాంచఁ గలుగుదుమో యను మొదలగు విషయములనుగూర్చి యించుక తెలిసికొందము.

సోమనాథుఁడు కేవల మొక్కకవీశ్వరుఁడు మాత్రమే కాదు. ఇతర కవులనేకులవలెఁ గవిగా మాత్రమే చిరయశస్సును సముపార్జించుట యతనికాంక్షితము కాదు. అతనికిఁ గవిత్వమును మించినప్రయోజనము మఱొక్కటి యున్నది. అది యతని పరమధ్యేయము. వీరశైవమతప్రచారమే యాతని ప్రధానలక్ష్యము.[౧] తనకవిత్వము మూలముగా వీరశైవమతప్రచారము చేయుటకుఁ గంకణము కట్టుకొనిన యసమానమేధాశాలి యతఁడు. తనకాలమునందు దేశములో వ్యాపించియున్న బౌద్ధ, జైన, వైష్ణవాది మతములను, శంకరాచార్యుల యద్వైతవేదాంతము మొదలయినసిద్ధాంతములను బ్రతిఘటించి, వానిని ద్రోసిరాజు చేసి, దానియాట కట్టించుటకుఁ గావలసిన పాండిత్యము నంతటిని నతఁడు సంపాదించుకొనెను. అట్లు గడించిన పాండిత్యమును దన

౧. పండితారాధ్యచరిత్రపీఠిక: శ్రీయుత చిలుకూరి నారాయణరావుగారు: పుట. *86.*

చతుర్వేదసారము, సోమనాథభాష్యము మొదలయిన గ్రంథములం దాతఁడు వినియోగించెను. కాని, దానిదేశాస్త్రీయముగా వీరశైవసిద్ధాంతము స్థాపిత మగునే కాని యంది జనసామాన్యములో వ్యాపించుటకు వీలులేదు. అట్లది జనసామాన్యములో వ్యాపింపవలెనన్నచో నాకార్యము చేయుటకుఁ గేవలవిద్వాంసుండును, బండితుఁడును. గవీశ్వరుఁడును బనికి రాఁడు. అతఁడు దాని ననుష్ఠించి, యాచరణలోఁ బెట్టి లోకమునకు లక్ష్యప్రాయుఁడుగా నుండ వలయును. తా ననుష్ఠించుట మాత్రమే కాక యితరులకును దాని ననుష్ఠింప వలె నన్నకోరిక నాతఁడు కలుగఁజేయవలయును. వారికి నుత్సాహము మాత్రమే కాక యావేశమును గలుగవలయును. వారిలో నట్టి యావేశము కలుగుటకుఁ దానును నావేశపరుఁడు కావలయును. జనులలో నభినివేశ మును, నావేశమును బుట్టించుటకు దేశభాషలో, దేశియచ్ఛందస్సులో, దేశీయరీతిని గవిత్వము చెప్పుటకంటే మఱియొక మార్గము లేదు. బుద్ధభగవానుఁడు తనమతము ప్రజలలో బాగుగా వ్యాపింప వలె నన్నచో సంస్కృతములోఁ గాక ప్రాకృతభాషలోనే తన యుపదేశములు రచితములు కావలయునన్నరహస్యమును గుర్తించి యట్లే ప్రాకృతభాషలోఁ దనమతసిద్ధాంతములను వెలయింపఁ జేసెను. రాజరాజ నరేంద్రుఁడు బౌద్ధమతవ్యాప్తి నరికట్టి, యాంధ్రదేశమున వైదికమతప్రచారము జరుగవలయు నని కాంక్షించి, తదాశయము సిద్ధింప వలయునన్నఁ బంచమవేద మగుమహాభారతము తెలుఁగులో రచితము కావలసినయగత్యమును గుర్తించి నన్నయభట్టారకుని మహాభారతాంధ్రీకరణమునకుఁ బ్రోత్సహించెను. మతప్రచారము జరుగుట కెట్టిమార్గములనుసరణీయములో సోమనాథుని మార్గపద్ధతిని సాఁగినరచనలకుఁ దద్రచనారీతులకు భిన్నముగా దేశి కవిత్వోద్యమముఁ దలపెట్టెను. సంస్కృతమూలకము కాని దేశిప్రక్రియా స్వీకరణముతో దేశీయ చ్ఛంద మగు ద్విపదలో జానుతెనుఁగుపలుకుబడి వెలయించి దేశికవిత్వోద్యమముఁ బ్రారంభించి తనపరమాశయ మయిన వీరశైవమతప్రచారము నాతఁడు సాధింపఁ దలపెట్టెను.

సాహిత్యోద్యమమును దలపెట్టినవాఁడు ప్రధానముగా సమ్యగవేక్షణము, సంకల్పదీక్షత, ధైర్యసాహసములు, ఆత్మప్రత్యయము, ఆవేశము, నిరుపమాన మయిన పాండిత్యము, తర్కనైపుణ్యము నను లక్షణములను గలిగి యుండ వలయును. దీనిలో మొదటిది సమ్యగవేక్షణము. సాహిత్యములో నొకమార్గము ప్రచలిత మగు చున్నప్పుడు – చక్కఁగాఁ దీర్చిదిద్దిన కావ్యపథమొకటి కనులముందు

కనఁబడుచున్నప్పుడు ఆమార్గమువెంబడినే నలుగురతోఁబాటు నడిచి పోక యొకక్రొంగ్రొత్తమార్గమును స్వతంత్రముగాఁ దా నభ్యూహించి దాని కొకరూపకల్పన చేయఁగల్గుయనల్పకల్పనాశక్తి యాతని కుండ వలయును. కవి యగువాఁడు సాధారణముగా సమకాలమునాఁటి సంఘమునకంటెఁ జాల ముందుగా నేఁగుచుండును. ఉద్యమకారుఁ డగుకవీశ్వరుడు మఱింత ముందున కేఁగును. వేసినదారివెంట వెడలుట సులభము. క్రొత్తదారి వేయుట కడుంగడుఁ గష్టము. ఎట్టి పరిణామము సాహిత్యమునం దభిలషణీయమో యాకవీశ్వరునికిఁ జక్కఁగా నెఱుక కావలయును. అట్టిమార్గమును గవేషించుటలోనే యాతని ప్రజ్ఞ యుండును. ఆ శక్తియే సమ్యగవేక్షణము. అట్లొకానొక వినూతనమార్గమును గనుఁగొనినపిదప దానికి రూపకల్పనముఁ గావించుట కాతఁడు దృఢసంకల్పుఁడు కావలయును. సంకల్పమనఁగా నొకకార్యము చేయువలయునని దృఢముగా వాంఛించుట. అం దెట్టి యౌదాసీన్యమును బూనరాదు. అట్టిచో నాతఁడు పరిహాసభాజనుఁ డగును. తీవ్రముగా సంకల్పించుట మాత్రము చాలదు. ఆసంకల్పమును ధైర్యముగా నాచరణమునకుఁ దెచ్చుట కాతఁడు గట్టిజతనము చేయువలయును. దారిలో నెన్నియో యాటంకములు రావచ్చును. పరిస్థితు లనుకూలింపక పోవచ్చును. ప్రాఁతదారులకుఁ బ్రాఁతసంప్రదాయములకుఁ బరమవిధేయు లయినవారు విమర్శింతురు. ఆవిమర్శముల నెదుర్కొని నిలువంగల ధైర్యమును, దనప్రణాళికతో వెనుక ముందులు చూడక ముక్కునకు సూటిగా ముందునకుఁ జొచ్చుకొని పోఁ గలిగిన సాహసమును నాతనికి మిక్కిలి యావశ్యకము. ఇట్టి ధైర్యమును, సాహసమును బ్రతి కవీశ్వరునికిని నలవడదు. అతనికిఁ దనయందును, దనలక్ష్యమునందును జక్కని యాత్మప్రత్యయ ముండ వలయును. అట్టి యాత్మప్రత్యయ మున్నప్పుడే యాతని హృదయమున ధైర్యగుణము స్థావర మేర్పఱచుకొనును. ఆత్మప్రత్యయముతోఁబా టాతనికి నావేశమును నవసరమే. అట్టియావేశపరుఁ డయినప్పుడు కాని యితరులలో నట్టి యావేశము నాతఁడు కలిగింపఁ జాలఁడు. ఆ యావేశమే యాతఁడు తలపెట్టిన యుద్యమమునకుఁ బ్రచోదకశక్తి యగును. ఇన్నిలక్షణము లున్నను నతఁడు వస్తుతః శక్తిమంతుఁడు కానిచో నాతనియుద్యమము మధ్యలోనే మట్టి గొట్టుకొని పోవును. పాండిత్యలోపముచేతనే – ఆపాండిత్యలోపమును గప్పిపుచ్చుకొనుటకే యాతఁ డీక్రొత్త యెత్తు లెత్తుచున్నాఁడనియు, నతనికి దొక్కశుద్ధి లేదనియు నతని నితరులు గర్హింతురు. అతనియుద్యమ మపుడు నిలువ నీడ లేనిదగును. వ్యావహారిక భాషోద్యమమును దల పెట్టినవిద్వాంసుఁడు తనయుద్యమాశయముల శ్రేష్ఠత్వమును

బ్రతిష్ఠాపింపఁ గలుగుటతోఁబాటు గ్రాంథికభాషలోఁ గూడఁ జక్కనిరచనము చేయనేర్చినవాఁ డయి యుండవలయును. లేకున్న నది చేతఁ గాక, యందు శక్తి చాలక యీయుద్యమము నారంభించె నన్నయపకీర్తి కలుగును. పాండిత్యము మాత్ర మున్నఁ జాలదు. ప్రతిపక్షులు వాదములోఁ దన్నెదురుకొనినపుడు వారిని దనతర్కనైపుణ్యముతోఁ బడఁగొట్టు చాతురియు, నందుకు వలసిన వాక్పటిమయు నాతనికి మిక్కిలి యవసరము.

ఒక క్రొత్తయుద్యమము బయలు దేరినప్పుడు సంప్రదాయవిధేయు లయిన పండితుల విమర్శ మేరీతి నుండునో యీక్రింది యంశమును గమనింపుఁడు. ఐరోపీయ సాహిత్యానుప్రేరణవమూలముగా నాధునికవంగసాహిత్య ముద్భవించినది. ఆంగ్లేయసభ్యత వంగదేశములో మత్తుమందువలెఁ బనిచేసినది. అది బెంగాలీసాహిత్యమును గ్రొత్తదారులు పట్టించినది. తొలిదినములలో దీనిని బలుపురు వ్యతిరేకించిరి. ఒక సంప్రదాయవిధేయుఁ డయిన కవి యాధునికుల నిట్లు పరిహసించెను.

'హా ధిక్
ఫేరంగవేశే
ఏయి వాల్మీకీరదేశే
కేతో రా
వేడాస్ సబ్
ఉల్కాము ఖీ ఆయా.'[౨]

(ఛీ ఛీ.. ఎవరు మీరు? ఈవాల్మీకి దేశములో ఫరంగివేషములోఁ దిరుగుచున్నారు - గ్రుడ్లగూబమొగముతో వచ్చి..)

ఇట్టి విమర్శములు వచ్చినప్పుడు నూతనోద్యమనేతలగువారు తమయుద్యమ లక్ష్యములను సమర్థించుకొనుచు నెట్టితర్కనైపుణిని బ్రదర్శింతురో యీక్రింది దృష్టాంతము నందుఁ దిలకింపఁ దగును.

రవీంద్రకవీంద్రుడు, వాడుకభాషలో రచన లారంభింపక ముందే వివేకానంద స్వామి వాడుకభాషలో రచన చేయుఁడని తన యనుయాయుల కుపదేశించెను. ఆయన చేసిన యీయుపదేశమెంత తర్కసహమో సాహితీపరులకు శిరోధార్యమయిన యీక్రింది రచనము వెల్లడించును.

౨. చూ. ఉత్తరభారతసాహిత్యములు : ఆంధ్రప్రదేశ్‌సాహిత్య అకాడమీ ప్రచురణ: పుట. 70.

[3] 'బుద్ధభగవానుఁడు మొదలుకొని రామకృష్ణునివఱకు లోకహితముకొఱ కవతరించినమహాపురుషు లందఱును సామాన్యులభాషలోనే జనసామాన్యమునకు శిక్షణ గఱపిరి. పాండిత్యముత్కృష్ట మయినదే. కా దనను. కాని, యప్రాకృత మైన, కల్పితమైన, కఠినమైన భాషలోనే కాని పాండిత్యము లేదా? వాడుకభాషలో శిల్పనైపుణ్యము సాఁగదా? స్వాభావిక మయినభాషను వదలిపెట్టి యస్వాభావిక మయినభాషను నాశ్రయించుటవలననే మగునా? ఏభాష నింట మాటలాడుదుమో యాభాషలోనే కదా మనస్సులో గవేషణ సాగింతుము. మఱి, వ్రాయునప్పుడు వహ్నాత్ర మయోవయ మయినభాష నెందులకు వాడుదురు? ఏభాషలో దర్శనవిజ్ఞానముల నాలోచింతుమో, పదిమందిమి కలసి చర్చింతుమో యాభాష దర్శనవిజ్ఞానముల రచనమునకుఁ బనికి రాదా? స్వాభావికముగా నేభాషలో మనసులోని మాటను వెల్లడింతుమో, యేభాషలోఁ గ్రోధము, దుఃఖము, ప్రేమ ప్రకటింతుమో యాభాషను మించినభాష లేనే లేదు.'

బెంగాలీసాహిత్యమునకు సంబంధించినదే మఱొక దృష్టాంత మిది. అత్యాధునిక సాహిత్యమును బ్రతిపక్షులు 'మేకలసాహిత్య' మని యవహేళనము చేసిరి. ఆసాహిత్య మంతయు నశ్లీలము పొమ్మనిరి. నోటికి వచ్చినట్లు దుమ్మెత్తి పోసిరి. అంతమాత్రమునఁ బ్రగతివాదులూరకుండలేదు. ఒకప్రగతివాది తన ప్రతిపక్షుల కిట్లు సమాధానించెను.

'రాజారామమోహన రాయలు, కేశవచంద్ర సేనం, ఈశ్వరచంద్ర విద్యాసాగరుఁడు – వీరుకూడ నొకనాఁడు అర్వాచీనులుగా నుండిరి. అధునికత యను నపరాధము వలన నానాఁడు వారును నిందకుఁ బాత్రు లయిరి. అందాఁక సాంఘికముగా వారికిఁ గష్టము లనుభవింపవలసివచ్చినది. బంకించంద్ర, మైకేలు, నవీనచంద్ర మొదలయినవారు సాంఘికకష్టములనుభవించిరి. అయితే యాదుఃఖము లనుభవించుట వేఱు. ఇప్పుడు రవీంద్రనాథునికి నిట్టిశోకప్రద మయిన సంఘటనమే తటస్థించినది. కేకలు వేయుట సరికాదు. నవీనులజాబితానుండి తనపేరు కొట్టివేయుట రవీంద్రనాథునికిఁ గష్టమనిపించి యతఁ డభిమానపడుట సహజమే. ఈయభిమానము మా కర్తవ్యము కాఁ గలదు. కాని, రవీంద్రనాథశిష్యులు పునర్జన్మోత్సవము మా కర్తవ్యమగుట లేదు. రవీంద్రుడు నవీనుల విజయమును గానము చేసెను. అందుకొఱకై తిట్లు కూడఁ దినెను. అయితే యాయన నిప్పుడు

3. చూ. *ఉత్తరభారతసాహిత్యములు : శ్రీ పురిపండా అప్పలస్వామిగారి యాంధ్రానువాదము. పుట. 91.*

ప్రాచీనులశిబిరములోఁ గప్పి పెట్టినచో మాత్రము ఈ క్రొత్తకేకలు సత్యమయినవే యని యనక తీరదు. గొప్ప యాధునికుఁడును, విద్రోహియు నయిన శరచ్చంద్రుఁడు ప్రాచీనులజట్టులోనికిఁ బోయి హతుఁ డయినచో నతనికి విప్రదాసునకుఁ బట్టినదశయే పట్టినదనవలెను. ఇందులో మొఱపెట్టవలసిన పని యే మున్నదో మా కర్థ మగుట లేదు. పురాతనమే యంతయు నావరించినచో మఱి నవీనతకు స్థలమెక్కడ? తండ్రియే యెల్లప్పుడును నున్నచో నిఁకఁ గుమారుని యవసర మే మున్నది? పైఁగా కొడుకు మూఁడు మూర్తులఁ దండ్రిలాగుననే యుండక పోయినచో నెత్తినోరు కొట్టుకొనుట యెందులకు? మనుష్యావతార మెందులకు? మత్స్యావతారమే యుండవలసినది.'[౪]

సాహిత్యోద్యమప్రవర్తకున కెట్టియోగ్యతలు, శక్తి యుక్తులు నుండ వలయునో పరిశీలించితిమి. ఇఁక నాయోగ్యతలు దేశికవిత్యోద్యమప్రవర్తకుఁ డగు సోమనాథుని యందెంతవఱకు నెక్కొని యున్నవో, యతఁ డొకయుద్యమకర్త యగుటకు నవి యెట్లుగా నుపకరించినవో యించుక పరిశీలింతము.

పాల్కుఱికి సోమనాథుఁ డవతరించునప్పటి కాంధ్రవాఙ్మయమున వెలసిన గ్రంథములు మిక్కిలి తక్కువ యనియే చెప్పవలసి యున్నది. నన్నయభట్టారకుఁడు ప్రారంభించిన భారతాంధ్రీకరణ మాతనినిర్యాణముతో నిలచిపోయినది. తరువాత రెండు వందల యేండ్లవఱకెవ్వరుగాని దానివంకఁ దమదృష్టిని సారింపలేదు. నన్నయభట్టారకుఁడు సంస్కృతపదభూయిష్ఠముగాఁ దనరచనమును సాఁగించెను. అతనికిని సోమనాథునికిని నడిమికాలమున వెలువడిన కొలఁది కబ్బములలోఁ బావులూరి మల్లనరచితమగు సార సంగ్రహగణిత మనుపేరు గల పావులూరి గణితము మహావీరాచార్యుఁడు సంస్కృత భాషలో రచించిన గణిత సారసంగ్రహమునకుఁ దెలుఁగుసేఁత. మఱియు నది యొక శాస్త్రగ్రంథము. మల్లికార్జునపండితుని శివతత్త్వసారము స్వతంత్రగ్రంథమే యయ్యును నది శతకవాఙ్మయములోఁ జేర్చఁ దగినది. అయ్యది కూడఁ బ్రాయికముగా సంస్కృత పదప్రచురముగనే సాఁగినది. మల్లికార్జునపండితుఁడు రచించినట్లు చెప్పఁబడుచున్న యాతని యితరకృతులు మనకు లభింప లేదు. తరువాతఁ బేర్కొనఁ దగినమహాకవీశ్వరుఁడు కుమారసంభవ మనుపేర నొకమహాకావ్యమున

౪. చూ. ఉత్తరభారతసాహిత్యములు : శ్రీ పురిపండా అప్పలస్వామిగారి యనువాదము. పుట. *162.*

మార్గదేశిసంప్రదాయముల ప్రస్తావన గావించి, దేశిమార్గమ్ములు దేశీయములుగాఁ గవిత వెలయింతు నని పని కట్టుకొని జానుతెనుఁగుపైఁ కొంత వలపును బ్రకటించెను. అతనికుమారసంభవము జాలవఱకు స్వతంత్రకావ్యమే యయినను నది కూడ గీర్వాణప్రాధాన్యమే కల ప్రౌఢప్రబంధ మై పండితజనైకవేద్యముగా మాత్రమే యుండి జనసామాన్యమునకు దుర్గ్రాహ్య మయ్యెను. అతని కలావిలాసము లభింప లేదు. అందుచే నందలి కవితావిధానము మనకుఁ దెలియదు. ఇట్టిస్థితిలో నాంధ్రవాఙ్మయమున నాంధ్రీకరణయుగ ప్రారంభదశయం దీకవిశేఖరుఁ డవతరించెను. అప్పటికి సుగమముగా, సుసంఘటితముగా నున్నతకావ్యమార్గము నాతఁ డనుసరింపఁ దలపెట్ట లేదు. తనకవిత్వమునకుఁ బరమాశయ మయినవీరశైవమత ప్రచారమునకు నాతఁ డొక నూతనమార్గము నవలంబింపఁ దలఁచెను. సంస్కృతవిధానము తోను, సంస్కృతమూలములతోను సంబంధము లేని స్వతంత్రగ్రంథముల రచనమునకే యాతఁడు కడంగెను. అతని కృతులలో నేయొక్కటియు సంస్కృతమూలకము కాదు. అన్నియు స్వతంత్రగ్రంథములే. ఈతనియవతరణమే యొకప్రత్యేకప్రయోజనము నుద్దేశించి నియుక్త మగుట కూడ దీనికిఁ గొంత కారణము కాఁ దగును. ఇతని తొలుతటికృతి యనుభవసారము. విషయౌన్నత్యమువలనం దది మాత్రమే కాక పద్య రచనావిధానమునను నీతఁడు కొంత సంస్కారమును సాధింప సంకల్పించెను. ఆంధ్రపద్య రచనములో నన్నయ పాటించిన సంస్కృతపదప్రాచుర్యమును, సమాసఘటికల్పనాసంకల్పమును నీతఁడు సడలింప నెంచి తన యనుభవసారమున దానిని గొంత యనుభవమునకుఁ దెచ్చెను. అటుతరువాత బసవస్తోత్రరూపము లగు గద్యలు, రగడలు మున్నగుదేశీయ గేయకృతులను గూడఁ బెక్కింటిని సంస్కృతపద భూయిష్ఠముగానే రచించెను. కాని యట్టి రచనలు జనవశీకరణమునకును, ఈ మతప్రచారమునకును నంతగా నుపకరింపఁ జాల వనెడి సత్యమును గ్రహించినవాఁడయి, జనులవాడుకలో నిలుకడనంది సహజోద్భవమై వారికి సులభముగా సంగ్రాహ్య మగు జానుతెనుఁగు పై వలపు పచరించెను. మఱియు మతగ్రంథరచనమునకు సంస్కృతభాష నాధారముగఁ గొని సంస్కృతభాషలో వంత గ్రంథములను వెలయించు ప్రాచీన మర్యాదను ద్రోసిరాజఁ జేసి ప్రజాసామాన్యమునకు మాతృభాష యగు తెలుఁగుపైనెన లేని యభిమానమును బూనినవాఁ డై తెలుఁగు పలుకులను గూడ వేదముల కొలఁదిగాఁ బాటింపుఁ డని లోకమును హెచ్చరించెను. సంస్కృతవృత్తసమాదరణభావమునకు స్వస్తి చెప్పి

సర్వసామాన్యమును, జాతీయచ్ఛందమునగు ద్విపదలోఁ దనప్రధానగ్రంథములగు బసవపురాణ, పండితారాధ్య చరిత్రములను నిర్వహించెను.

ఇట్లుగా విషయోన్నయనమునను, భాషావిషయకముగను, ఛందస్స్వీకార మునందును ప్రాచీన మార్గకవితాసంప్రదాయమునకు భిన్నముగా దేశికవితోద్యమమును దలపెట్టిన పాలకురికి సోమనాథునితో విధిగాఁ దప్పనిసరిగా యుండవలసినయోగ్యత లన్నియు సంపూర్ణముగా నిండారుకొని యున్నవి. పయిన వివరించినవిషయము లాతని సమ్యగవేక్షణమునకు నిదర్శనములు కాఁగాఁ పండితారాధ్య చరిత్రములోని –

పటుగద్యపద్యప్రబంధసామ్యముగఁ
గావ్యకలాప్రౌఢిఁ గల్పించు ద్విపద
కావ్యంబు భావ్యంబు గాన ...

పండి ... *1–20* పుట.

అను ద్విపదపంక్తులలో నాతని సంకల్పతీవ్రత గోచరించును.

'జాతులు రచనాప్రణీతులు గార్య
నీతులు పేరులు నేరు లుట్లుగ
వరకవుల్ గొనియాడ వర్ణనకెక్క
ధరఁ జెప్పఁ గృతియు నుద్యత్ప్రతి'

పండి .. *1–19,20* పుటలు

'ఆరూఢ గద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు' –

పండి ... *1– 18* పుట.

అను ద్విపద లాతనికిఁ గలయాత్మప్రత్యయమును జాటును.

'ఉరుతర గద్యపద్యోక్తులకంటె
సరస మై పరఁగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ

దెనుంగుమాట లనంగ వలదు వేదముల
కొలందియకాc జూడుc డిలనెట్టులనినc
బాటితూమునకును బాటి యొనేనిc
బాటింప సోలయుc బాటియ గాదె
యల్పాక్షరముల ననల్పార్థరచన
గల్పించుటయె కాదె కవి వివేకంబు?

అనువాక్యములలో నాతని తర్కనైపుణ్యము గోచరించును. '

'.... తన్మహోభక్తకమహిమc
బనరింపు మనమవాక్పాటవశక్తి
నొనcగితిమి .......'

పండి. 1–12 పుట.

అనుపలుకులవలన సోమనాథునికిc బరవాదభంజనమునందును, స్వమతస్థాపనమునందును గల వాక్పటిమ యూహింపనగుచున్నది.

ద్విపదకావ్యములయెడ సోమనాథునికాలమునc గూడc గొంత నిరసన భావము నెలకొని యున్నట్లు గోచరించును. బసవపురాణమును ధూర్తవిప్రులు నిరసించినట్లు పద్యబసవపురాణములోని యొరుగంటి వృత్తాంతములోc దత్కర్తయగు పిడుపర్తి సోమనాథుండు పేర్కొనినకారణములలో నది ద్విపదలో రచింపcబడి యుండుటయొకటి. కాని, సోమనాథుండట్టి ధూర్త జనాభిప్రాయములను సరుకుగొనునంతటి పిఱికి పంద గాండు. సముచిత మని, సమంజస మని తనకుc దోcచినవానిని నిర్వహించుటలో నాతనికి జంకుగొంకులు లేవు. అతc డొకరికి భయపడుస్వభావము కలవాండు కాండు. ఒకరి కిష్టము కా దని తనపద్ధతిని మార్చుకొనువాండును గాండు. 'క్రియాసిద్ధిః సత్వే భవతి మహతాం నోపకరణే' మహనీయులగువారికిc గ్రియాసిద్ధి సత్వమువలననే కలుగును. ఉపకరణములవలనc గాదు – అను నభియుక్తోక్తి ప్రకారముగా మహాకవు లగువా రే ఛందముc జేపట్టినను వారికావ్యములు లోకమును దప్పక రంజింపc జేయc గలిగినవిగనే యుండును. ఇందుచే సోమనాథుని సమకాలమున లఘుబుద్ధు లగు ధూర్తవిప్రుల దృష్టిలోను, ననంతరకాలమున మార్గకవితానుసారు లగు నితరకవులదృష్టిలోను నిరసనమునకుc దావలమయిన ద్విపద యలఘుమతి

యగుసోమనాధుని యమృతహస్తమున నైహికాముష్మిక ద్విపదహేతువై విరాజిల్లినది. ఈ యోరుగంటి వృత్తాంతమును, బసవపురాణపండితారాధ్యచరిత్రములయం దాతఁడు ద్విపదను సమర్థించుచుఁ జేసిన దీర్ఘోపన్యాసమును నాతనికిఁ దనయుద్యమమును నిలుపఁద్రొక్కుకొనుటలోఁ గల ధైర్యసాహసములను వెల్లడి చేయుచున్నవి. ఇక నాతని కుద్యమనిర్వహణములో నతిప్రధానముగా నుండ వలసిన వైదుష్య మనియెడియోగ్యత యెంతవఱకుఁ గలదో యాతనిగ్రంథములను బట్టి తెలిసికొందము. ద్విపదకవిత నభిమానించి, యాదరించి యందు రెండుప్రధాన గ్రంథములను నిర్వహించి తనయుద్యమమునకు స్థిరత్వమును గల్పించుకొనినను వృత్తరచనముచేతఁ గాకయో, యందు సిద్ధహస్తుఁడు కామినో ద్విపదను జేపట్టినాఁ డను 'నపదూరు' కలుగకుండునట్లు అనుభవసారము, చతుర్వేదసారము, చెన్నమల్లు సీసములు, బసవోదాహరణము అనుగ్రంథములయందు వృత్తములలోఁ గూడఁ బద్యరచనముఁ గావించి యందుఁ దనకుఁ గలశక్తిసామర్థ్యములను బ్రదర్శించి యుండెను. త్రిభంగి, క్రౌంచ పదము, మంగళమహాశ్రీ మొదలగు విశేషవృత్తములను గూడ రచించి చూపెను. సంస్కృతపదభూయిష్ఠముగాఁ దొలుతటిపద్యకృతులయందును, గేయకృతులయందును రచనము నెఱపి తనకు సంస్కృతపదప్రయోగము చేతఁ గాక జానుతెనుఁగు నభిమానించె నేమో యను ననుమానమునకుఁ దావు లేకుండఁ జేసెను. అతనిగ్రంథములనుబట్టి యాతనికిఁ గలవైదుష్యవిస్తార మెట్టిదో తెలిసికొందము.

## సోమనాథుని వైదుష్యము

*'శక్తి ర్నిపుణతా లోక*
*శాస్త్రకావ్యాద్యవేక్షణాత్*
*కావ్యజ్ఞశిక్షయాభ్యాస*
*ఇతి హేతు స్తదుద్భవే.'*

అని మమ్మటుఁడు ప్రతిభ, లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణమువలనఁ గలిగినవ్యుత్పత్తి, కావ్యజ్ఞ శిక్షచేఁ లభించిన యభ్యాసము అనునవి కావ్యహేతువులుగాఁ దనయలంకారగ్రంథము నందుఁ బేర్కొనెను. కావ్యసృష్టి యొనరించుటకు గవీశ్వరుని కుండ వలసిన యోగ్యత లలోఁ బ్రతిభతోఁ బాటు

వ్యుత్పత్తియుఁ బ్రధానస్థానము నాక్రమించును. అభ్యాసము కూడఁ బైరెంటికిఁ దో డయినచో నట్టికవి యుత్తమకావ్యస్రష్ట చేయఁ గలుగును. సాధారణముగా నేసాహిత్యమునకుఁ జెందినయుత్తమకవులను దీసికొన్నను వారిలో నీయోగ్యతలు కొంచెము హెచ్చుతక్కువలుగా నందఱిలో నుండి తీరును.

ఆంధ్రసాహిత్యమున మార్గకవులకావ్యసాహిత్యమును బరిశీలించినపుడు వారిలో నీ శాస్త్రకావ్యాధ్యయనమువలనఁ గలిగిన సంస్కారము మాత్రమే కాన నగును. కావ్యగతమయిన వారియీసంస్కారము వారి గ్రంథములలోఁ బ్రస్ఫుటముగాఁ గాక యనుమేయము (Suggestive) గా మాత్రమే యుండును. పాల్కుఱికి సోమనాథునిలో నట్లు కాదు. సోమనయం దీకావ్యశాస్త్రాదిజనిత సంస్కారము ప్రస్ఫుటముగా గోచరించును. అ ట్లగుటకుఁ గారణము లేక పోలేదు. అది యాతఁ డుద్దేశించిన కవిత్వప్రయోజనమువలనబట్టి యేర్పడినది. తనకవిత్వముమూలమున నతఁడు సాధింపఁ దలఁచిన పరమప్రయోజనము వీరశైవసిద్ధాంతప్రతిష్ఠాపనము. అట్లు, వీరశైవసిద్ధాంతమును బరమోత్కృష్టముగాఁ బ్రతిపాదించినమీదట నావీరశైవమున కాంధ్రప్రజానీకమున విశేష ప్రచారమును లభింపఁ జేయుటయుఁ, బెక్కురను వీరశైవమతావలంబకులనుగాఁ జేయు టయు నాతని యాశయము. అతఁడాంధ్ర సాహిత్యములోని తక్కిన మార్గకవులవలెఁ బాఠకులకు రసానందమును గలుగఁ జేయుటకో లేక తన పాండిత్యప్రకర్షనం బ్రకటించుకొనుటకో కాక, కవియశస్సును సముపార్జించుటకో కవిత్వమును రచించినవాఁడు కాఁడు. అతఁడు కవిత్వముమూలముగా వీరశైవమతవ్యాప్తికిఁ గంకణము గట్టుకొనిన యసమానప్రజ్ఞాశాలి. లోకములో వ్యాపించి యున్న బౌద్ధ, జైన, వైష్ణవాది మతములను, శంకరుని యద్వైతవేదాంతము మొదలయిన సిద్ధాంతములను బ్రతిఘటించి, వానిని ద్రోసిరాజు చేయుట యాతని సంకల్పము. ఇతరమతములను ఖండించుటయే కాక, తనమతముయొక్క యౌత్కృష్ట్యమును చాటి, దానిని బరమోత్కృష్టముగాఁ బ్రతిష్ఠాపింపవలసినయవసరమును నాతని కెం తేనిఁ గలదు. ఈరెండుకార్యములును బాండిత్యము లేక, వేదశాస్త్రముల యధ్యయనము లేక సాధింప వీలులేదు. కాన, సోమనకు వైదుష్య సంపాదన మభిలషింపఁ దగినది మాత్రమే కాక యావశ్యకమును నైనది. అందుచేఁ గవిత్వరచనమునకు వలసినపాండిత్యమును మాత్రమే కాక, పరమత ఖండనమునకును, స్వమతస్థాపనమునకును వలసినవిజ్ఞానము నంతయు నాతఁడు

సముపార్జించుకొనెను. అతఁడు గడించిన యాపాండిత్యస్వరూపమంతయు నతఁడు రచించిన చతుర్వేదసారము, సోమనాథభాష్యము మొదలగుగ్రంథములలోఁ గాన నగును.

సోమనాథునిగ్రంథముల మూలముననుం, నందాతఁడు తన్నుఁగూర్చి తెలుపుకొనిన విషయముల మూలమునను నాతని వైదుష్య మెట్టిదో యెఱుంగుటకు మఱం దాతని వైదుష్యసంపదనుగూర్చి ప్రాచీను లెట్టి పూజ్యభావమును, గౌరవమును గలిగి యుండిరో తెలిసికొనుట యుక్తము. చెన్నబసవపురాణ మనువీరశైవగ్రంథమును రచించిన అత్తలూరి పాపకవి పాల్కుఱికి సోమనాథునిగూర్చి యీక్రిందివిధముగా సంస్తుతించి యున్నాఁడు.

చ. వరసర్వజ్ఞశిఖామణిన్ బ్రథితసద్వారప్రమోదాకరున్
నిరతోద్యత్ శివధర్మసంచరుఁ, గళానీకాంచితావాసు, భా
స్వరలింగాన్వితదేహు, సర్వవిబుధవ్రాతామృతాధారు, భా
సురపాదున్ గలితారిఁ బాల్కుఱికి వంశ్యుం గొల్తు సోమాహ్వయున్.

పయిపద్యమున సోమన 'సర్వజ్ఞశిఖామణి' గా సంభావింప బడి యున్నాఁడు. ఇట్టి సర్వజ్ఞత్వమును, సర్వాతిశాయిపాండిత్యమును గేవలగురుకుల వాసక్లేశమువలననే నేర్పఁ దలఁచినచో సామాన్యముగా సంపూర్ణాయుర్దాయముతోఁ గూడిన యొక్క జన్మమును కూడఁ జాల దనియే చెప్పవలయును. కాన, సోమనకుఁ దనగురువులమూలమునఁ గలిగినవిద్యాసంస్కారము నామమాత్రమే యనియుఁ, గాళిదాసకవి పార్వతి విద్యాభ్యాసవర్ణనసందర్భమునఁ జెప్పిన 'ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః' అనుసూక్తి సోమనాథునివిషయమునఁ జక్కఁగా ననువర్తించు ననియు భావింపఁ దగును. సోమనవంటి యవతార పురుషులకే కాని, యన్యదుర్లభ మగు నట్టియఖండవిద్యావైభవ మితరులకు నలవడ నేరదు. కావుననే సోమనను 'భృంగీశ్వరుని యవతారము' గా శైవులు సంభావించిరి. బసవేశ్వరుని చరిత్రమును లోకమున వెలయింపఁ జేయుటకై శివునియానతిపై భృంగిరిటి యను గణము పాల్కుఱికి సోమనాథునిరూపమున నవతరించె నని పిడుపర్తి సోమన –

'అసదృశ తన్మహామహిమ మారవితారకమై వెలుంగ శ్రీ
బసవపురాణమున్ సకలభక్తకథామణిసూత్రభాతిగా
వెస రచియింపు మీవు పృథివీస్థలికిం జని నాఁగ సం
తసమునఁ బుట్టెఁ బాల్కుఱికిసోమపురీవర సోమనాథుఁడై.'

అను పద్యమునఁ బేర్కొని యున్నాఁడు.

ఇంతియే కాక పిడుపర్తి సోమన తన పద్యబసవపురాణములో సోమనాథుని సామర్థ్యములు నీక్రిందిపద్యమున మిక్కిలి వివరముగా, హృదయంగమముగా వర్ణించి యున్నాడు.

సీ. లిపి లిఖింపక మున్న యపరిమితార్థోక్తి శక్తి యాతనిజిహ్వ జరుగుచుండు
ఛందోధికరణాదిసరణిc జూడక మున్న మది నుండుc గావ్యనిర్మాణశక్తి
తర్కశాస్త్రాదివిద్యలు పరింపక మున్న పరపక్ష నిగ్రహప్రౌఢి వెలయు
భాష్యసంగతులు చెప్పంగc జూడక మున్న రుద్రభాష్యక్రియారూఢి వెలయు

గీ. నతని నుతియింప నాబోటి కలవి యగునె?
జైనమస్తకవిన్యస్త శాతశూల
కవితబిజ్జల తలగుండు గండబిరుద
శోభితుcడు పాల్కుఱికి సోమనాభిధుండు.

పయిపద్యములో సోమనాథునికిc గల యాశుకవితాసామర్థ్యమును, ఛందః ప్రానమునకు మున్నే మనస్సులో మెదలాడుకావ్యనిర్మాణశక్తియు, నాతనికిc గల పరపక్ష నిగ్రహప్రౌఢియు, రుద్రభాష్యక్రియారూఢియుc బ్రస్తావింపc బడినవి.

ఇట్లు ప్రాచీనకవీశ్వరులచే సంభావింపcబడుటయే కాక, సోమన తనగ్రంథము కొంc దాను జెప్పుకొనినవాక్యములను బట్టియుc గూడ నాతనిపాండిత్యము గ్రాహింప వచ్చును. పండితారాధ్యచరిత్రమున –

'నలిc బాల్కుఱికి సోమనాథుc డనంగ
వెలయువాcడను జతుర్వేదపారగుcడ'

*1-15 పుట.*

నని యాతcడు తన్నుcగూర్చి చెప్పుకొనెను. ఒక్క నిగమాగమములే కాదు వాంగములే కాదు, సంస్కృతవాఙ్మయమునందలి సమస్తస్మృతిపురాణేతిహాసములను, సకల శాస్త్రములను సంపూర్ణముగా నాకళించుకొనిన విద్యావిశారదుc గాతcడు. అతcడు రచించిన సోమనాథభాష్యము, చతుర్వేదసారము మున్నగుకృతులందులకు దృష్టాంతములు.

సోమనపాండిత్యము నిరుపమానమయినది. అతనిపండితారాధ్య చరిత్రమును చదివినవారి కాపాండిత్యవిస్తారమే కాక, దాని లోతు కూడ బోధపడును. అతcడు తన గ్రంథములలోనుదాహరించిన గ్రంథముల నామధేయములను జూచినc

జాలుసుఁ. మన కాశ్చర్యానందములు కలుగును. వేదవేదాంగములు, ఉపనిషత్తులు, గృహ్య సూత్రములు, స్మృతులు, శైవాద్యాగమములు, స్కాందాదిపురాణ, ఉపపురాణ, ఇతిహాసములు, వీరశైవధర్మ ప్రతిపాదకము లయినయాగమ గ్రంథములు, వ్యాకరణము, ఛందస్సు, తర్క, హఠయోగము, సంగీతము మొదలగు శాస్త్రములు పదింబదిగా నీతనికావ్యములు దుదాహరింపఁ బడినది.

గీర్వాణభాషయం దెంతటి యుద్దండపండితుఁ డైనను నితఁడు తనమాతృభాష యగునాంధ్రమునెడను, దదితర దేశభాషలవిషయమునను నుదాసీనత వహించినవాఁడు కాఁడు. ఇతనికి జానుతెనుఁగుపైఁ గల 'వలపుబలుపు' తెలుప నలవికాదు. ఇతని యాంధ్రభాషావైశారద్యమున కితఁడు రచించిన బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు ప్రబలనిదర్శనములు. ఈకృతులలోఁ గానవచ్చునన్ని యచ్చతెనుఁగుపదములు మఱి యేకృతులయందును నాంధ్రభాషలోఁ గానరా వనుట యతిశయోక్తి కాదు. అసత్య మంతకంటెఁ గాదు.

ఆంధ్రముననే కాక తక్కిన ద్రావిడ, కర్ణాటాది దేశభాషలయందును నీతఁడు చక్కని ప్రావీణ్యమును గడించి యుండెను. అష్టభాషాకవితా ప్రవీణుఁడ నని తన్నుఁగూర్చి యితఁడు స్వయముగాఁ జెప్పుకొనక పోయినను దత్ప్రావీణ్యమీతనికృతులలోఁ గాన వచ్చుటచేఁ గొంద ఱితరకవు లితనిగూర్చి యట్లే భావించిరి. వృషాధిపశతకములో నితఁడు బసవేశ్వరునికిఁ దెలుఁగు పద్యములతోఁబాటు సంస్కృతము, అరవము, కన్నడము, మహారాష్ట్రము అఱెభాష మున్నగునితరభాషలలోను స్తుతించియున్నాఁడు. పండితారాధ్య చరిత్రమునందలి పర్వతప్రకరణమునఁ బలుదేశములనుండి శ్రీశైలయాత్ర కరు దెంచిన పరుసలవరుసలను వారివారిభాషాపదములతో వర్ణించి యున్నాఁడు. ఆంధ్రకర్ణాట కవులలో నిట్టిసర్వంకషప్రతిభాపాండిత్యములు కల కవిసార్వభౌముఁడు మఱి యొకఁడు కాన రాఁడు. సోమనకాలమున శ్రీశైలము సకలదేశీయులకును యాత్రాస్థలముగు కూడలిస్థానముగా నుండినది. సోమన బాల్యమునుండియు శ్రీశైలయాత్ర కేఁగు చుండినవాఁ డగుటచే నచ్చట వివిధ దేశములనుండి యరుదెంచిన భక్తజనములతోడి గోష్ఠీ సాహచర్యసాంగత్యముల కలిమిచే నాతని కీ యన్యభాషాప్రవేశ పాండిత్యములు సులభముగా నలవడి యుండు నని భావింపఁ దగును.

సోమన గ్రంథములనుబట్టియు, నాతని గ్రంథములలో నాతఁడే స్వయముగాఁ దన్నుఁగూర్చి చెప్పుకొనినపలుకులనుబట్టియు నాతని వైదుష్యముయొక్క స్వరూపమును గొంత స్థూలముగాఁ దెలిసికొంటిమి. ఇఁక నతఁడు రచించిన బసవపురాణ, పండితారాధ్యచరిత్రములనుబట్టి యాతనికిఁ గలవైదుష్య విస్తార మెట్టిదో తెలిసికొందము.

సోమనాథునికి శ్రుతి స్మృతీతిహాసాదులతోఁ గలపరిచయ మాతఁడు బసవపురాణ, పండితారాధ్యచరిత్రములందుద్ధరించిన పెక్కు వేదమంత్ర భాగములవలన నెఱుక కందుచున్నది. అతనికి నష్టాదశపురాణములును, నందలి పౌరాణికగాథలును సుపరిచితములు. శైవాగమములు, శివదీక్షావిధులు నాతనికి వాచోవిధేయములు. బసవపురాణమున బసవేశ్వరుని చరిత్రము నభివర్ణించువ్యాజములో 'పూసలలోని దారము క్రియఁ బురాతన భక్తవితతిచరితల లోపల సంధిల్ల బసవచరిత మే వర్ణింతు' నని యాతఁడు వర్ణించెను. ఇఁక శాస్త్రములలో నాతనికి వేదాంతశాస్త్రము, సంగీతశాస్త్రము, వాస్తుశాస్త్రము, శకునశాస్త్రములకు మొదలగువానియందుఁ జక్కని పాండిత్యము కలదు. సంస్కృతవాఙ్మయము నతఁడు క్షుణ్ణముగాఁ జదివి చక్కఁగా జీర్ణించుకొనిన యసమాన ప్రజ్ఞాశాలి. చతుష్షష్టికళలలోఁ జౌర్యము, మృగయ యను వానియందు నతనికిఁ బరిచయము కలదు. వైద్యశాస్త్రమును, యోగములలో నొకభేదమగు హఠయోగమును నాతనికి సుపరిచితములు.

## సోమనాథునికిఁగల వేదవిజ్ఞానము

బసవపురాణమునందలి ప్రథమాశ్వాసమున బసవేశ్వరుఁడు తనతండ్రి యగు మండెఁగ మాదిరాజుతోఁ దన కుపనయనము వలదని వాదించుసందర్భము నందుఁ గాన నగుచున్నది. మఱియు, సప్తమాశ్వాసమున శివభక్తులయింటి కుక్కలకుఁ గూడ వేదమంత్రములు తెలియు నని బసవన నిరూపించునెడ సోమన తనకుఁ గలవేదములతోడిపరిచయమును, నందుఁ దనకుఁ గల పాండిత్యప్రాభవములను జక్కఁగా వినియోగించుకొనెను. ఇట్లు కథాసందర్భములం దచ్చటచ్చటఁ దనకుఁ గలవేదవిద్యాపరిచయమును వెల్లడి చేయుటయే కాక సోమన బసవపురాణము నందుఁ బదింబదిగా వేదమంత్రభాగముల నెన్నింటినో యుద్ధరించి చూపి, యవి ప్రమాణములుగా శివాధిక్యమును సంస్థాపింపఁ బూనుకొనెను. అట్టివానిలో గొన్ని-

'విశ్వత శ్చక్షు ఋత' – బస. 45.

'ఏక ఏవ హి రూపేణ' – బస. 55.

'ఏక ఏవ హి రుద్రః' – బస. 408.

'ఏవ మేత న్నిబోధత' – బస. 92.

'రసాన్ భక్తజిహ్వేంచ వే' – బస. 385.

'అణోరణీయాన్ మహతో మహీయాన్' – బస. 432.

'తద్విష్ణోః పరమం పదమ్' – బస. 172.

'సదాపశ్యంతి సూరయః' – బస. 474.

'బ్రహ్మాధిపతి బ్రహ్మణోధిపతి' – బస. 500. మొదలగునవి. మఱియు స్మృతిగ్రంథములనుండి కూడ నతఁడు కొన్ని వాక్యములను చేర్కొని యున్నాఁడు.

'సాధక స్సంస్మరే త్సదా' – బస 155

ఇత నికి నష్టాదశపురాణములతోను, నాపురాణములయందలి పౌరాణికగాథలతోను చక్కని పరిచయము కలదు. బసవపురాణములోని షష్ఠాశ్వాసమునందలి శివలెంక మందయ్యగారికథలోను (478, 479 పుటలు), సప్తమాశ్వాసమునందలి కక్కయ్యగారి కథలోను నితనికిఁ గలయీపరిజ్ఞానము వెల్లడి యగుచున్నది.

శివాగమములును, శివదీక్షావిధులను నితనికిఁ గరతలామలకములు. బసవపురాణమునందలి ద్వితీయాశ్వాసమున బసవేశ్వరుని బాసను, బసవేశ్వరుని శివాచార నిరతిని, నింకను జీఱితొండనంబి, హలాయుధుఁడు మొదలగు శివభక్తుల చరితముల నభివర్ణించుసందర్భమున నితనికిఁగల శైవధర్మవిజ్ఞానము తెలియును. మఱియు శివభక్తుల కథల నితఁ డెఱిఁగినంతగా మఱియొకఁ డెఱుఁగఁ డనియే చెప్పఁదగును. బసవపురాణమునందలి ద్వితీయాశ్వాసమున (104, 105 పుటలు), తృతీయాశ్వాసమున (156, 157 పుటలు), మఱియు నందే 192, 200, 201 పుటలు, చతుర్థాశ్వాసమున ( 285, 289, 327 పుటలు), షష్ఠాశ్వాసమున (449 పుట), సప్తమాశ్వాసమున ( 536, 537, 550 పుటలు) మున్నగుస్థలములలో నితఁడు పెక్కురు శివభక్తులకథలను, వారికి

సంబంధించిన ముఖ్యవిషయములను, గొన్ని స్థలములయందు వారిపేళ్లపట్టికను వర్ణించియుఁ, బ్రస్తావించియు వారియెడలఁ దనకుఁ గలభక్తిని మాత్రమేకాక వారిని గూర్చి తనకుఁ దెలిసినసర్వమును ననేకవిధములుగా నుపయోగించుకొని తన విజ్ఞానము నంతనుఁ బ్రదర్శించి యుండెను.

సంస్కృతవాఙ్మయమున నితనికి విశేషపరిచయము కలుగుటయే కాక, యితని కందుఁ జక్కని పాండిత్యమును గలదు. సంస్కృతవాఙ్మయమునుండి యతఁడు పెక్కు సూక్తులను గూడఁ దన బసవపురాణమునం దుదాహరించెను.

'కవయః కిం న పశ్యంతి' – బస. 13

'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్' – బస. 270

'అపుత్రస్య గతి ర్నాస్తి' – బస. 271

'సంసర్గజాః పాప గుణాః భవంతి' – బస. 311

'రాజ్యాంతే నరకం ధ్రువమ్' – బస. 366

'రాజానుమతో ధర్మః' బస. – 492

ఇట్లు సంస్కృతవాఙ్మయముతో సంబంధము కలిగియుండుటే కాక యితనికిఁ గావ్యశిల్పవిజ్ఞానమును సమధికముగానే కలదు. బసవపురాణమునందలి చతుర్థాశ్వాసమున 'ఒడయనంబి కథ' లోఁ బ్రసక్తానుప్రసక్తముగా విటుఁడు, విదూషకుఁడు, నాగరకుఁడు, పీఠమర్దకుఁడు ననునాయకసహాయులను బేర్కొనెను.

వేదాంతశాస్త్రమున నితనికిఁగల విజ్ఞానము బసవపురాణమునందలి షష్ఠాశ్వాసములోని తేడ్డరదాసయ్య కథలోఁ దేడర దాసయ్య జైనవిద్వాంసులతో జరిపినవాదమునందు వెల్లడియగుచున్నది. సంగీతశాస్త్రమునందును నితనికిఁ బ్రగాఢ మయిన పరిచయమే యున్నట్లు తెలియును. బసవపురాణములోని తృతీయాశ్వాసమున సకలేశ్వరవాదిరాజయ్యగారికథలోఁ బెక్కువీణల భేదములును, మార్గదేశిసంగీతభేదములును, పురుషరాగ, స్త్రీరాగ భేదములును బేర్కొనఁబడినవి. వాస్తుశాస్త్రమునను నితనికిఁ బ్రవేశము కలదు. బసవపురాణములోని తృతీయాశ్వాసమునందలి దీపదకలియారుకథలోఁ గోటల నిర్మాణమునుగూర్చియు (169 పుట), అందే (188 పుట) – ఉడుమూరి

కన్నప్ప కథలో దేవాలయనిర్మాణపద్ధతియు నభివర్ణించి తనకుఁ గల వాస్తువిజ్ఞానమును బ్రదర్శించెను. శకునశాస్త్రము కూడ నితనికిఁ దెలియును. సప్తమాశ్వాసమున (576 పుట) అల్లయ్య మధుపయ్యలకథలో దుష్టశకునములు కలుగుటను వర్ణించి తనకుఁ గల శకునశాస్త్ర పరిచయమును బ్రకటించెను. చతుష్షష్టికళలలో నొకటి యగు చౌర్యమును గూర్చిన పరిజ్ఞానమును నితనికిఁ గలదు. పంచమాశ్వాసమునఁ గన్నడబ్రహ్మయ్యకథలోఁ జోరుల పనిముట్లను, గన్నముల భేదములను పేర్కొనెను. వేఁటయందును నితనికి నభినివేశము కలదు. ఇది రెండు దెఱఁగులు. ౧. క్రూరమృగముల వేఁట, ౨. చేపలవేఁట. బసవ పురాణమునందలి పంచమాశ్వాసమున తెనుఁగు జొమ్మయ్యకథలో మృగయావర్ణనమును, జతుర్థాశ్వాసమున వివిధజాతులను బేర్కొనుసందర్భమునఁ జేపలవేఁటయు (238 పుట) మఱియు అడిభక్తునికథ నభివర్ణించుసందర్భము నందు (317 పుట) చేపల వేఁటను నభివర్ణించెను.

వైద్యశాస్త్రమునందును నితనికిఁ గొంతపరిచయమున్నట్లు తెలియును. బసవపురాణమునందలి తృతీయాశ్వాసములోని నాట్యనమిత్తండికథలో వాయురోగమునకు నౌషధములు తయారు చేయువిధానమును దెలిపియు (176 పుట), ఉడుమూరి కన్నప్పకథలో నేత్రరోగములను (195 పుట) బేర్కొనియు నితఁడు తనకుఁ గలవైద్యశాస్త్రపరిచయమును వెల్లడించెను. హఠయోగవిధానము కూడ నితఁడు బసవపురాణము నందు ప్రథమాశ్వాసమున (32, 33 పుటలు) వర్ణించిన తీరునుబట్టి యితనికిఁ దెలియునని యూహింపఁ దగును.

ఇట్లు, పాల్కుఱికి సోమనాథుఁడు శ్రుతి, స్మృతీతిహాసములను, నష్టాదశ పురాణములను, ఉపపురాణములను, వేదాంతము, సంగీతము, వైద్యము, వాస్తువు మొదలగుశాస్త్రములను, శైవాగమములను, జతుష్షష్టికళలను, సంస్కృతము నందలి కావ్యవాఙ్మయమును జక్కఁగా నధ్యయనము చేసి, తదధ్యయనమువలనఁ దనకు లభించిన వైదుష్యసంస్కారములను – బుట్టుకతోఁ దనకు సహజముగా నలవడిన కవితాప్రతిభతో మేళవింపఁ జేసి యుత్తమమత గ్రంథముగానే కాక గొప్ప సాహిత్య గ్రంథమును దీర్చి దిద్ది చిరయశస్సును సముపార్జించిన సత్కవిశ్రేష్ఠుఁ డని యాతని బసవపురాణాది గ్రంథములు తెలుపుచున్నవి.

కొందఱు విద్వాంసులదృష్టిలోఁ బాండిత్యము విషయమున సోమనాథుఁడు కవిసార్వభౌముఁడగు శ్రీనాథునికంటెను నూఱురెట్లెక్కువ. [1] శ్రీనాథుడు గౌడడిండిమభట్టు కంచుఢక్క నొకదానిని బగులఁ గొట్టఁ గలిగినచో మన సోమనాథుఁ డెన్ని ఢక్కలనైనను, నెట్టిఢక్కల నైనను బగులఁ గొట్టఁ గలవాఙ్మయధురంధరుఁడు, పాండితీచండుఁడు –

ఈయధ్యాయమునందుఁ జర్చింపఁబడినయంశముల సారాంశము నీక్రింది విధముగాఁ బేర్కొన వచ్చును.

౧. సోమనాథునికాలమునుగూర్చి పరిశోధకులలో ననేక భేదాభిప్రాయము లున్నవి. అతఁడు క్రీస్తుశకము పండ్రెండవశతాబ్ది యుత్తరార్ధమునను, బదుమూఁడవ శతాబ్ది పూర్వార్ధమునను జీవించియుండెనను బహుజనాంగీకృతవాదమే యంగీకరింపఁబడినది.

౨. సోమనాథునికిఁ బూర్వకాలమునందలి వాఙ్మయమును శాసనకవిత, పదరచనవములు, ఉపలబ్ధమగుచున్న కావ్యవాఙ్మయము, అనుపలబ్ధ మగుసారస్వతము అను శీర్షికలక్రిందఁ బరిశీలింపఁ బడినవి.

౩. నన్నయభట్టారకుఁడు, పావులూరి మల్లన్న, మల్లియ రేచన, నన్నెచోడుఁడు, మల్లికార్జునపండితుఁడు, వేములవాడ భీమకవి, అథర్వణాచార్యుఁడు, కవిభల్లటుఁడు లనువారు సోమనాథునికిఁ బూర్వము వెలసినకవులు.

౪. నన్నయభారతము, పావులూరిగణితము, కవిజనాశ్రయము, కువారసంభవము, అథర్వణభారతము అనుగ్రంథములు సంస్కృత మూలకములు. కాని, యాంధ్రీకరణవిధానము స్వతంత్రము. శివతత్త్వసారము స్వతంత్రరచన యయ్యును నది కావ్యము కాదు. శతకజాతిలోఁ జేరును. నన్నయభారతమునందుఁ దత్సమపదము లధికము. సంస్కృతవ్యాకరణ సంప్రదాయములు, సంస్కృతకారకచ్ఛాయలు నతని గ్రంథమున గోచరించును. సంస్కృతవృత్తముల నధికసంఖ్యలోఁ దనకవిత్వమునఁ బ్రవేశపెట్టెను. అతఁ డనుసరించిన చంపూకావ్యపద్ధతి సంస్కృతము ననుసరించినది. అతనిపద్యరచనా శైలి సాంస్కృతికము. అయ్యును నితఁడు కొన్నిసామెతలను, జాతీయములను దనగ్రంథమునఁ బ్రయోగించెను. దానిసంఖ్య యత్యల్పము. అచ్చటచ్చట

1. పండితారాధ్యచరిత్రపీఠిక: డ్క్టరు చిలుకూరి నారాయణరావుగారు: పుట. 88.

నావశ్యకమునుబట్టి యలంతియలంతి తెలుఁగు పద్యములను దేటమాటలలో రచించును. పావులూరి గణితములోని యాంధ్రీకరణపద్ధతి భారతాంధ్రీకరణమును బోలినదే. అందు దేశీయములగు మానాదికములు తెలుపునంతవఱకే దేశిగుణము కనఁబడును. రచనము సాంస్కృతిక మార్గముననే సాఁగినది. కవిజనాశ్రయమునఁ గందపద్యము లెక్కువ. నన్నెచోడుని కుమారసంభవమునందు దేశిసంప్రదాయములు కొన్ని యనుసరింపఁబడినవి. అయినను రచనము సాంస్కృతికముగనే బ్రాయికముగా గన్పట్టును. దేశిచ్ఛందస్సునకుఁ జెందిన పద్యము లధికముగా నున్నను నితఁడును నన్నయవలెనే సంస్కృతవృత్తముల నధికసంఖ్యలోఁ దనకవిత్వమునఁ బ్రవేశపెట్టెను. సామెతలు, జాతీయములు నన్నయలోఁ గంటెఁ గొంచె మధికముగాఁ గలవు. జానుతెనుఁగు ఇతనికవిత్వమున నొకయాశయముగా మాత్రమే యుండెను. శివతత్త్వసారమునందలి పద్యము లన్నియుఁ గందములే. ఇందు మంచి మంచిజాతీయములు కొన్ని ప్రయోగింపబడినవి. వ్యాకరణ విరుద్ధములగు ప్రయోగములు కూడఁ గొన్ని గలవు. సోమనాథుని భాషా ప్రయోగమున కీతనిభాషాప్రయోగము పూర్వరంగము. ఉపలబ్ధ మయినవేములవాడ భీమకవి చాటువులు, అధర్వణభారత పద్యములు, కవిభల్లటునిపద్యములు సాంస్కృతికశైలిలోనే నడచినవి. సోమనాథునికిఁ బూర్వముండిన ట్లూహింపఁబడు గద్యరచనలు సంస్కృతభూయిష్ఠములుగానే యుండెనని తలపఁబడుచున్నది.

శాసనములందును, బదరచములయందును దేశికవిత్వము కన్పట్టును.

౫. ఉద్యమకారుఁ డగువానికిఁ బ్రధానముగా సమ్యగవేక్షణము, సంకల్ప తీవ్రత, ధైర్యసాహసములు, ఆత్మప్రత్యయము, అవేశము, నిరుపమాన మయిన పాండిత్యము, తర్కనైపుణ్యములను లక్షణము లుండ వలయును. దేశికవిత్వోద్యమ ప్రవర్తకుఁ డగు పాల్కుఱికి సోమనాథునిలో నీలక్షణము లన్నియుఁ గలవు. అతనికి శ్రుతి స్మృతీహాసములు, అష్టాదశ పురాణములు, ఉపపురాణములు, వేదాంతము, సంగీతము, వైద్యము, వాస్తువు మొదలగుశాస్త్రములు, శైవాగమములు, చతుష్షష్టికళలు, సంస్కృతము నందలి కావ్యవాఙ్మయము, వివిధములగుదేశభాషలు – మొదలగువానియందుఁ జక్కని పరిచయము కలదు. వీని యన్నింటివలన లభించిన విజ్ఞానవ్రాతనికి దేశికవిత్వోద్యమ నిర్వహణమున నితర లక్షణములతోఁబాటు మిక్కిలిగా నుపకరించినవి.

# పంచమాధ్యాయము
# మార్గ, దేశి - వీని సమగ్రస్వరూపము - నిర్వచనము

ఆంధ్రవాఙ్మయమున దేశికవితోద్యమమును సాగించుటకుఁ గావలసిన యోగ్యతలు పాలకుఱికి సోమనాథునియం దెంతవఱకుఁ గలవో పూర్వాధ్యాయము నందుఁ బరిశీలించితిమి. అట్టి యోగ్యతలలో నాతఁడు సాగించిన యా దేశికవిత్వోద్యమముయొక్క సమగ్రస్వరూపమునుగూర్చి తెలిసికొనుటకు ముందు మార్గదేశిపద్ధతుల సమగ్రస్వరూపమునుగూర్చి సాకల్యముగాఁ జర్చించి తత్ఫలితముగా వాని కొక నిర్వచనమును గల్పించుకొనుట యావశ్యకమై యున్నది.

సంగీతము, నాట్యము, కవిత్వము అను లలితకళలయం దన్నిట నీమార్గదేశి భేదము లున్నట్లు పరిశీలనముబట్టి తెలియుచున్నది. సంస్కృతలాక్షణికులు కాని, కవులు కాని కవిత్వమున మార్గదేశివిభేదములను బాటించినట్లు కనఁబడదు.[౧] అట్టి విభేదమును బాటింపక పోవుటకుఁ గారణము లేక పోలేదు. సంస్కృతభాషయందుఁ జెప్పఁబడినకవిత్వము నియమబద్ధమై, సంప్రదాయవిధేయమై యుండును. ప్రాకృత భాషలయందుఁ జెప్పఁబడినకవిత్వమే దేశికవిత్వమగును. కనుక, సంస్కృతమునందు దేశి కవిత్వ ముండునవకాశమే లేదు. అందుచేతనే నియమపూర్వకముగా రచింపఁబడిన సంస్కృతకవిత్వమునందు మార్గదేశిభేద ముండునవకాశము లేక పోయినది. సంగీత శాస్త్రమునందు మాత్ర మిట్టి భేద మతిప్రాచీనకాలమునుండియు నున్నట్లు తెలియుచున్నది. దానిబట్టియే సంగీతశాస్త్రగ్రంథములు రచించిన సంస్కృతకవీశ్వరులు సంగీతమును మార్గమనియు, దేశి యనియు రెండు దెఱఁగులుగా విభజించి యుండిరి. సంగీతకళయం దిట్టిభేదము వాల్మీకి రామాయణకాలమునాఁటికే యున్నట్లు గోచరించును. వాల్మీకి రామాయణమునందలి బాలకాండమున శ్రీ రామచంద్రుని కుమారులగు కుశలవులు రామచోదితులై రామాయణమును మార్గవిధానమునఁ బాడినట్లు పేర్కొనఁ బడియున్నది. ఈక్రిందిశ్లోకమును జూడుఁడు:

౧. మా. ప్రాబ్బన్నయయుగము : డాక్టరు దివాకర్ల వెంకటావధాని : పుట. 359.

'తత స్తుతౌ రామవచఃప్రచోదితౌ
అగాయతాం మార్గవిధానసంపదా
స చాపి రామః పరిషద్గత శ్శనైః
బుభూషయా సక్తమనా బభూవ.'

బాలకాండము. చతుర్థసర్గ. 31 శ్లో.

శ్రీ శ్రీనివాస శిరోమణిగారు రచించిన వాల్మీకిరామాయణాను వాదములోని బాలకాండలో నీఘట్టమున నిట్లు కలదు.

'కుశలవులు అయోధ్యవీథులలో రామాయణం గానం చేశారు. పాడుతూ అది చూపించారు. 'పాట మనోహరంగా ఉంది. శ్లోకాలు అంతకన్నా మనోహరంగా ఉన్నవి. ఎప్పుడో జరిగింది ఇప్పుడు కన్నులఎదుట జరుగుతూ ఉన్నట్లు తోచింది' అంటూ అందరూ మెచ్చుకొన్నారు. ఈసంగతి విని రాముడు వాళ్లను కొలువుకూటానికి పిలిపించి పాడించుకొన్నాడు. ఆ దేవవర్చస్కులు వీణావేణుతాళవన్నిదంగాదులు మ్రోగుతూ ఉండగా అలాపించి రామాయణమహాకావ్యాన్ని **దేశిపద్ధతిని** పాడుతూ అభినయించ సాగారు. ఆగానానికి సదస్యులు అందరూ ఉప్పొంగి పోయారు. తన్మయులు అయినారు. అప్పుడు రాముడు ఆ కుశలవులను చూచి '**మార్గపద్ధతి**న ఆమహాకావ్యమును గానం చేయమని చెప్పాడు.'

ఈయనువాదమునఁ గుశలవులు తొలుత రామాయణమును దేశిపద్ధతిని బాడి, పిదప రామునిప్రేరితులై మార్గపద్ధతిని బాడినట్లు తెలుపఁబడి యున్నది. కాని, సంస్కృతమూలమును దీఘట్టమున వారు దొలుత దేశిపద్ధతిని బాడి రనుట కాధారము కానవచ్చుట లేదు. 'మార్గవిధాన' మని స్పష్టముగాఁ బేర్కొనినట్లు 'దేశివిధానము' అనుపదముగాని, తద్ద్యోతక మయినవిషయవర్ణనము కాని, యందుఁ గాన వచ్చుట లేదు.

మార్గవిధానమునఁ బాడవలసినదని శ్రీరామచంద్రుఁడు వారిని గోరినట్లుండుటచే నంతకు మునువు వారు 'దేశిపద్ధతిని' బాడి యుందురని యనువాదకు లూహించి యీ ఘట్టమున నట్లుగా వ్రాసి యుందురని తోఁచుచున్నది.

వాల్మీకిరామాయణమునకు రచిత మయిన 'తిలక' వ్యాఖ్యలో నీశ్లోకమునకు వ్యాఖ్యాన మిట్లు కలదు.[2]

తత ఇతి. రామవచః ప్రేరితా తౌ మార్గవిధానసంపదా, గానం ద్వివిధమ్, మార్గో దేశీ చేతి, తత్ర ప్రాకృతావలంబిగానం దేశీ, సంస్కృతావలంబి తం గానం మార్గః, తయోర్మధ్యే మార్గాఖ్యగానమార్గావలంబనసామగ్ర్యా అగాయతామ్, పరిషద్గతః సభాగతః స రామోఽపి బుభూషయా స్వచింతస్య చిరకాలం స్థిరీష యా ప్రబన్ధస్య గీతశ్రవణ ఆసక్తమనా బభూవ.

చదలువాడ సుందరరామశాస్త్రులుగారు రచించిన యాంధ్రతాత్పర్యసహిత వాల్మీకి రామాయణములో నీశ్లోకమున కాంధ్రతాత్పర్య మిట్లొసంగఁబడి యున్నది.[3]

'అంత రాముఁడు ప్రేరేపింపఁగానే యా కుశలవులు మార్గము, దేశి యనెడు గానప్రకారముల రెంటిలోను ముఖ్యమైన మార్గముమబట్టి పాడ నారంభించిరి. అంత రాముఁడును దిగ్గున లేచి వెళ్లినచో సభికులును లేవం జాలరు, దాన రసభంగ మగునని మెల్లగా సింహాసనమునుండి డిగ్గి సభఁ జేరి యాశ్రోత్రానంద మనుభవింపఁ గోరి వారి పాటను విన్ననాసక్తుఁ డయ్యెను.'[3]

పయిని బేర్కొనఁబడిన 'తిలకవ్యాఖ్య'ను బట్టి ప్రాకృతము నవలంబించిన గానము దేశి యదియు, సంస్కృతము నవలంబించిన గానము మార్గమనియు వ్యాఖ్యాతయాశయ మయినట్లు తెలియును. రామాయణము సంస్కృతమున రచింపఁబడిన కావ్యమే యగుట దానిని బాడుట మార్గపద్ధతియందే జరుగవలసియుండును. కనుక, కుశలవులు దానిని దేశిపద్ధతిని బాడియుండు ప్రసక్తి వచ్చుటకు వీలు లేదు. కాని, ప్రాకృతభాషా రచితము లయిన గేయములను బాడుట దేశిపద్ధతి యనియుఁ దంత్రీ లయబద్ధముగా నియమపూర్వక మయిన సంస్కృతభాషారచితములయినవాక్యములను బాడుట మార్గపద్ధతి యనియు - సంగీతమున నాకాలమునాఁటికే రెండు పద్ధతు లుండి యుండును. రామాయణమునందలి యీ 'మార్గవిధాన' ప్రశంసచేతనే యాకాలము నందలి 'దేశివిధాన' మనుమేయ మగుచున్నది.

2. Edited by: Wasudev Laxman Sastri Pansikar; Bombay 1930.
3. 1954 లోఁ బ్రకటితము. వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు.

'మార్గ' శబ్దము మృగ్ – వెదుకుట అనుధాతువునుండి యేర్పడినది. 'ఏమార్గిత్వం చతుర్షు వేదేషు అన్విష్య కృతత్వాత్' అని కల్లినాథుండు చెప్పియున్నాడు. దానిఁబట్టి మార్గపద్ధతి వేదములందు వెదకి సంగ్రహింపబడిన దని తెలియును. స్వరయుక్తముగా వేదములను గానము చేయువిధాన మీపద్ధతికిఁ జెందినదే యనవచ్చును. రామాయణము వేదప్రాయముగా భావింపఁబడుటచేతను – నది దేశభాష యగుప్రాకృత మందుఁ గాక సంస్కృతమునందు రచితమగుటచేతను దానిని గానము చేయువిధానము మార్గపద్ధతియే యయి యుండును. దీనిఁబట్టి పవిత్రములును, నుదాత్తములును నగు విషయములను – సంస్కృతభాషలో రచితము లయినవానిని గానము చేయుపద్ధతి 'మార్గ' మనియుఁ దద్భిన్నములయిన సామాన్యము లయినవిషయములను, ప్రాకృతాదిభాషలో రచితము లయినవానిని గానము చేయుపద్ధతి 'దేశి' యనియు నాకాలము నాఁటికే సంగీతమున నొకవ్యవస్థ యేర్పడి యుండును.

ఇట్లు వాల్మీకి రామాయణకాలమునుండి యు సంగీతమున మార్గదేశివిభేదములు ప్రచారమున నుండఁగాఁ దరువాతికాలమున సంగీత శాస్త్రగ్రంథములు రచించిన విద్వాంసులు వానికిఁ దమసంగీతగ్రంథములయందు లక్షణనిర్దేశము చేయుటకు యత్నించి కొంత వఱకు వానికిఁ గలభేదములను వింగడించి చూపిరి. శార్ఙ్గదేవుఁడు తన 'సంగీతరత్నాకరము' అను గ్రంథమునందు మార్గదేశివిభేదమును గూర్చి యిట్లు తెలిపి యున్నాఁడు.

*గీతం వాద్యం తథా నృత్తం*
*త్రయం సంగీత ముచ్యతే*
*మార్గో దేశీతి తద్ద్వేధా*
*తత్ర మార్గ స ఉచ్యతే॥*
*యో మార్గితో విరించాద్యైః*
*ప్రయుక్తో భరతాదిభిః।*
*దేవస్య పురత శ్శంభోః*
*నియతాభ్యుదయప్రదః॥*
*దేశే దేశే జనానాం యత్*

*రుచ్యా హృదయరంజకమ్।*
*గీతం చ వాదనం నృత్తం*
*త ద్దేశీ త్యభిధీయతే॥*
*యేషాం శ్రుతిస్వరగ్రామ*
*జాత్యాది నియమో న హి।*
*నానాదేశగతిచ్ఛాయా*
*దేశీరాగా స్తు తే మతాః॥*
*కామచారప్రవర్తిత్వం*
*దేశీరాగస్య లక్షణం।*
*నియమే సతి చే త్తత్ర*
*మార్గత్వ మనులక్షితమ్॥* — సంగీతరత్నాకరము.

బ్రహ్మాదులచే మార్గితమై - అనఁగా అన్వేషింపఁబడి యొక వ్యవస్థ కల్పింపఁబడినదై పరమేశ్వరుని సమక్షమందు భరతాదులచేఁ బ్రయుక్త మయినది మార్గ మనియు- నట్లుకాక దేశ దేశములయందలి జనులకు రుచించునట్లుగా - హృదయరంజనము కలిగించునట్లుగా నుండునది దేశి యనియుఁ బయిశ్లోకములయందు మార్గదేశిలక్షణములు పేర్కొనఁబడినవి. మఱియు నందే వహార్గదేశి రాగములకుఁ గలభేద మిట్లు తెలుపఁబడి యున్నది. శ్రుతిస్వరగ్రామజాత్యాది నియమములు లేక నానాదేశగతుల ఛాయలతో నొప్పుచుఁ గామచారప్రవర్తనమను లక్షణముతో నొప్పారుట దేశిరాగముల లక్షణము. నియమసహితమై సర్వదేశసమానమగురూపము గలిగి యుండుట మార్గరాగముల లక్షణము.

సంగీత సుధాకరము అనుగ్రంథమునఁ దత్కర్త యగు కాశీనాథుఁడు 'దేశి' లక్షణము నిట్లు తెలిపెను.

*'అధునా గీయతే య చ్చానియతం కామచారతః*
*దేశే దేశే ప్రచలితం తత్తత్త్వం దేశి సమ్మతమ్.'*

అనియతమై, కామచారిత్వము కలదై యాయాదేశములందే ది పాడఁబడుచుండునో యది యెల్ల 'దేశీ' యని వ్యవహరింపఁ బడును.

సంగీతదర్పణము అనుగ్రంధమున నిట్లు కలదు.

*'తత్త ద్దేశస్థయా రీత్యా యస్మా ల్లోకానురంజనమ్।*
*దేశే దేశే తు సంగీతం త ద్దేశీ త్యభిధీయతే॥'*

ఆయాదేశమునకుఁ జెందిన యే రీతిచేత లోకానురంజనమునది సాధింపఁబడునో యాదేశదేశములందలి సంగీతమునకు 'దేశి' యని పేరు.

రామయామాత్యుఁడు 'స్వరమేళకళానిధి' యనుగ్రంధమున – దేశీరాగాదిభిః ప్రోక్తం తద్గానం జనరంజనమ్ – అనుచో దేశీరాగములలోఁ గూడినయాగానము జనరంజనము కూర్చునని వచించియుండెను.

సంగీతశాస్త్రగ్రంధములయందలి పయిశ్లోకములును, శ్లోకభాగములును లోకజనరంజనము దేశిసంగీతమునకుఁ బ్రధానలక్షణమనుటను ముక్తకంఠములోఁ దెలుపుచున్నవి. సామాన్యజనులు శాస్త్రజ్ఞానము లేనివా రగుటచే హృదయరంజకమయిన దేశి సంగీతమునువలె బుద్ధిగమ్య మయినమార్గసంగీతము నాస్వాదింపఁ జాలరు. పండిత, పండిత జనము లట్లు కాదు. వారు దేశిసంగీతమును, మార్గసంగీతమును రెంటిని నాస్వాదించి యానందింపఁ జాలుదురు.

మార్గ, దేశిసంగీతములకే గాంధర్వము, గానము అని క్రమముగా నామాంతరములు సంగీతప్రపంచమునందుఁ గలవు. శార్ఙ్గదేవుఁడు తన సంగీతరత్నాకరమునందుఁ బ్రబంధాధ్యాయమున సంగీతమును రెండు రకములుగా విభజించి యందు మార్గమునకు గాంధర్వ మనియు, దేశికి గాన మనియు నామాంతరములు సూచించెను.

'గాంధర్వం గాన మిత్యస్య భేదద్వయ ముదీరితమ్.' ఈరెండు శబ్దములకును వ్యాఖ్యానము వ్రాయుచు సంగీతరత్నాకర వ్యాఖ్యాత యగు కల్లినాధుఁడు 'గాంధర్వం గానః, గానం తు దేశీ త్యవగంతవ్యమ్' అని తెలిపెను. శార్ఙ్గదేవు ననుసరించి రామయామాత్యుఁడు కూడ నీనామాంతరములను మార్గదేశిపర్యాయములుగా వాడెను. గాంధర్వ మనాదిసంప్రదాయసిద్ధ మని కూడ శార్ఙ్గదేవుఁడు నిర్వచించెను. అనాదిసంప్రదాయ మనుపదమును వ్యాఖ్యానించుచుఁ గల్లినాధుఁడు 'అనాదిసంప్రదాయ మిత్యనేన గాంధర్వస్య వేదవ దపౌరుషేయత్వ మితి సూచితం భవతి' అని తెలిపెను. దీనిఁబట్టి గాంధర్వము లేక మార్గ మనాదికాలమునుండియు వచ్చుచున్న దనియు నపౌరుషేయ మనియుఁ దేలును.

స్వరమేళకళానిధిలో రామయామాత్యుఁడు 'తత్ర లక్షణానురోధేన గాంధర్వం సంప్రయుజ్యతే' అనువాక్యమున గాంధర్వము లేక మార్గము లక్షణము ననుసరించి ప్రయోగింపఁ బడు నని తెలిపెను. మార్గసంగీతము పూర్వసిద్ధము లయిన లక్షణముల ననుసరించి ప్రయోగింపఁబడును. దేశి సంగీత మట్లు కాదు. అది లక్ష్యప్రధానము. పూర్వసిద్ధమయిన స్థిరలక్షణమేదియు దీనికి నుండదు. ఈవిషయమునే శార్ఙ్గదేవుఁడు తన సంగీతరత్నాకరమున నిట్లు తెలిపెను.

'య ద్వా లక్ష్యప్రధానాని శాస్త్రా ణ్యేతాని మన్వతే।
తస్మా ల్లక్ష్య విరుద్ధం యత్తచ్ఛాస్త్రం నేయ మన్యథా॥'

ఇచట 'ఏతాని శాస్త్రాణి' యనఁగా 'దేశీవిషయాణి' యని యర్థమని కల్లినాథుఁడు వ్యాఖ్యానించి యున్నాఁడు. దీనినిబట్టి మార్గము లక్షణము ననుసరించి యుండును. దేశిలో లక్ష్యములకే ప్రాధాన్యము.

సంగీతశాస్త్ర గ్రంథములయందలి పయివిషయముల నెల్లఁ గ్రోడీకరించి పరిశీలింపఁగా మార్గదేశిపద్ధతులకుఁ బ్రధానముగా నీక్రింది భేదములు గోచరించును.

| మార్గ సంగీతము (గాంధర్వము) | దేశి సంగీతము (గానము) |
|---|---|
| ౧. నియమసహితము. | కామచారప్రవృత్తి కలది. అనఁగా స్థిర మయిన నియమము లేనిది. |
| ౨. బ్రహ్మాదులచే మార్గితము. భరతాదులచేఁ బ్రయుక్తము. | నానాదేశజనులచే రుచ్యనుగుణముగా హృదయావర్జకముగాఁ బ్రయుక్తము. |
| ౩. పండితజనరంజకము. | సామాన్యజనరంజకము. |
| ౪. అనాదిసంప్రదాయసిద్ధము. | అప్పటికప్పుడు నూతనముగాఁ బ్రయుక్తము. |
| ౫. లక్షణప్రధానము. | లక్ష్యప్రధానము. |

సంగీతమునం దీ మార్గదేశిభేదములు పాలకురికి సోమనాథుని కాలమునఁ గూడ నుండినట్లు తద్రచితము లయిన గ్రంథములఁబట్టి తెలియుచున్నది. చూడుఁడు:

*సముధిగతసామవేదసంజాతసప్తస్వరోద్భూత విభ్రా*
*జిత 'దేశిమార్గ' సముల్లసితసాలంకారగానకళాకలాప*
*సముత్థిత నిరూపితోత్తమ లింగనాయక – అభీష్టఫలదాయక –*
*భక్తిభాండాగారసంపద్విధాయక – ప్రణమితచెన్నబసవ*
*దండనాయక – దేవ బసవా!*

<u>పంచప్రకారగద్య - ప్రథమగద్య.</u>

*లాలితశుద్ధసాళగములు బెరయఁ*
*గ్రాలుచు దేశిమార్గంబులు వెలయ*
*లలి ద్రుతమధ్య విలంబితంబులను*
*నలిఁ దాళమానమానంబులు నూపి.*

*బస. 3–208*

రాగములలోఁ గూడ దేశికాకు, దేశిమలహరి యనుపేర్లతో దేశిరాగములు సోమనాథునికాలమునందుండినది.

*గాధంబు లవి రాగకాకును బొచ్చ*
*గాధంబు మఱి దేశికాకును సింధు*
*... ... ...*
*చొఖ్ఖాయి యాదిగా సొగయు రాయములు*
*దలుకొత్త దేశాక్షి, ధన్నాసి, దేశి*
*మలహారి, సకలరామక్రియ, లలిత*
*సారంగ, నాట, గుజ్జరి, మేఘరంజి.*

*బస. 3–209*

నేఁటికాలమునఁ గూడ సంగీతమునం దిట్టి భేదము కలదు. మార్గ సంగీతము కర్ణాటకసంగీత (Classical Music) మనియు, దేశి సంగీతము లలితసంగీత (Lighit Music) మనియు నేఁడు వ్యవహరింపఁ బడుచున్నది.

సంగీతశాస్త్రమునందలి మార్గదేశిభేదములు, వానిలక్షణములు, వానికిఁ బరస్పరము కల తారతమ్యములు అనువిషయములనుగూర్చి తెలిసికొన్నపిదప నాట్య శాస్త్రమునం దిట్టిభేదము కలదేమో పరిశీలింప వలసి యున్నది.

తమిళమున 'శిలప్పధిగారమ్' అనుకావ్యమున అరంగేట్రు కాదై ( రంగాధిరోహణ గాథ) యను నధ్యాయమున 'చోళన్ కరిగాల్ పెరువళత్తాన్'

అనురాజుయొక్క యాస్థానమున మాధవి యనునర్తకి రంగాధిరోహణ మహోత్సవమునఁ జేసిన నాట్యము నభివర్ణించు ఘట్టమున నిట్లు కలదు.

'రా దవిల్ పురికుళల్ మాదవీ తన్నై
అదలుంపొదలుం అలిగుం ఎంఁడ్ ఇర్
కూరియ మూన్రిన్ బల్ఁదు కురై పడామల్
ఏలాన్డు ఏట్టే ఒర్ తంరాత్ అన్నిల్
నూల్కళల్ మన్నర్క్ కాట్టల్ వేణ్డి
*ఇరువహై క్కూత్తిన్ ఇలక్కణం అరిందే*
పలవహై క్కూత్తుం నిలక్కినిల్ పుణత్
పదినో రాదలుం పాట్టుం కొట్టుం
విదిమాణ్ కొళ్గయిన్ విళుగ అరిందే....'

ఇందు మాధవి యనువేశ్య ద్వివిధము లయిననాట్యము (ఇరువహైక్కూత్తిన్ ఇలక్కణం అరిందే) యొక్కలక్షణమును దెలిసి నాట్యము చేసిన ట్లభివర్ణింపఁ బడినది. ఆ ద్వివిధము లయిన నాట్యభేదము లేవో యందుఁ దెలుపఁబడ లేదు. కాని, యాగ్రంథమునకు వ్యాఖ్యానము (ఉరై) వ్రాసిన అడియాలత్తు నల్లార్ అను విద్వాంసుఁడు దాని కిట్లు వ్యాఖ్యానము వెలయించినాఁడు. ఈవ్యాఖ్యాత యొక్కకాలము సరిగాఁ దెలియ వచ్చుట లేదు. కాని యతఁడు నాచ్చినార్ కినియరుకుఁ బూర్వుఁ డని మాత్రము నిశ్చయముగాఁ జెప్పఁ దగును.

'ఇరువగైక్కూత్తావన – వసైక్కూత్తు, పుగళ్క్కూత్తు – వేత్తియల్, పొదు ఇయల్ – శన్తిక్కూత్తు, వినోదక్కూత్తు – అద్యం, తమిళ్ – ఇయల్బుక్కూత్తు, దేశిక్కూత్తు – యెన పలవగయ.'

దీనిలో ఇయల్బుక్కూత్తు మార్గనాట్యము. దేశిక్కూత్తు దేశినాట్యము.

'శిలప్పదిగారము' అను నీ తమిళకావ్యము నాధారముగాఁ జేసికొని శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు 'మంజీరగాథ' యనుపేరఁ దెలుఁగున నొక వచనకావ్యమును రచించిరి. అందుఁ గూడ నీ 'మార్గదేశి' నాట్యముల ప్రస్తావము కలదు. శిలప్పదిగారమునకుఁ దమిళమున వ్యాఖ్యానము రచించిన 'నల్లార్' అను నతఁడు చేసిన వ్యాఖ్యానానుగుణముగనే యాయుభయనాట్యముల ప్రస్తావము నందుండుట గమనార్హము. చూడుఁడు:

ప్రాకృతవాఙ్మయమున 'లీలావతికథ' కుఁ బ్రముఖస్థానము కలదు. అది యాంధ్రదేశమునకు సంబంధించిన యొకచారిత్రకకథ యనియు, నందాంధ్రదేశము లోని యనేకప్రాంతము లభివర్ణింపఁ బడెననియు శ్రీ మానవల్లిరామకృష్ణకవిగారు తెలిపి యున్నారు. అది క్రీస్తుశకము అఱు, ఏడు శతాబ్దములకుఁ జెందినకావ్యము. అందలి యవతారికలోని యీక్రింది ప్రసంగమునుబట్టి ప్రాకృతభాష దేశిపద్ధతికిఁ జెందిన దనువిషయము స్ఫురించును. చూడుఁడు:

'రాత్రి రమణీయంగా ఉంది. దానికి తగినట్టే శరత్కాలము గూడ మనో హరంగా ఉన్నది. ప్రేమాస్పదుడ వైననీవున్నూ (నాకు) స్వాధీనుడ వై ఉన్నావు. పరిజనులు కూడ అనుకూలురుగా ఉన్నారు. నాకు లేనిదంటూ లేదని అనుకొంటాను. కనుక, ఏదేనా మనస్సుకు ఇంపు పుట్టించే సంభాషణ గలదిగానూ, ఈప్రదోషకాలపు వినోదానికి తగినట్టిదిగానూ ఉన్న కొత్తకథ – చక్కని రసం ఉట్టిపడేదాన్ని, మహిళాజనానికి ఇంపు సంపాదించేదాన్ని సాధించండి' అని నాయిక నాయకుణ్ణి అడుగుతుంది.

ఇలా ఎంతో అమాయికత్వాన్ని వెల్లడిస్తూ అడిగిన ప్రియురాలిని చూచి ఆ కథానాయకుడు ఇలా అంటాడు.

'కవులు మూడు రకాలకథలే లోకంలో ఉన్నవన్నారు. దివ్యకథ అనీ, దివ్యమానుషికథ అనీ, మానుషకథ అనీ .... వాటిలో మాలాంటి అప్రాజ్ఞులు చెప్పే కథలు (లక్షణశాస్త్రాలు అనుసరించి చెప్పేవి కావు కాబట్టి) లోకంలో పరిహాసం పొందవు మరీ? నన్నెందుకు పరిహసిస్తావు? శబ్దశాస్త్రాన్ని వినైనా ఎరగనివాడికి బాగా మాట్లాడ్డానికేనా వీలు కా దంటారు కదా. అట్లాంటి స్థితిలో వికల మైనకథాబంధం మరి చెప్పే దేమిటి?' –

ఇట్లా అన్నప్రియుడి మాటలకు అతడి ప్రియురాలు అన్నదీ – ప్రియతమా!, ప్రియతమా!, ఏ శబ్దశాస్త్రం చక్కని ముద్దులుగురిసే సంభాషితం దారిని పాడు చేసి వేసిందో ఆ శబ్దశాస్త్రంవల్ల లాభం ఏముందీ? దేనిచేత అర్థం చాలా విశదంగానూ, దాపరికంలేని హృదయంతోనూ వెల్లడి అవుతుందో అదే మీ పాలిటికి శబ్దం అని నామతం. అంతేకాని అర్థం కాని లక్షణంతో ఏమి లాభం? కనుక అట్లాగే (అంటే, రాని వ్యాకరణాది లక్షణ శాస్త్రాలవైపు పోయి చెడగొట్టకోకుండా ఉండే సంభాషణలోనే) పరిశుద్ధంగా విప్పారిన హృదయం

దశరూపకము నాంగ్లములోనికిఁ బరివర్తించిన Prof Hass దొర, మార్గమును Higher style అనియు, దేశిని Lower style అనియుఁ బరివర్తించి యున్నాఁడు.

కాకతీయగణపతిదేవచక్రవర్తి సేనాపతియు, గజసైన్యాధ్యక్షుఁడును నగు జాయపసేనాని చక్రవర్తికోరికపై క్రీ.శ. 1253-54లో నరువది సంవత్సరములు దాఁటిన వయస్సున 'నృత్తరత్నావళి' యను నొకనాట్యశాస్త్రగ్రంథమును రచించెను. అందు రెండు ప్రధానభాగములు కలవు. ఒకటి భరతప్రోక్త మయిన మార్గనృత్తము. అం దీతఁడు అభినవగుప్త కీర్తిధరాచార్యుల ననుసరించెను. రెండవది దేశినృత్తము. ఈవిషయమున నతఁడు మతంగుని బృహద్దేశిని ననుసరించెను. ఇందొక్కొక్క భాగమునందును నాలుగేసి యధ్యాయములు కలవు. మొదటి యధ్యాయము నర్తనవివేకము. రెండవది అంగ నిరూపణము. మూఁడవది చారీస్థానక మండల లక్షణము. నాలుగవది కరణఅంగహార వివేచనము. అయిదవది దేశిస్థానక కరణభ్రమరీలక్షణము. ఆఱు, ఏడు, ఎనిమిది యధ్యాయములం దాకాలమునఁ దెలుఁగు దేశమునఁ బ్రాచుర్యము నంది యున్నదేశినృత్త పద్ధతులు - పేరణి, చర్చరి, దండరాసక, ఘటసరి, బహురూపము, చిందు, కోలాటము మొదలగునవి పెక్కు వర్ణింపఁ బడినవి.[౬] పాల్కుఱికి సోమనాథుఁడు కూడఁ దనపండితారాధ్యచరిత్రయందుఁ బలువిధము లయినదేశీనృత్తభేదములను బేర్కొనెను.

తమిళనిఘంటువునందుఁ గూడ (Tamil Lexicon) మార్గమ్ అనుపదమునకు A kind of dance అనియు - దేశీ, దేశికమ్ అనుపదములకుఁ గ్రమముగా A mode of dancing, A kind of dance అనియు నర్థము లొసఁగఁబడి యున్నవి. అట్లే, మార్గరాగమ్ అనుపదమునకు Musical Modes in vogue from ancient times అనియు, దేశీ యనుపదమునకు A specific melody type అనియు సంగీతపరముగాఁ గూడ నర్థములొసఁగఁబడి యున్నవి. దీనిఁబట్టి తమిళమునఁ గూడ మార్గదేశీభేదములు సంగీతకళయందును, నాట్యకళయందును గలవనుట నిరూపిత మగుచున్నది.

సంగీతనాట్యములందుఁ గనవచ్చు నీ మార్గదేశీ భేదములను భాషల కన్వయించి చూచినప్పుడు సంస్కృతభాషమార్గవిధానమునకును, దేశజనుల వ్యవహారమునం దున్న ప్రాకృతభాషలు దేశివిధానమునకు జెందు నని స్ఫురించును.

---

౬. నాట్యశాస్త్రము : డాక్టరు పోణంగి శ్రీరామఅప్పారావు : పుట *146.*

ప్రాకృతవాఙ్మయమున 'లీలావతికథ' కుఁ బ్రముఖస్థానము కలదు. అది యాంధ్రదేశమునకు సంబంధించిన యొకచారిత్రకకథ యనియు, నందాంధ్రదేశము లోని యనేకప్రాంతము లభివర్ణింపఁ బడె ననియు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తెలిపి యున్నారు. అది క్రీస్తుశకము ఆఱు, ఏడు శతాబ్దములకుఁ జెందినకావ్యము. అందలి యవతారికలోని యీ క్రింది ప్రసంగమునుబట్టి ప్రాకృతభాష దేశిపద్ధతికిఁ జెందిన దనువిషయము స్ఫురించును. చూడుఁడుః

'రాత్రి రమణీయంగా ఉంది. దానికి తగినట్టే శరత్కాలము గూడ మనో హరంగా ఉన్నది. ప్రేమాస్పదుడవైననీవున్నూ (నాకు) స్వాధీనుడవై ఉన్నావు. పరిజనులు కూడ అనుకూలురుగా ఉన్నారు. నాకు లేనిదంటూ లేదని అనుకొంటాను. కనుక, ఏదేనా మనస్సుకు ఇంపు పుట్టించే సంభాషణ గలదిగానూ, ఈప్రదోషకాలపు వినోదానికి తగినట్టిదిగానూ ఉన్న కొత్తకథ - చక్కని రసం ఉట్టిపడేదాన్ని, మహిళాజనానికి ఇంపు సంపాదించేదాన్ని సాధించండి' అని నాయిక నాయకుణ్ణి అడుగుతుంది.

ఇలా ఎంతో అమాయికత్వాన్ని వెల్లడిస్తూ అడిగిన ప్రియురాలిని చూచి ఆ కథానాయకుడు ఇలా అంటాడు.

'కవులు మూడు రకాలకథలే లోకంలో ఉన్నవన్నారు. దివ్యకథ అనీ, దివ్యమానుషికథ అనీ, మానుషకథ అనీ .... వాటిలో మాలాంటి అప్రాజ్ఞులు చెప్పే కథలు (లక్షణశాస్త్రాలు అనుసరించి చెప్పేవి కావు కాబట్టి) లోకంలో పరిహాసం పొందవు మరీ? నన్నెందుకు పరిహసిస్తావు? శబ్దశాస్త్రాన్ని వినైనా ఎరగనివాడికి బాగా మాట్లాడ్డానికేనా వీలు కా దంటారు కదా. అట్లాంటి స్థితిలో వికలమైనకథాబంధం మరి చెప్పే దేమిటి?' -

ఇట్లా అన్నప్రియుడి మాటలకు అతడి ప్రియురాలు అన్నదీ - ప్రియతమా!, ప్రియతమా!, ఏ శబ్దశాస్త్రం చక్కని ముద్దులుగురిసే సంభాషితం దారిని పాడు చేసి వేసిందో ఆ శబ్దశాస్త్రంవల్ల లాభం ఏముందీ? దేనిచేత అర్థం చాలా విశదంగానూ, దాపరికంలేని హృదయంతోనూ వెల్లడి అవుతుందో అదే మీ పాలిటికి శబ్దం అని నామతం. అంతేకాని అర్థం కాని లక్షణంతో ఏమి లాభం? కనుక అట్లాగే (అంటే, రాని వ్యాకరణాది లక్షణ శాస్త్రాలవైపు పోయి చెడగొట్టుకోకుండా ఉండే సంభాషణలోనే) పరిశుద్ధంగా విప్పారిన హృదయం

గల ఇంపైన కథలు విస్తారంగా 'దేశీమార్గం'తో ఒప్పి ఉండేటట్లు, దివ్య మానుషులకు చెంది ఉండేటట్లు చెప్పండి అని ఆ నాయిక అడిగింది.[౭]

లీలావతి (ప్రాకృతకావ్య మగుటచేత నిందలినాయిక 'దేశిమార్గముతో నొప్పి యుండునట్లు' చెప్పు మనుమాటకుఁ బ్రాకృతభాషలోఁ గథలు చెప్పుము - అనియే సందర్భమునుబట్టి యర్థము చెప్పుకొన వలసి యుండును.

భరతుని నాట్యశాస్త్రమునందుఁ గూడ దేశి లేక దేశీగతము అనునది ప్రాకృత పాఠ్యమునందలి భేదములలో నొకటిగాఁ బరిగణింపఁబడి యున్నది. చూడుఁడు:

'ఇంతవఱకును సంస్కృతపాఠ్యమును వివరించి యున్నాను. ఇప్పుడు ప్రాకృతపాఠ్యమును వివరింతును. సంస్కృతమే వ్యత్యస్తమును, సంస్కారగుణవర్జిత మగును అగునప్పుడు అది ప్రాకృత మనఁబడును. మఱియు ఇది నానావస్థాంతరాత్మకముగా ఉండును. నాట్యప్రయోగమందు ప్రాకృతపాఠ్యము సంగ్రహముగా మూఁడు విధములు. సమానము (తత్సమము), విభ్రష్టము (తద్భవము), దేశీగతము (దేశి లేదా గ్రామ్యము).'[౮]

అందే మఱొక్కచో గర్భసంధ్యంగ మగు 'మార్గము' అను భేదమునుగూర్చి యిట్లు తెలుపఁబడి యున్నది.

'మార్గము - తత్త్వమును (యథార్థము)ను దెలిపెడి వచనము మార్గ మనబడును.'

ఇది భాషనుబట్టియు, విషయమునుబట్టియు నేర్పడిన గర్భసంధిభేదముగాఁ దెలియుచున్నది. కనుక మార్గదేశిభేదములను భాషల కన్వయించినపుడు మార్గము సంస్కృతమును - దేశి ప్రాకృతమును దెలియఁజేయు చున్నవని తలపఁదగి యున్నది. ప్రాకృత భాషలవలెనే యాంధ్రకర్ణాటకాదిదేశ భాషలు కూడ దేశివిధానమునకే చెందును. సంస్కృతము నియతలక్షణము కలభాష. పాణిన్యాదులు దానికి స్థిర మయిన నియమములు కల్పించి వ్యాకరణములు రచించి యున్నారు. అది వేదకాలమునుండియు ననాదిసిద్ధమై వచ్చుచున్నది. అది పండితజనైకవేద్యము. పామరు లగువా రాభాషయందు రచితము లయిన

౭. గిడుగువారి సప్తతితము జన్మదినోత్సవసంపుటము : శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారి వ్యాసము :

౮. నాట్యశాస్త్రము : డాక్టరు పోణంగి శ్రీరామఅప్పారావు : పుట *481*.

కావ్యములఁ జదివి యర్థము చేసికొనఁ జాలరు. అందుచే సంస్కృతము మార్గవిధానమునకుఁ జెందును. లౌకిక సంస్కృత దృష్టితోఁ బరిశీలించినప్పుడు వైదికసంస్కృతమును దేశభాషలదృష్టిలోఁ బరిశీలించినప్పుడు లౌకిక సంస్కృతమును మార్గలక్షణలక్షితము లగుచున్నవి. ఆంధ్రకర్ణాటకాది దేశభాషలకుఁ గాలక్రమమున నియమము లేర్పడినను నవి జీవద్భాష లగుటచే నానియమములు స్థిరము లగునట్టివి కావు. అవి కాలము గడచుకొలఁది మాఱుట కవకాశము కలదు. అవి సంస్కృతమువలె ననాదిసిద్ధములు కావు. క్రీస్తుశకము ప్రారంభించిన తరువాతనే యీభాషలు పెక్కింటిలోఁ జెప్పుకొనఁ దగిన సాహిత్యముద్భవిల్లినది. ఈలక్షణములచేత దేశభాష లన్నియు దేశివిధానమునకుఁ జెందునని తెలియుచున్నది.

భాషకు సంబంధించిన యీ మార్గదేశి లక్షణములనే ప్రతిదేశభాషయందలి కవిత్వమునకును నన్వయింపవచ్చును. మానవ సంఘము మాటలాడ నేర్చినప్పటి నుండియుఁ బ్రతిదేశభాషయందును నేదో యొక రకమయినకవిత్వము సృజింపఁబడు చుండును. ప్రారంభదశలో దాని కొక నియత మయినవ్యవస్థ లేక పోవచ్చును. కాని, కాలము గడచినకొలఁది ప్రతిభాషయందలి కవిత్వమునందును గవిత్వాంగము లిట్లిట్లుండ వలయు నని నియమము లేర్పడు చుండును. అట్టి నియమములు లంతకు మునుపా భాషయందు వెలసిన కావ్యములలేదా కవితారచనముల యాధారమునఁ గల్పింపఁ బడినవి కావచ్చును. లేదా దేశమునఁ బ్రచురమై యున్న మఱొకభాషయందలి కవిత్వ నియమము లనుసరించుటవలన నేర్పడినట్టివి కూడఁ గావచ్చును. ఆ ప్రత్యేకభాషయందొక్కమహాకవి జన్మించి తనప్రతిభాసామర్థ్యములలో నూతనముగా నభ్యూహించి రచించిన కావ్యమువలన నాభాషాకవిత్వమున కొకవ్యవస్థ యేర్పడుటయు సంభావ్యమే. ప్రతి భాషయందును నిట్టికవిత్వనియమములను నిర్దేశించులక్షణగ్రంథములు వెలువడుచుండును. పండితులగువారు తత్తల్లక్షణానురోధముగానే యాయాభాషలయందుఁ గవిత్వమును వెలయించుచుందురు. కాని, యట్టి కవిత్వలక్షణము లేర్పడినతరువాతఁ గూడ నన్ని కాలములయందును బాండిత్యహీను లగువారును, బామరులును వివిధ సన్నివేశములలో భావోద్రేకము కలిగినప్పుడు కొంత కవితాసృష్టి చేయుచుందురు. వారు లక్షణగ్రంథములను జదివి తదనురోధమునఁ గవిత్వము చెప్పినవారు కాక పోవుటచే వారి కవిత్వమునందుఁ గవిత్వమునకు సంబంధించిన

లక్షణములు సంపూర్ణముగా గోచరింప కుండుట కవకాశము కలదు. అట్టివారు వెలయించినకవిత్వము నందు సంప్రదాయమునకు, నియమమునకు భిన్నము లయిన యంశములు గోచరించుచుండును. ఇట్లు ప్రతిభాషయందును రెండు రకము లయినకవిత్వము వెలయుట కవకాశము కలదు. ఆయాభాషలయందు లక్షణానుగుణముగా వెలయింపఁబడినదానిని దేశికవిత్వ మనియుఁ జెప్ప వచ్చును. ఈరెంటిలో మార్గకవిత్వము పండితజనులచే వెలయింపఁబడును. దేశికవిత్వము పాండిత్యహీనులచేతను పామరజనుల చేతను వెలయింపఁబడును. దేశికవిత్వమున సలక్షణమును, నియమబద్ధమును నగుభాష యుండును. వస్తుభావము లుదాత్తముగా నుండును. ఛందస్సు సంప్రదాయసిద్ధ మయి యుండును. రసపోషణముకూడ రసానుగుణముగా నుండును. దేశికవిత్వమున నిట్టి స్థిరమైన నియమము లేవియు నుండవు. మార్గకవిత్వము నేకాలమున నేదేశప్రాంతమువారు వ్రాసినను గొంత రూపసాదృశ్యము కలిగి యుండును. దేశికవిత్వ మట్లు కాక దేశకాలకర్తృభేదముల ననుసరించి మాఱుచు భిన్నరూపత నంది యుండును. ఇట్లు, ప్రతిదేశభాషయందలికవిత్వమునందును మార్గ దేశి, విభేదము లుండుట కవకాశము కలదు. కాని, యేదేశభాషయందైనను దొలుత దేశికవిత్వమును, నాతరువాతనే మార్గకవిత్వమును వెలయుచుండును. మార్గకవిత్వము వెలువడిన తరువాత (దల్లక్షణానురోధమునఁ గాలక్రమమున మార్గకవిత్వమే యొకప్రక్క వెలయింపఁబడుచు శిష్టసాహిత్యమున నది సముచితస్థానము నంది శోభిల్లుచుండఁగా మఱొక ప్రక్క పామర జనులచే సృష్టింపఁబడు దేశిసాహిత్యము కూడ దానికి సమానాంతరముగానే వర్ధిల్లుచుండును. కాలక్రమమున జనాదరపాత్రము లయిన కొన్ని దేశిపద్ధతులు మార్గకవిత్వమునఁ బ్రవేశించుటయుఁ దన్మూలమున నామార్గమునఁ గొంత దేశితనపులక్షణములు గోచరించుటయు గూడ జరగుచుండును. అట్లుకాక యొకకాలమున దేశికవిత్వముగా జనుల కాదరపాత్ర మయిన పద్ధతికి లక్షణ మేర్పడి తదనురోధమున నట్టివే మఱికొన్ని రచనలును నేర్పడినచో – నాతరువాతి కాలమున దేశిసాహిత్యమునఁ గ్రొంగ్రొత్తపోకడ లేర్పడుచోఁ దొలుతటికాలమున వెలసిన దేశి యాతరువాతికాలమువారి దృష్టికి మార్గకవిత్వమయి తద్భిన్న మయినది దేశికవిత్వముగాఁ జెల్లుటయుఁ గలదు.

సంగీతము, నాట్యము, భాష యను మూఁడు విషయములందును బాటింపఁబడుచుండిన మార్గదేశిభేదములను గవిత్వవిషయమునఁ గూడఁ

బాటించుట తొలుత కన్నడ భాషయందు జరగినది. కన్నడకవులు కవిత్వమునందుఁ బాటించిన యీరెండుభేదములను దరువాత నన్నెచోడుఁడు వారి ననుసరించి తెలుఁగునందుఁ బ్రవేశపెట్టెను. తెలుఁగున మార్గదేశికవితాసంప్రదాయముల ప్రస్తావన మన కొక్క నన్నెచోడుని కుమారసంభవము నందు మాత్రమే కానవచ్చుచున్నది. కుమారసంభవములోని పద్యములను గొందఱు లాక్షణికులు తమ తమలక్షణగ్రంథములో నుదాహరింపక పోలేదు. కాని, వారిలో నెవ్వరును నీవిషయమై యంతగాఁ బట్టించుకొనినట్లు కానరాదు. నన్నెచోడుని పద్యములను, నందలి భావములను ననుకరించిన కవులు మన పూర్వులలో ననేకులు కలరు. వారిలోఁ గూడ నెవ్వరును నీ ప్రస్తావన చేసి యుండలేదు. నన్నెచోడునికించుక తరువాతి వాఁ డని చెప్పఁదగు నృపధూర్జటి భీమయపండఁ (క్రీ.శ. 1145) డొక్కఁడు మాత్ర మీ మార్గదేశికవితా సంప్రదాయములను బ్రస్తావించి యున్నాఁడు. తెలుఁగునందలి యీ యుభయసంప్రదాయములనుగూర్చి చర్చించుటకు ముందు వీరికీ విషయమున నుద్బోధముఁ గొలిపినకన్నడభాషయందలి యీమార్గదేశి సంప్రదాయముల యునికినిగూర్చి కొంత యెఱుఁగుట ముఖ్యకర్తవ్య మై యున్నది.

కన్నడమున రచింపఁబడి లభ్యము లగుచున్న గ్రంథములలో నృపతుంగుఁ డను నామాంతరముకల అమోఘవర్షుఁ డనురాష్ట్రకూట చక్రవర్తి రచించిన 'కవిరాజమార్గము' మిక్కిలి ప్రాచీన మయినది. నృపతుంగుఁడు క్రీ.శ. 815 నుండి 877 వఱకుఁ బరిపాలించినవాఁడు. కవిరాజమార్గమున 'చత్తాణె', 'బెదండె' యనురెండు ప్రాచీనకావ్యభేదములు పేర్కొనఁబడినవి. అందు వానిలక్షణ మిట్లు చెప్పఁబడినది.

కందము మమలిన వృత్తము
మొందొందెడెగొందు జాతిజాణె నెయెబెడు
గొంది పరీళ మరెపేఱ
ల్సుందర రూపిం బెదెండె గబ్బమ దక్కుం
కంద ళ్ళుంవాగిరె
సుందరవృత్తం గళక్కరంచవుషదిమ
త్తంగీతకొ తిపదిగ
ళందు బుత్తెగెయ పేళ్దొడదు చత్తాణం

– కవిరాజ 1–34,35

ఒక కందపద్యము తరువాత నొక వృత్తమును రచించి యచ్చటచ్చట జాతులను బొదిగిన నదే 'బెదెండె' కావ్య మగునంట. చత్తాణ కావ్యమును గందపద్యబహుళ ముగాఁజేసి యం దక్కడక్కడ సుందరవృత్తములను, అక్కర, చవుపది, గీతికె, తిపది మొదలగువానిని నందముగాఁ జేర్చవలయునంట. ప్రాచీనము లగు నీరెండు కావ్య భేదములును కవిరాజమార్గమునకుఁ బూర్వము కన్నడభాషయందు వెలసిన దేశికవిత్వమునకుఁ జెందిన రచన లయి యుండును. అందచ్చటచ్చట వృత్తములు కూడ రచింపఁబడ వలయు ననుటచే మార్గపద్ధతి యప్పుడప్పుడే కన్నడమునఁ బ్రవేశించుచుండెనన వచ్చును.

కవిరాజమార్గమునందు పళగన్నడమును గూర్చిన ప్రస్తావములో దేశిని గూర్చి కొన్ని వివరములు కలవు. ఈ క్రింది పద్యములు చూడుఁడు:

**కవిరాజమార్గ - దోషాదోషానువర్ణన నిర్ణయం:**

క. దోష మినితెందు బగెదు
ద్భాషిసి తత్తినందు కన్నడం గళొళెందుం
వానుగియు మత్తియ లాఅదె
బెసరుగుం దేశి బేటె (వే) అప్పుడతిం (46 ప)

క. ఇంతు పురాణకవిగళ
సంతతగత మార్గగదిత దోషంగళుము
చింతిసిమత్తె న్నలివుదు
మంతటినలె బుధజనక్కె కెలవం పేళ్వం (47 ప)

క. నెలసిద కావ్యం కావ్య
క్కె లక్షణం నతత మెందె పళగన్నడమం
పొల (గి) తిసి నుడివరాగామ
బలహీనర్ దేసి యల్ల దెందటి దర్దుం (48 ప)

**పళగన్నడ స్వరూపం**

క. పొడవిపతి గొ (రవ) నెనె (పే)
ల్పడెయరు వరెకరిని కబ్బగర్ దూ (తా) నెయుం
(హడవనమఱె నిట్ట) సంగెం?
ముడి యొ (ళ) మార్గెందు నుడివ పళగన్నడమం (49 ప)

<u>పఱగన్నడదనిందె</u>

క. దొరకొండిరె సొగయిసు గుం
పురాణకావ్యప్రయోగదొళ్ తత్కాలం
విరసంకర మప్ప దేసిగె
జరద్వధూవిషయ సురత రస రసికతెవోల్ (50 ప)

పంప భారతము అను విక్రమార్జున విజయమున నీ మార్గదేశి కవితా విధానముల ప్రస్తావ మిట్లు కలదు. చూడుఁడు:

బగెయదు తప్ప దాగి మృదుబంధదొళొందువు దొందు (ది) దేసియొళ్
పుగువుదు పొక్క మార్గదొళె తప్పదు తళ్దొడె కావ్యబంధమొ
ప్పుగు మెళమావు కెందళరపూవిన బిణ్పొళెయింబఱల్దు తుం
బగలినె తుంటి కోగిలెయ బగ్గిసె నుగ్గియళొప్పువంతెవోల్.
(1-8 ప.)

రన్నకవియు 'నెగుల్దు రసం మనం గొళిసె వమార్గ మొడంబడె దేసి కబ్బమం, బగెగొళె లింత పేల్దదు' అనుచో నీరెండు కవితాప్రభేదములను బేర్కొనెను. మల్లికార్జునుని సూక్తిసుధార్ణవములో దేశిమార్గ మిట్లు ప్రస్తావింపఁబడినది. చూడుఁడు:

పదవిన్యాసన దేశిమార్గద విలాసం రూఢి వెత్తంగ హో
ర దలంకారద బంధభావ దెసకరి మెల్పొడి నొళ్ బందుకో
డిద నానారససారదాన మెసె దత్తెందొల్దుకెయ్కొండు మె
చ్చిద నా సూక్తి సుధార్ణవాద్యకృతి పాత్రశ్రీగె సోమేశ్వరం.

ఇట్లు కన్నడమునఁ గవిరాజమార్గముకాలమునుండియు మార్గదేశిభేదములు కవిత్వపరముగాఁ బాటించు సంప్రదాయ మున్నట్లు పయియుద్ధరణములనుబట్టి గోచరించును.

తెలుఁగున మార్గదేశిపదములను గవిత్వపరముగా వాడిన మొదటికవి నన్నెచోడుఁడు. అతని కుమారసంభవమునం దీక్రింది నాలుగు పద్యములలో దీని ప్రస్తావము కలదు. చూడుఁడు:

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలగుఁ బలువుర్.
– కుమా 1-23 ప.

చః సురవరులం బ్రగమంబున వచోమణిసంహతిఁ బూజ సేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సమ్మతిఁ జేసి కొల్చి వి
స్తరమతులు బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతి జేసి మనోముదంబునన్.

– కుమా. *1–24* ప.

కః మార్గ కుమార్గము, దేశి య
మార్గము వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నలంతి మహి సుకవులకున్.

– కుమా. *1–28* ప.

సీః దేశిమార్గంబులు దేశీయములుగా, న
లంకారములఁ దా నలంకరింప.

– కుమా. *1–36* ప.

కన్నడ కవులను, గన్నడకవితాసంప్రదాయములను బెక్కుసందర్భములలో ననుసరించిన నన్నెచోడుఁ డీమార్గదేశివిభేదముల ప్రస్తావమును కన్నడమునుండియే పరిగ్రహించి యుండునను. సంగీతశాస్త్ర గ్రంథవములనుండి యు, నాట్యశాస్త్రగ్రంథముల నుండియు నాయాశాస్త్రములయందున్న యీమార్గదేశిభేదములను నన్నెచోడుఁడు తనగ్రంథమున గ్రహించి యుండఁ గూడదా యని ప్రశ్నింపవచ్చును. అతఁడు దానిని గవిత్వపరముగా వాడియుండుటచేతను, నతనికిఁ బూర్వము కన్నడములోఁ గవిత్వపరముగానే యీరెండువిభేదములను వాడఁబడి యుండుటచేతను – కన్నడకవులను, కన్నడసంప్రదాయములను బెక్కు సందర్భములలో ననుసరించిన నన్నెచోడుఁడు వీనివిషయమునఁ గూడఁ గన్నడమునే యనుసరించి యుండుట సంభావ్యమగుట చేతను నతఁడు వానిని గన్నడమునుండియే పరిగ్రహించి యుండుననుట సత్యమునకు సన్నిహితముగా నుండును. ఇట్లు, వాని నీతఁడు కన్నడమునుండి పరిగ్రహించెనను నిశ్చయమునకు వచ్చినతరువాత నతఁడు తనగ్రంథమునందు మార్గదేశికవిత్వములుగాఁ బరిగణించిన కవిత్వము లెట్టివో పరిశీలింప వలసి యున్నది. అనఁగా నాయాపద్యములకుఁ జక్కని యర్థసమన్వయము కలిగించి యాతఁ డేయేయర్థములందాయుభయపదములను వాడెనో యరయ వలసి

యున్నది. తొలుత మార్గదేశివిభేదములను బేర్కొనిన యీ క్రిందిపద్యమున కర్థసమన్వయము చేయుటకు యత్నింతము.

క: మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

నన్నెచోడుఁడు కావ్యారంభమునందుఁ దొలుత నిష్టదేవతాప్రార్థనముఁ గావించి యాపిదప గురుస్తుతిని నిర్వర్తించి తరువాతఁ బూర్వకవిస్తుతిఁ గావించెను. ఆకవి స్తుతియందు వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, భారవి, ఉద్భటుఁడు, బాణుఁడు అను సంస్కృతకవులను గణముగా స్తుతించెను. ఆ తరువాత మార్గదేశికవితాప్రస్తావము కల పయి పద్యము రచింపఁబడియున్నది. తొల్లి మార్గకవిత లోకమునందుఁ బ్రచారమున నుండఁగాఁ జాళుక్యరాజాదు లగుపలువురు దేశికవితను బుట్టించి యాంధ్రదేశమునఁ దెలుఁగును నిలిపి రని యాపద్యము తెలుపుచున్నది. అనంతర మీక్రిందిపద్యము కలదు.

చ: సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజసేసి మ
ద్గురువరనారవిందములకుం దగ నమ్రతిఁ జేసి కొల్చి వి
స్తరమతులు బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁజేసి మనోముదంబునన్.

– *కుమా. అవ. 24.*

ఇం దాతఁడు తాను గావ్యారంభమునఁ గావించిన స్తుతిక్రమమును సింహావలోకనము చేసి యున్నాఁడు. కాని, కావ్యారంభమున నాతఁడు సురవరులను, గురువును, బురాణకవిసంఘమును బ్రత్యేకప్రత్యేకముగా స్తుతించినట్లు మార్గదేశికవుల నాతఁడు స్తుతించి యుండలేదు. ఈమార్గదేశికవు లెవరో మనకుఁ దెలియదు. తెలియుట కవకాశము లేదు. అయితే కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రములో నన్నెచోడుఁడు కృత్యాదిని స్తుతించిన వాల్మీకి వ్యాసులను బురాణకవులుగను, కాళిదాసు మొదలుగాఁ గల సంస్కృతకవులను మార్గకవులుగను బరిగణించి, నన్నెచోడుఁడు దేశికవులను స్తుతించుచు రచించినపద్యము లేఖకప్రమాదవశమునఁ దాళపత్ర గ్రంథమునందు వ్రాయఁబడక వదలిపెట్టఁబడి యుండునని తమ యభిప్రాయమును వెల్లడించిరి.

కాని యాయూహ యెంతవఱకు నిజమో చెప్పఁజాలము. మఱికొందఱు 'దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి' యనుటలోనే వారిస్తుతి యిమిడి యున్నదనియు, నందుకే దేశికవుల స్తుతించుచున్న పద్యము మనకు లభింప లేదని తలఁప నవసరము లేదనియు నభిప్రాయ పడుచున్నారు.[౯]

స్తుతి సింహావలోకనము నొనరించిన పిమ్మట నాతఁ డొక పద్యమున విబుధ వర్గమును దలపోసి యనంతరము కుకవినింద సేయుచు నీక్రింది పద్యమును రచించెను.

క: మార్గ కుమార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్.

– కుమా. అవ. *28*

మార్గ కుమార్గ మనియు, దేశియే మార్గమనియు, నట్లయ్యు దుర్మార్గ పదవర్తు లయి చరించుమార్గవులను సుకవులు తలఁప నక్కఱ లే దనియు నీపద్యమున కర్థము చెప్పఁ బడుచున్నది.

పయి మూఁడు పద్యములయందలి యన్వయసందర్భములు పరస్పర విరుద్ధములు కాకుండునట్లును – నర్థసమన్వయము చక్కఁగాఁ గుదురునట్లును మన మందలి మార్గదేశిపదముల కర్థము చెప్పుకొనవలసియుండును. వాని కర్థసమన్వయము కుదుర్చుకొనుటకు ముందు వీని కర్థము కుదుర్చుటలోఁ గలచిక్కు లెట్టివో తెలిసి కొనుట యుక్తము.

నన్నెచోడుని 'మును మార్గకవిత' యనుపద్యమున కర్థము చెప్పినవారు తొలుత భాషను మాత్రమే దృష్టిలో నిడుకొని దాని కర్థము చెప్పినట్లు గోచరించును. వారి యభిప్రాయమున మార్గ కవిత యనఁగా సంస్కృతకవిత్వము. దేశికవిత యనఁగా దేశభాషా కవిత్వము. దానినిబట్టి, తొల్లి సంస్కృతకవిత్వము లోకమునందు వెలసి యుండఁగాఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువురు దేశికవిత్వమును అనఁగా తెలుఁగు కవిత్వమును బుట్టించి యాంధ్రవిషయమునఁ దెలుఁగును నిలిపిరని యాపద్యమున కర్థము చెప్పుకొనవలసి యుండును. ఇట్లు సంస్కృతకవిత్వమే

౯. కుమారసంభవ విమర్శము : శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

మార్గకవిత్వ మని భావించినచో నన్నెచోడుని కవిస్తుతియందుఁ గొంత వైరుద్ధ్యము గోచరించును. 'సురవరులం గ్రమంబున' అనుపద్యమున నతఁడు పురాణకవిసంఘమును, మార్గసత్కవీశ్వరులను బ్రత్యేకప్రత్యేకముగాఁ బేర్కొని యున్నాఁడు. సంస్కృతకవు లయినవారందఱును మార్గకవులే కదా. అట్లైనచో వారిలోఁ గొందఱిని బురాణకవులుగను మఱికొందఱిని మార్గకవులుగను బేర్కొనుటకుఁ గారణము కనఁబడదు. నన్నెచోడుఁడు కుకవినిందఁ గావించిన 'మార్గ కుమార్గ' మిత్యాదిపద్యమున మార్గ కుమార్గ మనియు, దుర్మార్గ పదవర్తులనఁదగుమార్గకవులు దలఁప నలఁతి మహి సుకవులకున్ అనియుఁ బేర్కొని మార్గవులను కుకవులుగాఁ బరిగణించి యుండెను. ఈమార్గవులు మార్గకవులే యని భావించినచో నిందు వారిని గూర్చి చేసిన నిందకును – కవిస్తుతిలో వాల్మీకి వ్యాసాదులను బ్రత్యేకప్రత్యేకముగా స్తుతించుటకును – సురవరుల ననుపద్యమున 'నుత్తమమార్గ సత్కవీశ్వరులను సంస్తుతిఁజేసి' యని వారియెడ గౌరవముఁ బ్రకటించి యుండుటకును బరస్పరవైరుద్ధ్యము గోచరించును. నన్నెచోడుఁడు సంస్కృతకవులను గాని సంస్కృత కవిత్వమునుగాని నిందించి యుండుట యసంభవము. కనుక నచ్చటిమార్గవులు సంస్కృతకవులకంటె భిన్ను లే యయి యుండ వలయును. అదియును గాక 'దేశి యమార్గము' అనునెడ దేశియందలి యమార్గ మని దాని కర్థము చెప్పుట యంత యుచితముగాఁ దోఁపదు. దేశి + అమార్గము, దేశియ + మార్గము అని కాని యచట నర్థము చెప్పుకొన వలసి యుండును. అట్లైనచో మార్గ కుమార్గ మనియు, దేశి యమార్గమనియు నన్నెచోడుని యభిప్రాయ మయినట్లు మనము తలఁపవలసి యుండును. కాని, మార్గదేశికవిత్వములను గూర్చి యతనికట్టి యభిప్రాయము లే దనువిషయ మాతఁడు మార్గకవులను, దేశికవులను స్తుతించుటనుబట్టియే వ్యక్త మగుచున్నది. అందుచేత మార్గ కుమార్గ మనియు, దేశి యమార్గ మనియు నిరసించి దుర్మార్గపదవర్తు లయి చరించు మార్గకవులు కారు. అతనిచేత స్తుతింపఁ బడిన మార్గకవులు మార్గ సత్కవీశ్వరులు సంస్కృతకవులకంటె భిన్నులు. పురాణ కవిసంఘము అనుపదముచేతనే సంస్కృతకవుల నందఱిని నాతఁడు పేర్కొని యుండుటచే మార్గసత్కవీశ్వరు లనుపదము తద్భిన్ను లయినకవీశ్వరులనే సూచించునన వలసి యున్నది.

ఈ సందర్భమున శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ కుమారసంభవ పీఠికలో వ్రాసిన యీవాక్యములు గమనింపఁదగి యున్నవి.

'మును మార్గకవిత లోకంబున వెలయఁగ నని నన్నిచోడుఁడనుటలో నన్నయకు పూర్వమునఁ గల స్థితినిగూర్చి చెప్పుచున్నా డన్నచో నప్పటి కాతనిదృష్టిలో నున్న కన్నడభాషలోని మార్గపద్ధతినే యుద్దేశించినా డనియు నది లోకమున వెలయఁగా చాళుక్య రాజు మొదలగు పలువురు (నన్నయకు పూర్వమే) తెలుగులో దేశికవితకు ప్రోత్సాహమిచ్చి తెలుగున దేశికవితను వ్రాయించి శాసనాదులలోఁ గూడ పద్యముల నిలిపి రని యాతని యభిప్రాయముగా గ్రహింపదగి యుండును. తరువాత నన్నయకాలమున మార్గకవిత బయలుదేరినది. కాని, దానిలో దేశీయత తక్కువైనదను నుద్దేశముతో తాను దేశిమార్గములను దేశీయములుగాఁ జేసి చెప్పఁదలఁచినట్లు సూచించినాఁడు. మార్గ కవిత దేశభాషలో లక్షణానుసారమైనకవిత ని గాక – సంస్కృతకవిత యనియే చెప్పెనవో కుకవినిందలో 'మార్గకుమార్గము' అన్నప్పుడు సంస్కృతకవిత్వము వీరికి దెలియనిది అని చెప్పెనా డనవలె. ఈ గ్రంథముననను అందు కుకవులనుగూర్చి చెప్పునపుడును సంస్కృతభాషాకవిత్వప్రశంస యేల? తద్భాషాకవులను నిందింప నేల? వారిని స్తుతించియే యున్నాఁడు. ఇక కవిరాజమార్గాదుల మార్గపద్ధతి ననుసరింపక తెలుగు సంస్కృతములను బులిమిపుచ్చు (దు) ర్మార్గులనే నిందించినాడు.'౧౦

దీనింబట్టి నన్నయకుఁ బూర్వము కన్నడమున మార్గకవితాపద్ధతి యుండఁగా జాళుక్యరాజాదు లగుపలువురు తెలుఁగున దేశికవితఁ బుట్టించి రనియు, నాతరువాత నన్నయ కన్నడము ననుసరించి తెలుఁగున మార్గకవిత్వమును వెలయించె ననియు, నాపిదప నన్నెచోడుఁడు తెలుఁగుకవితయందు దేశీయత తక్కువ కాఁగా దేశిమార్గము లను దేశీయములుగాఁ జేయ యత్నించె ననియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి యభిప్రాయ మయినట్లు తెలియుచున్నది. డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు కూడ నిదే యభిప్రాయమును మఱింత విపులముగాను, సప్రమాణముగాను జర్చించి ప్రాఙ్నన్నయయుగము అను గ్రంథమున సిద్ధాంతము చేసి యున్నారు.౧౧ దాని సారాంశ మిది.

నన్నెచోడుఁడు తనపద్యమున మును మార్గకవిత 'లోకంబున' వెలసి యుండె నని పేర్కొనెను. లోకంబున – అను శబ్దమును వాడుటలో నాతఁడు మార్గకవిత్వ మెుక్క యాంధ్రదేశమునందు మాత్రమే కాక యితరదేశములఁ గూడ వ్యాపించియుండె నని తెలుపఁ దలఁచినట్లు తోఁచును. నన్నెచోడునికిఁ దమిళ

౧౦. చూ. కుమారసంభవపీఠిక: శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు: పుటలు. *26, 27.*
౧౧. చూ. ప్రాఙ్నన్నయయుగము: డాక్టరు దివాకర్లవెంకటావధాని: పుటలు. *372–80*

కర్ణాటకభాషలతోఁ జక్కని పరిచయ మున్నట్లుకుమారసంభవవములనఁ దెలియుచున్నది. అందును దమిళభాషకంటెఁ గన్నడ మాతని కెక్కువ పరిచిత మని యూహించుట కవకాశ మున్నది. అతఁ డాభాషలోఁ బంపాదులు రచించి యుండిన కావ్యవముల నాదరవముతోఁ జదివి యుండవను. వరార్గ దేశికవితాసంప్రదాయము నాతఁ డందుండి గ్రహించి యుండును. అతఁడు 'లోకంబున' వెలసి యుండె నని పేర్కొనినమార్గకవిత కన్నడభాషలోఁ బంపాదు లనుసరించినమార్గకవితా పద్ధతి. చాళుక్యరాజాదులు తెలుఁగుదేశమున నట్టి మార్గకవిత్వమునుగాక, దేశికవిత్వమును బుట్టించి తెనుఁగును నిల్పుటకు యత్నించి యుండిరి. ఇందుఁ బేర్కొనఁబడిన చాళుక్య రాజు రాజరాజనరేంద్రుఁడు కాఁడు. అతని పూర్వులలో నొకఁ డయి యుండును. వారు పుట్టించి నిలిపిన దేశికవిత కొంత వంనకు నన్నయకుఁ బూర్వపుశాసనాదులవలన నెఱుఁగఁబడుచున్నది. అందలి పద్యములు సీసము, తరువోజ, మధ్యాక్కర మొదలగు దేశిచ్ఛందోభేదములకు మాత్రమే చెందియున్నది. రాజరాజే యాదేశికవితను బుట్టించినవాఁ డన్నచో నన్నయ భారతమే యాదేశికవిత యని చెప్పవలసి వచ్చును. కాని, యందలి కవిత్వస్వభావమును బట్టి చూచినచో నది మార్గకవిత్వమే కాని, దేశికవిత్వము కాదు.

కన్నడమున మార్గకవితాపద్ధతితోఁబాటు మణిప్రవాళ కవితాపద్ధతి కూడఁ గవిరాజ మార్గకాలమునాఁటికి వ్యాప్తిలో నుండెను. కవిరాజమార్గమునఁ దక్కర్త పఱగన్నడభాషా ప్రయోగమును నిరసించి సమసంస్కృతమునే దేశభాషలయందుఁ గలుప వలెను గాని కేవల సంస్కృతపదములను గలుప రా దని నియమము గావించి యుండెను. మఱియు అహరహః, ఉచ్చైః, నీచైః, ముహుర్ముహుః ఇతస్తతః పునః, అతః, బహిః మున్నగు వానిని కన్నడభాషావాక్యమున వాడఁ గూడ దని శాసించి యుండెనవ. అట్లు వాడినచో గరిడియునవ, మద్దెలనవ నొక్కవాఱు వాయించుటవలనఁ గలుగుజర్ఝరధ్వని కలుగు ననియు, సమసంస్కృత పదములతోఁ గలిపి చెప్పినది మృదంగసంగీతకాది మధురరవమును బోలు ననియు నాతఁడు వివరించి యుండెను. అరసకుమార – ఇత్యాది మిశ్రసమాసము లను బరిహరింప వలె నని కూడ నాతఁడు సూచించి యుండెను.

కేతన కూడఁ దన యాంధ్రభాషాభూషణమున – వృక్షేణ, దక్షాయ, పక్షిభిః, పుత్రస్య యను సంస్కృతభక్త్యంతపదములను – అస్తి, ప్రయాతి, గాయంతి, భుంక్తే

మున్నగు క్రియాపదములను – గత్వా, హసిత్వా, ప్రకాశ్య, సంత్యజ్య, మొదలయిన క్త్వార్థకల్యబంతములను, హంతుం మున్నగు తుమున్నర్థకరూపములను – ఆపి, చ, తు, హి, వై, స, వా యను నవ్యయములను దెలుఁగునఁ బ్రయోగింప రా దని తెలిపి యుండెను. నన్నయభట్టునకు సంస్కృతవిభక్త్యంతశబ్దమును దెలుఁగున యథాతథముగాఁ బ్రయోగించుట సమ్మతము కా దని యాతని భారతము వలనఁ దెలియు చున్నది. పాల్కుఱికి సోమనాథుఁడు తన వృషాధిపశతకమున మణిప్రవాళ భాషలో నొకపద్యమును వ్రాసి యుండెను. తిక్కన తన నిర్వచనోత్తరరామాయణము నందు 'జాత్యము గాని నొప్పయిన సంస్కృతమెయ్యెడఁ జొన్ప' నని తన కవిత్వాశయమును వెల్లడించి యుండెను. వీని యన్నిటినిబట్టి యొకకాలమున నిట్లు మణి ప్రవాళ భాషయందుఁ గవిత్వము చెప్పు పద్ధతి కన్నడమునందును, తెనుఁగునందును గూడ వ్యాప్తిలో నుండినట్లు తెలియుచున్నది. ఆకాలమునందు సంస్కృతములుగాఁ జేసి వాడుటకుఁ గాని, కేవలదేశభాషాపదములనే వాడుటకుఁ గాని యిచ్చగింపక సంస్కృతపదములను దేశభాషా పదములతోఁ గలిపి వాడు మణిప్రవాళశైలి నభిమానించి యుందురు. కన్నడమునఁ గవిరాజమార్గమునకుఁ దరువాత మార్గకవితాపద్ధతికి ఘంటాపథ మేర్పడెను. కన్నడ కవులా మార్గమునే నిశ్శంకముగా నవలంబించిరి. పంపాదుల కావ్యము లట్టిమార్గ కవితాపద్ధతిని రచింపఁబడినట్టివే. దానిప్రభావము తెలుఁగుదేశముపైఁ గూడఁ బ్రసరించినది. తెలుఁగు దేశమునందుఁ బండితజనుల యాదరము మార్గపద్ధతివైపు ములు సూపఁ దొడఁగెను. చాళుక్యరాజాదులు పుట్టించి నిలిపిన దేశికవితపై నాదరము సన్నగిల్లఁ జొచ్చెను. నన్నయనాఁటి కీభావము బాగుగా బలము పుంజుకొనెను. నన్నయకును కన్నడ భాషలోఁ బరిచయ ముండి యుండు నని యాకాలమునందలి పరిస్థితులను బట్టి యూహింపవచ్చును. ఒకవేళ నదియసత్యమైనను నతని సహాధ్యాయుఁడును, వాఙ్మయ ధురంధరుఁడను నగు నారాయణభట్టు కర్ణాటభాషలోఁ జక్కని పాండిత్యము గడించినవాఁ డనుటకు శాసనప్రమాణము కూడఁ గలదు.[౧౨] అతఁడు కన్నడభాషయందలి మార్గకవితాపద్ధతిని గాంచి యందలి సామంజస్యమున కలరి మహాభారతమువంటి యుద్గ్రంథము నేమార్గమున వ్రాయుదమా యని యాలోచించుచుండిన తనమిత్రుఁ డగు నన్నయభట్టున కాపద్ధతినిగూర్చి తెలిపి

౧౨. 'య స్సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు
కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన.'

యదియే యనుసరణీయ మని బోధించి యుండును. అనాఁడు కూడ సంస్కృతభాషాభిమాను లగుపండితులు మణిప్రవాళ పద్ధతియే యుచితమని వాదించియుండురు. ఇట్లు సమకాలమునాఁటి సంస్కృతపండితులతోడి 'ఘోరరణమునందు'ఁ బాకశాసనికి నారాయణునివలె నన్నయ కీనారాయణ భట్టు తోడ్పడి మార్గకవిత్వపద్ధతిలో మహాభారతమును రచించుటకుఁ బ్రోత్సహించి యుండును.

నన్నెచోడుఁడు 'సురవరులం గ్రమంబున' అను పద్యమున స్తుతించిన యుత్తమమార్గసత్కవీశ్వరులు మార్గపద్ధతిలోఁ గవిత్వముఁ జెప్పిన తెలుఁగుకవులు. వారిలో నన్నయ కూడ నొక్కఁడయి యుండును. అతనిచే స్తుతింపఁబడిన దేశి సత్కవులుకూడఁ దెలుఁగునకు సంబంధించినవారే. మార్గసత్కవులలో నన్నయను బ్రత్యేకముగాఁ బేర్కొనక పోవుటకు నన్నెచోడుఁడు శైవమతాభిమాని యగుట - యప్పటికి నన్నయభారతమంతగాఁ బ్రామర్యము నంది యుండక పోవుట యనునది కారణములుకావచ్చును.

మార్గ కుమార్గము దేశి యమార్గము అనుపద్యములో మార్గసత్కవీశ్వరు లను దొలుతఁ గొలిచి యిందు వారి మార్గము కుమార్గమని నిరసించుటలో స్వవచన వ్యాఘాతము కానిపించును. కాని, యాపద్యమున మార్గ కుమార్గము దేశి యమార్గము - అనునభిప్రాయమతనిది కాదు. అతనిచే నిరసింపఁబడిన వమార్గవులది, వారు మణిప్రవాళ పద్ధతి నవలంబించినవారు. వారికి సంస్కృతపదములను దత్సమీకరించి దేశభాషాపదములలోఁ గలిపి చెప్పు మార్గపద్ధతి కుమార్గము. దేశి కవిత్వము అమార్గము. రెండుపద్ధతులును నవ్వువు గాన మాటలాడ కూరకుండుటకు వారికి మన సిచ్చగింపదు. అందుచే వారు సంస్కృతపదములను సంస్కృతపదములుగానే యుంచి దేశిపదములతోఁ గలిపి చెప్పు మణిప్రవాళమార్గము నవలంబించిరి. నన్నెచోడుని యభిప్రాయమున వారవలంబించిన యానూతనమార్గము దుర్మార్గము. అట్టి మార్గ మునఁ జరించు మార్గకవులను సుకవులగువారు తలఁప నక్కఱలేదని యాతని యభిప్రాయము.

నన్నెచోడుని యీ పద్యమునఁ బ్రయోగింపఁబడిన 'కుమార్గము', 'అమార్గము' అనుపదములు తరువాతఁ బాలకురికి సోమనాథుని గ్రంథములలోఁ గూడఁ బ్రయోగింపఁబడియున్నవి. చూడుఁడు:

అని నాచిదేవయ్య యఖిలంబు నెఱుఁగఁ
దనయు విన్నవించె ననుచు నార్యోక్తి
మార్గంబు లుండఁ గుమార్గంబు లూఁది
మార్గమే యీ త్రాటి మాలలఁ గలయ — బస. 7-569

వట్టినియమంబుఁ బాయక కవ్వ
పెట్టినర్థమె కాని ముట్టఁడు నేత
నిది గుమార్గము భక్తియే యనవలదు
ఇదియె తా సన్మార్గమెట్లు లంటేని —బస. 5-365

విమలతఁ గనిరి చేరమయుం జోదండుఁ
గాన యెట్లును నమార్గం బన రాదు
తా నీశ్వరార్థ మనక్ తలఁపునఁ జేసి — బస. 5-366

ఈ ప్రయోగములను బట్టి వన్నెచోడుని పద్యమునఁ గూడ మార్గ 'కుమార్గము' - దేశి 'యమార్గము' అనువిధముగనే యర్థము చెప్పుకొన వలసి యుండు నని నిర్ధారిత మగుచున్నది. అర్థసందర్భము ననుసరించి కూడ నట్లే యుండుఁ బదవిభాగము చేసికొనవలసి యుండు నని తేలినది. మార్గ కుమార్గము, దేశియ మార్గము అని కాని - మార్గకు మార్గము దేశియ, మార్గము వగవంగ (వదలంగ?)ఁ దమకు మది వదలక - అని కాని, పదవిభాగములు చేసికొని యర్థములు చెప్పువిధాన మంతయు దీనిమూలముననే బరిహృతమగుచున్నది.

ఇట్లు, నన్నెచోడుఁడు మార్గదేశి ప్రస్తావము చేసిన తొలిమూఁడు పద్యముల యర్థ సమన్వయమునకుఁ బరస్పరవైరుద్ధ్యము గోచరించనివిధమున నర్థము కుదుర్చు కొనినపిదప నతఁడు కావ్యప్రశస్తిలో 'దేశిమార్గంబులు దేశియములుగా, న లంకారముల దా నలంకరింపఁ (కుమా. అవ. 36 వ) గవిత యుండవలె నని చెప్పినవాక్యమున దేశి మార్గములు దేశీయము లగుటనేమో పరిశీలింప వలసియున్నది. మార్గమును దేశీయముగా నొనరించుట యనఁగా సంస్కృతమునుండి గ్రహించినవస్తువులోఁ గొన్ని దేశీయాచార సంప్రదాయములను, దేశీయములగు కథలను బ్రవేశపెట్టుట యనియు, సంస్కృత వృత్తములను సంస్కృతలక్షణములతోఁ గాక యతిప్రాసలతోఁ గూడి దేశీయ ఛందోనుగుణము లగునట్లుగా వాడుట యనియు నర్థము చెప్పుకొన వచ్చును. ఇఁక దేశిని దేశీయముగా నొనరించుట యనఁగా దేశికవితను మఱింతదేశీయముగా

నుండునట్లు చేయుట యని యర్థముతోఁచును. మార్గకవిత్వమును దేశికవితకు సన్నిహితముగాఁ జేయుట, దేశికవితారీతిని మఱింత దేశీయముగా నొనరించుట యను ద్వివిధ ప్రక్రియలును నాతని కుమారసంభవమునఁ గానవచ్చును. తనకావ్యమునందలి వస్తు భాషాచ్ఛందోరీతులలో సాధ్యమయినంతవఱకు దేశీయలక్షణములను జొప్పించుటయే కాక, యూతఁడు తమిళకర్ణాటభాషలనుండి కూడఁ గొన్ని దేశీయసంప్రదాయములను గ్రహించి వానిని దనకావ్యమున నెలకొలిపెను. దేశిమార్గములను గలుపుట యను నీపద్ధతి నాతఁడు కన్నడకవులనుండి గ్రహించి యుండెను. మార్గదేశివిధానములను గలిపి చెప్పుటయే కన్నడకవులగు పంప, రన్న కవుల కభిమత మని వారి మార్గదేశివిధాన ప్రశంసను బట్టి తెలియును.'

" నన్నెచోడుని కించుక తరువాతివాఁ డని చెప్పఁదగు నృపధూర్జటి భీమయ పండఁడు (క్రీ.శ. 145) కూడఁ గవితారచనమునందుఁ దనకుఁ గలనేర్పును బ్రశంసించు కొను సందర్భమున నీమార్గదేశివిధానములను బేర్కొని యున్నాఁడు. ఈక్రిందిపద్యమును చూడుఁడు:

*'తలఁపు సదర్థభావమునఁ దద్గతసూక్తులు గూడ వర్ణనల్*
*గొలుసుగొనంగ బ్రావడులు గోరినభంగికి వచ్చిముట్టఁగో*
*మలగతి దేశిమార్గములు మట్టుపడం ఘటనంబు లొప్ప నా*
*ద్యులక్రియఁ జెప్ప నేర్చె నృపధూర్జటి భీమయపండఁ డిమ్మహిన్.'*

*– దక్షిణదేశశాసనసంచయము – సంపు. 6, సంఖ్య 103*
*(– శాసనపద్యమంజరి – 19)*

ఈపద్యము నన్నెచోడుని కుమారసంభవమునందలి 'సరళముగాఁగ భావములు జానుదెనుంగున నింపుపెంపుతో (అవ. 35 ప) నను పద్యమునుబోలి యున్నది. ఇందు భీమయపండఁడు 'దేశిమార్గములు మట్టుపడునట్లుగా' c గవిత్వము చెప్పఁగల నేర్పును బ్రశంసించుకొని యున్నాఁడు. మట్టుపడుట యనఁగాఁ గుదురుకొనుట యని యర్థము. నన్నెచోడుఁడు దేశిమార్గములు దేశీయములుగాఁ గవిత చెప్ప వలయునని సూచింపగా నితఁడు దేశిమార్గంబులు కుదురుకొనునట్లుగాఁ గవిత చెప్ప వలె నని యిందుఁ బేర్కొనెను. నన్నెచోడుఁడు దేశిమార్గంబులు దేశీయములుగానని యనుటలో దేశీయతవైపునకు మ్రొగ్గు చూపినట్లు గోచరించును. భీమయపండఁడు తనపద్యమును 'ఆద్యులక్రియఁ జెప్ప నేర్చె' నని చెప్పి యుండుటచే నతనికిఁ బూర్వులయినకొందఱు కవులు

దేశిమార్గములు మట్టుపడునట్లుగాఁ గవితఁ జెప్పి యుండి రని తెల్ల మగుచున్నది.' ఆయాద్యులు కన్నడభాషయందుఁ గవిత్వము చెప్పిన పంప, రన్నకవులో లేక యాంధ్ర కవీశ్వరు లగు నన్నయ, నన్నెచోడులో కావలయును. ఆయాద్యులు తెలుఁగుకవులే యని యనుకొనినను నాయుభయుల కావ్యములయందును మార్గదేశివిధానములు మట్టుపడి యుండుట యథార్థము కాదు. నన్నయకవిత్వమున మార్గాంశ మధికముగా నుండుచో, నన్నెచోడుని కవిత్వమున దేశియాంశము గొంత యధికముగా నుండును. అందుచే నన్నయ, నన్నెచోడుల కవిత్వమందుఁ గొంచెము హెచ్చు తక్కువలతో నీయుభయవిధానములును గుదురుకొని యుండుట తథ్యము. అతఁడు పేర్కొనిన యాయాద్యులు తెలుఁగుకవులు కాక - మార్గదేశివిభాగములనుఁ బేర్కొని యా రెంటికిని దమకవిత్వమునందుఁ జక్కని సామరస్యముఁ గూర్చిన కన్నడకవులని భావించి నను నందుఁ దప్పు లేదు. అట్టి యా యాద్యుల కవితావిధానమునే భీమయపండఁడాదర్శముగా గ్రహించి యట్టి కవిత్వ రచనమునందుఁ గాలక్రమమునఁ జక్కనినైపుణ్యమును సంపాదించి యుండునని భావింప వచ్చును.

ఇట్లు, తెలుఁగు సాహిత్యములో మార్గదేశిపదము లెట్టియర్థములందుఁ బ్రయోగింపఁబడెనో తెలిసికొనిన పిదపఁ దెలుఁగుసాహిత్యమునకు సంబంధించినంతవఱకు మార్గకవిత్వ మనఁగా నెట్టిది? దేశికవిత్వమనఁగా నెట్టిది? మార్గ, దేశిపదములకుఁ దెలుఁగుసాహిత్యమునకు సంబంధించునట్లుగా నెట్టినిర్వచనములు చెప్పుకొనవలసియుండును? అను విషయములను బరిశీలింపవలసియున్నది.

కవిత్వమునందలి మార్గదేశిభేదములను బరిశీలింపవలసి వచ్చునప్పుడు కవిత్వాంగములయిన భాషాచ్ఛందోలంకారరీతివస్తురసపాత్రాదుల నన్నిటిని దృష్టిలో నుంచుకొనవలసి యుండును. కాని, పెక్కు రీవిషయమున వస్తుచ్ఛందోభాగములకు మాత్రమే ప్రాధాన్య మిచ్చుచుందురు. సంస్కృతమునందలి యాలంకారికుల నిర్దేశము ననుసరించి ధీరోదాత్తాది నాయకులతోఁ గూడి పురాణాదులయందుఁ బ్రసిద్ధ మయిన వస్తువును జిత్రించు నదియు - సంస్కృతభాషాకావ్యములయందుఁ బ్రయుక్తము లై యందుండి గ్రహించి యల్పసంస్కారములు చేసిన సంస్కృతవృత్తప్రయోగము గలదియు - సంస్కృతపదబహుళ మై లక్షణయుక్త మయినభాష కలదియు, మార్గకవిత్వ మగును. పురాణప్రసిద్ధ మయినది కాక,

దేశీయ మయిన వస్తువుతోఁ గూడినదియు, దేశీయము లయిన ద్విపద, తరువోజ, రగడ, అక్కర, సీసము మొదలయిన దేశీయచ్ఛందములందు రచింపఁబడినదియు, దీర్ఘసమాసభూయిష్ఠము కాక దేశిపదప్రచురమై సామెతలు, జాతీయములు, పెల్లుగా గలిగి వాక్యరచనము, రచనావిధానము అనువిషయము లందు దేశీయత వెలార్చునదియు, దేశీయవిజ్ఞానమును, దేశీయ జనజీవనమును జిత్రించు నదియు దేశికవిత్వమగును. వర్ణనలు సంస్కృతసంప్రదాయానుసారముగా నుండుట, దేశీయముగా నుండుట యనునవి కూడ నీభేదములవిభాగమునకుఁ గొంత తోడ్పడును. ఈ నిర్దేశములనుబట్టి భారతదేశములోని యేభాషలో నయినను మార్గదేశివిభాగములకుఁ జెందినకవిత్వముండుట కవకాశము కలదు. కాని, యేకవీశ్వరుని కవిత్వమయినను బూర్తిగా మార్గకవిత్వశాఖకును, బూర్తిగా దేశికవిత్వశాఖకును జేరుటకు వీలుండదు.

శార్ఙ్గదేవుఁడు తన సంగీతరత్నాకరమునందు గాన, గాంధర్వములనుగూర్చి వివరించుచు గానము నిబద్ధ మనియు, ననిబద్ధ మనియు రెండుతెఱఁగు లని పేర్కొనెను. గాంధర్వము మార్గ మనియు – గానము దేశి యనియుఁ గూడ నాతఁడు తెలిపి యుండెను. కనుక, దేశి యయిన గానములో నిబద్ధము, అనిబద్ధము అని రెండు తెఱఁగు లున్నట్లు తెలియుచున్నది. మార్గ మయిన గాంధర్వమున నిట్టి భేదము లున్న ట్లాతఁడు తెలుప లేదు. కాని, కవిత్వవిషయమున మాత్రము మార్గపద్ధతిలోఁ గూడ నీ రెండు తెఱఁగులును (నిబద్ధము, అనిబద్ధము) గోచరించు నని తెలియుచున్నది. నిబద్ధమార్గము లక్షణానుసారిగా నుండుటచే యించుక స్వాతంత్ర్యచ్ఛాయలతోఁ గూడినది. నన్నయకవిత్వము నిబద్ధమార్గమునకుఁ జెందును. నన్నెచోడుని కవిత్వము అనిబద్ధమార్గము. అట్లే, దేశిలోఁ గూడ రెండు భాగములు కలవు. నన్నయకుఁ బూర్వకాలమునందును, దరువాతి కాలమునందును జనవ్యవహారమున నుండి జనులను రంజింపఁజేయు చుండినపదరచనములు అనిబద్ధదేశిపద్ధతికిఁ జెందును. పాల్కుఱికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు నిబద్ధదేశికవితాపద్ధతికిఁ జెందును. అందలి యితివృత్తము, ఛందస్సు, భాషాప్రయోగము మొదలగునవి యన్నియు దేశిపద్ధతి కనుగుణముగా నున్నవి. కాని, యిం దందందు మార్గకవితాచ్ఛాయలు కొన్ని లేక పోలేదు. అట్టి మార్గకవితాలక్షణములు కొన్ని తన కవిత్వమునం దున్న ట్లాతఁడే చెప్పుకొని యున్నాఁడు. సామెతలు, జాతీయములు నెక్కువగాఁ

ప్రయోగించి వైరిసమాసములను, వ్యాకరణ విరుద్ధము లయిన ప్రయోగములను గూర్చి దేశివాక్యరచనావిన్యాసవైఖరులను ప్రదర్శించి యున్నను నతఁడు పూర్తిగా వ్యాకరణమును వదలివైచి వ్యావహారికభాషను వాడి యుండ లేదు. అందుచే నతనిది మార్గకవితాచ్ఛాయలు కలిగిన నిబద్ధదేశికవితా పద్ధతి. పామరజన వ్యవహారమున నుండు అనిబద్ధదేశి దేశికవుల చేతులలోఁబడి 'నిబద్ధదేశి' యగును.

మార్గదేశికవితాపద్ధతులు రెండును ప్రత్యేకము లయిన వనియు, వానిలో నొండొంటికి సంపర్కముండదనియుఁ దలంచుటకు వీలులేదు. బాహుళ్యమును బట్టియే యొకరి కవిత్వము మార్గమని కాని, దేశి యని కాని తలంపఁబడు చుండును. మార్గకవిత్వమునందు దేశికవితాచ్ఛాయలును, దేశికవిత్వమునందు మార్గకవితాచ్ఛాయలును నెంతో కొంత యుండుచునే యుండును. ఆంధ్రసాహిత్యమున నీరెండు కవితా పద్ధతులును సమానాంతరము గానే సాఁగినవి. అట్లు సాఁగిన యీ మార్గదేశికవిత్వములలో సోమనాథుని కవిత్వము నిబద్ధదేశిపద్ధతికిఁ జెందును. అందలి యితివృత్తము దేశీయము, స్వతంత్రము. సంస్కృతమూలకము కాదు. ఛందస్సు దేశీయ మయిన ద్విపద. అతని కవిత్వమునఁ బెక్కు దేశివర్ణనలు కలవు. సామెతలను, జాతీయములను నతఁడు విస్తారముగాఁ బ్రయోగించెను. అతని వాక్యరచనావైఖరులందును దేశీయత యధికముగా గోచరించును. అతఁడు వాడిన యుపమానములు కొన్ని దేశీయములు. వ్యాకరణ విరుద్ధములుగా మనకుఁ దోఁచు తనకాలమునాఁటి వ్యావహారికభాషారూపముల నాతఁడు దనకవిత్వమునందు విరివిగా నెలకొల్పెను. అందలి రచనావిధానము కూడ దేశీయమే. అతని గ్రంథములందు దేశీయ జనజీవనము మిక్కిలి మనోహరముగాఁ జిత్రింపఁబడినది. వానియం దాతఁడు తనకుఁ గల దేశీయవిజ్ఞానము నంతను బ్రదర్శించి యున్నాఁడు. నేఁడు వ్యవహారమునందుఁ జ్యుతములయిన పదములను – అర్థ విపరిణామము నొందిన పదములను బెక్కింటిని దనకావ్యములయందుఁ బ్రయోగించి తన కాలమునందలి దేశిపద సంపదను మన కందఁజేయుటయే కాక, సంస్కృతపదముల ప్రయోగముకంటే దేశి యయిన తెలుఁగు పదముల ప్రయోగమునందే యత్యధిక మగు నాదరము నాతఁడు కనఁబఱచి యుండెను. అతఁడు ప్రయోగించిన తెలుఁగు పదములు సంస్కృత పదములకు రెండింతలుగా నాతని గ్రంథములయందుఁ గానవచ్చుట యాతని దేశిపదప్రయోగము నందలి మక్కువను జాటును. ఇట్లు బహుముఖముగా నాతఁడు తన కావ్యములయందు

దేశియతనను సాధించుటకు యత్నించినను నాతని కవిత్వము పూర్తిగా నియమరహితము కాదు. అది ఛందోబద్ధమయినది. భాషయు వ్యావహారికము కాదు. అందందు వ్యావహారికపదప్రయోగములును, వ్యాకరణ విరుద్ధములగు ప్రయోగములును నున్నను సలక్షణ భాషయందుఁ జాలవఱకుఁ గలదు. తెలుఁగు పదము లెక్కువగా నుపయోగించి యున్నను నాతఁడు సంస్కృత సమాస భూయిష్ఠ మగు రచనమును జేసి యుండక పోలేదు. కనుక, నీతని బసవపురాణ, పండితారాధ్య చరిత్రవములు ని బద్ధ దేశి కవితాశాఖకుఁ జెందిన గ్రంధవములు. అతని యుదాహరణకృతులు మార్గ దేశిపద్ధతుల మధురసమ్మేళనము కల మిశ్రకృతులు. అతని యితర కృతులు కూడ నిబద్ధ దేశిరచనలే.

మార్గదేశి లక్షణములు నియతములు కావనియు 'గాలభేదమునుబట్టియుఁ గవిత్వ భేదమునుబట్టియు నాయాలక్షణములు మాఱుపాటు నొందుచుండు ననియు, నొకకాలమున దేశికవిత్వముగాఁ బరిగణింపఁబడునది యాతరువాతి కాలమున మార్గకవిత్వముగాఁ బరిగణింపఁబడవచ్చుననియు, నందుచే నివి రెండును బరస్పరసంబద్ధము లయిన పదము (Relative terms) లనియు స్థూలదృష్టికిఁ దోఁచును. పూర్వపూర్వకవిత్వములు మార్గకవిత్వము లగుచు రాఁగా నుత్తరోత్తర కవిత్వములు దేశికవిత్వము లగు చుండుననని దీని సారాంశము. మార్గకవిత్వమునకుఁ బ్రాచీనత్వమును, దేశికవిత్వమునకు నవీనత్వమును నిర్ధారకములని భావము. కాని, యిది నిజముకాదు. వాని ప్రత్యేకతను స్థాపించు నితరాంశములును, గుణములును బెక్కులు కలవు. వాని యన్నిటిఁబట్టి కాని యాయాకవిత్వముల మార్గత్వ, దేశిత్వములను నిర్ధరించుటకు వీలుకాదు. కాని, యొకకాలమునందు దేశికవిత్వాంశము ప్రాచుర్యము వహించుట చేతను నది యనంతరకాలికకవిత్వమునఁ బ్రవేశించి మార్గత్వముఁ బడయుటయు, నట్లే యొకకాలమునందలి మార్గకవిత్వాంశము దేశికవిత్వమునఁ బ్రవేశించి దానికిఁ గొంత సంస్కారమును గలుగఁజేయుటయు సంభవింప వచ్చును. దేశికవిత్వ లక్షణములలో నొకటి యగు దేశిచ్ఛంద మనులక్షణము మార్గకవిత్వమునఁ బ్రవేశించినందులకు రంగనాథరామాయణాదు లగుద్విపదకృతులను దార్కాణముగా గ్రహింపఁ దగును. అట్లే దేశియ మగునితివృత్తము, దేశితనము అను రెండులక్షణములతోను గూడుకొనిన కావ్యము శ్రీనాధుని పలనాటివీరచరిత్రము. దేశియేతివృత్తము, తెలుఁగుసామెతల యొక్కయు, జాతీయముల యొక్కయుఁ బ్రయోగము

అనురెండులక్షణములను మార్గకవిత్వమునఁ బ్రవేశించినకావ్యములు, శుకసప్తతి, హంసవింశతి యనుకావ్యరాజములు. యక్షగానరచనములు దేశీయమగు ప్రక్రియ యనులక్షణమునకుఁ బ్రాధాన్యము కలుగునట్లుగాఁ గొన్నిట మార్గేతివృత్తముఁ బ్రవేశించినందులకుఁ దార్కాణములు గాఁ గొనవచ్చును. నన్నెచోడుని కుమారసంభవము కూడ మార్గకవిత్వమున దేశిసంప్రదాయములు, దేశీయపద ప్రయోగము, నందందు దేశవర్ణనలును దేశిలక్షణములు ప్రవేశించినకావ్యరాజము. అట్లే, సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రములు మార్గకవిత్వ లక్షణము లయిన ఛందోబద్ధత, అధికముగా సలక్షణమగుభాష, యనునవి ప్రవేశించిన దేశికవిత్వము. అందుచేతనే యవి నిబద్ధదేశిశాఖకుఁ జెందుచున్నవి. ఇట్లొక కవిత్వపద్ధతికిఁ జెందిన గుణములు మఱొక కవిత్వపద్ధతికి సంక్రమించుట యనుకార్యము నిరంతరము సాగుచునే యున్నను నీరెండు పద్ధతులును నన్నికాలములయందును సమానాంతరముగానే సాగుచుండు ననుమాటను మాత్రము మఱవ రాదు.'

ఈ సందర్భమున నీమార్గదేశిపదములను నాంగ్లసాహిత్యమునందలి Classicism, Romanticism అను పదములకుఁ బర్యాయములుగా భావించువారి యభిప్రాయమును బరిశీలింపవలసియున్నది. ఆంగ్లసాహిత్యమునందలి 'Romantic Movement' అనుకాల్పనికకవిత్వోద్యమమునకును, తెలుఁగు సాహిత్యమునందలి దేశికవిత్వోద్యమమునకును గొన్ని సమాన ధర్మములు లేక పోలేదు. అసమానధర్మములనుగూర్చి తెలిసి కొనుటకు ముందు ఆంగ్లసాహిత్యమునందలి కాల్పనిక కవిత్వోద్యమమునుగూర్చి కొంత తెలిసికొనవలసి యున్నది. ఆంగ్లేయవిమర్శకు లాయుద్యమమును గూర్చి తెలిపిన యంశముల నిటఁ బరిశీలింతము.

'Romantic Movement is a term applied to a general artistic upheaval which culminated about 1830 - 40. It was a reaction against the accepted formulae of so-called classical art and although it may be regarded as having originated in the field of German Literature in the later 18th century, it rapidly embraced the whole European art. The relative aims of classical and Romantic art were summed up by Heine as follows: Classical art had to express only the finite and its forms could be identical with the artist's idea. Romantic art had to represent or rather to typify the infinite and the

spiritual and had therefore to be expressed symbolically. Classical art may be said to possess objective beauty since universal types are presented, the artist being chiefly a technical medium of realisation. Romantic art, on the other hand, is subjectively beautiful since individual impressions are presented, the artist being a psychological medium of interpretation. The rules evolved from classical tradition were not suited to romantic ideals, the former aimed at symmetry of outline and perfection of form, whilst the later aimed at the expression of individuality. The Romantic Movement therefore discarded formal beauty in favour of emotioal intensity."[13]

"It was to some extent a literary version of Romanticism in painting. A reflection in Literature of the universal effort at emancipation from tyranny that culminated in the French Revolution, with the later repurcussions throughout Europe. It was largely a rebellion against the inflexible rigidity and limited imaginative range of the classical school which had dominated all European Literature for over a century."[14]

'Romanticism or the Romantic Revival is a term applied to the Movement in European Literature and other arts which began at the end of the 18th century, emphasizing the imagination and emotion over reason and the intellect and revolting against the conventional strictness of Neo-Classicism.'[15]

'Romanticism is a complex of many trends in all the arts, particularly Literature and Music flourished throughout most of Europe. It was well under way in England, Germany and France before 1750 and isolated signs of Romanticism may be traced much earlier. Among many causes may be mentioned 1) a reaction against Neo-classicism based not only on literary fashions but also on steadily increasing first hand knowledge of the classical countries especially

13. *Everyman's Encyclopaedia, Vol. 10. Edited by E F. Bozmann.*
14. *The Universal Encyclopaedia, Vol. 9, Edited by Sir John Hammenton.*
15. *The Reader's Encyclopaedia - Edited by Williams Rose Benet.*
16. *The Caxton Encyclopaedia.*

Southern Italy and Greece and the whole range of their art and culture.'[16]

కాల్పనికత్వమునుగూర్చియుఁ గాల్పనిక కవితోద్యమమునుగూర్చి యుఁ దెలుపుచున్న పయి యుద్ధరణములవలన నీక్రింది యంశములు తెలియు చున్నవి.

౧. కాల్పనికత్వము (Romanticism) కవిత్వమునకు మాత్రమే కాక యన్నికళలకును సంబంధించినది.

౨. యూరపుఖండములోని ప్రముఖదేశములయందలి కళలం దన్నిట నీయుద్యమము బయలుదేరి నూతనత్వమును సాధించినది.

౩. అంతకు ముందుండిన నియమబద్ధత, సంప్రదాయానుసరణము మొదలగుకళాపద్ధతులకుఁ బ్రతిక్రియగా నీయుద్యమ మవతరించినది.

౪. ఈయుద్యమమునకుఁ బూర్వమే దీని ఛాయలు గోచరించుచుండెను.

కాల్పనికత్వమునకుఁ గాల్పనికకవితోద్యమమునకు సంబంధించిన యీ నాలుగుఁ ధర్మములు నాంధ్రసాహిత్యమునందలి దేశికవితోద్యమమునకును సమానము లయియున్నవి. సోమనాథుని దేశికవితోద్యమమునకుఁ బూర్వమే యీదేశికవిత్వచ్ఛాయ లాంధ్రకవిత్వమున నుండెను. మార్గదేశిభేదము లొక్కకవిత్వమునకే సంబంధించినవి కాక సంగీతము, నాట్యము, భాష, కవిత్వము అనువానియం దన్నిటఁ గూడ నుండినట్లు తెలియుచున్నది. కళలయందలి యీభేదము లొక్కయాంధ్రదేశమునకే పరిమితములు కావు. భారతదేశము నందంతట నన్నిదేశవిభాగములకు సంబంధించినకళలయందును నీ విభాగము లుండెను. ఆంధ్రసాహిత్యమున నీయుద్యమము నన్నయోపజ్ఞ మయిన మార్గకవితా సంప్రదాయమునకుఁ బ్రతియోగిగా మతప్రచారలక్ష్యముతో నవతరించినది.

ఇట్లు, ఆంగ్లసాహిత్యమునందలి కాల్పనికకవితోద్యమమునకును, నాంధ్రసాహిత్యమునందలి దేశికవితోద్యమమునకును గొన్ని సమానధర్మములు కానవచ్చు చున్నను నిరెంటికిని భేదము లేకపోలేదు. ఆంగ్లసాహిత్యమునఁ గాల్పనికత్వ మొక యుద్యమముగా నవతరించి కొంతకాలము మాత్రము ప్రాచుర్యము వహించి

యితర కవిత్వోద్యమముల బయలుదేరుటతో వెనుకపడి పోయినది. ఆ యుద్యమకాలమున మాత్రమే దాని ప్రభావము, దాని ప్రత్యేకత కవిత్వమునఁ గానవచ్చినది. తెలుఁగున నట్లు కాక యుద్యమకాలమునఁ దీవ్రరూపమునఁ బ్రాచుర్యము వహించుటయే కాక – తదుద్యమమునకు బూర్వకాలమందును, ననంతరకాలమందును మార్గ కవిత్వమునకు సమానాంతరముగా నీదేశి కవిత్వము ప్రజానీకమునఁ బ్రాచుర్యము వహించియుండినది. ఆంగ్లమున నది యొక యుద్యమ మాత్రముగానే – యొక కవితాపద్ధతిగా మాత్రమే యొకపరిమిత కాలమునఁ బ్రాచుర్యము వహింపఁగా నాంధ్రభాషయందలి దేశికవిత్వ మన్నికాలముల యందును నధికముగనో, యల్పముగనో యుండుచునే వచ్చినది. ఇందుచేఁ గొన్నిట మన దేశికవిత్వమునకుఁ గాల్పనికకవిత్వోద్యమముతో సామ్యము లున్నను నారెంటికిని భేదము కూడఁగలదని విశదమగును. మార్గదేశి పదములకుఁ బర్యాయపదములుగా Classicism, Romanticism అను నాంగ్లపదములను వాడునప్పుడు వాని కొక పరిమితార్థము మాత్రమే కలదనుమాటను, నట్టి పరిమితార్థముననే వానిని వాడఁదగియుండు ననువిషయమును విస్మరింప రాదు.

ఈ యధ్యాయమునందుఁ జర్చింపఁబడిన యంశముల సారాంశము నీ క్రిందివిధముగాఁ బేర్కొనవచ్చును.

౧. సంగీతము, నాట్యము, కవిత్వము అను లలితకళలయందు మార్గ, దేశిభేదము లున్నట్లు పరిశీలనమువలనఁ దెలియుచున్నది. సంస్కృతలాక్షణికులు కాని, కవులు కాని, కవిత్వమున మార్గదేశభేదములను బాటింపలేదు. వాల్మీకిరామాయణము కాలమునాఁటికే సంగీతమున మార్గదేశివిభేదములు కలవు. సంగీతరత్నాకరము మొదలగు సంగీతశాస్త్ర గ్రంథములందు మార్గదేశిలక్షణములు వివరింపఁ బడినవి. దానిఁబట్టి మార్గ సంగీతము నియమ సహితము, బ్రహ్మాదులచే మార్గితమై భరతాదులచేఁ బ్రయుక్తము, ననాదిసంప్రదాయసిద్ధము, లక్షణప్రధానమునై పండితజనులను రంజింపఁజేయునని తెలియుచున్నది. దేశిసంగీతము కామచారప్రవృత్తి కల దై, నానాదేశజనులచే రుచ్యనుగుణముగా నప్పటికప్పుడు నూతనముగాఁ బ్రయుక్త మగుచు లక్ష్యప్రధానమై సామాన్యజనులను రంజింపఁ జేయు నని తెలియుచున్నది.

౨. క్రీస్తుశకము రెండవశతాబ్దికిఁ జెందినదని కొందఱు విద్వాంసులచేఁ దలంపఁబడు 'శిలప్పదిగారము' అనుతమిళకావ్యముఁ బట్టి నాట్యమునఁ గూడ మార్గదేశిభేదము లున్నట్లు తెలియును. దశరూపకమునుబట్టి నృత్యమునకు మార్గమనియు, నృత్తమునకు దేశి యనియు వ్యవహార మున్నట్లు తెలియును.

౩. సంగీతనాట్యములయందుఁ గానవచ్చు నీమార్గదేశిభేదములను భాషల కన్వయించినపుడు సంస్కృతభాష మార్గమనియు, ప్రాకృతభాషలు దేశియనియుఁ దేలును. ఆంధ్రకర్ణాటాది దేశభాషలన్నియు దేశిమార్గమునకే చెందును. భాషకు సంబంధించిన యీ మార్గదేశిలక్షణములను బ్రతిదేశభాషయందలి కవిత్వమునకును నన్వయింప వచ్చును. ఆయాభాషలయందు లక్షణానురూపముగా వెలయుకవిత్వము మార్గము. లక్షణము ననుసరింపక స్వచ్ఛందముగా వెలయింపఁబడునది దేశి.

౪. కవిత్వవిషయమున నీ మార్గదేశివిధానములను బాటించుట తొలుతఁ గర్ణాటభాషయందు జరగినది. వారిననుసరించి నన్నెచోడుఁడు దానిని దెలుఁగునందుఁ బ్రవేశపెట్టెను. అతనికిఁ దరువాత భీమయపండఁడీసంప్రదాయములను బేర్కొనెను.

౫. నన్నెచోడుని పద్యమునఁ బేర్కొనఁబడిన మార్గసత్కవీశ్వరులు కన్నడమునందలి పంపాదు లగుకవులు, తెలుఁగున నన్నయాదు లగుకవులు కాఁదగుదురు. మునులోకంబున వెలసినమార్గకవిత కన్నడమునందలి మార్గకవితా పద్ధతి. చాళుక్యరాజు రాజరాజనరేంద్రుఁడు కాఁడు. నన్నయకుఁ బూర్వము శాసనాదులందుఁ దెలుఁగు కవితను వెలయించుటకు దారి చూపిన చాళుక్యరాజాదులు రాజరాజనరేంద్రునికిఁ బూర్వులయిన చాళుక్యరాజులు. మార్గకుమార్గము అనియు, దేశి యమార్గము అనియు వాదించి మణిప్రవాళభాషలోఁ గవిత్వము చెప్పవలయు నని యభిప్రాయపడుచుండిన మార్గవులనే యాతఁడు కుకవినిందలోఁ బరిహరించెను. దేశిమార్గములను దేశీయముగాఁ జేయుట యనఁగా మార్గను దేశీయసంప్రదాయములో నొప్పునట్లు రచించుట. దేశిని దేశీయముగా నొనర్చుట యనఁగా దేశికవితారీతిని మఱింత దేశీయముగా నొనరించుట. దేశిమార్గములు మట్టుపడునట్లుగాఁ గవిత చెప్పిన యాద్యులు

కన్నడమునందుఁ గవిత్వము చెప్పిన పంపాదులును, దెలుఁగునందలి నన్నయ నన్నెచోడులును గాఁదగుదురు.

౬. సంస్కృతమునందలి యాలంకారికుల నిర్దేశము ననుసరించి పురాణేతివృత్తముతో, సంస్కృతవృత్తసమాదరణముతో, సంస్కృతపదబహుళమై, లక్షణయుక్త మయిన భాష కల కవిత్వము మార్గకవిత్వము. పురాణప్రసిద్ధము కాక దేశీయ మయిన వస్తువుతోఁ గూడినది యు, దేశీయము లయిన ఛందములందు రచింపఁ బడినదియు, దీర్ఘసమాసభూయిష్ఠము కాక దేశిపదప్రచురమై సామెతలు, జాతీయములు పెల్లుగాఁ గలిగి వాక్యరచనము, రచనావిధానము, అను విషయములందు దేశీయత వెలార్చునదియు, దేశీయవిజ్ఞానమును, దేశీయజనజీవనమును జిత్రించునదియు, దేశి వర్ణనములను గలదియు దేశికవిత్వ మగును. ఈ లక్షణముల ప్రాచుర్యమునుబట్టి మార్గదేశికవిత్వముల నిర్దేశము సాధారణముగా జరుగుచుండును. సంగీతమున దేశి యందున్నట్లే, కవిత్వమున మార్గ దేశి భేదములు మఱల నిబద్ధమనియు, ననిబద్ధమనియు ద్వివిధము లగును. పాల్కుఱికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు నిబద్ధదేశిసంప్రదాయమునకుఁ జెందును.

౭. మార్గ గుణములు దేశి యందును, దేశి గుణములు మార్గము నందును గాలక్రమమున సంక్రమించుచుండును.

౮. ఆంగ్లసాహిత్యమునందలి Romantic Movement అను కాల్పనిక కవితోద్యమమునకును, తెలుఁగు సాహిత్యమునందలి దేశికవితోద్యమము నకును గొన్ని సమానధర్మములు కలవు. తెలుఁగున నీ దేశికవిత్వ మొకకాలమున నుద్యమ రూపమునఁ జాలఁ దీవ్రముగా నుండినను నంతకుఁ బూర్వమునను, ననంతరమునను మార్గకవిత్వమునకు సమానాంతరముగా సాఁగుచు వచ్చినది. మార్గమును Classicism కుఁ బర్యాయముగను, దేశిని Romanticism కుఁ బర్యాయముగను వాడు నప్పుడు వాని నొకపరిమితార్థముననే వాడుట యుక్తము.

# షష్ఠాధ్యాయము
# దక్షిణదేశభాషా సాహిత్యములలో దేశి

మార్గ, దేశి – వీని సమగ్రస్వరూపమును, లక్షణములను బూర్వాధ్యాయమునందుఁ దెలిసికొంటిమి. ఈయధ్యాయమునందు దక్షిణదేశభాషాసాహిత్యములందుఁగల దేశితనము యొక్క స్వరూపమును, నాయాదేశి లక్షణములాభాషాసాహిత్యములయం దధికముగాను, నల్పముగాను నుండుటకుఁ గల హేతువులను బరిశీలింతము. ఆంధ్రసాహిత్యమునందు వెలసిన దేశికవితోద్యమస్వరూపమును, నందును ముఖ్యము గాఁబాల్కురికి సోమనాథుఁడు తన రచనలమూలమున దేశికవిత్వమునకుఁ గూర్చిన యభ్యుదయదోహదములను గూర్చి యెఱుఁగుటకు ముందు దక్షిణదేశభాషాసాహిత్యములయందుఁగల దేశిలక్షణముల నెఱుఁగుట ముఖ్యకర్తవ్యమయి యున్నది.

ఒక్క భాషాకుటుంబమునకే చెంది యుండి, యొక మూలభాషనుండియే వచ్చిన వని తలఁపఁబడుచున్న దక్షిణదేశభాష (తమిళము, కన్నడము, తెలుఁగు, మలయాళము) లేకాలమునందుఁ బ్రత్యేకభాషలుగా నేర్పడినవో చెప్పుట కవకాశము లేదు. కాని, క్రీస్తుశకమునకుఁ జాలకాలమునకుఁ బూర్వమే యని యొకదానినుండి యొకటి విడివడి ప్రస్తుతము వ్యాప్తి గాంచి యున్న దేశభాగములందు నెలకొనియుండినవని మాత్రము చెప్పఁదగి యున్నది. దక్షిణదేశమునందుఁ బ్రస్తుతకాలమునఁ బ్రాధాన్యము వహించి యున్న తమిళము, కన్నడము, తెలుఁగు, మలయాళము నను భాషలలో తెలుఁగు తక్కిన భాషల కంటెను గొంతపూర్వకాలమునందే మూలద్రావిడభాష నుండి విడివడి యుండు నని పరిశోధకుల యభిప్రాయము.[1] ఈనాలుగుభాషలలోను తమిళ కన్నడములు తెలుఁగు తమిళములకంటెను గొంత సన్నిహితములుగాఁ గన్పట్టును. తమిళ

---

౧. చూ. దక్షిణదేశభాషాసాహిత్యములు – దేశి. పుట. 58.
శ్రీ, కోరాడ రామకృష్ణయ్య

మలయాళములు తమిళకన్నడములకంటెఁ గూడ నత్యంతము సన్నిహితము లయిన వని చెప్పవచ్చును. ఇట్లు భాషాసహజస్థితులనుబట్టియే కాక యీ భాషలకు సంస్కృతభాషలోఁ గలిగిన సంబంధస్వభావమునుబట్టి కూడ నీభాషలస్వరూప స్వభావములలోఁ గొంతభేద మేర్పడుపరిస్థితి కలిగిన దనుట యయథార్థము కాదు.

తెలుఁగు కన్నడభాషలపై సంస్కృతభాషాప్రభావమధికముగాఁ గలదు. అధికముగా నుండుట మాత్రమే కాక యాప్రభావ మతిప్రాచీనము కూడ. తమిళము మలయాళము ననుభాషలపై నీసంస్కృతప్రభావ మంత యధికముగాఁ గానరాదు. కానవచ్చుచున్న యాప్రభావ మయినను నర్వాచీనము మాత్రమే. క్రీస్తునకుఁ బూర్వమే యగస్త్యుఁడు మొదలగు నార్యమహర్షులు కొందఱు వైదికమతవ్యాప్తికొఱకై యుత్తరదేశమునుండి తమిళదేశమునకుఁ దరలి వచ్చి యుండిరి. బౌద్ధయుగమున బౌద్ధభిక్షువులు కూడఁ దమమతధర్మములను దక్షిణదేశమునందును వ్యాపింపఁజేయవలయు ననెడి యుద్దేశముతో వచ్చి యచట విహారాదులు కల్పించుకొని బౌద్ధమత వ్యాప్తిఁ గావించిరి. అట్లే, జైనమతస్థులును గొందఱు వచ్చి యచ్చట స్థిరనివాసములు కల్పించుకొని యుండవచ్చును. వారు తమతమ మతములను దక్షిణదేశమునఁ బ్రచారము గావించినసందర్భమున నీతమిళభాషకు సంస్కృతప్రాకృతభాషలతో సంపర్కము విశేషముగానే గలిగి యుండుట కవకాశము కలదు. కాని, వింధ్యపర్వతమునకు దక్షిణమున నున్న తెలుఁగు కన్నడదేశము లార్యజనాక్రాంతము లైనట్లు తమిళదేశ మార్యజనాక్రాంతము కాలేదు. అట్లే, తెలుఁగు కన్నడదేశము లుత్తరదేశీయు లగురాజ వరేణ్యుల పరిపాలనప్రాభవములకు లోఁబడినట్లు తమిళదేశము లోఁబడ లేదు. అందు చేతనే తమిళదేశమున క్రీస్తుశకారంభకాలమునాఁటికే దేశీయప్రభువుల యాదర ప్రోత్సాహములతో దేశికవిత పెంపొందినది. ఆకాలమునకే సంస్కృతచ్ఛందమునందుఁ గాక దేశీయచ్ఛందమునందు రచింపఁబడిన రచనలు విజయగీతములు (పురనానూఱు), ప్రేమ గీతములు (అగనానూఱు) మొదలయినవి ప్రోవు చేయఁబడి సంకలనగ్రంథ రూపమున నాదేశికవిత యెల్ల వాసి గాంచినది. ఈ సంకలనగ్రంథములు కడసంగము వర్ధిల్లిన కాలమున వెలుఁగులోనికి వచ్చెను. దీనిలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్‌కీళ్‌కణక్కు మొదలయినవి ప్రసిద్ధి చెందినవి. దీనియందు సంకలింపబడిన రచనలు బహుకర్తృకములు. భిన్నభిన్నకాలములయందు భిన్నభిన్న సందర్భములలోఁ గవులు చెప్పినపద్యము

లించు౯ గూర్చ౯బడెను. అలనాఁటి తమిళ భూపతులయు, మంత్రి వరేణ్యాదులయు, దండనాథులయు జీవితవిశేషము లీ కృతులలో నభివర్ణింప౯ బడినవి.

దీనిలో ఎట్టుత్తొగై యనునది యెనిమిది గ్రంథములు గల బృహద్గ్రంథము. నర్రిణై, కుఱుందొగై, ఐంగురునూఱు, పదిర్రుప్పత్తు, పరిపాడల్, కలిత్తొగై, అగనానూఱు, పుఱనానూఱు అనునవి యా యెనిమిది గ్రంథములు. అట్లే పత్తుప్పాట్టులోఁ బదికావ్యములును, పదినెణ్కీళ్ కణక్కులోఁ బదునెనిమిది కావ్యములును గలవు. దీనియందలి రచనవములు దేశిసాహిత్యమునకుఁ జెందినపదములు లేక గీతము. ఈ గీతములయందలి పాదములసంఖ్యను బురస్కరించుకొని యాయాగీతికాగుచ్ఛములకుఁ బేర్లేర్పడెను. అగనానూఱు, పుఱనానూఱు అను సంకలనములలోని గీతములు పదుమూఁడు మొదలు కొని పదునేడువఱకును బాదములు గలిగి యుండును. కనుక వానికి 'నెడుందొగై' (దీర్ఘసంకలనములు) అని పేరు. 'కుఱుందొగై' యనుసంకలనములోని గీతములు నాలుగు మొదలు ఎనిమిదిపాదములవఱకుఁ గలిగి యుండును. ఇవి యన్నియు దేశిచ్ఛందోభేదములే. ఈ సంకలనగ్రంథములలో అగనానూఱు, పుఱనానూఱు అనునవి ప్రసిద్ధి చెందినవి. 'అగం' అనుమాటకు స్థూలముగాఁ 'ప్రేమ' యని యర్థము. అట్టి ప్రేమను వ్యక్తీకరించు నాలుగువందల గీతములు 'అగనానూఱు' అనుగ్రంథమున సంకలింప౯బడెను. పాండ్యభూపతి యగు 'ఉగ్రపెరువళుది' యనునాతని సమాదరణమున 'రుద్రశర్మ' యనుపండితుఁ డీకావ్యమును సంకలన మొనర్చెను.

అగనానూఱు ప్రేమగీతముల సంకలన మగుచో పుఱనానూఱు వీరగీతముల సంకలనము. ధర్మార్థముల సమన్వయమును తమిళులు 'పుఱం' అని వ్యవహరింతురు. ఈ కృతిలోఁ గూడ నాలుగువందల గీతము లుండుటచే దీనికి 'పుఱనానూఱు' అని పేరయ్యెను. ఇందుఁ దమిళభూపతు లగు చేర, చోళ, పాండ్య వంశీయులను గూర్చియు, వారిసామంతులను గూర్చియు, వీరవరేణ్యులనుగూర్చియుఁ బెక్కు విషయములు ప్రస్తావింప౯ బడినవి. సంగకాలమునాఁటి చారిత్రక, సామాజిక విషయము లెన్నో 'పుఱనానూఱు' నుండి తెలిసికొనవచ్చును. ఆర్యుల యాచార వ్యవహారము లప్పటికే తమిళదేశమునందుఁ గూడ వ్యాప్తిలోనికి వచ్చుచుండెను. అయినను తమిళదేశమునందలి ప్రజలును,

రాజులును నాకాలమునఁ దమప్రాచీనాచారవ్యవహారములందే గాఢానురక్తు లై యుండిరి.

ఈ సంకలనగ్రంథములు కడసంగకాలమునకుఁ జెందిన వని యింతకుఁ బూర్వమే తెలుపఁబడినది. కడసంగమునకుఁ బూర్వము తమిళదేశమున మఱిరెండు కవిసంగములు వర్ధిల్లెను. వానికి 'తలైచ్చంగం' (తొలిసంగము), ఇడైచ్చంగం (మధ్యసంగము) అని పేరు. తొలిసంగము మధురలో వర్ధిల్లె ననియు, నందు 549 మంది కవు లుండెడివా రనియు, శివుఁడు, మురుగన్, అగత్తియన్ మొదలగువారందు సభ్యులుగా నుండి రనియుఁ జెప్పుదురు. కపాడపురమునందు వర్ధిల్లిన మధ్యసంగమున 59 మంది కవులుండెడివా రనియు, వారిలో అగస్త్యుఁడు, తొల్కాప్పియనార్ మున్నగువారు సుప్రసిద్ధు లనియుఁ దెలియుచున్నది. అగస్త్యుని పంద్రెండుగురు శిష్యులలో తొల్కాప్పియనార్ ఒకడు. ఐంద్రవ్యాకరణము నాధారముగాఁ జేకొని యతఁడు 'తొల్కాప్పియము' అను గ్రంథమును రచించెను. అది తమిళభాషాలక్షణమవును, నందలి ఛందస్సాహిత్యలక్షణవములను దెలుపుచున్నది. ఇట్టి భాషాలక్షణ గ్రంథవము తమిళభాషలో నాఁటికే బయలుదేరుటచే నిభాషాసాహిత్యము లంతకుఁ బూర్వము చిరకాలమునుండి దేశమున స్థిరపడి యుండెనని యూహించుట తప్పు గాదు. తొల్కాప్పియ మనునీలక్షణగ్రంథము సంస్కృతవ్యాకరణసంప్రదాయముల ననుసరించి రచింపఁబడినదే యయినను ద్రావిడభాషా సాహిత్యముల విశిష్టలక్షణములను జక్కఁగా వ్యక్తీకరించుచున్నది. అందు ఎళుత్తు (వర్ణసమామ్నాయము), సొల్ (శబ్దము), పొరుళ్ (కావ్యవస్తువు) అనుపేర మూఁ డధికారములు గలవు. ఇందొక్కొక్కటియు మరలఁ దొమ్మిదిభాగములుగా విభజింపఁ బడెను. దీనిలోఁ దొలి రెం డధికారములును కేవలము వ్యాకరణాంశములకు సంబంధించినవి. మూఁడవది యగు పొరుళధికారము కావ్యవస్తువునకు సంబంధించినది. శృంగార వీరరసములు, బాహ్యాభ్యంతరవస్తువులు, నాయికానాయకులు, దేశకాలపరిస్థితుల కనుగుణముగ వస్తుచిత్రరూపములగు కవి సమయములు, ఛందోఽలంకారములు, లోకోక్తులు మున్నగువానినిగూర్చి వివరించు నది పొరుళధికారము. వీనిలోఁ దమిళుల సామాజికజీవనవిధానము మనోజ్ఞముగాఁ జిత్రింపఁబడి నది. వారియభిరుచులు, ఛందస్సంప్రదాయములు, నాచారవ్యవహారములు, జాతివార్తామతకృత్యములు మొదలగువానిని దెలిసికొనుట కీ యధికారము మిక్కిలి తోడ్పడును.

తొల్కాప్పియము ద్రావిడభాషావ్యాకరణము లన్నిటిలోను నతిప్రాచీన మయినది. భాషావ్యాకరణచ్ఛందోఽలంకారవములనుగూర్చి తెలుపు నీలక్షణగ్రంథరచనా సంప్రదాయమే తరువాత తెలుఁగు లక్షణగ్రంథములందు ననుసరింపఁబడినది. సంస్కృతమున వ్యాకరణగ్రంథములు, ఛందోగ్రంథములు, అలంకార గ్రంథములు ప్రత్యేకప్రత్యేకము గానే రచింపఁబడును గాని యిట్లన్నిటిని జేర్చి భాషాలక్షణమును దెలుపుసంప్రదాయమాభాషలో లేదు. అది తమిళమునకు విలక్షణము. ఈ దేశిరచనాపద్ధతి తరువాత తెలుఁగులోఁ గూడ ననుసరింపఁ బడినది.

కడసంగమునకుఁ జెందిన కవిప్రవరులలో తిరువళ్లువర్ ప్రసిద్ధుడు. అతఁడు రచించిన 'తిరుక్కురళ్' అను గ్రంథము 'తమిళవేదము' గా సంభావింపఁబడుచున్నది. ఇందు సార్వజనీనములు, సార్వకాలికములు నగు పెక్కు నీతులు రెండుపాదములు గలిగిన 'కురళ్' అను ఛందములోఁ దెలుపఁబడెను. వానిలో నేమతప్రసక్తియు లేకుండుట యొక గొప్పవిశేషము.

తిరువళ్లువరుకుఁ బిమ్మటఁ బేర్కొనఁ దగిన కవయిత్రి అవ్వై. ఆమె అత్తిచ్చూడి, కొంద్రైవేంద్రన్, వాక్కుండాం, నల్వలి మొదలగు నీతిగ్రంథములను రచించెను.

సంగకవులు తమకావ్యవస్తువులను సంస్కృతము నుండి గ్రహింప లేదు. వర్ణనలయందును వారి ప్రత్యేకత గోచరించును. ఛందస్సాహిత్యరీతుల విషయమునఁ గూడ సంస్కృతసంప్రదాయములు తెలుఁగు కన్నడములందువలెఁ దమిళమునఁ బ్రవేశింప లేదు. అక్షరగణబద్ధము లగు సంస్కృత వృత్తములు గాని, సంస్కృతకావ్య పద్ధతిని నష్టాదశవర్ణనలు గాని, గర్భబంధకవిత్వరీతులు గాని యందవలంబింపఁబడ లేదు. తమిళము నందలి ప్రాచీనకవిత్వమంతయు మూఁడేసి, నాలుగేసి దేశీయచ్ఛందోగణములగల మూఁడేసి నాలుగేసి పాదములు గల పద్యములతోఁ గూడి యుండును. కురళ్ గ్రంథము రెండు పాదముల పద్యములతోఁ గూడి యుండును. షట్పదులు, అష్టపదులు మొదలగు వానివలె **6, 8, 10, 12** పాదములు గల పద్యములు కూడ నందుఁ గలవు.

అగనానూఱు, పుఱనానూఱు కావ్యములు ప్రేమగీతములు, వీరగీతములు ప్రధానముగాఁ గలిగి యుండును. 'తిరుక్కురళ్' నీతిగీతముల గ్రంథము. తరువాత

ఆళ్వారుల కాలములో భక్తిగీతములు ప్రబలినవి. క్రీస్తుశకము ఏడు, ఎనిమిది శతాబ్దులకాలమున పెరుందేవనార్ అనువదించిన భారతము దేశీయ మగు 'వెణ్బా' పద్యములలో రచింపఁబడినది.

జైన, బౌద్ధుల యుగమునఁ దమిళసాహిత్యమునందు శిలప్పదిగారము, మణిమేకలై, జీవకచింతామణి యనుకావ్యరాజములు వెలుఁగులోనికి వచ్చెను. వళయాపతి, కుండలకేశి యనుకావ్యములతోఁ గలసి వీనికిఁ దమిళమునఁ బంచకావ్యములని పేరు. జైనబౌద్ధుల యాచారవ్యవహారములను, తాత్త్వికరహస్యములను బ్రతిబింబించుచున్నను నివి కేవలము జైన బౌద్ధమతసిద్ధాంతములను వ్యక్తీకరించుమతగ్రంథములని భావింపరాదు. అందలినాఁటి తమిళుల ప్రశాంతజీవనవిధానము, వారి నాగరకత, వారి సిరిసంపదలు మొదలగునవి యభివర్ణింపఁబడినవి. దీనియందలి యితివృత్తములు స్వతంత్రములు, దేశీయములు. సంస్కృతసాహిత్యములో దీనికెట్టి సంబంధమును లేదు. దీనిలో శిలప్పదిగారము తమిళుల జాతీయమహాకావ్యముగాఁ బరిగణింపఁ బడుచున్నది. చోళదేశమున జనించి, పాండ్యమండలమునఁ బాతివ్రత్యము వెలయించి, చేరదేశమునఁ దనభౌతికకాయమును వీడిన కణ్ణకి యొక్క జీవితచరిత్ర మా మహాకావ్యమున మిక్కిలి మనోహరముగా నభివర్ణింపఁ బడినది. ఆమె పవిత్ర జీవనఘట్టములు కావేరీనదీజలముల వలెఁ జేరచోళపాండ్యములను ప్రాచీనతమిళరాజ్యత్రయమును బెనవేసికొని పవిత్రతను గాంచినవి. మణిమేఖల యనుకావ్యమును మణిమేఖల యను వేశ్యయొక్క వృత్తాంత మభివర్ణింపఁబడినది. కథాదృష్టితోఁ జూచినపుడు మణిమేఖల శిలప్పదిగారమునకంటెఁ బూర్వరచన మని స్ఫురించును. కాని, యివి రెండును జంటకావ్యము లని పేర్కొనఁబడు చున్నవి. మణిమేఖలయందలి కథకుఁ దరువాత జరిగిన వృత్తము శిలప్పదిగారమునం దభివర్ణింపఁ బడినది.

ఈ జైనబౌద్ధులయుగమునందు వెలువడిన గ్రంథములలో సంస్కృతశబ్దములును, నార్యగాథలును ననేకములు ప్రవేశించెను. అనఁగా నీకాలమున సంస్కృత భాషావాఙ్మయములకుఁ దమిళదేశమున బహుళప్రచారము లభించె నన్నమాట. అయ్యును నీయుగమునందు వెలసినకావ్యములు సంస్కృతానువాదములు కాక స్వతంత్రము లయి, దేశీయేతివృత్తములతో శోభిల్లుచుఁ దమిళభాష యాదినుండి యనుసరించుచుండిన దేశిమార్గమును బరిరక్షించుకొనుచునే యుండినవని విశదమగుచున్నది.

తరువాత వచ్చిన శైవవైష్ణవమతాచార్యులయుగమునఁ బ్రచారములోనికి వచ్చిన తమిళసాహిత్య మంతయు మధురగేయమయమై భక్తిరసప్రపూర్ణమై యుండెను. ఆళ్వారులును, నాయన్మారులును సంస్కృతభాషాభిజ్ఞు లయినను భక్త్యుద్రేకమున వారు ప్రజలభాషయందే గీతములు పాడిరి. అట్లు రచితము లయిన శైవగీతకదంబము నకు 'తిరుమత్తై' యనియు, వైష్ణగీతికాసందోహమునకు 'నాలాయిర' దివ్య ప్రబంధ మనియుఁ బేళ్లు కలిగెను. మాణిక్యవాచకర్ అను నాయన్మారు రచించిన కృతులలోఁ బేర్కొనఁ దగినది 'తిరువాచకం'. అందు దేశికవితాశాఖకుఁ జెందిన అమ్మానై (అచ్చనగాయ లాడు సందర్భమున స్త్రీలు పాడెడిపాట), తెళ్లేణం (గొబ్బిపాట), పాళల్ (జోలపాటలు) మొదలగు గీతప్రభేదములలోఁ బెక్కు గీతములు రచింపఁబడియున్నవి.

తమిళమునందలి కవిత్రయయుగమున వెలసిన ప్రముఖ గ్రంథము రామావతార మను నామాంతరము కల కంబరామాయణము. వాల్మీకిరామాయణము ననుసరించియే కంబమహాకవి తన రామాయణమును సంతరించినను నం దతఁడు కావించిన వర్ణనలు సహజములు, సుందరములు నై యొప్పారుచున్నవి. ఉపమాలంకారమును జెప్పుటలో నతనిని మించినవారు తమిళకవులలో మఱొకరులేరని నుడువుదురు. అతని వర్ణనాంశములు దైనందినజీవితమునుండి గ్రహింపఁబడినది. ఇట్టివానిచేతనే కంబరామాయణము వాల్మీకిరామాయణము కంటెను మిన్నగానుండు నని తమిళవిద్వాంసులు తలఁచుట కవకాశమేర్పడినది. సంస్కృతకావ్యముల ననువదించిన సందర్భములందుఁ గూడ తమిళ కవీశ్వరులు దేశీయము లగునుపమానాదులతో, వర్ణనములతోఁ దమకవిత్వమును దేశి లక్షణలక్షిత మగునట్లు చేసి యుండి రనుట యీవిషయమువలన వెల్లడియగుచున్నది.

తమిళమునందలి క్షీణయుగమునకుఁ జెందిన అరుణగిరినాథుని రచనములలో 'తిరుప్పుగళ్' అనునది ప్రశస్త మయినది. అందురమారమి వేయికిఁ బైఁగా మధుర గీతములు కలవు. తమిళులు తమజాతీయకవి యని ప్రస్తుతించు మహాకవి సుబ్రహ్మణ్యభారతి కవిత్వమున గేయాంశము ప్రస్ఫుటముగా గోచరించును. అతఁడు పరాశక్తిని గుఱించియుఁ, గృష్ణునిగుఱించియు రచించిన మధురగీతికా సముచ్చయములో నాతని భక్తితత్త్వము కొట్టవచ్చినట్లు కానవచ్చును. ఆళ్వారులును, నాయన్మారులును దమిళమున గేయవాఙ్మయమును సుసంపన్న

వెలయరించినట్లే భారతి యాధునిక తమిళగేయ వాఙ్మయమును సుసంపన్నమొనరించెను.

తమిళసాహిత్యమున నాటి కాలమునుండి ప్రవర్తిల్లుచు వచ్చిన దేశికవిత్వ లక్షణవములు నానుపూర్విత్రోం దెలిసికొంటిమి. ఇతివృత్తమునందునను, ఛందస్సునందును వారు సంస్కృతభాషపై నాధారపడక స్వతంత్రముగానే చాలవఱకుఁ గవిత్వము చెప్పి యుండినవిషయమును బరిశీలించితిమి.

ఇఁకఁ గవిసమయములు, వర్ణనాంశములు, ఉపమానములు మొదలగు వానివిషయమునఁ గూడ వారు సంస్కృతభాషా ప్రభావమునకు లోనుగాక స్వతంత్రముగా, దేశీయముగా నిర్వహించినవిధము నించుక పరిశీలింతము.

తొల్కాప్పియము పొరుళ్ అధికారమునఁ దమిళకావ్యవస్తువునుగూర్చియుఁ దద్వర్ణనారీతులనుగూర్చియుఁ దెలుపుసందర్భమునఁ గావ్యములోని శృంగారరసము గాని, వీరరసము గాని యాయాదేశకాలవిభాగమున కనుగుణముగానే వర్ణింపఁబడ వలయు నను నది యొక కవిసమయముగాఁ బేర్కొనఁబడినది. ప్రాచీన తమిళకవి సంప్రదాయము ప్రకారము దేశవిభాగము 'కురుంజి' (పర్వతప్రాంతము), 'పాలై' (ఎంరుప్రదేశము), 'ముల్లై' (అరణ్య ప్రదేశము), 'మరుదం' (మాగాణిప్రదేశము) 'నెయ్‌దల్' (సముద్రప్రాంతము) అని యైదువిధములుగా జేయఁబడినది. తొల్కాప్పియములోని యీ సూత్రమున నీవిషయము తెలుపఁబడినది. చూడుఁడు:

'మాయోన్‌మేయ కాడుఱై ఉలగముం
శేయోన్‌మేయ మెయ్‌వరై యులగముం
వేన్దర్ మేయ తీమ్పున లులగముం
వరుణన్‌మేయ పెరుమణలులగముం
ముల్లై కుఱింజి మరుద నెయ్‌ద లెన
చ్చొల్లియ ముఱైయాల్ శొల్లవుం పడుమే.'

– తొల్కాప్పియం – పొరుళ్ అధికారము, సూత్రము -

ఈ సూత్రమునకు శ్రీ ఇ.యస్. వరదరాజఅయ్యర్ చేసినయాంగ్ల వాదమిట్లు కలదు.

'The ancient Tamilians divided the lands into four regions Viz , **Mullai**, or the pastoral part, **Kurinji** or the hilly part, **marudam** or the agricultural part and **neydal** or the littoral part. Tholkappiar calls them as the worlds as they by themselves constitute a miniature world, and as all things are born of the five elements viz., fire, air, earth, water and ether **Palai** has no land of its own. Any how it also had been included because of the abudance of a tree named **Palai**, the trendils and branches of which do not fade even in summer. The world is called **'Nanilam'** in Tamil because of the above four divisions which it comprised In fact lands not only in the Tamilagam, but also in the North or West of India, why in fact, any part of the land in any quarter of the globe can be classified under any one of these heads. Every division in the Tamil land had its own presiding deity; for instance **Meyon** belonged to the **Mullai** Tract, **Seyon** or **Murugan** to the hilly tract, Indra to the **Marudam** tract, and **Varuna** to the **Neydal** region The prepondering elements in the population of these tracts were the shepherds, the hunters, the agriculturists, and the fishermen; though the other men who belonged to the various castes, creeds and colours were also there.

Tolkappiam - Porulatikaram - vol I, part I, page 5.

వేదాంతదేశికులవిషయముగా నితరులుచెప్పిన వాళిత్తిరునామము (స్వస్తి వాచనము లేక మంగళాశాసనము) లోఁ గూడ నీదేశవిభాగప్రసక్తి కలదు.

'నానిలముం తాన్‌వాళ నాన్ మఱైగళ్ తాన్ వాళ' ఇందు 'నానిలము' అనఁగా నాలుగుదేశవిభాగములు గల ప్రపంచ మని యర్థము.

ఈప్రదేశములయందు శృంగారవీరప్రధానములగు కథలను వర్ణించునప్పుడు కొన్నిప్రత్యేకకవిసమయము లందుఁ బేర్కొనఁబడినవి. ఒక్కొక్కప్రాంతమునకుఁ జిహ్నములుగాఁ గొన్ని కొన్నిరంగుల పుష్పములు మొదలగునవి కూడఁ దెలుపఁబడినవి. శృంగారము రస మయినప్పుడు నాయికానాయకులసమాగమము (పుణర్తల్) 'కురంజి' యనఁగాఁ బర్వతప్రదేశమునందు జరగినట్లును, రాత్రి మొదలిజామున సంఘటిల్లినట్లును వర్ణింపవలయును. యుద్ధాదివర్ణనము మొదట గోగ్రహణముతోఁ బ్రారంభింపవలయును. అదియు 'కుఱింజి' అనఁగాఁ బర్వతప్రదేశమునందే జరిగినట్లు సూచింప వలయును. దండయాత్ర కను వయినస్థలము ముల్లై (అరణ్యప్రదేశము ముట్టడి) మరుదు (మాగాణి) ప్రదేశమున

జరిగినట్లును, యుద్ధము నెయ్‌దల్ (సముద్ర) ప్రాంతమున జరిగినట్లును సూచింప వలయును. విజయమునకు సంబంధించినది 'పావై' యనఁగా మరుప్రదేశము.

ఇఁకఁ బుష్పములలో నెఱ్ఱనిరంగు గల'వెచ్చి' పూవులు యుద్ధమునకు సూచకములుగా వర్ణింప వలయును. పసుపుపచ్చని పగు 'వంచి' పువ్వు అప్రతిహత శక్తిచిహ్నము. తుంబె (ద్రోణ) పుష్పములు కోటను ముట్టడించువారిచే ధరింపఁ బడును. 'వాహై' యను తెల్లని పుష్పములు విజయచిహ్నములు.

ఈ కవిసమయము లన్నియు దేశీయములే కాని సంస్కృతాలంకారశాస్త్రములకును, సంస్కృతకవిసంప్రదాయములకును నేమాత్రమును సంబంధించినవి కావు.

అగనానూఱు అనుసంకలనగ్రంథమునందలి యొకగీతములోని యీయుపమానము దేశీయమై యుండుట గమనింపఁ దగియున్నది.

'భద్రాజా చేతిలోని మద్దెలనడిమి భాగమున నున్న తెల్లని భాగమువలె నా ప్రాంతమున నున్న నీళ్లు లేని త్రోవమీఁదుగా నా ప్రియుఁడు వెడలెనుగదా.'

పుఱనానూఱు అను సంకలన గ్రంథమునఁ గరికాలచోడుని మరణవార్తను విని చింత్రాక్రాంతుఁడయిన యొక కవి విలపించినవిధమును వర్ణించు గీతములోని దేశీయమయినయీయుపమానము మిక్కిలి మనోజ్ఞము.

'మేనవికాలమున గొల్లెమందల మేఁతకై గోపబాలు రాకులు రాల్పఁగా వెలవెలఁ బోవుచుఁ గనఁబడునెండుచెట్లవలె – నేఁడునగలు, నాణెములు, బరిహరించినరాణులు వెలవెల పోవుచున్నారుకదా.'

ఈ యుపమానమును గలిగి యున్న పుఱనానూఱులోనియీ గీతమును దిలకింపుడు:

'పసిత్త ఆయత్తు పయన్నిరై తరుమార్
పుచాల్ కోవలన్ పూవుడన్ ఉదిరక్
కొయ్‌దుకణ్ అలిత్త వేంగైయిన్
మెల్లియర్ మగలిరుం ఇలై కలైన్ దనరే.'

– పుఱనానూఱు, *224 గీతము*

దీనికి నాచ్చినార్ కినియర్ వ్యాఖ్య (ఉరై) యిట్లు కలదు. చూడుఁడు:

'పెరియ వఙ్కుడు మిక్క వేనిల్ కాలత్తు
పసిత్త అయ మాగియ పయన్ పదుం అనిరైయై
ఇరక్కిత్తిల్ సెయ్‌వారాగ కూర్నై పొరుందియ
కొడువాళాళ్ కోవలర్‌అవర్‌గళ్ పుకొక్కుడనే
ఉదిరకొంబుగ్గలై కళిత్తు అదన్ తళై చ్చెవై
అళిత్త వెంగైయినై ఒప్ప మెల్లియ ఇయల్పినై
ఉడైయ ఉరమై మగళిరుం అరుంగలఅణి మొద
లాగియ అణిగళై ఒళిత్తార్.'

– డాక్టరు యు. వి. స్వామినాథ అయ్యరుగారిచే సంపాదితము.

కంబరామాయణమునందలియుపమానములు స్వతంత్రము లై దేశిసౌరభముతో గుబాళించును. అశోకవనమునందున్న సీతాదేవికి హనుమంతుఁడు శ్రీరామచంద్రుఁ డొసఁగిన యంగుళీయకము నీయఁగా దానిని జూచి యామె బ్రహ్మానందమునందెను. ఆమెయానందమును గవి యీక్రింది యుపమానములతో నభివర్ణించుచున్నాడు.

'కోలుపోయినమణిని మరలఁ బడసిన పన్నగపు మనస్సు, ఆశవదలుకొనిన పిదప యావదాస్తిని మరలఁ బడసినవాని మనస్సు, మరణించె నని తలంచిన తనయేకైక పుత్రుఁడు పునరుజ్జీవితుఁడు కాఁగా నతనిని జూచుకొని సంతసించు తల్లి మనస్సు, ఏదో యొకమహిమవలనఁ జూపును బొందిన పుట్టుగ్రుడ్డి మనస్సు నెట్లుండునో సీతాదేవి మన స్సట్లుండెను.'

ఈ యుపమానములుగల కంబరామాయణములోనియీపద్యములను దిలకింపుఁడు.

'ఇఱన్దమన్ పెఱ్ఱపయన్ ఎయిదినర్ కొల్ ఎన్గో
మఱన్దవర్ అఱిన్దుణర్వు వందనర్‌కొల్ ఎన్గో
తుఱన్ద ఉయిర్ వన్దిడై తొడర్‌న్దదు కొల్ ఎన్గో
తిఱన్దెరి వరన్ కొల్ ఇవన్ న న్నుదలి శెయ్‌కై.'
'ఇరనమణి పుట్టుఅవు యదిఱ్‌న్దెనల్ అనాళ్
పఱన్దనం మఱైన్దదు పడైత్తవరుం ఒత్తాళ్

కుళిర్నయై ఉయిత్తమల ది క్కు-వమై కొండాల్
ఉళ్లన్ల ఎటి పెట్రుదోర్ ఉయిర్పొరయుం ఒల్లాల్.'

– కంబరామాయణము – సుందరకాండము –
ఉరుక్కా-ట్టుపటలము – **110, 111** పద్యములు.

గుహుని నల్లనిదేహమును వర్ణించుచుఁ గంబకవి 'నూనెపూసిన యద్దకపు గుడ్డవలె నాతని దేహము నిగనిగలాడుచు నల్లగా నుండెను' – అని రచించెను. ఈ(క్రింది పద్యమును జూడుఁడు:

'పెణ్ణై ఎన్ శెరుం పిర్పిరుగిచ్చురి
వణ్ణవార్ మయిల్ వార్దుయల్ మున్కైయాన్
కణ్ణకన్ తడమార్బన్ ఎన్నుం కల్లినాం
ఎణ్ణై యుండ విరుల్పురై మేనియాన్.'

– అయోధ్యాకాండము – గుహప్పడలము – 6వ పద్యము.

ఇందు 'నూనె పూసినయద్దకపు గుడ్డవలె' నను నుపమానము దేశీయ మై నిగనిగతోఁడి యాతని మేని నల్లఁదనమును జక్కఁగా స్ఫురింపఁ జేయుచున్నది.

ఇట్లు, తమిళసారస్వతమునందుఁ బ్రాచీనకాలమున దేశిసారస్వతమే ప్రవర్తిల్లె ననియు, సంస్కృతభాషాప్రభావమంతగా నాభాషపైఁ బ్రసరింప లే దనియుఁ, గవిసమయములు, ఉపమానములు మొదలగు విషయములందుఁ గూడ దేశీయాభిమానమే ప్రదర్శింపఁ బడుచు, స్వతంత్రమయిన మార్గమే యనుసరింపఁ బడుచు వచ్చెననియుఁ దెలిసికొంటిమి.

ఇంతకుమునుపు తమిళసారస్వతమునందలి దేశినిగూర్చి తెలిసికొంటిమి ఇఁకఁ గన్నడసారస్వతమునందలి దేశినిగూర్చి తెలిసికొందము. తెలుఁగు కన్నడముల మీఁద వలెఁ దమిళ, మలయాళములమీఁద సంస్కృతభాషాప్రభావ మంత ప్రాచీనమును, బలవత్తరమును గా దని యింతకు ముందే తెలిసికొంటిమి. తమిళ సారస్వతమునకును, దెలుఁగు కన్నడ సారస్వతములకును ముఖ్య మయినభేద మొకటి కలదు. ఈయుభయభాషలయందును గావ్యరచనము ప్రారంభ మగునాఁటికే సంస్కృతసాహిత్యానుకరణము ప్రబలినసూచన లగపడుచున్నవి. క్రీస్తుశకము ఏడు, ఎనిమిది శతాబ్దములనాఁటికే సంస్కృతవృత్తములును, సంస్కృతసాహిత్యాలంకారికరీతులును గన్నడకవితయందుఁ బ్రవేశించినవి.

క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్దికిఁ జెందిన శ్రావణ బెళగోల శాసనమున 'స్రగ్ధరా' వృత్తమున రచింపబడిన కన్నడపద్య మగుపడుచున్నది.[४]

స్రగ్ధర:

సురచాపంబోలె విద్యుల్లతెగళతెఱవోల్ మంజవోల్ తోఱిబేగం
పిరగుం శ్రీరూపలీలాధనవిభవమహోరాశిగళ్ నిల్లవాగ్గ్ం
పరమార్థం మెచ్చెనా నా ధరణియొళ్ ఇరవా నెందు సన్న్యాసనంగె
య్దురు సత్వన్ నందిసేన ప్రవరమునివరన్ దేవలోకక్కె సన్దాన్.

(*Ep. Car. II, 88*)

అం దొక శార్దూలవృత్తము కూడఁ గలదు. చూడుఁడు :

మాసేనర్ పరమప్రభావ రుషియల్ కఱ్ఱప్పినా వెట్టిదుళ్
శ్రీసంఘం గళపేట్టి సిద్ధసమయం తప్పాదెనోం తింపినిన్
ప్రాసాదాంతరమాన్ విచిత్రకనక ప్రజ్వల్యదిన్ మిక్కుదాన్
సాసిర్వన్ చరపూజిదందుయె అవల్ స్వర్గాగ్రమానేఱిదార్.

– శ్రావణ బెళ్గొళా. *Circa. 700*

క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దియందు దండిభామహాదుల యాలంకారిక లక్షణము ననుసరించి రచింపఁబడి రాష్ట్రకూటచక్రవర్తి యగు నృపతుంగుని మూలముగఁ బ్రచారమునకుఁ దేఁబడిన 'కవిరాజమార్గ' పద్ధతి కన్నడమున ననుసరణీయముగుచున్న కవితాపద్ధతియై వెలసినది. క్రీస్తుశకము పదవశతాబ్దియందు రచింపఁబడిన నాగవర్మవిరచిత మగు 'ఛందోంబుధి' లో సంస్కృతవృత్తముల ప్రశంసయే ప్రాధాన్యము వహించినది. కాని, దేశీయచ్ఛందముల కట్టి ప్రాధాన్యము లేదు. దీని ననుసరించియే పంపాదులు మార్గపద్ధతియందు అనఁగా సంస్కృతవృత్తములు, తత్సమబహుళ మగుభాష ప్రాధాన్యము వహించిన గద్యపద్యాత్మక మగు చంపూకావ్యపద్ధతిలోఁ దమప్రబంధములను రచించిరి.

కవిరాజమార్గమునకుఁ బూర్వము కన్నడమున సంస్కృతానుసరణము చాలవఱ కున్నను దేశి పద్ధతి కూడ మార్గపద్ధతితోఁబాటు సమానగౌరవము నందియుండెనని యూహింపవచ్చును. కవిరాజమార్గమునందలి పూర్వకవి

४. దక్షిణదేశభాషాసారస్వతములు–దేశి, శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు:పుట. *62.*

ప్రశంసలో శ్రీవిజయు, కవీశ్వర, పండిత, చంద్రలోకపాలాదులు పద్య కావ్యకర్తలుగను, విమలోదయు, నాగార్జున, జయబంధు, దుర్వినీతులు గద్యకావ్యకర్తలుగను బ్రస్తుతింపఁ బడిరి. కొందఱి రచనలనుండి లక్ష్యములు కూడ నం దొసఁగఁబడినవి. కాని, వానిఁబట్టి యాకవిత్వస్వభావ మెఱుఁగుటకు వీలగుట లేదు. కాని, యాకవిరాజమార్గపీఠికయందే 'చత్తాణ', 'బెదండె' యను కావ్యభేదము కందముతోఁబాటు అక్కర, గీతికె, తివది మొదలగు దేశీయ రచనలతోఁ గూడినదిగాఁ జెప్పఁబడియున్నది. అవి రెండును దేశీయచ్ఛందము లందు రచింపఁబడిన కావ్యభేదము లనియు, నవి నృపతుంగుని కాలమునకే 'పఱగన్నడ' (ప్రాచీన కన్నడము) మని చెప్పఁబడఁ దగినభాషలో రచింపఁబడి యుండుననియుఁ దెలియుచున్నది.

కవిరాజమార్గమున దోషాదోషానువర్ణన నిర్ణయము అనునధ్యాయమున దేశిని గూర్చియు, పఱగన్నడమును గూర్చియుఁ దెలుపఁబడి యున్నయీ పద్యము లిచట ననుసంధింపఁ దగి యున్నవి.

క: దోష మినితెందు బగెదు
ద్భాషిసి తఱిసందు కన్నడం గళాళెందుం
వానుగియు మఱియ లాఱదె
బేఱుగుం దేశి బేఱె (వే) అప్పుదఱిం. (46)

'దేశి వేఱువేఱు విధముగా నుండుటచేతఁ గన్నడభాషలోని దోషమింత యని విచారించి నిశ్చయముగాఁ జెప్పుటకు వాసుకికిఁ గూడ సాధ్యము కాదు. వేసట కూడఁ గలుగును. కావున దానికి అనఁగా నీ కన్నడదేశీయభాషకు లక్షణము చెప్పుట సాధ్యము కాదు' – అని పయిపద్యమునందలి భావము.

క: (ఇం) తుం పురాణకవిగళ
సంతత గత మార్గగదిత దోషం గళుమం
చింతిసి మత్తె న్నఱివుడు
మంతఱి సలె బుధజనక్కె కెలవం పేళ్వెం. (47)

క: నెలసిద కావ్యం కావ్య
క్కెలక్షణం సతత మెందె పఱగన్నడమం
(గి) డిసి నుడివరాగమ
బలహీనర్ దేసి యల్ల డెందఱి దుర్డుం. (48)

'అప్పటికి నిలిచియున్న కావ్యములను నాకావ్యముల లక్షణమును సతతముగా – నవశ్యాదరణీయములుగా నెంచి శాస్త్రములను లేదా లక్షణములను బాగుగా నెఱుంగనివారు ఆ పఱగన్నడమును బాడు చేసి చెప్పెదరు. అది యందము కా దని వారికే తెలియును' – అని భావము.

పఱగన్నడ స్వరూపం.

క: పొడవిపతి గొ (రవ) నెనె (పే)
ళ్పిడెయదు వదెకరిసి కబ్బిగల్ దూ (ఱె) నెయుం
(హొడవ సమరె నిట్ట) సంగెం?
మఱియొ (ళ) మార్గెండు నుడివ పఱగన్నడమం. (49)

పఱగన్నడదనిందె.

క: దొరకొందిరె సొగియిసు గుం
పురాణకావ్యప్రయోగదొళ్ తత్కాలం
విర (సం) కర మప్పు దేసిగె
జరద్వధూ విషయ సురత రస రసికతె వోల్. (50)

'పఱగన్నడము పురాణకావ్యప్రయోగమున నాకాలమునందు సొగసుగా నున్నను నిప్పటివారిదృష్టికి జరద్వధూ విషయ సురత రస రసికతను బోలి విరసంకర మగును' – అని భావము.

సంస్కృతపదభూయిష్ఠ మగుశిష్టభాషవలె నీ పఱగన్నడము నృపతుంగునికి సమ్మతము కాక పోవుటచేతనే యతఁడు 'విరసంకర మప్పు దేసిగె జరద్వధూవిషయ సురతరసరసికత వోల్' అని దానిని నిరసించి యుండెను. మఱియు నాతఁ డిట్లు 'పఱగన్నడ' భాషాప్రయోగమును నిరసించి సమసంస్కృతమునే దేశభాషలలోఁ గలుప వలెను గాని కేవల సంస్కృతపదములను గలుప రా దని యీ క్రింది నియమము గావించి యుండెను.

క: సమసంస్కృతం గళా (ళ్స)
ద్యత్తు మర్దిరె కన్నడ మనఱిదు పేళ్గెంబుది దా
గమకోవిద నిగదితమా
ర్గ మిదం బెరె సల్కమాగదీ సక్కర దొళ్.

నృపతుంగుని కవిరాజమార్గమునందలి కన్నడభాషకును, దరువాతి కన్నడ కవులభాషకును వ్యత్యాసమంతగాఁ గానరాదు. సంస్కృతపదములను గన్నడభాషతో నెట్లు వాడ వలయునో, యెట్టి రూపములను దేశభాషా పదములతోఁ గలిపి వాడ రాదో కవిరాజమార్గమునందు వ్యవస్థ చేయఁబడెను. భాషవిషయమున నాతఁడు చెప్పిన సూత్రములను దరువాతివారు పాటించిరి. దండిభామహాదుల ననుసరించి వేయఁబడిన యీ కన్నడమార్గపద్ధతి రాజమార్గమగుటచే నంతకుఁ బూర్వము కన్నడమందుండిన దేశిపద్ధతి యంతరించినది. తెలుఁగులో నన్నెచోడునివలె – కన్నడమున పంపాదులు దేశిని గూడ స్మరించి కొంత దేశి సంప్రదాయమును గూడ మార్గపద్ధతిలోఁ జేర్చినను గేవల దేశిరచనాపద్ధతి మఱుఁగుపడి పోయినది.

పంపమహాకవికి సమకాలికుఁ డగు ‘శివకోట్యాచార్యుఁడు’ వడ్డారాధన యను నొక గ్రంథమును రచించెను. ఆగ్రంథము కన్నడవాఙ్మయమున కపూర్వాలంకారము. అందు మార్గపద్ధతికిని, దేశిపద్ధతికిని సమాన ప్రాధాన్య మొసఁగఁబడినది. పంపమహాకవి యుగమునకుఁ జెందినకవులు శైలిలో, వర్ణనలలో, నలంకారములలో, ఛందస్సులో, కవిసమయములలోఁ జాలవఱకు సంస్కృతకావ్యములనే యనుసరించి నప్పటికిని సందర్భోచితముగా వారు కన్నడదేశిని గూడ నభిమానించిరి. పదునొకండవ శతాబ్దికిఁ జెందిన దుర్గసింహుఁ డను యోధకవి రచించిన పంచతంత్రము అను ప్రౌఢ కావ్యమునందలి దేశిమార్గసమ్మిశ్రణము మిక్కిలి విశిష్ట మయినది. పండ్రెండవ శతాబ్దమునకుఁ జెందిన ‘నయసేనుఁ’ డనుకవి పామరులకొఱకై గ్రంథరచనము చేసిన కళారాధకుఁడు. అతఁడు ‘శుద్ధకన్నడము’ న గ్రంథము వ్రాయవలయునని యభిలషించెను. తత్ఫలితమే యాతని ‘ధర్మామృతము’.

క్రీస్తుశకము పండ్రెండవశతాబ్ది యుత్తరార్ధమునుండి పదునాలుగవ శతాబ్దాంతము వఱకుఁ గలకాలము కన్నడసాహిత్యచరిత్రమునందు ‘బసవయుగము’ అనుపేర వ్యవహరింపఁబడుచున్నది. ఈయుగమున మార్గపద్ధతి నుండి దేశిపద్ధతికిఁ బరివర్తనము మొదలయ్యెను. విషయము, భాష, ఛందస్సు – ఈమూఁటియందును నీయుగ మున దేశిప్రాధాన్య మెక్కువ యగుటచే దీనిని ‘స్వతంత్రయుగము’ అని కూడఁ గొందఱు పేర్కొనిరి. ఈకాలమున ‘వచనము’ అను సాహిత్యరూపము పుట్టెను. రగళె, త్రిపది, షట్పది యను అచ్చగన్నడఛందస్సులో గ్రంథములు వెలసెను. ప్రాయికముగా శరణుల చరిత్రలు

కావ్యవస్తువు లయ్యెను. భాషావిషయకముగా 'హళగన్నడము' నకును, 'హొస గన్నడము' నకును మధ్య 'నడుగన్నడ' మీ యుగమునందు వ్యాప్తిలోనికి వచ్చెను.

పండ్రెండవ శతాబ్దియందు బసవాదులు – పండితలోకమునఁ బ్రబలిన జైన, వైదికమతములకుఁ బోటిగాఁ దమమతమును జనసామాన్యమునందు వ్యాపింపఁ జేయఁదలచినవా రగుటచేఁ బ్రజాసామాన్యమునకు సుబోధక మగురచనారీతి ననుసరింప వలసిన యావశ్యక మేర్పడెను.

History of Kanarese Literature అను గ్రంథమున E.P. రైసు దొరగారు వ్రాసిన యీ వాక్యము లిట సంభావ్యములు.

'The remarkably rapid success of the prapoganda was largely due to the fact that these books were for the most part in simple prose, intelligible to all, or in easy verse, requiring no learning to understand and set to popular airs, We may perhaps, compare the effect produced in England in the fourteenth century by Wicliffe and his preachers. The books generally had simple titles explanatory of their contents.' (P. 39)

అందుచేతనే కన్నడ సారస్వతమునందు వెలసిన లింగాయతవాఙ్మయ మంతయు వచనములు, రగడలు, అవష్టదులు, సాంగత్యములు మొదలగు దేశీయ రచనాఫక్కీనే యనుసరించినది. వచనము – అను సాహిత్యరూపము బసవేశ్వరునితోఁ బ్రారంభ మయినది. షట్స్థల వచనము, కాలజ్ఞానవచనము మొదలగునవి యాతని వచనరచనములు. ద్వారసముద్రమును రాజధానిగాఁ జేసికొని పరిపాలించిన బల్లాళరాజుల కాలములో హరీశ్వరుఁడనుకవి 'శివగణద రగళె' యను గ్రంథమును, కెరెయ పద్మరస అనుకవి దీక్షాబోధె యను రగడచ్ఛందోఘటిత గ్రంథమును రచించిరి. 'షట్పదీ' కావ్యరచనమునకు రాఘవాంకకవి మొదటివాఁడు. అతఁడు రచించిన సిద్ధరామపురాణము, హరిహరమహత్త్వము ననునవి షట్పదీచ్ఛందమున రచితము లయిన కావ్యములు. క్రీస్తుశకము పదవ శతాబ్దమున నాగవర్మ తన 'ఛందోంబుధి' యను గ్రంథమున నీ షట్పదిరగడలను కన్నడ దేశిచ్ఛందోభేదములక్రిందఁ బేర్కొని వానికి లక్షణము తెలిపి యున్నను నా కాలమునను, నంతకుఁ బూర్వకాలమునను నా రచనల కంత ప్రాచుర్యములేదు. నృపతుంగుని కాలమున వేయఁబడి, పంపాదులచే

ననుగమింపఁబడిన మార్గకవితాపద్ధతి యాకాలమునఁ బ్రాచుర్యము నందుటయే యీ దేశిరచనా మార్గము మాసి పోవుటకుఁ గారణమయి యుండునని యూహింపఁ బడుచున్నది.

కాని, హరిహరుఁడు 'రగడ' యను కన్నడచ్ఛందమును వ్యాప్తిలోనికిఁ దెచ్చి కన్నడ సాహిత్యమున కొక నూతనాలంకారమును గ్రాసెను. 'రగళె' లోఁ బూర్తి కావ్యమునే వ్రాయుట కితఁడు మొదటివాఁడు. హరిహరుని మేనల్లుఁడయిన రాఘవాంకకవి సంస్కృతవిద్వాంసుఁడయ్యును జంపూకావ్యప్రక్రియను జేపట్టక - సంస్కృత చ్ఛందస్సునే యుపయోగింపక - దేశి యగు షట్పదిలో నేతన కావ్యములను వ్రాసెను. అండయ్య యనుకవి యొక్క తత్సమ శబ్దమును గూడ వాడక 'అచ్చగన్నడము' నందే 'కబ్బిగరకావ' యను కావ్యమును రచించెను. పద్మణాంకుఁడు పద్మరాజపురాణమను గ్రంథమును వార్ధక షట్పదిలో రచించెను.

ఇట్లీ బసవయుగమునందు దేశిప్రాధాన్యమెక్కు వయ్యెను.

పంపయుగమునఁ బ్రౌఢమార్గకావ్యములు ప్రాచుర్యమునందఁగా, బసవ యుగమున దేశిపద్ధతివైపు మ్రొగ్గుచూపఁబడినది. బసవయుగమునకుఁ దరువాతి దయిన కుమారవ్యాసయుగమున దేశిప్రాచుర్యము హెచ్చినది. దాసకూటము స్థిరపడి ద్వైతమతాచారములను దేశిప్రక్రియలసహాయమునఁ బ్రచారముచేయఁ దొడఁగెను. బసవయుగమునందలి శైవకవుల యుద్బోధముతో - నీయుగమున బ్రాహ్మణకవులు గూడ జనసామాన్యమున కందుబాటులో నుండునట్లు సాహిత్య నిర్మాణము చేసి యందు సంగీతమును జోడించిరి. దాసకూటోద్యమ ఫలితముగా దేశిసారస్వత మీయుగమున విస్తారముగా వెలువడినది.

తొలుదొలుత లింగాయతమతమే దేశిరచనలకుఁ బ్రోద్బలకమైనను తరువాతి కాలమున వైష్ణవగ్రంథములును దేశీయచ్ఛందమున రచింపఁబడుచు వచ్చినది. అట్టివానిలో కుమారవ్యాసునిచే రచింపఁబడిన షట్పదీభారతము ప్రసిద్ధి చెందినది. కుమారవ్యాసభారతము వలె కుమారవర్మ విరచిత మగు రామాయణము కూడ నిట్లే షట్పదియందు రచింపఁబడినది. జాలువిట్టలనాథ కవి కన్నడమున భాగవతపురాణమును రచించెను. ఇట్లు శ్రీకృష్ణదేవరాయల కాలమున విజయనగరాస్థానమునందు వెలువడిన కన్నడకావ్యములు దేశీయచ్ఛందమగు షట్పదిలో రచింపఁబడి యుండుట గమనార్హము.

విజయనగరరాజుల కాలమున వైష్ణవదాసులచే ననేకములగుభక్తిగీతములు కన్నడములో రగడలుగా రచింపఁబడినవి. ఇవి 'దాసర పదగళు' అనుపేర వ్యవహరింపఁబడుచున్నవి. ఇట్టి భక్తిగీతముల రచనములోఁ బ్రసిద్ధుఁడు పురందరదాసు. అతనికి సమకాలికుఁడగు కనకదాసు మోహనతరంగిణి యనుసాంగత్యమును, నలచరిత్ర, హరిభక్తి సారము అను షట్పదీకావ్యములను రచించెను. పదునేడవశతాబ్ది తుదిభాగమున లక్ష్మీశుఁ డను వైష్ణవకవి జైమిని భారతమునుషట్పదీకావ్యముగా రచించెను. రంగావధూత రచించిన 'అనుభవామృతము' అనుషట్పదీకావ్యము కన్నడభాషలోఁ బ్రసిద్ధి చెందిన వేదాంతగ్రంథము.

ఇట్లీషట్పదులు, రగడలు ననుదేశిచ్ఛందములు తొలుత లింగాయతమతముతో బయలుదేరినను, గాలక్రమమున నన్ని మతములవారిచేతను నాదరింపఁబడి కన్నడవాఙ్మయమున నొక ముఖ్యశాఖగాఁ బ్రసిద్ధి వహించినది.

ఇటీవలికాలమునఁ గన్నడమున వ్యాప్తిలోనికి వచ్చిన దేశిరచనాప్రభేదము యక్షగానము. తెలుగులో నాయకరాజులకాలమునఁ బెక్కురు కవులచేఁ జేపట్టఁ బడిన యక్షగానరచనములచే నుద్బోధము నంది కన్నడిగులును నిట్టి రచనలను గొన్నిటిని దమభాషయందును వెలయించుకొనిరి.

పంపాదుల మార్గకవితాపద్ధతిచే వెనుకబడి పోయిన దేశిరచనావిధానము వంత వ్యాప్తికొఱకై బసవయుగమునఁ దొలిసారిగాఁ జేపట్టఁబడి కుమారవ్యాసయుగములో నితరమతములవారిచేతను నామార్గమే యనుసరింపఁ బడి యిటీవలకాలమున నాంధ్రము లోని యక్షగానరచనోద్బోధముచే యక్షగాన కురవంజుల రూపమునఁ బొడసూపినది. ఇట్లు, కన్నడమున మార్గకవితాపద్ధతియే కాక, దేశిపద్ధతికిఁ జెందిన వచనము, రగడ, షట్పది, సాంగత్యము, కీర్తనలు, యక్షగానము అనుఛందఃప్రక్రియలు లాయాకాలములందలి యనుకూలవాతావరణమునుబట్టి, మతప్రచారాదులగునావశ్యకములనుబట్టి వృద్ధి చెందుచు వచ్చినవి.

కన్నడసారస్వతమున నాగవర్మ, గుణవర్మ లనువారు 'జాణ్నుడి' కిఁ బ్రసిద్ధులు. కన్నడకవులలో నొక రిద్దఱీపదమును వాడి యుండిరే కాని వా రయినను దాని స్వరూప మిట్టి దని తెలిపిన ట్లగపడదు. కన్నడకవులను జూచి తొలుత

నన్నెచోడుఁడును, నాపిదపఁ బాలకుఱికి సోమనాథుఁడును 'జాణ్ణుడి' కిఁ బ్రత్యామ్నాయముగాఁ దెలుఁగున 'జానుతెనుఁగు' అనుపదమును వాడి తాము జానుతెనుఁగునఁ గవిత్వము చెప్పుదుమని తమకావ్యావతారికలలోఁ బ్రతిజ్ఞలు చేసి యుండిరి. కన్నడకవులు ప్రయోగించిన 'జాణ్ణుడి' యనుపదము సంస్కృతప్రాధాన్యములేని జాతీయ మయిన కన్నడభాషా ప్రయోగమును దెలుపు నని యూహింప వచ్చును. కనుక 'జాణ్ణుడి' నభిమానించిన యాకవులు కన్నడకవితయందు దేశిప్రాధాన్యము నభిలషించువారుగాఁ దలఁపఁ దగును. కవిత్వోపయోగి యయినభాష జాతీయమయిన కన్నడనుడికారముతో నుండుట వారి యభిలషితము కావచ్చును. కన్నడకవుల ప్రయోగమునుబట్టి యాభాషలో 'జాణ్ణుడి' యనునది 'తిరుళ్‌కన్నడము'తో సమాన మయినదిగా గ్రహింపఁ బడుచున్న ట్లగపడదు. 'తిరుళ్‌కన్నడ' మనఁగా సారభూత మయిన కన్నడము. అది తెలుఁగులోని తేటతెనుఁగుతో సమానమన వచ్చునేమో![1] జాణ్ణుడి యనఁగా జాణతనముతోఁ జమత్కార యుక్తముగాఁ బ్రయోగింపఁ బడినకన్నడ మని యర్థము కావచ్చును. మొత్తము మీద నది భాషావిషయకముగా దేశీయంత నభిమానించురచనావైఖరి యని తలఁపఁ దగి యున్నది.

నాగవర్మ ఛందోంబుధి యనుగ్రంథమునఁ దన కవిత్వమును గూర్చి ప్రశంసించుకొనిన సందర్భమున నీపద్యము ప్రయోగింపఁ బడినది. చూడుఁడు:

నవరసముణ్మె, మాతుపొసతాగిరె, దేశియదే సెవెత్తుదెం
బవొలిరె, **జాణ్** మణంగొలిసె, పొణ్ణిరదర్థ కృతిప్రబంధముం
కివి దిని దాగె, పొచ్చుపొస తాగె, మనోహర మాగె, పేళ్వ న
త్కవి కవిరాజహంసనెనె పేళ తొడర్చిదె నీప్రబంధముం.

నయసేనకవి (క్రీ.శ. 1112) తన ధర్మామృత మనుగ్రంథమునందు గుణవర్మయొక్క 'జాణ్' తనమును బ్రశంసించినాఁడు.

అనగుణ దేసె, పొన్నమహోన్నతి వెత్తబెడుగు, పంపనొం
దనదృశమప్ప పూర్వతనభావ, గజాంకుశ నొళ్పువెత్తురం
జనువ నదర్థదృష్టి, గుణవర్మన **జాణ్**, కవిరత్ననోజె, శో
భిసి నెలసిర్కె, ధారిణి మనంగొళె మత్కృతియొళ్ నిరంతరం.

---

1. కుమారసంభవ పీఠిక : శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు : పుట. 30.

*జన్నకవి కూడఁ దన యశోధరచరిత్రలో గుణవర్మ యొక్క. జాణ్మడిని ప్రశంసించి యున్నాఁడు. చూడుఁడు:*

*ఎన గనుకూాల మక్కె, గుణవర్మన* ***జాణ్మడి,*** *పంపనింపు, పొ*
*న్ననబగె, నాగవర్మన బహ్మజ్ఞతె, రన్ననకాంతి, నాగచం*
*ద్రనరసభావ, మగ్గళన వక్రతె, నేమియ దేసె, పుష్పబా*
*ణన మృదుబంధ మీ కవిగళత్తె జినేంద్రపురాణకర్తృగళ్.*

కన్నడమున నాదిగ్రంథ మగుకవిరాజమార్గమునందు లాక్షణికవిషయముల తోఁబాటు చారిత్రక, వ్యావహారిక విషయములు కూడఁ బెక్కు తెలుపఁబడినవి. అది కేవలము దండి కావ్యాదర్శమున కనువాదము కాదు. నృపతుంగుఁడు తన సర్వతోముఖ ప్రజ్ఞావిశేషమును బ్రదర్శించి కన్నడదేశమును, నందలి జనజీవనమును గన్నులకుఁ గట్టునట్లు వర్ణించినాఁడు. కర్ణాటకదర్శన మనఁదగిన యాగ్రంథమునఁ గన్నడదేశమును గూర్చియు, నందలి జనులనుగూర్చియు వర్ణింపఁబడి యున్న పద్యములకు 'రైసు' దొరగారు చేసిన యాంగ్లానువాద మిది చూడుఁడు:

*'In all the circle of the earth*
*No fairer land you'll find*
*Than that where rich sweet Kannada*
*Voice the peole's mind*
*'Twixt sacred rivers twain it lies*
*From Famed Godavari*
*To where the pilgrim rests his eyes*
*On holy Kaveri*
*If you would hear its purest tone*
*To Kisuvolal go;*
*Or listen to the busy crowds*
*Through Kop'na's streets which flow;*
*Or seek it in Onkunda]s walls,*
*So justly famed in song*
*Or where in puligere's court*
*The learned scholars throng*

*The people of that land are skilled*
*To speak in rythmic tone;*
*And quick to grasp a poet's thought,*
*So kindred to their own*
*Not students only, but the folk*
*untutored in the schools*
*By instinct use and understand*
*The strict poetic rules.'*

*I (36-39)*

*- History of Kannada Literature, p. 26.*

తమిళమునందు వలెనే కన్నడమునందును గొన్ని దేశీయములయిన యుపమానములును, జాతీయములును గలవు. కన్నడకవుల గ్రంధపరిచయముచే ట్టి వానిని గొన్నిటిని వన్నెచోడుఁడు తనకుమారసంభవమునందు గ్రహించి యుండెను.

. జవనుండు కాఱిదవోల్ అయితెత్తం కురుక్షేత్రదోళ్. (రన్న - గదా.)
జముఁడు కుడిచి క్రక్కిన భంగిన్. (కుమా.)

. సంగరదలో జళద పాళియం నెఱపిదం గండం పెఱం గండనే.

(పంప. భార. 10-56)

జొన్నలు గొన్నబుణంబు నీఁగెదన్. (కుమా.)

. జయజీవస్తుతి రవంగల్
జయజీవస్తుతి శతంబులు.

. ఛత్రమహీరుహములు, తానదీవియలు, మండనాంగానోకహములు - ఇవి సంస్కృతసంప్రదాయములు కాక కన్నడకావ్యములందే కానవచ్చు విశేషములు.

గమకి - కావ్యపాఠకుఁడు అనునర్థమునఁ బ్రయుక్తము.

కన్నడసారస్వతమునందలి దేశిరచనావైఖరులను బరిశీలించితిమి. ఇపు డాంధ్ర రస్వతమునందలి దేశిరచనావైఖరులను గుఱ్ఱి పరిశీలింతము.

కన్నడమున నృపతుంగ విరచితమగు కవిరాజమార్గము వెలసిన పిదప నాదేశమున కవితామార్గము నశించిపోయినది. కన్నడదేశమునందలి శాసనములలో

నేడవశతాబ్ది నుండియు స్రగ్ధరాది సంస్కృతవృత్తములే కాని దేశీయవృత్తములు కానరాకుండుటకు నాకాలమునుండియే సంస్కృతభాషాప్రభావ మాదేశమునందలి కన్నడభాషపైఁ గ్రమక్రమముగాఁ బ్రసరించుచుండుటయే ప్రధానకారణమన వలసి యున్నది. ఇట్లు, కన్నడదేశమున మార్గకవిత ప్రాచుర్యము నందును దేశికవిత మాసిపోవుచుండఁగా నాంధ్రదేశమునందుఁ జాళుక్యరాజాదులు పలువురు తెలుఁగుభాషలో దేశికవితను బుట్టించి పెంపొందించి తెలుఁగు రచనల నీయంధ్రవిషయము నిలుపుటకుఁ బ్రయత్నించిరి. వారియాప్రయత్న ఫలముగానే న న్నయకుఁ బూర్వకాలమునకుఁ జెందిన శాసనములలో దేశీయచ్ఛందో రీతులందు రచింపఁ బడినపద్యములు – తరువోజ, అక్కర, సీసము, అనునవి కానవచ్చుచున్నవి. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దినాఁటికిఁ గాని చాళుక్యుల శాసనములలోనికిఁ దెలుఁగుపద్యము లెక్కువ తటస్థింపకుండుట కదియే కారణము. అంతకుఁ బూర్వము కూడఁ దెలుఁగున దేశికవిత చాలవఱకుఁ బాటలరూపమున నుండియుండును. కాని, యది కొంత సంస్కారమును బొందినతరువాతఁ గాని పద్యరూపమున శాసనములలోని కెక్కు న్యర్హత దానికి లభింపలేదు. చాళుక్యరాజుల యాస్థానములయం దుండినపండితులే యాకాలమున నాశాసనములను రచించి యుండుట సంభావ్యము. అందుచే వారే దేశమునఁ బ్రాచుర్యము నంది యున్న దేశికవితకు మార్గవేషముఁ దొడుగుటకుఁ దోడ్పడి యుందురు. చాళుక్యరాజులకు దేశికవితయందుఁ గలయాదరమే వారిని సంస్కృతప్రవృత్తావలంబనమునుండి మరల్చి పాటలరూపమున నున్న దేశిరచనలను గొన్నిటిని సంస్కరించి పద్యరూపము నొందింపఁ బ్రోత్సహించి యుండును. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దియందుఁ బండరంగని యద్దంకిశాసనములోఁ గానవచ్చెడి 'తరువోజ' యట్టి సంస్కార ఫలితమే యని భావింపఁ దగును. అది ద్విపదలోని రెండుపాదముల నొక పాదముగాఁ జేసి, యట్టి నాలుగుపాదములను బ్రాసబద్ధములుగాఁ జేయుటచే నేర్పడిన పద్యము. దేశీయమును, రెండుపాదములు గలదియు నగు ద్విపద నంస్కృతమునందు వలె నాలుగుపాదములు గల తరువోజగాఁ గూర్పఁబడుటయే శాసనపద్యరచయితలగు కవులు మార్గకవితాపద్ధతి ననుసరించి చేసిన సంస్కారము. దీనిఁబట్టి ద్విపద యను దేశి చ్ఛందోభేదము చిరకాలమునుండియుఁ దెలుఁగుదేశమునఁ బ్రచారమునం దుండి యుండునని తెలియుచున్నది.

అట్లే, దేశీయచ్ఛందోరీతిని మాత్రాగణబద్ధములై జాత్యుపజాతి వృత్తములలోఁ జేర్పబడిన సీసగీతములు చాళుక్యభీముని శాసనములలోను, మధ్యాక్కరలు యుద్ధమల్లుని బెజవాడ శాసనములోను గానవచ్చుచున్నవి. ఇవియు ద్విపదవలెనే దేశమునఁ బాటల రూపమునఁ జిరకాలమునుండి వ్యాప్తిలో నుండి యుండును. అట్లుండి యుండినఁ గాని బండితుల దృష్టిలోనికెక్కి శాసనములలోని కెక్కుట తటస్థించి యుండదు. ఇట్టి గణములతోఁ గూడిన అక్కర, గీతికె, ద్విపద, రగళె మొదలగు పాటలు, పద్యములు కన్నడభాషలోఁ గూడ నుండినట్లు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దియందు రచింపఁబడిన నాగవర్మ రచిత మగు ఛందోంబుధిని బట్టి తెలియుచు యీయూహమును బలపఱుచుచున్నది.

ద్విపదపాదములను రెట్టించినఁ దరువోజ యయినట్లే, రెండింద్రగణములను, నొక సూర్య గణమును జేర్చి, దాని నినుమడించిన మధ్యాక్కరపాద మగుచున్నది. దీనిఁ బట్టి తొలుత మూఁడేసి నాలుగేసి గణములు గలపాదములతోఁ గూడిన పద్యములే యీ దేశికవిత్వమున నుండెడి వని యూహింపనగును. తమిళమునకు నిట్లే మూఁడేసి గణములతోఁ గూడినపాదములు గలపద్యములు గలవు. వానికి 'చిందడి' అని పేరు. 'అగవల్' అనుపద్యములోని పాదములు నాలుగేసి గణములు గలిగి యుండును. ఇట్టి దేశికవిత తొలుత నాంధ్రదేశమునవ్యాప్తి గాంచి, యున్నను నీతెలుఁగుదేశ ముత్తరదేశీయు లగునార్యాంధ్రులకు వలసభూమి యగుటచే నీదేశ మాంధ్రదేశ మై, భాష యాంధ్ర మై, తెలుఁగు భాషపేరు కొంతకాలము మఱచిపోఁబడినట్లే యిట్టి దేశిరచనలును దేశమునఁ గొంతకాలమువఱకు మఱచి పోఁబడుట తటస్థించినది.[6]

నన్నయకుఁ బూర్వకాలమున నాతని భారతమువంటి యుద్గ్రంథము లొక వేళ లేకుండినను జనబాహుళ్యమున వ్యాప్తిగాంచియుండిన దేశిరచన లుండి యుండక పోవు. కాని, భారతరచనమునకుఁ దరువాత నారచనములు కాదరము లేక పోవుటచేతను, నవి ముఖస్థములే కాని గ్రంథస్థములు కాక పోవుటచేతను నవి నశించి యుండును.

తెలుఁగున శివతత్త్వసారమును రచించిన మల్లికార్జున పండితారాధ్యుఁడు పంచ గద్యలు, శంకరగీతభాస్వత్పదావళి యను పదములనే కాక యింకను బెక్కు ప్రాకృతపురాతనభవ్యగీతములను గూడ రచించి యీశ్వరునిఁ బొగడె నని

౬. దక్షిణదేశభాషాసారస్వతములు : దేశి. శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు : పుట. 117.

సోమనాథుఁడు పేర్కొని యున్నాఁడు. అట్టి గద్యరచనయుఁ, బదకవిత్వమును నాకాలముననను, నంతకుఁ బూర్వముననను సామాన్యజనప్రచారములో నుండెనని యూహించుటకు వీలగుచున్నది.

పండితారాధ్యుఁడు బౌద్ధగురువుతో వాదించుటకై వెలనాటిచోడుని యాస్థానమునకుఁ బోవుసందర్భమున నాతనివెంట వచ్చుచుండిన శిష్యులును, సద్భక్తసంకులమును నాడుచుఁ బాడినపదరచనములు మఱికొన్ని కలవు. వారు –

'పదములు తుమ్మెదపదముల్, ప్రభాత
పదములు, శంకరపదముల్, నివాళి
పదములు, వాలేశుపదములు, గొబ్బి
పదములు, వెన్నెలపదములు, సంజ
వర్ణన, మఱి గణవర్ణనపదము
లర్థవఘోషణ ఘూర్ణిల్లుచుండఁ
బాడుచు నాడుచుఁ బరమహర్షమున'

పండితారాధ్యుని వెంట నేఁగి రఁట.

శివరాత్రినాఁడు శ్రీశైలమున జాగరణము చేయు భక్తజను లీక్రింది గ్రంథములు చదివినట్లు పండితారాధ్యచరిత్రమునఁ గలదు.

'శతకంబు శివతత్త్వసారంబు, దీప
కలిక, మహానాటకము, నుదాహరణ
ములు, రుద్రమహిమయు, ముక్తకావళులు
గీతసూక్తములు, భృంగీస్తవంబులుఁ, బు
రాతనమునిముఖ్యరచితాష్టకములు
నరుదొందఁ జదువుచు నంకించువారు.'

మఱియుఁ గొందఱు అఱువత్తుమూవుర చరిత్రముల నేలలు పెట్టుచుఁ జదివిరఁట. మఱికొందఱు సకలపురాతనచారుగీతములు ప్రకటించి పాడుచుండిరఁట. వానిలోఁ గొన్ని సంస్కృతకృతులును, గన్నడకృతులును గావచ్చును. కొన్ని తెలుగు కృతులేఁ గావచ్చును. దానినిబట్టి శతకము, దీపకలిక, నాటకము, ఉదాహరణము, ముక్తకము, అష్టకము అనుకావ్యరచనాభేదములు క్రీస్తుశకము పండ్రెండవశతాబ్దికిఁ బూర్వమే ప్రచారములో నుండెనని

తెలియుచున్నది. వానిలోఁ గొన్నింటికిఁ దరువాతి లాక్షణికులు కొందఱు లక్షణనిర్దేశము చేసినను నన్నయోపజ్ఞ మయిన గద్యపద్యాది ప్రబంధ సంస్కృతభూయిష్ఠరచనలవంటి కాఁగ లేక తెలుఁగున నవి వెనుకఁబడి పోయి యుండవచ్చును. ఆ సమయమున జనపదగీతములే కాక సకలపురాతనవారు గీతములు కూడఁ బాడఁబడుచుండె నని చెప్పఁబడుటచే నా గీతములు కూడ నాకాలమునాఁటి పాటల భేదములే యయి యుండును. అఱువత్తుమూవుర చరితముల నేలలు పెట్టి చదివి రనుటచే నేలపాటలందువలె సంబోధనలతోఁ గూర్చిదానిని జదివి ఉండురనవచ్చును. ఇట్లనుటచే 'నేలపాటలు' అను గేయరచనలాకాలములో నుండియుండుట కవకాశమున్నది. కనుక, పండితారాధ్యరచనాకాలమునను, నంతకుఁ బూర్వమునను పాటలు, స్తోత్రములు, గీతములు మొదలగు రచనాభేదములుజనసామాన్యమునఁబ్రచారములో నుండియుండుననుట యసంభావ్యము కాదు. మఱియు శివరాత్రినాఁడు భక్తజనుల వినోదమునకై పెక్కువేడుకలు, ప్రదర్శనములు జరుపఁబడినట్లు పండితారాధ్యచరిత్రమునఁ దెలుపఁబడినది. ప్రమథపురాతనపటు చరిత్రములను నాటకములుగా నాడిరఁట, తోలుబొమ్మలనాడించుచు భారతాదికథలను బ్రదర్శించి రఁట, దీనిఁబట్టి యాకాలమునాఁటికే పావురజనుల నలరించుటకై రచితములయిన వీధిభాగవతములవంటి రచన లుండి యుండు నని తెలియుచున్నది.

ఇట్లు పెక్కువిధము లయిన దేశిరచనములు నన్నయకుఁ దరువాతికాలమునఁ గూడఁ దెలుఁగుదేశమున జనసామాన్యములో వ్యాప్తి గాంచి యున్నను నట్టిరచనములు పండితకవులకాదరపాత్రములు కాలేదు. పంద్రెండవశతాబ్దియందుఁ గన్నడదేశమున బసవాదులను శివశరణులు తమమతమును జనసామాన్యమున వ్యాపింపఁ జేయఁదలఁచిన వా రగుటచే వారికి సంబోధ మగు రచనారీతి నవలంబించిరి. వారి యాయుద్యమము మూలమునఁ గన్నడమున వచనములు, రగడలు, షట్పదులు, సాంగత్యములు మొదలగు దేశిరచనాప్రక్రియలకు వ్యాప్తి కలిగినది. కన్నడదేశమున బయలుదేరిన యీవీరశైవ మాంధ్రదేశమునఁ గూడ వ్యాపించిన వెంటనే యిచటను జనసామాన్యప్రబోధమునకై దేశి రచనముల యావశ్యక మేర్పడెను. పాల్కుఱికి సోమనాథుఁడు తెలుఁగున వెలయించిన దేశిసార్వస్వము బహుముఖము. అంతకు ముందు మల్లికార్జునపండితారాధ్యుఁడు రచించిన శివతత్త్వసారమునందును గొంత దేశిరచనా రేఖలు గోచరింపక పోలేదు. అవి కేవలము కందపద్యమయము. నన్నయభారతమునఁ గందపద్యములు పెక్కు

గానవచ్చును. నన్నయకుం బూర్వమునం గలశాసనములలో నీ కందపద్యరచనము కాన వచ్చుట లేదు. కాని, కన్నడభాషయందు రచితము లయినతొలిరచనములు కందపద్యబహుళములుగాం గాన వచ్చును. అందాదిమగ్రంధ మయిన కవిరాజమార్గమున నందందుం గొన్ని సంస్కృతవృత్తములును, గొన్ని గీతికలును నున్నను నది ప్రాయికముగాం గందపద్య బహుళముగానే రచిత మయినది. అందుం బేర్కొనంబడినప్రాచీన దేశిరచనము లగు 'చత్తాణ', 'బెదండె' యనునవి కందపద్య బాహుళ్యము గల రచనములుగానే వాని లక్షణముం బట్టి తెలియుచున్నది. కన్నడమునం గందపద్యమునకుం గల ప్రాధాన్యము తరువాతి కాలమునం దగ్గిపోయినది. మల్లికార్జునపండితుండు తన శివతత్త్వసారమును గందపద్య బహుళముగా రచించుటకుం గన్నడ భాషాగ్రంథముల పరిచయమువు నన్నయందే శిచ్ఛందస్సులలోఁగందపద్యరచనమునెడం జూపిన యాదరము కారణములు కావచ్చును. కన్నడకవుల ప్రభావమో, మఱి మల్లికార్జునపండితుని ప్రభావమో స్పష్టముగాం జెప్పలేము కాని, నన్నెచోడుని కుమారసంభవమునందుం గూడం గందపద్యబాహుళ్యము కాన నగును. నన్నయకుం దరువాతికాలమున జరగిన దేశిరచనాప్రయత్నము లివి.

పాల్కుఱికి సోమనాథుండు కన్నడమునందు వలెనే తెలుంగునందునుదేశీయ చ్ఛందోభేదమై ప్రచారమున నున్న 'రగడ'ను జేపట్టి బసవ రగళె, సద్గురు రగళె, చెన్న బసవ స్తోత్ర రగళె యను రగడకృతులను గన్నడభాషలో రచించెను. కన్నడమునందలి వచనములను బోలిన గద్యలను అక్షరాంకగద్య, నమస్కారగద్య, పంచప్రకార గద్య యను దానిని దెలుగున వెలయించెను. కన్నడమునం గాన రాక తెలుంగు దేశమున మాత్రమే వ్యాప్తిలో నుండిన దేశీయచ్ఛందోభేదము లగు ద్విపద, ఉదాహరణము, సీసము అను వానిని గ్రహించి యతండు బసవపురాణ, పండితారాధ్యచరిత్రములను ద్విపదకావ్యములను, బసవోదాహరణము, పండితారాధ్యోదాహరణము అను నుదాహరణకృతులను, చెన్నమల్లు సీసములను సీసపద్య రచనమును దెలుగున వెలయించి దేశిసాహిత్యమునకుం బుష్టి చేకూర్చెను.

తొలుత కన్నడసాహిత్యము ననుసరించియే యందులోని మార్గకవితాపద్ధతి నన్నయకాలమునం దెలుంగున ననుసరింపం బడినది. అట్లే, బసవాదుల మూలమున నందు వెలసిన దేశిసాహిత్యప్రక్రియలే సోమనాథునికాలమునం దెలుంగున దేశికిం బునరుద్బోధ కారణ మయ్యెను. ఉభయభాషలయందును జరగిన యీ దేశిమార్గకవితాపద్ధతుల క్రమవికాసము నీక్రింది విధమున గుర్తింప వచ్చును.

| కన్నడము | | తెలుఁగు |
|---|---|---|
| చత్తాణె, బెదండె అను దేశి రచనలు పఱగన్నడము | | నన్నయకు బూర్వము దేశి సారస్వతము |
| ↓ | | |
| కవిరాజమార్గము మార్గకవితాపద్ధతి | → | నన్నయ భారతము మార్గకవిత్వము |
| ↓ | | |
| బసవయుగమునందలి దేశిమార్గము | → | సోమనాధుని దేశికవితోద్యమము |
| ↓ | | ↓ |
| జైనుల దేశిరచనాపక్ష్మి | | రంగనాధరామాయణమునందలి దేశి. |
| ↓ | | ↓ |
| వైష్ణవకవుల దాసర పదగళు | | తాళ్లపాక కవుల దేశి కవిత్వము. |
| ↓ | | ↓ |
| యక్షగానములు | ← | యక్షగానములు |

సోమనాధునికిఁ దరువాత రంగనాధరామాయణము మొదలగు ద్విపద కావ్యములు మార్గేతివృత్తములో వెలసినవి. రంగనాధరామాయణమున సులోచనా వృత్తాంతము, లక్ష్మణదేవరనవ్వు మొదలయిన దేశీయము లయినకథలు చేరి యొక్క ఛందోవిషయమువననే కాక యితివృత్తమునందును గొంత దేశీయత సాధించుప్రయత్నము జరగినది. శ్రీనాధయుగమునఁ బలనాటివీరచరిత్రము దేశీమేతివృత్తముతో దేశీయచ్ఛందమగుమంజరీద్విపదలో రచిత మయినది. అందలి యితివృత్తము తెలుఁగుదేశమునకే సంబంధించి యుండుట సోమనాధుని బసవపురాణమునందుగంటె నందుఁ గల వైలక్షణ్యము. బసవపురాణమునందుఁ గర్ణాటకదేశీయుఁడగు బసవేశ్వరుని జీవితచరిత్ర మభివర్ణింపఁ బడఁగాఁ బలనాటి వీరచరిత్రమున నాంధ్రదేశీయు లయిన పలనాటివీరుల పరాక్రమాదిక మభివర్ణింపఁ బడినది. తరువాత తాళ్లపాకకవులు వైష్ణవమతవ్యాప్తికై వెలయించినసాహిత్య మంతయు సోమనాధుని కాలమున సాఁగిన దేశికవితోద్యమమునే యనుసరించినది. పదములు, ద్విపదకావ్యము, శతకము, ఉదాహరణము, వచనము, రగడ, మంజరి యను వివిధసాహిత్యప్రక్రియలలో వారు తమ వైష్ణవకవిత్వమున వెలయించిరి. తాళ్లపాకకవులలో తాళ్లపాక అన్నమాచార్యులు, తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చిన్నన్న యనుకవులు శృంగారసంకీర్తనములు, అధ్యాత్మసంకీర్తనములు

అను పేరఁ బెక్కు పదరచనవములను దెలుఁగున వెలయించిరి. పెద తిరుమలాచార్యుఁడు సీసపద్య శతకము, శృంగారవృత్తపద్యశతకము, వేంకటేశ్వరోదాహరణము, వేంకటేశ్వరవచనములు మున్నగు పెక్కు గ్రంథములను రచించెను. అష్టమహిషీ కల్యాణము. ఉషాకల్యాణము, పరమయోగివిలాసము ననునవి చిన్నన్న రచితము లగుద్విపదకావ్యములు. ఇట్లొకవంకఁ దాళ్లపాక కవులు దేశికవిత్వమును వివిధప్రక్రియలలో బంధ్ల కెత్తించుచుండఁగా రాజాస్థానములందు మాత్రము మార్గకవితావృక్షమునఁ బూచిన ప్రబంధకుసుమము యొక్క పరిమళము గుబాళించుచుండెను. కళాపూర్ణోదయమునందుఁ బింగళి సూరన్న స్వతంత్రకావ్యనిర్మాణప్రయత్నము చేసినను నందలి కవిత్వ మంతయు మార్గపద్ధతినే సాఁగినది.

అయ్యలరాజు నారాయణామాత్యుఁడు, పాలవేకరి కదిరీపతినాయకుఁడు తమ హంసవింశతి, శుకసప్తతి యనుకావ్యములలో దేశీయము లయినకథలను మార్గ పద్ధతిని రచించిరి. కాని, యందలి దేశీయము లయిన, పామరజన వ్యవహారములో నున్న కథలమూలమున నాకావ్యములు దేశిసారస్వతములోనే యొక సముచితస్థానమును సంపాదించుకొనుచున్నవి. అవి దేశికథలకు మార్గవేషముఁ దొడిగిన కావ్యములు.

తంజావూరు నాయకరాజులకాలమునను, నాతరువాత మహారాష్ట్రప్రభువుల పోషణమునను వ్యాప్తి గాంచిన దేశిరచనాప్రకియ యక్షగానము. మన కిపుడు లభించి ప్రకటింపఁబడియున్న యక్షగానములోఁ బదునాఱవశతాబ్దివాఁ డగు కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవవిజయ మనుయక్షగానమే మొట్టమొదటిదిగాఁ గానవచ్చు చున్నది. పదునేడవ శతాబ్దియందు నాయకరాజుల కాలమున ననేకయక్షగానములు బయలుదేరినవి.నాటకములు, కొరవంజులు నని మఱికొన్ని కలవు. వానికిని, యక్షగానములకును రచనలో నంతగా భేదము కాన రాదు. నాటకములను రచించినవారిలో విజయరాఘవనాయకుఁడు, షాజీ, శివాజీ, మన్నారుదేవుడు మొదలగు తంజావూరు పాలకులే కలరు. విజయరాఘవనాయకుఁడు కాళియమర్దనము, పూతనాహరణము, రఘునాధాభ్యుదయము, ప్రహ్లోదచరిత్రము మొదలగునాటకములనే కాక యింకను బెక్కుదేశిరచనలను గూడఁ జేసిన ట్లతని ప్రహ్లోదచరిత్రమువలనఁ దెలియుచున్నది. ఫాల్గుణోత్సవరగడ, రాజగోపాల దండకము, వీరశృంగార సాంగత్యము, సంపంగి మన్నారు సాంగత్యము, విన్నపములు, దరువులు, ఏలలు,పదాలు, సంకీర్తనలు, చౌపదము, జక్కిణి,

దురుసదము, చిందు, సవతిమత్సరము మొదలగు పెక్కుదేశిరచనలు చేసినట్ల విజయ రాఘవనాయకుఁడు తన ప్రహ్లాదకథానాటకాటు కావ్యమునందు జెప్పుకొనెను. ఈ కాలముననే క్షేత్రయ్య మొదలగు కొందఱు పదకర్తల పెక్కుపదరచనములను వెలయించిరి. తెలుఁగునందుఁ బ్రాచుర్యము వహించిన యక్షగాన రచనము క్రమముగాఁ గన్నడమునలోనికిని వ్యాపించినది. కన్నడసారస్వతమునందు వెలసిన యక్షగానములు తెలుఁగు యక్షగానముల ప్రభావముచేతనే రచింపఁబడినవి. ఇ ట్లిది 'కన్నడాంధ్రము లకు సమాన మై యిటీవలికాలముననే పొడసూపి వ్యాప్తి గాంచిన దేశిరచనాభేదము.'[౭]

ఆధునిక యుగమున మార్గకవితాపద్ధతి క్రమక్రమముగా సన్నగిల్లుచు దేశి కవితకుఁ దా నింతకాలముగా నధిష్ఠించి యుండిన కవితాసింహాసనమును వదలిపెట్టుచున్న ట్లు దోఁచును. గురజాడ కవి దేశభక్తిగేయములో నాధునికదేశి కవితకు నాందీవాక్యము పలికినట్లయినది. వ్యావహారికభాషోద్యమము కృతక మయిన కావ్యభాష స్థానమున శిష్టజనులవ్యవహారభాషకుఁ బట్టాభిషేకము చేసి కవితారంగమును విస్తృతము గావించినది. విద్యాధికులయిన యువకులు వ్యావహారికభాషలో బహుముఖ మయిన తమ ప్రజ్ఞావిశేషము బ్రదర్శించునవకాశ మేర్పడినది. నాటకము, నాటిక, నవల, కథానిక, గల్పిక, వ్యాసము, అపహాసకావ్యము, గేయకవిత మొదలగు వివిధప్రక్రియలు చేపట్టి రచయితలు చేయుచున్న యిటీవలి రచనములు పెక్కు దేశిపద్ధతికే చెందునట్టివి. ఇతివృత్తము ప్రాయికముగా సాంఘికము. అందలి భాష వ్యావహారికభాష.

పదునొకండవ శతాబ్దియందు నన్నయ పెంపొందించిన మార్గకవిత మూలముగాబడి పోయినదేశికవిత పంౘ్రెండు పదమూఁడు శతాబ్దులలో మతవ్యాప్తికొఱకై మఱలఁ బ్రాధాన్యము వహించినది. కాని, తరువాతికాలమున నన్నయోపజ్ఞ మయిన మార్గకవితాపద్ధతియే బలవత్తర మై తెలుఁగుకవుల హృదయముల నాకర్షించుటచేత నప్పుడప్పుడు కొంతకొంతగా దేశిరచనాప్రయత్నము జరిగినను పదునేడవశతాబ్దిదాఁక గూడ నదియే ప్రాధాన్యము వహించి యుండెను. పదునేడవశతాబ్దియందు రాజకీయ పరిస్థితులు కారణముగా – అనఁగా తెలుఁగునాయకులు విదేశముగు తమిళదేశమున నెలకొని యుండుటచేతఁ దిరిగియనుకూలవాతావరణము కలుగుటఱకు నీదేశికవితతల యెత్తుటకు వీలు

---

౭. దక్షిణదేశభాషాసారస్వతములు : దేశి. (శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు : పుట. 71.

కలుగ లేదు. యక్షగానాది రూపమున జాలువారిన యానాంటి దేశికవితయు క్షీణయుగమునం దాదరప్రోత్సాహములు లేక యుత్పన్నప్రాయము కాఁగా, మఱల నాధునికయుగమునందు గురజాడ అప్పారాయకవ్యాదులు తమదేశిరచనములమూలమున దానికిఁ బ్రాణము పోసిరి. ఆధునికయుగమునందలి దేశిసారస్వతవిభూతి చాలవఱకు నాంగ్లేయసారస్వతపరనాసంస్కారమువలన లభించినదని చెప్పవచ్చును.

ఇట్లు, తెలుఁగు సాహిత్యమునందు నానాఁట దేశిసారస్వతశాఖ పెంపొందుచు వచ్చినను – దాత్కాలికముగా నది యాయాకాలమునందలి ప్రజల కాదరపాత్రమై ప్రజాబాహుళ్యమున వ్యాపించి వంత ప్రచారము, వినోద ప్రదానము, రాజకీయప్రచారము మొదలగు తాత్కాలికావసరములను దీర్చుచుండినను నాంధ్రమునఁ బురాణ ప్రబంధములతో సమాన మయిన గౌరవము మాత్రము దానికిఁ బండితలోకమున లభింప లేదు.

తమిళము, కన్నడము, తెలుఁగు అను మూఁడు భాషల సారస్వతము లందలి దేశిరచనావైఖరులను, వానికి దారి తీసిన పరిస్థితులను బరిశీలించిన మిమ్మటఁ దమిళ ముపై సంస్కృతభాషప్రభావ మంతగా లే దనియుఁ, గన్నడాంధ్రములపై నా ప్రభావము సమధికముగానే కలదనియు విశద మగుచున్నది. అందుచేతనే యాభాషలలో దేశిలక్షణముల ప్రాచుర్యము విభేదించుటయుఁ, దమిళమున దేశిప్రాధాన్య మధిక మగుటయు జరగినది. ఈ సందర్భమున శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారువ్రాసిన యీవాక్యములు గమనింపఁ దగి యున్నవి.

''ఆంధ్రకన్నడ సారస్వతవృక్షము లింకను లేతవరువమున నుండఁగనే సంస్కృతసాహితీమహావృక్షముతో నంటఁ గట్టఁబడినవి. కావుననే, యీయంట్లు శీఘ్రకాలముననే యంతుకుకొని క్రొత్తవృక్షములై యతిరుచ్యములగు నూతనస్వాదుఫలముల నొసంగ మొదలిడినవి. ఈ ప్రయత్నము సుమారు క్రీస్తుశకారంభముననే జరగి యుండును. అప్పటికే తమిళసారస్వతవృక్షము ముదురుబాఱి ఫలవంత మగుటచే నాంధ్రకన్నడములందువలెనరి యైన సమ్మేళనము కుదర లేదు. అంటుకట్టుటలోను, దోహదక్రియలలోను గూడఁ గొంత భేద మేర్పడి పోయినది. ఆయా సాంఘికరాజకీయ పరిస్థితులే దీనికి ముఖ్యకారణము. కావుననే, తమిళసంస్కృతభాషావృక్షముల యంటు సరిగా నంటుకొనకుండుట, నూతనవృక్షఫలముల కొత్త వింత రుచి కలిగినను మొదటి తమిళభాషాసారస్వత

ఫలములు పొంకము, వాసన, రుచియుఁ బోకుండుట తటస్థించినది. కన్నడాంధ్రములలో నీక్రొత్తయంట్లు చక్కఁగనే యేర్పడినవి గాని యవి నాఁటఁబడిన క్షేత్రములయందుఁ గలిగిన దోహదభేదముచేఁ గాఁబోలు నొకదానికంటె మఱియొకటి యతిశీఘ్ర కాలముననే ఫలవంత మగుట తటస్థించినది.''

మలయాళవాఙ్మయమును ఆదియుగము, మధ్యయుగము, ఆధునిక యుగము అని మూఁడు యుగములుగా మలయాళవిద్వాంసులు విభజించిరి. ఆదియుగమున తమిళభాషాప్రభావమును, మధ్యయుగమున సంస్కృతభాషా ప్రభావమును మలయాళముపై నున్నట్లు వారు చెప్పుదురు. ఆధునికయుగము ఎళుత్తచ్చన్ మహాకవితోఁ బ్రారంభమగుచున్నది. పెరుమాళ్ రాజవంశీయులు తమిళ భూపతులు. కేరళదేశమున వారి రాజ్యపరిపాలనము క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దమున నంతమయ్యెను. ఈరాజవంశీయులవలనను గేరళదేశమునందుఁ దమిళసంస్కృతివ్యాపించెను. ఆకాలమునకు మలయాళమునఁ గావ్యభాష యేర్పడెను. ఇట్లేర్పడిన తమిళభాషాప్రభావ మాభాషలోఁ బదునాలవ శతాబ్దమువఱకును నేదో రూపమున నుండెను. కాని, యీ యాదియుగమునకుఁ బూర్వము మలయాళమున వెలసిన సారస్వత మంతయు దేశిసారస్వతమే యని చెప్ప వచ్చును.

ఏభాషయం దయినను దొలుత గేయసారస్వతము వెలసి యాతరువాతఁ గావ్యవాఙ్మయము క్రమముగాఁ బ్రచారములోనికి వచ్చును. ఆంధ్రసాహిత్యమునఁ గూడ నన్నయకుఁ బూర్వము గేయసారస్వతము కొంత యుండినట్లు పాల్కుఱికి సోమనాథుని రచనలనుబట్టి తెలియుచునే యున్నది కదా. అట్లే, మలయాళమునను దమిళభాషాప్రభావముతో రామచరితము మొదలగు కావ్యవాఙ్మయము వెలయుటకుఁ బూర్వము గేయసారస్వతము విస్తారముగా నుండినట్లు తెలియుచున్నది. మలయాళము గేయములకుఁ బాటలకుఁ బెట్టినది పేరు. ఈగేయములెప్పుడు రచింపఁ బడెనో యిద్దమిత్థమని చెప్పుటకు వీలు లేకున్నది. కాని, కొందఱు వీని రచనాకాలము క్రీస్తు శకము పదవ శతాబ్ద మనియు, మఱికొందఱు నాలుగవశతాబ్దమై యుండుననియు విశ్వసించుచున్నారు. ఈజానపదగేయములందు సులభసుందరమైన భాష వాడఁబడినది. అది వాడుకభాషకు మిక్కిలి సన్నిహితముగా నుండును. సంస్కృత తమిళ భాషల సంపర్కము లేని శుద్ధమలయాళభాష యది. దానికే 'పచ్చమలయాళము' అని

పేరు. వానిలో భద్రకాళిపాట్టు, తీయాట్టుపాట్టు, పుళ్ళువన్ పాట్టు, శాస్త్రకళి పాట్టు, తోట్టంపాట్టు అనునవి ప్రసిద్ధి చెందినవి. వానిని ఉత్సవాదులందుఁ బాడుదురు. భద్రకాళి పాట్టుకాళికాదేవికి సంబధించినది. పుళ్ళువన్‌పాట్టు అనునది పాముపాట, ఇది చాలఁ బ్రాచీన మయిన గేయమనియు, శుద్ధమలయాళములో వ్రాయఁబడిన దనియు భావింపఁబడుచున్నది. కేరళదేశమునందలి బ్రాహ్మణులును, క్షత్రియులును 'శాస్త్రకళి' గేయమును బాడుదురు. క్రీస్తుశకము తొలి శతాబ్దులలోఁ బశ్చిమసముద్రతీరమున స్థిరనివాసములు కల్పించుకొనిన క్రైస్తవులు కూడఁ గొన్నిగేయములను విరచించిరి. వానిలో మార్గంకళి పాట్టు ప్రశస్త మయినది. అందు సెయింట్‌థామస్ మహిమలు వర్ణింపఁబడెను.

దక్షిణదేశభాషాసారస్వతములు : దేశి : పుటలు 134, 135.

ఇవి కాక పండుగవేళలయందును, వ్యవసాయపుఁ బనులుచేయు సమయ ములందును బాడునట్టి పాటలు కొన్ని కలవు. వానిలో ఓణప్పాట్టు, కృషిప్పాట్టు, వంజి ప్పాట్టు (పడవపాటలు) అనునవి ముఖ్యముగాఁ బేర్కొనఁ దగి యున్నవి.

ఇట్లు వెలసిన యీ గేయసారస్వత మంతయు మలయాళమునందలి దేశి సారస్వతవిభాగముక్రిందకు వచ్చును.

పిదప వెలసిన యాదియుగములో 'కణ్ణశన్ పాట్టుగళ్' అను కావ్య సంపుటము నందుఁ దత్కర్త లగు కణ్ణశన్‌కవులు లోక క్రొత్తఛందస్సు నుపయోగించిరి. దానికి 'నిరణప్పత్తం' అని పేరు. దానికి మాత్రుక యొక తమిళ ఛందోవిశేషమని విజ్ఞులు విశ్వసించుచున్నారు. ఈ వంగడపుఁగవులు 1375-1475 ప్రాంతమున నివసించియుండురని పండితుల యభిప్రాయము.

ప్రాచీనమలయాళవాఙ్మయమునందలి ప్రశస్తకావ్యములలో కృష్ణగాధ యొకటి. అది మంజరీఛందస్సున వ్రాయఁబడెను. ఆఛందస్సున వ్రాయఁబడిన కావ్యమునకే మలయాళమున గాధ యను వ్యవహార మేర్పడి యున్నది. మలయాళ కవులు సంస్కృత తమిళముల నాదరించినంతగా మలయాళము నాదరింప లేదు. వారు మలయాళఛందస్సులను జిన్నచూపుచూచిరి. అట్టి పరిస్థితులలో నీకృష్ణగాధ మలయాళ ఛందమున రచితమయ్యెను. ఒక్క ఛందోవిషయమునందే కాక, భాషావిషయమునందును దత్కర్త స్వాతంత్ర్యమును వహించెను. అందు మిక్కిలి సులభ మయినభాష వాడఁ బడెను. మలయాళమున నేమాత్రము పరిచయమున్నను దానిని జక్కఁగా నర్థము చేసికొన వచ్చును.

మలయాళసాహిత్యమున ఎళుత్తచ్ఛన్ సుప్రసిద్ధుఁడు. అతని కృతులు మలయాళవాఙ్మయమున కమూల్యాలంకారములు. 'కిళిప్పాట్టు' అను ఛందోవిశేషమతనిమూలమున మిక్కిలి ప్రచారములోనికి వచ్చెను. 'కిళిప్పాట్టు' అనగా చిలుకపాట యని యర్థము. ఈ చిలుకపాటకు మలయాళసాహిత్యమున విశిష్టమగు స్థానము కలదు. 'కిళిప్పాట్టు' అనునది కేక, కాకళి, కళకాండి యను ఛందోవిశేషములను గూడ సూచించునని నేఁడు తలఁపఁబడుచున్నది. ఎళుత్తచ్ఛన్ దీనిని దమిళమునుండి గ్రహించెనని కొందఱభిప్రాయపడుచున్నారు. కాని, యివి మలయాళఛందోరీతులనియు, ఎళుత్తచ్ఛన్ వానికిఁ గావ్యత్వగౌరవముఁ గలిగించెననియుఁ బలువుర విశ్వాసము.

సంస్కృతభాషాప్రభావముచే మధ్యయుగమునను, నాతరువాతను బెక్కు చంపూకావ్యములును, సందేశకావ్యములును వెలసినవి. మలయాళమున వెలసిన చంపూరచనలలోని పద్యము లన్నియు వృత్తములందే యుండెను. అందలిభాష మణిప్రవాళ భాష. కాళిదాసు మహాకవి మేఘదూతము ననుసరించి మలయాళమునఁ బెక్కు సందేశకావ్యములు వెలువడెను. వానిలో 'ఉణ్ణునీలిసందేశ' మనుకావ్యము పేర్కొనఁదగినది. సంస్కృతప్రభావముచే రచితమయిన కావ్యమయినను నందుఁ గేరళదేశపు చారిత్రకసాంఘికపరిస్థితులు మిక్కిలి మనోహరముగా నభివర్ణింపఁబడుటచే నామేరకది దేశితనముతో నొప్పుచున్న దనినుడువఁదగును. అందలి వర్ణనములు కూడఁ గడు స్వతంత్రములు.

కథకళికి నుపయోగపడు 'అట్టక్కథ' యను సాహిత్యప్రక్రియ మలయాళమునఁ బదునేడు, పదునెనిమిది శతాబ్దులయందు మిక్కిలి వ్యాప్తి గాంచెను. కథకళి ప్రదర్శనమునకు వలసినసాహిత్యము నీ అట్టక్కథ సమకూర్చును. కొట్టారకార తంబురాన్ అనునతఁడు రచించిన రామనాట్టం అనునది మలయాళమునఁ బ్రప్రథమముగా వెలసిన అట్టక్కథ. అతఁడు రచించిన యిట్టికృతులు మఱికొన్నికూడఁ గలవు. ఇట్టిరచనలకుఁ గలుగుచుండిన వ్యాప్తినిబట్టి యనేకులు తంబురాను ననుసరించి 'యట్టక్కథ' సారస్వతమును వృద్ధి గావించిరి. కార్తికతిరునాళ్, అశ్వతి తిరునాళ్, ఉణ్ణాయివారియర్ అనువారు అట్టక్కథ సారస్వతమును వెలయించినవారిలోఁ బ్రముఖులు.

ఆంధ్రసాహిత్యములోని యక్షగానములవంటి యీ రచనలు దేశిలక్షణలక్షితములని వేఱ చెప్పనవసరము లేదు.

కేరళదేశమునందలి ప్రసిద్ధకళావిశేషములలో 'తుళ్లల్' ఒకటి. అది యొక జానపదనృత్యవిశేషము. మలయాళమున దీనికి సంబంధించిన కొంతవాఙ్మయము కూడఁ గలదు. ఇందు పరయన్, సీతంకన్, ఓట్టన్ అను మూఁడు రకము లున్నవి. పదునెనిమిదవ శతాబ్దికిఁ జెందిన కుంజన్‌నంబియార్ అనునతఁడు దీనిపాదుర్భావమునకుఁ గారణభూతుఁ డని చెప్పుదురు. అది సామాన్యులను సైత మలరించిన సాహిత్యప్రక్రియ. విశేషించి, కుంజన్ కవితలోఁ గేరళదేశపు వాతావరణము చక్కఁగాఁ గనఁబడుచుండును. పౌరాణికగాథలమూలమున సమకాలపు జీవనవిధాన మందు మిక్కిలి మనోజ్ఞముగాఁ జిత్రింపఁబడినది. కుంజన్ నంబియారు పండితాధీనమయిన సాహిత్యమును దన రచనముల మూలమునఁ బ్రజలకు మిక్కిలి సన్నిహితము గావించెను.

ఆధునిక మలయాళసాహిత్యమున నితివృత్తము నందును, భాషయందును, గొప్ప పరివర్తన మేర్పడెను. సంస్కృతపదభూయిష్ఠ మైనభాషను గాని, క్లిష్ట మగు మలయాళకావ్యభాషను గాని వాడుట కాధునికమలయాళ రచిత సుముఖుఁడుగా లేఁడు. వ్యావహారికభాషకు సన్నిహిత మగు భాషనే యతఁడు స్వీకరించెను. చంగంపూళ కృష్ణపిళ్లై, అతని యనుచరులు కావ్యములందును, గీతులందును సులభసుందరమైన భాషను వాడవచ్చునని చూపిరి. ఆధునిక రచయితలు జటిలములగు సంస్కృతచ్ఛందముల నుపయోగించుట లేదు. సాధ్య మయినంతవఱకు గేయాంశముగల ప్రాచీన మలయాళ ఛందములనే వా రుపయోగించుచున్నారు. ఆధునికరచయితలు స్వీకరించునితివృత్తములు కూడ ఆ మాన్యులను రంజింపఁజేయుచున్నవి. సామాన్యమానవుని జీవితమే యాధునిక కాలమునందలి పెక్కు రచనములకుఁ గావ్యవస్తువయి యున్నది.

ఇట్లాధునిక కాలమునందలి మలయాళసాహిత్యము కూడ దేశిమార్గమునే పురోగమించుచున్నది. మధ్యయుగమునను, నాతరువాతఁ గొంతకాలమువఱకును మలయాళసారస్వతమున సంస్కృతభాషాప్రభావము భాషాప్రక్రియలయందును, ఛందో విషయములందును గోచరించుచున్నను తమిళసారస్వతమునందువలెనే యీభాషాసారస్వతమునందును దేశిసార్వ్యతమే యధికముగా నుండుట గోచరింపఁ గలదు. భాష, ఛందము, ప్రక్రియ యనువానిలో మాత్రమే దేశీయత స్ఫురింపఁ జేయుచుఁ బ్రాచీనకాలమునఁ బౌరాణికేతివృత్తమే మలయాళసారస్వతమునఁ

ప్రాధాన్యము వహింపఁగా నాధునికమలయాళరచయితీ వస్తువునందును దేశితనమును సాధించుటకు యత్నించు చుండుట ముదావహము.

★ మహారాష్ట్రదేశమున దేశీ, వర్హాడీ, కొంకణి, మరార్వాడీ యని నాలుగు విధము లయినయుపభాషలు వాడుకలో నున్నవి. ఈయుపభాషలలోఁ గొంకణిభాష యత్యంతము భిన్నమయినది. వీనిలోఁ బూనా మొదలగుప్రాంతములలో వాడఁబడు 'దేశీ' భాష యుత్కృష్ట మైనది. వర్హాడీభాషలో హిందీశబ్దములును – మరార్వాడాభాషలో ఉర్దూ, పార్సీ, తెలుఁగు మొదలయిన భాషలలోని శబ్దములు గలిపి వాడుచుండుటవలన నవి 'దేశీ' భాషకంటెఁ గొంత వైలక్షణ్యమును గలిగి యుండును. 'దేశి' యను నీభాష యితరభాషాసంపర్కము లేని యచ్చమయిన మహారాష్ట్ర మని చెప్పఁదగును.

జ్ఞానేశ్వరుఁడు తన గీతాభాష్యమునందు 'నేను మరాఠీలో ననఁగా సులభ మైనభాషలోఁ జెప్పుచున్నాను' అని మరాఠీశబ్దమును సులభార్థమున వాడి యుండుట గమనార్హము.

పాల్కురికి సోమనాథుఁడు 'తెలుఁగుమాట లనంగ వలదు వేదముల, కొలఁదియు కాఁ జూడుఁ డిల నెట్లు అనిన' యనుపంక్తులలోఁ దెలుఁగు కవిత్వము వేదములతో సమానముగా గౌరవింపఁ దగిన దని చెప్పి తన యాంధ్ర భాషాభిమానమును వెల్లడించినట్లే మహారాష్ట్రమున నేకనాథుఁ డనుకవి **(1533-1599)** –

**'సంస్కృతవాణీ దేవేఁకేలీ**
**ప్రాకృతకాయ్ చోర్‌ాపాసోనీకేలీ.'**

'సంస్కృతభాష దేవభాష యగుచోఁ బ్రాకృతభాష దొంగలభాషయా యేమి?' యని యధిక్షేపించి తన మహారాష్ట్రభాషాభిమానమును వెల్లడించెను.

మహారాష్ట్రభాషయందు భక్తకవులు, పండితకవులు, సంప్రదాయప్రవక్తలు వలసి భాషాభివృద్ధికి బహువిధములఁ దోడ్పడి యున్నారు. భక్తకవులు తమ తమ

---

★ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన 'దక్షిణభారత సాహిత్యములు' అను గ్రంథమున మహారాష్ట్ర సాహిత్యచరిత్రము తక్కిన దక్షిణదేశ భాషాసారస్వతచరిత్రములతోఁబాటు తెలుపఁబడుటచే నిందు సైతము మహారాష్ట్ర, సారస్వతములోని దేశి యిటఁ జర్చింపఁ బడుచున్నది.

యుపదేశ[గంథములను వ్రాసియుఁ, బండితకవులు రసభావాద్యలంకారములతో నిండిన రచనలుచేసియు, సంప్రదాయప్రవక్తలు జ్ఞానభక్తియోగాదులను బ్రబోధించు గ్రంథములు విరచించియు మహారాష్ట్ర సాహిత్యమును బరిపుష్టము గావించిరి. సమర్థ రామదాస స్వామి భక్తిజ్ఞానములను బ్రబోధించుటయే కాక రాజకీయములను, వ్యావహారిక విషయములను, దేశభక్తినిగూడఁ బ్రబోధించుసాహిత్యమును జక్కఁగాఁ బెంపొందించెను. అతఁడు మహారాష్ట్ర దేశవర్ణనపర మయిన 'ఆనందభువనము' అనుగ్రంథమును రచించెను. స్వాతంత్ర్యము ననుభవించు మహారాష్ట్రదేశ మానందభువనమని యాతఁడు కీర్తించి దేశభక్తిని బ్రజలలోఁ బెల్లుబుకునట్లుచేసెను. పండ్రెండవశతాబ్దికిఁ జెందిన హేమాద్రి పండితుఁడు వ్యవహారసౌకర్యార్థము నాగరలిపిని మార్చి 'మోడీ' యను నొకక్రొత్త లిపిని సృష్టించి మహారాష్ట్రభాషకు మహోపకార మొనర్చెను. తెలుఁగు నందలి గొలుసువ్రాఁతవలె దీనికి లేఖనసౌకర్యమెక్కువగాఁ గలదు. లిపికి సంబంధించి మహారాష్ట్రభాషలో జరిగిన దేశీయసంస్కరణ మిది.

మహారాష్ట్రకవులు సంస్కృతవృత్తములను యథేచ్ఛగా వాడిరి. అనుష్టుప్పు, ఇంద్రవజ్రము, ఉపేంద్రవజ్రము, ఉపజాతి, శాలిని, వంశస్థము, పుష్పితాగ్రము, భుజంగప్రయాతము, వసంతతిలకము, మాలిని, పృథ్వి, మందాక్రాంతము మొదలగు వృత్తములనువారు రసభావములకుఁ దగినరీతి నుపయోగించిరి. శిఖరిణి, హరిణి, శార్దూలవిక్రీడితము, స్రగ్ధర, మందారమాల యనువాని నెక్కువగా నుపయోగించిరి. ఈయక్షరగణవృత్తములే కాక ఆర్యా – గీతి మొదలగు మాత్రాగణవృత్తముల నంతకంటె నెక్కువగా వారువాడి యున్నారు. ఇట్లు సంస్కృతచ్ఛందములే కాక దేశీయచ్ఛందములు కూడ మహారాష్ట్రకవులచే విశేషముగా వాడఁబడినవి. ఆ మహారాష్ట్రదేశీయ ఛందోభేదము లన్నియు మాత్రాగణబద్ధములు. 'మరాఠీ ఛటనారచనా పరంపరా' యనుగ్రంథమున దేశీయవృత్తములెక్కువగా నుదాహరింపఁబడినవి.

వామనుఁడు మొదలగుపండితకవులు సంస్కృతవృత్తములనే నిరర్గళముగా నుపయోగించిరి. కాని, మహారాష్ట్రసాహిత్యమునఁ బెక్కురు కవులు వాడినఛందములు - 'ఓవీవృత్తము', 'అభంగవృత్తము'. ఇవి రెండును దేశీయచ్ఛందోభేదములు. మహారాష్ట్రభాషయం దాదికవి యయిన ముకుందరాజు తన వివేకసింధు మనుకావ్యమును 'ఓవీ' వృత్తములలో రచించెను. ఈ 'ఓవీ' వృత్తము

సంస్కృతచ్ఛందోరీతులలోఁ జేరదు. మహానుభావపంథకుఁ జెందిన గ్రంథములు శిశుపాలవధ, ఉద్ధవగీత మొదలగునవి, కూడ 'ఓవీ' వృత్తబద్ధములే. ఓవీ వృత్తరచనమున జ్ఞానదేవుఁడు సిద్ధహస్తుఁ డని వాసి గాంచెను. అందుచేతనే ఏకనాథుఁ డనుకవి 'జ్ఞానేశ్వరుని యనంతరమెవరు ఓవీవృత్తమునఁ గావ్యము వ్రాయఁ దలఁచిరో వా రమృతమయ మయిన పసిఁడిపళ్లెరమునందు టెంకాయచిప్ప నుంచినవా రగుదురు' అని వ్రాసి యాతనికిఁ గల ఓవీవృత్తరచనాకౌశలమును బ్రశంసించెను. మహారాష్ట్రసాహిత్యములోఁ జాలభాగము ఈ 'ఓవీ' వృత్తములందే రచింపఁబడెను.

అభంగవృత్తములలోఁ దొలిసారిగా కవిత వ్రాయనారంభించిన కవీశ్వరుఁడు నామదేవుఁడు. (1270-1350) ఇతని తరువాత తుకారామకవి విట్ఠలునియాదేశము చొప్పున అభంగవృత్తములలోఁ గవిత్వము వెలయించెను. నామదేవుని యనంతరము విశదము, విస్తృతము, రసవంతము నైన యభంగ రచన తుకారామునిదే యని చెప్ప వచ్చును.

ప్రప్రథమ మహారాష్ట్ర కవయిత్రి యగు మహదాయిసా రచించిన స్త్రీల పాటలు 'ధవళే' యనుగ్రంథముగాఁ గూర్చఁబడినది. ఈమె యొకవివాహ సందర్భమున 'కరవలి' పెండ్లిపెద్ద యధికారమును స్వీకరించి రుక్మిణీస్వయంవర గీతములు వ్రాసి పాడెను. ఈమె క్రీ.శ. 1280 ప్రాంతమునకుఁ జెందినది. సమర్థ రామదాస స్వామి హారతులు అను గీతములను రచించెను. ఆనందతనయుఁ డనుకవి కడలే యనుగేయరూపమున సీతాస్వయంవర మనుకావ్యము వ్రాసెను. ఇది కాక యితఁడు సుందరము లగు పదములు వ్రాసెను.

మహారాష్ట్ర సాహిత్యమున గ్రంథము లనేకములు దేశీయవృత్తములందే రచింపఁబడినను వానియందలి వస్తువు మాత్రము వేదాంతము. భక్తితత్త్వము, రామాయణ, భారత, భాగవతాది సంస్కృతపురాణములకు సంబంధించిన యితివృత్తములు నయియుండుట గమనార్హమై యున్నది. ఒక్క సమర్థ రామదాసస్వామి రచనమునందే కొంత దేశభక్తి, దేశాభిమానము గోచరించును. ఒక్క ఛందోవిషయమునఁ దప్పఁ దక్కిన విషయములందు మహారాష్ట్ర సాహిత్యమున దేశితన మంతగాఁ గాన్పింప దనియే భావింపవచ్చును. దానికిఁ గారణము మహారాష్ట్ర కవు లాదికాలమునఁ గేవలము భక్తి, జ్ఞాన, వైరాగ్యములలోఁ రుషు లయిన మహామహులు, మతప్రవక్తలు, మతప్రచారకులు నయి యుండుట.

వారిలోఁ గొందఱు తమ తమ మతములను, సంప్రదాయములను దమ కవిత్వమువలనఁ బ్రచారము చేయఁ దలఁపఁగా మఱికొందఱు సంస్కృతములోని యుత్తమగ్రంథములకు వ్యాఖ్యానములను, నా గ్రంథములందలి యితివృత్తములతో భాషాగ్రంథములను రచింపఁ దలఁచుట యని మనము భావింప వలసి యున్నది. షాహిరీవాఙ్మయమునఁ గొంత వస్తువు మాఱినను నది దేశీయము కాక పేష్వాలను, ప్రభువులను గౌరవము చేయునట్టిరచనలుగాను – శృంగారప్రధానములు గాను రచితము లగుటచే నందును దేశీయత పరిస్ఫురించు నవకాశము లేక పోయినది.

ఈ యధ్యాయమునందుఁ జర్చింపఁబడిన వివిధాంశముల సారాంశము నీక్రింది విధముగాఁ బేర్కొన వచ్చును.

౧. తెలుఁగు కన్నడ భాషలపై సంస్కృతభాషాప్రభావ మధికముగాఁ గలదు. తమిళము, మలయాళము ననుభాషలపై నీప్రభావ మంతగాఁ గాన రాదు. వింధ్య పర్వతమునకు దక్షిణమున నున్న తెలుఁగు కన్నడదేశము లార్యజనాక్రాంతము లయినట్లు తమిళదేశ మార్యజనాక్రాంతము కాలేదు. అందుచేతఁ దమిళదేశమునఁ గ్రీస్తు శకారంభకాలమునాటికే సంస్కృతప్రభావము సోకని దేశికవిత పెంపొంది యుండినది. అగనానూఱు, పుఱనానూఱు అను సంకలనగ్రంథములయం దా దేశికవిత యొక్క స్వరూపము గోచరించును. తొల్కాప్పియమునందలి పొరుళధికారమునఁ దమిళుల సామాజిక జీవనవిధానము మిక్కిలి మనోజ్ఞముగాఁ జిత్రింపఁ బడినది. తమిళవేద మని సంభావింపఁబడు 'తిరుక్కురళు' నందు సార్వజనీనములు. సార్వకాలికములు నగు నీతులు 'కురళ్' అనఁబడు దేశీయఛందములోఁ దెలుపఁబడెను. సంగకవులు తమ కావ్యవస్తువులను సంస్కృతమునుండి గ్రహింప లేదు. వర్ణనలయందును వారిప్రత్యేకత గోచరించును. ఛందస్సాహిత్యరీతుల విషయమునఁ గూడ సంస్కృత సంప్రదాయములు తమిళమునందుఁ బ్రవేశింప లేదు. జైన, బౌద్ధులయుగమున వెలసిన శిలప్పదిగారము వంటి కావ్యములు సంస్కృతానువాదములు కాక దేశీయేతివృత్తములతో శోభిల్లుచుఁ దమిళభాష యాదినుండి యనుసరించుచుండిన దేశిమార్గమును బరిరక్షించినది. శైవ వైష్ణవమతాచార్యుల యుగమున వచ్చిన తమిళ సాహిత్య మంతయు మధురగేయమయము. 'తిరువాచకం' అను గ్రంథమునందు దేశికవితాశాఖకుఁ జెందిన అమ్మానై, తెళ్లేణం, పాళల్ మొదలగుగీతప్రభేదములలోఁ

బెక్కుగేయంవములు రచింపఁబడి యున్నవి. కంబరామాయణము వాల్మీకిరామాయణము ననుసరించియే రచింపఁడినను నందలి వర్ణ నాంశములు దైనందిన జీవితమునుండి గ్రహింపఁబడినవి. అరుణగిరినాథుని 'తిరుప్పుగల్' అను గ్రంథమునఁ బెక్కు మధురగీతములు కలవు. ఆధునిక కాలమునందలి సుబ్రహ్మణ్య భారతి రచనములందు గేయాంశ మధికము.

కవిసమయములు, వర్ణనాంశములు, ఉపమానములు మొదలగువాని విషయమునఁ గూడఁ దమిళకవులు సంస్కృతభాషాప్రభావమునకు లోఁబడక స్వతంత్రముగా, దేశీయముగా నిర్వహించిరి.

౨. కన్నడమునఁ గవిరాజమార్గమునకుఁ బూర్వము దేశిపద్ధతి కూడ మార్గపద్ధతిలోఁ బాటు సమానగౌరవము నందియుండెను. కవిరాజమార్గమున వేయఁబడిన కన్నడమార్గపద్ధతి ప్రభావముచే నంతకు ముం దుండుదేశిపద్ధతి యంతరించినది. పంపాదులు దేశిని స్మరించినను వారి కవిత్వము మార్గపద్ధతినే సాగినది. బసవయుగమున విషయము, భాష, ఛందస్సు, అనుమూఁడు విషయములందును దేశిప్రాధాన్య మెక్కువ యయ్యెను. వచన మనుసాహిత్య రూపము పుట్టెను. రగళె, త్రిపది, షట్పది యను 'అచ్చగన్నడ' ఛందస్సులు వ్యాప్తిలోనికి వచ్చెను. ప్రాయికముగా శరణుల చరిత్రములు కావ్యవస్తువు లయ్యెను. కుమారవ్యాసయుగమున దాస కూటము ప్రాచుర్యమునకు వచ్చి షట్పది, సాంగత్యము, త్రిపది, కీర్తనలు ప్రాధాన్యము వహించెను. లింగాయతమతముతో వ్యాప్తిలోనికి వచ్చిన యాదేశిచ్ఛందస్సులు కాలక్రమమున నన్నిమతములవారిచేతను నాదరింపఁబడఁజొచ్చెను. తెలుఁగులోని యక్షగానముల ననుసరించి కన్నడమునను నిటీవలికాలమున యక్షగాన మనుదేశిరచనా ప్రభేదము వ్యాప్తిలోనికి వచ్చెను. కన్నడకవులు ప్రయోగించిన 'జాణ్నుడి' యనుపదము సంస్కృతప్రాధాన్యము లేని జాతీయ మయిన కన్నడభాషాప్రయోగమును దెలుపు నని యూహింపఁ బడుచున్నది. దానిఁ బేర్కొనిన కవులు కన్నడకవితయందు దేశిప్రాధాన్యము నభిలషించువారుగాఁ దోఁచుచున్నారు. తమిళమునందువలెనే కన్నడమునందును దేశీయము లయినయుపమానములు, జాతీయములు, సంప్రదాయములు కొన్ని కలవు.

౩. తెలుఁగుభాషయందు నన్నయకుఁ బూర్వము దేశికవిత చాలవఱకుఁ బాటలరూపమున నుండి యుండును. భారతరచనమునకుఁ దరువాత

నట్టిరచనముల కాదరము లేక పోవుటచేతను, నివి ముఖస్థములే యయి యుండుటచేతను నశించి యుండును. నన్నయకుఁ దరువాతికాలమునఁ గూడఁ బెక్కువిధము లయిన దేశిరచనము లుండె నని సోమనాథుని రచనములనుబట్టి తెలియుచున్నది. కన్నడదేశమున బయలుదేరిన వీరశైవమతోద్యమ మాంధ్రదేశమునఁ గూడ వ్యాపించిన వెంటనే యిచటను గన్నడదేశమునందు వలెనే దేశిరచనముల యావశ్యక మేర్పడెను. శివతత్త్వసారము దేశీయ ఛందోభేదమగు కందపద్యబహుళముగా రచింపఁబడెను. నన్నెచోడుఁడు తన కుమారసంభవమునఁ గొన్ని దేశిసంప్రదాయములను జొప్పించెను. సోమనాథుఁడు తెలుఁగున వెలయించిన దేశిసారస్వతము బహుముఖము. రంగనాథ రామాయణమున ఛందస్సు నందు మాత్రమే కాక యితివృత్తమునందును గొంతదేశీయతను సాధించు ప్రయత్నము జరగినది. పలనాటి వీరచరిత్రములోని యితివృత్తము తెలుఁగుదేశమునకే సంబంధించినది. తాళ్లపాక కవులు వెలయించిన సాహిత్య మంతయు సోమనాథుఁడు సాఁగించిన దేశికవితోద్యమమునే యనుసరించినది. హంసవింశతి, శుకసప్తతి కావ్యములలో దేశికథలు మార్గపద్ధతిని రచింపఁబడినవి. యక్షగానరచనము దేశిసాహిత్యప్రక్రియ యని వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. ఆధునికయుగమున మార్గకవితా పద్ధతి క్రమ క్రమముగా సన్నగిల్లుచు దేశికవితకుఁ దావధిష్ఠించి యుండిన కవితాసింహాసనమును వదలి పెట్టినది. ఇటీవలికాలమునఁ దెలుఁగున రచింపఁబడుచున్న పెక్కు రచనములు దేశిమార్గమునకే చెందును. వాని యందలి యితివృత్తము ప్రాయికముగా సాంఘికము, భాష వ్యావహారికము.

౪. మలయాళమునఁ గావ్యవాఙ్మయము వెలయుటకుఁ బూర్వము గేయసారస్వతము విస్తారముగా నుండెను. అది యెల్ల దేశిసారస్వత[illegible] వచ్చును. ఆదియుగమునందలి 'కణ్ణశన్‌పాట్టుగళ్' అను కావ్య[illegible] 'నిరణవృత్త' మనఁబడు దేశి ఛందోవిశేషము మాత్రముగా [illegible] బడినది. 'కృష్ణగాథ' యనుకావ్యము నందలి మంజరీవృత్తము [illegible] చ్ఛందము. ఎళుత్తచ్చన్ మూలమున 'కిలిప్పాట్టు' అను ఛందోభేదము[illegible] గావ్యత్వగౌరవము కలిగినది. మలయాళకవులు సంస్కృత [illegible] నాదరించినంతగా మలయాళము నాదరింప లేదు. వారు మలయాళ ఛంద[illegible] జిన్నచూపు చూచిరి. అట్టిపరిస్థితులలో దేశీయఛందము[illegible]

కృష్ణగాధ, ఎళుత్తచ్చన్ రామాయణము అనునవి దేశీయ పద్ధతికిఁ బట్టము గట్టెను. 'ఉణ్ణునీలి సందేశము' అనుకావ్యములోఁ గేరళదేశపు చారిత్రకసాంఘిక పరిస్థితులు మిక్కిలి మనోజ్ఞముగా నభివర్ణింపఁబడినవి. అందలివర్ణనములు కడుఁ స్వతంత్రములు. ఆమేరకది దేశితనములో నొప్పుచున్నదని చెప్పఁదగును. కథకళికి నుపయోగపడు అట్టక్కథలు దేశిలక్షణలక్షితములు. తుళ్లల్ రచనములు పౌరాణికగాధలమూలమున సమకాలపుజీవనవిధానమును జిత్రించుచుఁ బ్రజలకు మిక్కిలి సన్నిహితము లయ్యెను. ఆధునికకాలము నందలి మలయాళసాహిత్యము కూడ దేశిమార్గముననే పురోగమించు చున్నది. ఆధునికరచయితలు జటిలము లగు సంస్కృతవృత్తముల నుపయోగించుట లేదు. ప్రాచీనమలయాళచ్ఛందములనే వా రుపయోగించు చున్నారు. వారు స్వీకరించు నితివృత్తములు సామాన్య జనరంజకములు. సామాన్యమానవుని జీవితమే యాధునికకాలమునందలి పెక్కు రచనములకుఁ గావ్య వస్తువు.

౫. మహారాష్ట్రభాషయందు భక్తకవులు, పండితకవులు, సంప్రదాయ ప్రవక్తలు వెలసి భాషాభివృద్ధికి బహువిధములఁ దోడ్పడిరి. వా రుపదేశ గ్రంథములను, జ్ఞానభక్తియోగాదులను బ్రబోధించునుత్తమ గ్రంథములను రచించి మహారాష్ట్ర సాహిత్యమును బరిపుష్టము గావించిరి. సమర్థరామదాస స్వామి భక్తిజ్ఞానములను బ్రబోధించుటయే కాక రాజకీయములను, వ్యావహారికవిషయములను, దేశ భక్తి నిగాడఁ బెంపొందించుసాహిత్యమును సృష్టించెను. అతని యానంద భువనము మహారాష్ట్రదేశవర్ణనపరము. మహారాష్ట్రకవులు సంస్కృతవృత్తములను యథేచ్ఛగా వాడిరి. అట్లు సంస్కృతచ్ఛందమునే కాక దేశీయచ్ఛందములుకూడ వారిచే విశేషముగా వాడఁబడినవి. మహారాష్ట్ర సాహిత్యమున నధికముగా నాదరింపఁబడిన దేశీయవృత్తములు ఓవీఛందము, అభంగవృత్తము. దేశి సాహిత్యమునకుఁ జెందిన స్త్రీలంపాటలు 'ధవళే' యను గ్రంథముగాఁ గూర్పఁబడినది. మహారాష్ట్రసాహిత్యమున గ్రంథము లనేకములు దేశీయవృత్తములయందే రచింపఁబడినను వానియందలి విషయము మాత్రము వేదాంతము, భక్తి, సంస్కృతపురాణసంబంధి యధ్యాత్మిక[illegible]ర్థము. ఒక్క ఛందోవిషయమునఁ దప్పఁ దక్కిన విషయములందు మహారాష్ట్ర సాహిత్యమున నంతగా దేశితనము గాన్పింపదు.